శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
యార్థికసాహాయ్యమునకు
కృతజ్ఞత



This Book is published with the Financial ass
tance of Tirumala Tirupati Devasthanams under tl

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
యార్థికసాహాయ్యమునకు
కృతజ్ఞత



This Book is published with the Financial assis-
tance of Tirumala Tirupati Devasthanams under their



శ్రీ శ్రీ శ్రీ బ్రహ్మానందతీర్థస్వామివారు (ఇనమడుగు)

శ్రీరస్తు

# శ్రీరామాయణ తరంగిణి

ఏడవభాగము

లక్ష్మణతీర్థాదిచతుష్టయము



రచయిత:

పోలూరి హనుమజ్జానకీరామ శర్మ

ప్రథమ ప్రకాశనము : మే 1988
ప్రతులు : 1000

ప్రకాశకుఁడు :
పోలూరి హనుమజ్జానకీరామశర్మ B. A., (Hons)
16/1216, పొగతోట, నెల్లూరు-524 001

ప్రతులు దొరుకుచోట్లు :

1. శ్రీరామకృష్ణ సేవాసమితి (రిజిష్టర్డు)
కాసుఖేలవారియగ్రహారమునెల్లూరు—524 001

2. శ్రీవివేకానంద విద్యాలయము
4/120, ముకుందపురము
నవాబుపేట, నెల్లూరు- 524 002

3. బ్రహ్మానందతీర్థస్వామి,
శ్రీసత్యానందాశ్రమము, ఇనమడుగు-524 137,
కోవూరుతాలూకా, నెల్లూరుజిల్లా.

ముద్రణము :
కమలాంబికా ప్రెస్ నెల్లూరు-1

# ఆశీః పరంపర

## శ్రీసత్యానందమహర్షులవారు

శ్రీ సత్యానంధాశ్రమము, ఇనమడుగు, నెల్లూరుజిల్లా.



శ్రీరామచంద్రుడు ధర్మస్వరూపుడు; ధర్మమును అవంతయైన తప్పినవాడు కాడు. శ్రీమద్రామాయణము వాల్మీకికృతమై మహోజ్జ్వలాదర్శప్రాయమై, శుభప్రదమై, మోక్షదాయకమై విలసిల్లుచున్నది; మరియు అదికావ్యమై ప్రసిద్ధిని గాంచియున్నది. శ్రీమద్రామాయణము ప్రాచ్యభాషలలోనేగాక పాశ్చాత్యదేశీయవిదేశీయభాషలలో సైతము అనువదింపబడి విశ్వవ్యాప్తమైయున్నది.

శ్రీరామచరితపఠనపాఠనపారాయణముల గావించుటయే గాక అందలితత్త్వమును భక్తాగ్రేసరులు గ్రహించుచున్నారు: ఇంకను అనుష్ఠించుటకు ప్రయత్నించుచున్నారు. శ్రీరామచంద్రుడు అంధ్రులకులదైవత మనుటకు అంధ్రదేశమున చిరకాలము నివసించుటయే కారణము. అబాలగోపాలము శ్రీమద్రామాయణమును శ్రద్ధాభక్తివిశ్వాసములతో పఠించుచు గ్రహించుచు పరమానందమును పొందుచున్నది. శ్రీరామనామమును అలకించుటతోడనే తన్మయత్వానందములు కలిగి అనందబాష్పములు అప్రయత్నముగా జలజల రాలును.

సీతారాముల దివ్యచరితమును శ్రీవాల్మీకిమహర్షి వివిధ రీతుల అత్యద్భుతముగ వర్ణించియున్నాడు. నైతికసాంఘికరాజకీయ ఆధ్యాత్మికరంగములయందు శ్రీరామచంద్రుని సర్వతోముఖ ప్రజ్ఞ విశ్వతోముఖధర్మాచరణము చిరస్మరణీయమై యున్నది. దేశములు మారినను కాలములు మార్పొందినను పరిస్థితులు తారుమారైనను అమాంతముగా పరిణామమును నొందనిది (మారనిది) శ్రీమద్రామాయణము.

శ్రీవాల్మీకిమహర్షి దేవభాషయందు గాయత్రీబీజకేంద్రీకరణమున ఇరువదినాల్గువేల శ్లోకములను ఏడుకాండములుగ శ్రీమద్రామాయణమును ఆదికావ్యమును పండితపామరరంజకముగా రచించెను. శ్రీమద్రామాయణములో హనుమంతుని భవ్యదివ్యచరితము విపులముగ వర్ణింపబడియున్నది. ఆంజనేయస్వామి మహాబలసంపన్నుడయ్యు శ్రీరామచంద్రునియెడ వినయవిధేయతలు భక్తిశ్రద్ధలు గలవాడు. యుద్ధరంగమున పవనసుతుడు లేనిచో యుద్ధమే లేదనుట అతిశయోక్తి కాజాలదు. ఇప్పటికాలమున స్వామిభక్తిగలవారు అల్పసంఖ్యాకులు మాత్రమే ఉన్నారు. ఇట్టి దుస్థితి అధోగతిపాలొనర్చును. వారు తమ అనర్థమును గ్రహింపజాలకుండుట శోచనీయము.

విభీషణుడు పవిత్రచరిత్రుడు; శరణాగతిదివ్యభావము కలవాడు; ధర్మపరాయణుడు; రాక్షసకులములో జన్మించినను రావణాసురుని సోదరుడైనను ప్రవృత్తిచేత రామానుగ్రహము సమగ్రముగా పొందినాడు. యుద్ధరంగములో విభీషణుని స్థానము అగ్రగణ్యమైనది.

పాతివ్రత్యమునకు పారిశుద్ధ్యమునకు సీతామహాదేవి మహాదాదర్శమైనది. సీతాదేవి అయోనిజ; మహాభాగ్యముగా జనకచక్రవర్తికి ప్రాప్తించి, సుకుమారముగా పెరిగి, శివధనుర్భం

గము గావించిన శ్రీరామచంద్రునకు సహధర్మచారిణి యైనది. శ్రీరామయణ మంతయు సీతామహాదేవి దివ్యచరిత్రమే. సీతాదేవి యొక్క సహనము, రావణాసురునిచేత బాధింపబడి, అశోకవన మున శోకసంతప్తయై జగదేకభర్తయగు రఘునాథునే స్మరించుచు దేశకాలపరిస్థితులను విస్మరించెను. ఇదియే వాస్తవముగ ఏకాగ్రతాసంయుక్తమహాతపస్సు.

లక్ష్మణునకు శ్రీరామచంద్రునియెడ భక్తి అధికము. శ్రీరామచంద్రునకు సీతయెడనున్న ప్రేమ అధికమైనది. అవిషయము ఆమెవియోగమువలన శ్రీరామభద్రుడు పొందిన విశేష దుఃఖమువలన వ్యక్తమగుచున్నది. కాని సోదరుడగు లక్ష్మణుని యందు ఆయనకు గలప్రేమ సీతయందున్న ప్రేమకంటె గాఢ తమ మైనది. లక్ష్మణుడు శ్రీరామచంద్రుని వదలియుండలేదు. లక్ష్మణునకు తల్లి, తండ్రి, గురువు, దైవము సర్వస్వము శ్రీరాముడే. శ్రీరామునకు కించిత్తు ఆపద వచ్చినను లక్ష్మణుడు సహించువాడు కాడు. ఇంద్రజిత్తును సంహరింపగలిగిన శక్తిమంతుడు లక్ష్మణుడు.

సుగ్రీవుడు చండశాసనుడు. సుగ్రీవాజ్ఞ అన్నది జగత్ప్రసిద్ధము. అతడు క్రమశిక్షణకు ఆదర్శప్రాయుడు. వానరప్రముఖులను ప్రపంచమున నలుదిశలకు పంపి సీతాన్వేషణము గావించెను; యుద్ధరంగమున మహానాయకుడై వానరసేనను క్రమబద్ధముగ నడిపించెను. లక్ష్మణుడు మూర్ఛ జెందినపుడు సుగ్రీవహనుమజ్జాంబవదాదులు విశేషముగ దుఃఖించిరి.

భరతునిది భావవైరాగ్యము. భరతుడు నందిగ్రామమున ప్రాతఃకాలమున శ్రీరామచంద్రుని పాదుకలను సింహాసనముపై ప్రతిష్ఠించి రాజ్యవ్యవహారములను పాదుకలకు నివేదించుచు

పదునాలుగుసంవత్సరములు పరిపాలనను కొనసాగించెను. పుష్పకవిమానమున శ్రీరామచంద్రుడు అయోధ్యకు రాగానే రాజ్యమును ఆయనకు అర్పణముగా గావించి భారమును వదిలించుకొని సోదరుడగు శ్రీరామచంద్రునకు కింకరుడుగా తన జన్మను సార్థకపరచుకొనెను. మహారణ్యములోనున్న రామచంద్రునివలె భరతుడు జటాజూటధారియై భ్రాతృవిరహదుఃఖమున కృశించినశరీరముకలవాడై యుండెను. శ్రీరామదర్శనకాంక్షతో దేహపోషణార్థము అల్పాహారమును స్వీకరించుచు జన్మను సార్థకపరచుకొనెను.

ఈగ్రంథరాజము ఏడవభాగముతో పూర్తియైనది. ఇంకను శ్రీరామచంద్రునిసేవలో సర్వస్వమును అర్పించి శ్రీరామాజ్ఞను పాలించినవారు అనేకులు కలరు. లక్ష్మణతీర్థము రఘునందన తీర్థము జానకీతీర్థము పట్టాభిషేకతీర్థము అనునాలుగుతీర్థములు ఈయేడవభాగమున కలవు. శ్రీరాముని కైంకర్యములో జీవితమును సంతోషముగ గడిపిన వ్యక్తులనేకులు కలరు. వారినిగూర్చి తెలిసికొనగోరువారు ఈయేడవభాగమును చదివి తీరవలయును. ఆంధ్రలోకము శ్రీశర్మగారికి ఋణపడియున్నది.

———

శ్రీరస్తు

# తొలిపలుకులు

ఈయేడవభాగముతో శ్రీరామాయణతరంగిణి పూర్తి యగుచున్నది. ఈసందర్భమున ఈగ్రంథరచనకు అనుషంగికము లైన కొన్ని సంఘటనములను పేర్కొనవలసియున్నది.

నాకు శ్రీమద్వాల్మీకిరామాయణముతో వ్యాసంగము ఈ గ్రంథరచనకు పూర్వమే అనేకవిధముల ఏర్పడెను. 1951 మార్చినెలలో మాఅక్కగారు కీ॥ శే॥ శ్రీమతి చోరగుడి హనుమత్ శేషమ్మగారు పి. ఓ. ఎల్ (P. O. L) పరీక్ష వ్రాసిన తరువాత ఎమ్. ఓ. ఎల్. (M.O.L) పట్టముకొఱకు, "వాల్మీకి రామాయణ నాటకములు" అనువిషయముపై పరిశోధనవ్యాసమును (Thesis) వ్రాయఁబూనుకొనెను. అమెకు సాయముగా నేను కూడ సంస్కృతములోని రామకథానాటకములను చదువుచు వాల్మీకిరచనముతో పోల్చి విమర్శించుచుంటిని. ఆ పరిశీలనము 1954 జూలైప్రాంతమున పూర్తియై ఆమె 1955 జనవరిలో ఎమ్. ఓ. యల్. (M.O.L) పట్టమును పొందెను.

1954 అక్టోబరులో జయసంవత్సరశరన్నవరాత్రులలో మే మిరువురము కందుకూరుతాలూకాలోని వెన్నూరునకు పోయితిమి. అక్కడ మాతాతగారియింటిలో 4.10.1954 తేది ఉదయము సుమారు 10 గంటలకు ఏకాంతమున నేను విశ్రమించి యుండఁగా అనుకొనకుండ వ్యాసభగవానునిగూర్చి స్తుతిపద్యములు స్ఫురింపఁ జొచ్చెను. అరచనము క్రమముగా నలచరిత్రముగా రూపొంది విలంబ సంవత్సరాశ్వయుజ బహుళ ప్రతిపత్సోమవాసరమున, 13.10.1958 తేది పూర్తి యయ్యెను.

తరువాత 15.3.1959 తేది ఫాల్గున కృష్ణదశమీ స్థిర వాసరమున సాయంకాలము మిత్రుఁడు కీ॥ శే॥ శ్రీ దుర్భా రామ మూర్తిగారికొఱకు శ్రీవేంకటగిరిగారి రాజకళాశాలకు ఎదురుగానున్న వినోదభవనమునకు (Macleans Club & Reading Room) పోయితిని. ఆయన పైయంతస్తునందు క్రీడానిమగ్నుఁడై యుం డెను. నేను పైకి పోయి ప్రక్కన వరాండాలో (Balcony) కూర్చుండి ఆకసమువంక చూచుచుంటిని. అప్పుడు అయిదున్నర గంటల ప్రాంతమున వాల్మీకికి సంబంధించిన పద్యములు స్ఫురింపఁ జొచ్చెను. కలికల్మషహరమైన నలచరిత్రము తరువాత పరమేశ్వరుఁడు నాచేత పుణ్యప్రదమైన రామకథను పలికించు చున్నాఁ డేమో యనుతలంపు కలిగెను. ఆ తలంపుతో మరల రామాయణమును పఠింపఁజొచ్చితిని.

అప్పటికే అనేకపర్యాయములు వాల్మీకిరామాయణము లోని వివిధఘట్టములను రామకథానాటకములలోని సన్నివేశ ములతో పోల్చి పరిశీలించియుండుటచే కొన్ని యభిప్రాయములు నాకు ఏర్పడియుండెను. వాల్మీకిరచనమునకు భిన్నముగా నాటకకర్తలైన మహాకవులు గావించిన కల్పనము లన్నియు రసా భాసము లయ్యేనేకాని రసవంతములు కాలేదని, సన్నివేశసంఘ టనమున సంవాదశైలియందు అంతర్బాహ్యసంఘర్షణ చిత్రణ మున (Depiction of internal and external struggle) ఏ నాటకకర్తయు వాల్మీకిమహర్షితో సమత్వమును పొందలేకపోయె నని, రూఢముగా గ్రహించియుంటిని. కావున రామకథను తెలుఁగునకు తెచ్చునప్పుడు రసపోషణముకొఱకు ఎట్టి కల్పనలు చేయ నక్కఱ లేదని, నాటకకావ్యాదులలోని యే యంశములను చొప్పింపఁబనిలేదని నిశ్చయించుకొంటిని. వాల్మీకిరచనము సర్వాంగసుందరమైన చిత్రము. దానియందు కొన్నిరేఖలు చేర్చి

నను, లేదా ఉన్నవానిని మార్చినను దాని సౌందర్య సమగ్రతకు భంగమే కలుగునని తోఁచెను. అందువలన వాల్మీకి హృదయమును మాత్రమే గ్రహించి దానిని సాధ్యమైనంతవఱకు తేట తెలుఁగులో తెలుఁగువారికి అందింప ప్రయత్నించినచో రచనము కృతార్థ మగునని నిశ్చయించితిని.

ఈవిషయమున కవిత్రయము పోతన్నగారును అవలంబించిన విధానము విశిష్టముగా నున్నది. వారు మూలములోని కొన్ని భాగములను సంగ్రహించినను కొన్నిచోట్ల వర్ణనములను పెంచినను, మూలమునకు భిన్నములైన కల్పనలను, ఫుక్కిటిపురాణములను కావ్యనాటకాదులలోనియంశములను, తమయనువాదములందు గ్రహింపలేదు.కాళిదాసుని శాకుంతలము ప్రసిద్ధమై ఎంత యాకర్షకముగా నున్నను, నన్నయభట్టారకుఁడు శకుంతలోపాఖ్యానమున అనాటకములోని యొక్క కల్పనమును గాని, కనీసము ఒక్క శ్లోకమును కూడ అనువదింప లేదు. అయన వ్యాసునిమూల మెట్లున్నదో అట్లే రచించెను. తెలుఁగున మహాభారతభాగవతములకు ఏర్పడిన ప్రామాణికత్వమునకు గౌరవమునకు ఇది యొక ముఖ్యకారణము. ఈ దృష్టిలో వాల్మీకి రామాయణమును మరల నిశితముగ పరిశీలించుచు ఆయా ఘట్టములను యథాశక్తి భావించుచు దానిని చంపూకావ్యముగా రచింపఁజొచ్చితిని. రచన నెమ్మదిగా జరుగుచుండెను. అప్పటి నుండి రామాయణముపై ప్రసంగింపవలసివచ్చినప్పుడెల్ల కేవలము వాల్మీకిరచనముపైననే అధారపడి మాటాడుచుంటిని.

ఇట్లుండఁగా 1974 జూలైలో అనుకోకుండను, శ్రీరామకృష్ణ సేవాసమాజయాజమాన్యమున కాసుఖేలవారియనుగ్రహమున (నెల్లూరు) శ్రీసదాశివవేదాంతమందిరమునందు ఒకసమావేశము జరిగెను. అందు రామాయణములోని యొక సన్నివేశమును

ప్రస్తావించితిని. అప్పుడు ప్రియమిత్రుఁడు చి॥ బొమ్మిశెట్టి ఎల్లమందయ్య బి. ఏ. "ఈ సన్నివేశము తులసీదాసరామాయణ మున నిట్లు లేదే" అనెను.

నే నిట్లు సమాధానము చెప్పితిని. "ఆ మాట నిజమే. తులసీదాసు వాల్మీకిరామాయణమును అనువదించుచున్నా నని చెప్పలేదు. అయన గ్రంథారంభముననే అనేక గ్రంథములలోని రామకథావిశేషములను గ్రహించుచున్నా నని, తనరచనావిధాన మును ఇట్లు స్పష్టముగా చెప్పెను. "రామాయణమునందు చెప్పఁబడినది, కొన్నియెడల ఇతరగ్రంథములలో నానాపురాణ నిగమాగమసమ్మతముగా నున్నది యగు రఘునాథగాథను తులసీదాసు తనయంతరంగసుఖముకొఱకు అతిమంజులమైన భాషానిబద్ధముగా రచించుచున్నాఁడు"

శ్లో॥ నానాపురాణనిగమాగమసమ్మతం యత్
రామాయణే నిగదితం క్వచి దన్యతోఽపి।
స్వాన్తస్సుఖాయ తులసీ రఘునాథగాథా
భాషానిబద్ధ మతిమంజుల మాతనోతి॥

ఈవిషయమున తమిళములో కంబఁడు, తెలుఁగున భాస్కరుఁడు గోనబుద్ధారెడ్డి మొదలగువారి దృష్టి కూడ ఇట్టిదే. వారు వాల్మీకి యభిప్రాయమును మాత్రమే చెప్పవలయు నని పూనుకొనలేదు. అందువలన వాల్మీకిరచనమునకు భిన్నములైన సన్నివేశములు కల్పనములు అనేకములు ఆగ్రంథములందు కలవు. కావున వానినిబట్టి వాల్మీకియభిప్రాయమును గ్రహించుటకు వీలులేదు"

అప్పుడు చి॥ ఎల్లమందయ్య "అట్లయినచో మాకు వాల్మీకి యభిప్రాయము ఎట్లు తెలియును"? అవి యడిగెను. "మీరు సమావేశములు ఏర్పాటుచేసినచో నాకు తెలిసినంతవఱకు

వాల్మీకిహృదయమును అనుసరించి రామాయణకథను ప్రసంగ పరంపరలో వివరింతును" అని చెప్పితిని. తక్కిన సమాజ సభ్యులును అవిషయమున కుతూహలము నొందిరి. తరువాత ప్రసంగపరంపర నేర్పాటుచేయు కార్యక్రమభారమును ఇతర సభ్యుల సహకారముతో సమాజకార్యదర్శి ప్రియశిష్యుఁడు చి॥ శివరాజు వేంకటనరసింహరావు B. A. B. T వహింపఁగా26.10.74 నుండి 14.12.75 వఱకు ఆదివారములందు సాయంసమయానంత రము ఏఁబదియొక్క ప్రసంగములను గావించితిని.

1982 జూలైప్రాంతమున శ్రీశ్రీశ్రీ సత్యానందమహర్షుల వారి ప్రియాంతేవాసులు శ్రీశ్రీశ్రీ బ్రహ్మానందతీర్థస్వామివారు అప్రసంగములను గ్రంథరూపమున ప్రకటించుట అవశ్యకమని చి॥ ఎల్లమందయ్యను ప్రోత్సహించిరి. అతఁడు ముద్రణకార్య భారమును వహింపఁగా గ్రంథమున మొదటిభాగము 1983 జనవరిలో ప్రకాశము నొందెను. ఈశ్వరానుగ్రహమున గ్రంథము ఇప్పటికి పూర్తియయ్యెను.

మూలమునందు ఇప్పుడు మనకు నచ్చనివి, నమ్ముటకు శక్యము కానివి యనేకవిషయములు కలవు. వానిని ఉన్నవి యున్నట్లే చెప్పితిని. వానిని సాధ్యమైనంతవఱకు సహేతుకముగా వివరించుటకు యత్నించితిని. ఇందు అనేకసందర్భములలో మూలములోని శ్లోకములను మాత్రమే ప్రధానముగా ఉదాహ రించి వాల్మీకిమహర్షియభిప్రాయమును వివరించుటకు ప్రయ త్నించితిని. ఈప్రయత్నము సమగ్రము కాదు. సహృదయులు పెద్దలవలన ఇంకను పెక్కువిశేషములను గ్రహింపఁగలరు. ఈ వివరణములందు అధ్యాత్మరామాయణాదులయందలి విషయము లను ప్రస్తావింప లేదు. అట్లే వాల్మీకిరచనమునుండి పాఠకుల దృష్టి చెదరకుండ నుండవలయు నను తలంపుతో భాస్కరరామా యణము రంగనాథరామాయణము మొదలగువానినుండి తెలుఁగు పద్యములను కూడ పొందుపఱచలేదు. ఈకారణముచేతనే శ్రీశ్రీశ్రీ బ్రహ్మానందతీర్థస్వామివారు. నేను రచించుచున్న చంపూ

రామాయణములోని కొన్నిఘట్టములను విన్న తరువాత, "మీ చంపూకావ్యములోని పద్యములను ఈగ్రంథమునందు అక్కడక్కడ సందర్భోచితముగ పొందుపఱచిన బాగుండునేమో" అని సూచించినను, నాపద్యములను ఈగ్రంథమున ప్రవేశపెట్టలేదు.

ఈగ్రంథమున దొరలిన భ్రమ ప్రమాదములను పెద్దలు తెలిపినచో కృతజ్ఞతతో సవరించుకొందును. మొదట ముద్రణ వ్యయమును కీ॥ శే॥ బొమ్మిశెట్టి రామనాథంశ్రేష్ఠిగారి పుత్రులు ఎల్లమందయ్య బి. ఏ, ఇతనితమ్ముఁడు చి॥ బొమ్మిశెట్టి వీర రాఘవులును కొంత వహించిరి. శ్రీ దొమ్మరాజు నరసింహరాజుగారి ప్రోత్సాహమున తెలుగుగంగ డైరెక్టరు శ్రీ. కే. రామరాజుగారు కొంతధనము నొసంగిరి. శ్రీ వేముల సత్యనారాయణగారు B.A.C.A.I.I. (Retired Staff Cfficer, State Bank of India) శ్రీ గోపరాజు పూర్ణచంద్రరావుగారు (Professor & Head of the Dept of Civil Engineering B.I.I.T, Ranchi)కూడ ధన సాహాయ్యమును గావించిరి.

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు మూఁడవ భాగమునకు రు. 7010/—లు నాల్గవభాగమునకు రు. 7500/-లు ఏడవభాగమునకు రు. 7300—లు ధనసాహాయ్యమును గావించిరి. అయిదవభాగమునకు అర్థికసాహాయ్యము తప్పక లభించునని ఆప్తులు చెప్పఁగా సాహాయ్యము లభించినట్లే ముందుగా గ్రంథమున ప్రకటించితిని; కాని కారణాంతరములచే లభింపలేదు.

చి॥ రామరాజు చెన్నకేశవరావు బి. ఏ., చి॥ రావినూతల శ్రీరాములు B.A.L.L.B, శ్రీశ్రీశ్రీ రామానంద భారతస్వామివారును (బెజవాడ) మొదలుగా అనేకులు ఈగ్రంథవిక్రయ ప్రచారములకు కృషిచేయుచున్నారు. శ్రీరాజి (నెల్లూరు) చిత్రించియిచ్చిన యట్టిమీఁదిబొమ్మ గ్రంథనామాదికము అయిదవభాగమునుండి ముద్రింపఁబడుచున్నది.

కమలాంబికాముద్రణాలయాధినేతలు శ్రీపద్మనాభముగారు, చి॥ రంగనాథము, అచ్చుటికార్యకర్తలును ఎంతో శ్రద్ధతో గ్రంథము అందముగా ముద్రిత మగుటకు కృషియొనర్చిరి.

ఈ గ్రంథముద్రణప్రకాశనవిక్రయప్రచారములకు తోడ్పడు చుండినవారి కందఱకును శ్రీసీతాలక్ష్మణహనుమత్సమేతుఁడైన శ్రీరామచంద్రప్రభువు ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించును గాక!

అమోఘములైనయాశీస్సులను ప్రసాదించుచున్న శ్రీశ్రీశ్రీ సత్యానందమహర్షులవారికి (ఇనమడుగు), తప్పొప్పులపట్టికను తయారుచేసిన శ్రీశ్రీశ్రీ బ్రహ్మానందతీర్థస్వామివారికిని అనేక నమస్కారములు చేయుచున్నాను.

తప్పులను సవరించుకొని తరువాత గ్రంథమును చదువుఁడని పాఠకులను ప్రార్థించుచున్నాను.

నెల్లూరు, బుధవిధేయుఁడు
విభవవైశాఖము పోలూరి హనుమజ్జానకీరామశర్మ
బహుళదశమి
శ్రీహనుమజ్జయంతి
11-5-1998.



బొమ్మిశెట్టి ఎల్లమందయ్య

బొమ్మిశెట్టి వీరరాఘవులు



శివరాజు వేంకటనరసింహరావు.

శ్రీరస్తు

# స్తుతి

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే॥

శ్లో॥ వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యేపుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్।
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాన్తం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్॥

శ్లో॥ నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై।
నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో
నమోఽస్తు చంద్రార్కమరుద్గణేభ్యః॥

శ్లో॥ యత్ర యత్ర రఘునాథకీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్।
బాష్పవారిపరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాన్తకమ్॥

శ్లో॥ కూజన్తం రామ రా మేతి మధురం మధురాక్షరమ్।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్॥

శ్లో॥ యః కర్ణాంజలిసంపుటై రహ రహ స్సమ్య క్పిబ త్యాదరాత్
వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు।
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యంతసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్॥

శ్లో॥ వాల్మీకిగిరి సంభూతా రామసాగరగామినీ।
పునాతు భువనం పుణ్యా రామాయణమహానదీ॥

# విషయసూచిక

## తీర్థములు ఘట్టములు:-

—

# శ్రీ రామాయణతరంగిణి

## 21. లక్ష్మణతీర్థము

### 1. యుద్ధారంభము

ఋక్షవానరసైన్యము నగరమును నిరోధించె నని భటులు రావణునకు నెఱింగించిరి. అతఁడు నగరరక్షణవిధానమున కట్టుదిట్టములు రెట్టింపుగాఁ జేసి ప్రాసాదము నారోహించి లంక పరిసర మంతయు సశైలవనముగా వానరపరివ్యాప్తమై యుండుటను చూచి "వీరి నెట్లు నాశమొందింప నగును?" అని యాలోచింపఁ జొచ్చెను.

వానరబలములచే నిరుద్ధమైన లంకను చూచి హర్షమునొందుచు రాముఁడు సీతను స్మరించి సంతప్తుఁడై శత్రువధమును వెంటనే ఆజ్ఞాపించెను. రామునియాజ్ఞ యైనంతనే ఋక్షవానరులు, రావణుఁడు చూచుచుండఁగా, సాలశైలాగ్రయోధులై ప్రాకారముపై కెగిరి తోరణద్వారములను పగులఁగొట్టుచు గోపురములను కూలఁద్రోయుచు పరిఖలను పూడ్చుచు, "అతిబలుఁడైన రామునకు జయము, రాఘవపాలితుఁడైన సుగ్రీవునకు జయము" అని వీరనినాదములు గావించుచు విక్రమింపఁజొచ్చిరి.

శ్లో॥ జయ త్యతిబలో రామో లక్ష్మణ శ్చ మహాబలః।
రాజా జయతి సుగ్రీవో రాఘవే ణాభిపాలితః॥ 20

యుద్ధ-సర్గ.

కొందఱు శత్రువులను మార్కొనుచుండఁగా మఱికొందఱు వీరబాహువు సుబాహువు పనసుఁడు మొదలగు వారు స్కంధా

వారనివేశనమును గావింపఁజొచ్చిరి. కుముదుఁడు ప్రఘసపనసు లతో పదికోట్లమందివానరులతో పూర్వద్వారసమీపమున ఈశాన కోణమున, ఇరువదికోట్ల సైన్యముతో శతబలి దక్షిణద్వారసమీప మున ఆగ్నేయకోణమందు, అరువదికోట్లబలముతో సుషేణుఁడు పశ్చిమద్వారసమీపమున నైరృతికోణమునందును, సుగ్రీవునితో కూడ గవాక్షుఁడు కోటిసైన్యముతో ఉత్తరద్వారసమీపమున వాయువ్యకోణమునను సహాయులై నిలిచిరి.

రాముని సైన్యసన్నాహమును చూచి రావణుఁడు వెంటనే తరలుఁడని సైన్యముల కాజ్ఞాపించెను. భేరీశంఖనినాదములతో మహాప్రవాహములుగా రాక్షసులబలములు బయలుదేరి వానర సైన్యమును మార్కొనెను. శంఖదుందుభినిర్ఘోషములతో వీర యోధులసింహనాదములతో గజబృంహితములతో హయహేషిత ములతో రథనేమినిస్వనములతో పదఘట్టనములతో పర్వతసాను వులు భూమ్యాకాశములు ప్రతిధ్వనించెను. ఋక్షరక్షోవానరుల సమరము ఘోర మయ్యెను. ప్రాకారముపైనుండి రాక్షసులు భిందిపాలశూలాదులతో పైకెగురుచున్న ఋక్షవానరులను ప్రహ రింపఁజొచ్చిరి. ఋక్షవానరులు వానిని లెక్కఁబెట్టక పైకెగిరి రాక్షసులను క్రిందికి కూల్చుచుండిరి. సంప్రహారము తుములమై చూచుచుండఁగనే సంగరాంగణము మాంసశోణితకర్దమమయ మయ్యెను.

ఇంతలో వీరవర్యులద్వంద్వయుద్ధములు కూడ ఆరంభ మయ్యెను. ప్రజంఘుఁడు సంపాతిని మూఁడుబాణములతో ప్రహ రింపఁగా, సంపాతి వాని నొకవృక్షముతో కూల్చెను. జంబుమాలి శక్తితో హనుమంతుని వక్షమున తాడింపఁగా, హనుమంతుఁడు వానిని రథముతోఁ గూడ నేలఁగూల్చెను. నలుఁడు ప్రతపనుని

కనులు పెటికివైచెను. సుగ్రీవుఁడు ప్రఘను నంత మొందించెను. లక్ష్మణుఁడు విరూపాక్షుని సంహరించెను, అగ్నికేతు రశ్మికేతు సుప్తఘ్నయజ్ఞకోపులశీర్షములను రాముఁడు ఖండించెను. మైందుఁడు వజ్రముష్టిని, నీలుఁడు నికుంభుని, ద్వివిదుఁడు అశనిప్రభుని, సుషేణుఁడు విద్యున్మాలిని సంహరించిరి.

ప్రొద్దు గ్రుంకి చీఁకటిపడుచున్నను యుద్ధము ఘోరముగా సాఁగుచునే యుండెను. అప్పుడు కొందఱు రాక్షసులు రామలక్ష్మణులపైకి వచ్చిరి. శరవర్షమున రాముఁడు రాక్షసులను కూల్పఁ జొచ్చెను. యజ్ఞశత్రు మహాపార్శ్వ మహోదర వజ్రదంష్ట్ర మహాకాయ శుక సారణులు సకలమర్మములందు తాడితులై రణరంగమును వీడి బ్రతికిరి. నిమేషాంతరమాత్రమున రాముఁడు దీప్తములైన బాణములచే దిశలు వెలుఁగొందునట్లు చేసి పెక్కుమంది రాక్షసులను సంహరించెను.

అంగదుఁడు ఇంద్రజిత్తును మార్కొని యతనియశ్వములను సారథిని తెగటార్చెను. ఇంద్రజిత్తు రథమును వీడి పరిశ్రాంతుఁడై యంతర్హితుఁ డయ్యెను. అంగదునిపరాక్రమమును దేవతలు ఋషులు స్తుతించిరి; రామలక్ష్మణులు అభినందించిరి; సుగ్రీవ విభీషణాదు లందఱు సాధువాదములు గావించిరి.

## 2. నాగపాశబంధనము

పరాజయమును పొందిన యింద్రజిత్తు తీవ్రమైనక్రోధముతో నదృశ్యుఁడై యంతరిక్షమున నిలచి పాములను శరములనుగాఁ జేసి రామలక్ష్మణులను దేహములయందంతటను ప్రహరించెను. ఆకాశమునుండి వచ్చి తగులుచున్న శరములచేత వ్యథనొందుచు రాముఁడు "వాఁ డెక్కడ నున్నాఁడో తెలిసికొనుఁడు"

అని ఆంజనేయాంగదనీలాదులను పదిమందిని పంపెను. వారు పాదపహస్తులై గగనమున కెగిరి వచ్చుచుండుటను చూచి ఇంద్రజిత్తు పరమాస్త్రములతో వారిగమనమును నిరోధించి క్షతవిక్షతులను గావించెను. వారు ఇంద్రజిత్తుయొక్క దాపునకు పోలేక ఆ బాణములు ఎక్కడనుండి వచ్చిపడుచున్నవో తెలిసికొనలేక హతాశులై తిరిగి వచ్చిరి. వారిపరాజయమునకు ఇంద్రజిత్తు చాల సంతోషించి మరల రామలక్ష్మణులపైననే తీవ్రబాణములను ప్రయోగింపఁజొచ్చెను. శరీరములు రక్తధారామయములై వారు పూచిన మోదుగులవలె నైరి. "యుద్ధమునందు అదృశ్యుఁడనైన నన్ను ఇంద్రుఁడు కూడ గుర్తింపఁజాలఁడు. మీరెంత? శరజాలనిబద్ధులైన మిమ్ము ఇప్పుడే సంహరింతును" అని గర్జించుచు ఇంద్రజిత్తు మరల రామలక్ష్మణులపై వాడియైనబాణములను ప్రయోగించెను. వారిశరీరములందు అంగుళమాత్రము కూడ బాణములు తగులనిప్రదేశము లేకుండెను. రక్తము నిరంతరముగా స్రవింపఁజొచ్చెను. మర్మములయందు బాణములు తగులుటచే రాముఁడు మూర్ఛిల్లెను. అన్నయొక్క పాటును చూచి లక్ష్మణుఁడు కూడ జీవితమునందు నిరాశ నొంది సోలి వ్రాలెను. వానరు లందఱు వారిని జూచి కన్నీరు గార్చుచు ఆక్రోశమొనర్పఁ జొచ్చిరి.

కొలఁదిసేపటిలో రామలక్ష్మణులు మరణించుట తథ్య మని తలంచుచు ఇంద్రజిత్తు శరప్రయోగమును విరమించి వానరుల సంక్షోభమును వినోదముగా తిలకించుచుండెను. వర్షము కురిసి వెలసినట్లుగా బాణములు వచ్చిపడుట ఆగినంతనే విభీషణుఁడు సుగ్రీవుని గైకొని రామలక్ష్మణులయొద్దకు వచ్చెను. రక్తధారలలో మునిఁగి మందముగ నిశ్వసించుచున్న రామలక్ష్మణులను చూచి సుగ్రీవుఁడు వానరసేనానాయకులు విలపింపఁజొచ్చిరి. వారు

అంతరిక్షమున నలువైపులఁ గలయఁజూచియు ఇంద్రజిత్తును కనుగొనఁజాలకుండిరి. మాయావిదుఁడైన విభీషణుఁడు మాత్రము వానిని చూడఁగలిగెను. తన్ను విభీషణుఁడు చూచుచున్నాఁడని గమనించి వెడలిపోవుటకు ఉద్యుక్తుఁడై ఇంద్రజిత్తు రాక్షసులకు హర్షమును కలిగించుచు, "ఖరదూషణాదులను సంహరించిన రామలక్ష్మణుల నిర్వురను శరజాలమున బంధించితిని; సురాసుర మహర్షి సంఘములు కూడి వచ్చినను ఈశరబంధమునుండి వీరిని తప్పింపఁజాలరు; ఈవనచరులవిక్రమ మంతయు నిష్ఫలము; ఎవరివలన మాతండ్రికి సంతాపము, లంకకు ఇట్టిదుస్థితియు కలిగినదో వారిని శమింపఁజేసితిని" అని యుద్ఘోషించెను. పిదప అతఁడు సమధికమైన యుత్సాహముతో రాక్షసు లందఱు హర్ష విస్మయములతో చూచుచుండఁగా నీలుఁడు మొదలుగా వానర సేనాపతుల నందఱను బాణతాడితులను గావించెను. వారందఱు వ్యథ నొందుచుండఁగా ఇంద్రజిత్తు రాక్షసులను చూచి, "శరబద్ధులైన రామలక్ష్మణులను చూడుఁడు" అని అట్టహాసము గావించెను. రాక్షసులు హర్షముతో విస్మితులై చూచుచు రామలక్ష్మణులు హతులై రనియే తలంచుచు జయజయనినాదములతో ఇంద్రజిత్తును అభినందించిరి. అతఁడు కూడ నిరుచ్ఛ్వాసులైనట్లు పడియున్న రామలక్ష్మణులను చూచి మరణించి రనియే తలంచుచు ప్రహర్షము నొంది రాక్షససేనాపరివృతుఁడై లంకకుఁ దిరిగి పోయెను.

రామలక్ష్మణులను చూచుచు దుఃఖించుచున్న సుగ్రీవుని చూచి విభీషణుఁ డిట్లు ఓదార్చెను. "మిత్రమా! భయము నొందకుము; శోకమును నిగ్రహింపుము. సాధారణముగా యుద్ధములన్నచో ఇట్లే కదా యుండును! విజయ మెప్పుడును ఒకపక్షము

ననే యుండదు. వీ రిప్పుడు మూర్ఛిల్లియున్నారు. మనకు భాగ్య శేషమున్నచో వీరు త్వరలో మూర్ఛనుండి తేఱుకొందురు. మన స్సును నిగ్రహించుకొనుము. సత్యధర్మాభిరక్తులైన వీరికి మృత్యు భయము లేదు." ఇట్లు చెప్పి విభీషణుఁడు జలము నభిమం త్రించి దానితో సుగ్రీవునికన్నులను తుడిచి అసంభ్రాంతుఁడై యిట్లనెను. "వానరేంద్రా! ఇది దైన్యమునకు కాలము కాదు. ఇట్టి సమయమున అతిస్నేహము కూడ మరణావహ మగును. కావున సర్వకార్యవినాశకమైన దైన్యమును వీడి రామపురస్సరమైన సకల బలమునకు హితము నాలోచింపుము. రామునకు స్మృతి కలుగు వఱకును వీరిని రక్షించుచుండుము. వీరికి స్మృతి కలిగినచో వీరు మనభయమును తొలఁగింపఁగలరు. రామున కేమియు హాని కాలేదు; ముఖమునందు కళ తప్ప లేదు. నేను సర్వసైన్యములను కుదుటఁబఱచి వచ్చునంతవఱకు నిన్ను నీవు నిగ్రహించుకొని నీ బలగము నోదార్చుచుండుము. ఈఋక్షవానరులను చూడుము. వీరు కన్నులు పెద్దవి చేసికొని మనవంకఁ జూచుచు ఒకరిచెవిలో నొకరు గుజగుజలు పోవుచున్నారు."

శ్లో॥ న కాలః కపిరాజేంద్ర వైక్లబ్య మవలంబితుమ్।
అతిస్నేహోఽపి కాలేస్మిఽన్ మరణా యోపకల్పతే॥ 36

శ్లో॥ తస్మా దుత్సృజ్య వైక్లబ్యం సర్వకార్యవినాశనమ్।
హితం రామపురోగాణాం సైన్యానా మనుచింతయ॥ 37

యుద్ధ-సర్గ-46

ఇంతలో ఋక్షవానరులు కొందరు పారిపోఁజొచ్చిరి. విభీషణుఁడు వారియొద్దకు పోయి వారిని తగినమాటలతో ఉత్సాహపఱచి వెనుకకు మరలునట్లు చేసెను. ఆంజనేయాంగద నీలాదులు కూడ జాగరూకులై సైన్యవ్యూహములు చెదరకుండ

కట్టుదిట్ట మొనర్చి తాము పాదపాయుధులై రామలక్ష్మణుల చుట్టును నిలిచి రక్షింపఁదొడఁగిరి. వారు అన్నిదిక్కులు, పైకి క్రిందికిని చూచుచు గడ్డిపఱకలు కదిలినను రాక్షసులే వచ్చు చుండి రని యులికిపడఁజొచ్చిరి. వెన్నెలతో కూడ అన్నివైపుల దివిటీలకాంతి ప్రసరించుచున్నను వారి కది కాళరాత్రివలెనే యుండెను.

ఇంద్రజిత్తు తండ్రిని దర్శించి రామలక్ష్మణులు నిహతు లైరని ప్రియము నివేదించెను. రావణుఁడు సింహాసనమునుండి దుమికి తనయుని కౌఁగిలించుకొని మూర్ధాఘ్రాణముం గావించి విశేషములను వివరించి చెప్పు మనెను. అతఁడు తాను రామలక్ష్మణుల నెట్లు నాగబాణబద్ధులను గావించెనో వివరించెను. రావణుఁడు కుమారుని అభినందించి వీడ్కొలిపి, సీతయొద్ద కావలి గాయుచున్న రాక్షసస్త్రీలను పిలిపించి, "పుష్పకవిమానమున సీతను గైకొనిపోయి నిహతులైయున్న రామలక్ష్మణులను చూపుఁడు. అంతటితో ఆమెకు ఆశ నశించి అహంకార మణఁగి ఆమె నాకు భార్య కాఁగలదు" అని యాజ్ఞాపించెను; పిదప రామలక్ష్మణులు ఇంద్రజిత్తుచే హతులైరని పురమున నుద్ఘోషింపఁజేసెను.

రాక్షసస్త్రీలు త్రిజటతో కూడ సీతను గైకొని పుష్పకవిమానమున రణరంగమునకు పోయిరి. రామలక్ష్మణులు చక్కఁగా కన్పించుటకు వీలుగా ఆకాశమున ఒకచోట విమానమును వారు నిలిపిరి. నేలపై బాధతో స్మృతిని గోల్పోయి పొరలుచున్న రామలక్ష్మణులను చూచి సీత పెద్దగా రోదనమొనరించెను. "సాముద్రికశాస్త్రవేత్తలు నాశరీరలక్షణములను చూచి నా భర్త యజ్ఞకర్త యగు నని, నేను అవిధవను పుత్రవతిని అగుదు నని చెప్పిరి. అయ్యో! రాముఁ డిట్లయ్యెనే! వా రందఱును అనృతవాదులేనా?

నాకు పతితో అధిరాజ్యపట్టాభిషేకము జరుగు నని బ్రాహ్మణులు చెప్పిరి. ఆమాట లన్నియు వ్యర్థము లయ్యెను. నేను రామలక్ష్మణులనుగూర్చి గాని నన్నుగూర్చి మాయమ్మనుగూర్చియు నంతగా శోకించుట లేదు. మాయత్తగారిని తలంచినంతనే నాకు దుఃఖము వెల్లువ యగుచున్నది. పాప మామె సమాప్తవ్రతులై తిరిగివచ్చు సీతారామలక్ష్మణుల నెప్పుడు చూతునా యని కనిపెట్టుకొని యుండును. ఈమాట విన్నచో ఆమెగుండియలు ద్రవయ్యును."

శ్లో॥ న శోచామి తథా రామం లక్ష్మణం చ మహారథమ్।
నాత్మానం జననీం చాపి యథా శ్వశ్రూం తపస్వినీమ్॥ 20

శ్లో॥ సా తు చింతయతే నిత్యం సమాప్తవ్రత మాగతమ్।
కదా ద్రక్ష్యామి సీతాం చ లక్ష్మణం చ సరాఘవమ్॥ 21

యుద్ధ-సర్గ-48

ఈ మాటలలో సీతయొక్క ఉదాత్తత వ్యక్తమగుచున్నది. భార్యగా తనకు రామునియందు ఎంత ప్రేమ యున్నను, అది తల్లిప్రేమతో సమానము కా దని గుర్తించి ఆమె అత్తయందు సానుభూతిని పొందుచున్నది.

త్రిజట రామలక్ష్మణులను ఋక్షవానరసేనాపరిస్థితిని పరిశీలించి సీత నిట్లు ఓదార్చెను. "జానకీ! దుఃఖింపకుము. నీ భర్త నిశ్చయముగా జీవించియే యున్నాఁడు. లే కున్నచో వానరబల మిట్లుండదు. హతవీరమైన సైన్యమున భయశోకములే యుండును గాని ముఖములందు కోపము వ్యక్తము కాదు. మఱి వీ రందఱును జాగరూకులై రామలక్ష్మణులను పరివేష్టించి రక్షించుచున్నారు. అదియునుగాక వీరు నిహతు లైనచో నిన్ను ఈపుష్పకము వహింపదు. వీరు మూర్ఛిల్లియున్నారు; కావున ముఖములందు జీవకళ

పోలేదు. చూడుము. గతజీవితులం దుండు వికృతత్వము వీరి యందు కన్పించుటలేదు. కావున శోకమును వీడుము." సీత త్రిజటను చూచి, "అమ్మా! నీవు చెప్పినట్లే యగును గాక" అని పలికెను. అంతట రాక్షసస్త్రీలు మరల ఆమెను అశోకవన మునకు చేర్చిరి.

శ్లో॥ ఇదం విమానం వైదేహి పుష్పకం నామ నామతః।
దివ్యం త్వాం ధారయే న్నైవం యద్యేతౌ గతజీవితౌ॥ 25

యుద్ధ-సర్గ-48

ఆకాశమున పుష్పకములో నుండి వారు, క్రిందవానర సేనలచే పరివేష్టితులైయున్న రామలక్ష్మణులను స్పష్టముగా చూడఁగలుగుచున్నా రన్నచో వెన్నెలకాంతియే కాక దివిటీల వెలుఁగు కూడ ఉజ్జ్వలముగా నున్న దన్నమాట. వారు ఆవిధ ముగా చూడఁగలిగి రన్నచో ఆవిమానము రామలక్ష్మణులు ఉన్న ప్రదేశమునకు సమీపముననే పైన నిలిచియుండవలె. అట్లయి నచో ఆవిమానమును చూచి వానరు లెందులకు సంభ్రమము నొందలేదు? వారు ఆవిమానముయొక్క రాకపోకలను గమనించి నట్లే వాల్మీకి చెప్పలేదు. ఆవిమానము కామరూపము కామగమ నము గల దివ్యయానము. అందువలన రావణునిసంకల్పము ననుసరించి యది అదృశ్యముగనే వచ్చి అట్లే పోయి యుండు నని గ్రహింపవలసియున్నది.

"వీ రిద్దఱు గతజీవితులైనచో ఈవిమానము నిన్ను వహింపదు" అని త్రిజట సీతతో చెప్పుట ఎట్లు కుదురును? దిగ్విజయ యాత్రలు చేసినప్పుడు రావణుఁడు ఎంతోమంది స్త్రీలను, వారి భర్తలను సంహరించి, తీసికొనివచ్చెను. అప్పుడు అంతమంది విగతభర్తృకలైన స్త్రీలను వహించి తెచ్చినవిమానము, ఇప్పుడు

రాముఁడు విగతజీవితుఁ డైనచో సీత నేల వహింపదు? దివ్యమైన విమానము దాని కధిష్ఠానమైన దేవతచేత నడుపఁబడుచుండును- దేవతలకు అమంగళవస్తువులయొక్క వ్యక్తులయొక్క స్పర్శము ఇష్టము కాదు. సముద్రుఁడు తనజలమును దస్యులు స్పృశించు చుండుట సహింపలేకయే కదా రామునిచేత వారిని సంహరింపఁ జేసెను. అట్లే పుష్పకవిమానమునకు అధిష్ఠానమైన దేవత కూడ సహజముగ అమంగళస్పర్శను అంగీకరింపదు. అట్టి యమంగళ స్పర్శయే సంభవించినచో అయధిష్ఠానదేవత కుపితయై విమాన మును ఆపివేయు నన్నమాట. మఱి రావణుఁడు విగతభర్తృక లను తీసికొనివచ్చినప్పుడు, వానియానతిని మీరఁజాలక ఆయధి ష్ఠానదేవత ఆయమంగళస్త్రీలను ఇష్టము లేకున్నను నిర్బంధ ముగా వహించి తెచ్చిన దన్నమాట. సముద్రుఁడు కూడ దస్యు లను చిరకాలము ఏమియు చేయలేక వారిస్పర్శను సహించుచునే యున్నాఁడుకదా! అట్లే రావణునివిషయమున విమానాధిష్ఠాన దేవత విధేయయై యున్నది. అట్టివిధేయతను ఆదేవత తమవిషయ మున చూపదని త్రిజటయొక్క అభిప్రాయము.

రాముఁడు శరబద్ధుఁడై యుండియు స్థైర్యాతిశయమువలన సత్త్వయోగమువలనను ముందుగా తేఱుకొని లక్ష్మణుని చూచి సుగ్రీవాదులతోఁ జెప్పుకొనుచు విలపింపఁజొచ్చెను. "ఇంక నాకు సీతతోఁ గాని నాజీవితముతోఁ గాని యేమి ప్రయోజనము? ఈ లోకమున వెదకినచో సీతవంటిస్త్రీని పొందవచ్చును గాని లక్ష్మ ణునివంటివాఁడు సచివుఁడు సాంపరాయికుఁడైన సోదరుఁ డెక్కడ లభించును? ఇతఁడు లేకుండ అయోధ్యకు పోయి మాయమ్మకు కైకేయికి సుమిత్రకును ఏమి చెప్పఁగలను? సుమిత్రయొక్క ఉపాలంభము నెట్లు సహింపఁగలను? ఇతఁడు గతాసువైనచో

నేనును ఇచ్చటనే మరణింతును. ఎంతోమంది రాక్షసులను సంహరించినలక్ష్మణుఁ డిప్పుడు శరతల్పమున శరమయుఁడై శోణితస్రావవేష్టితుఁడై అస్తమించుచున్నయహస్కరునివలె నున్నాఁడు. ఇతఁడు నన్ను అనుసరించి వనమునకు ఎట్లు వచ్చెనో అట్లే నేనుకూడ ఇతనిని యమపురికి అనుసరింతును. ఇతఁడు ఎంత కోపముతో ఉన్నప్పుడు కూడ నన్ను గూర్చి పరుషమును గాని విప్రియమును గాని పలికినట్లు గుర్తు లేదు. ఇతఁడు ఒక్కపట్టున అయిదువందల బాణములను ఏకవేగమున ప్రయోగించెడివాఁడు. కార్తవీర్యార్జునునికన్నను శస్త్రాస్త్రప్రయోగదక్షతయందు ఇతఁడు అధికుఁడు.

విభీషణునకు నేనిచ్చినమాట వ్యర్థమై ఇఁక నన్ను దహించును. నే నాతనిని రాక్షసులకు రాజును గావింపనైతిని. సత్యహీనుఁడనైన నన్ను రావణుఁడు నిర్జించుట తథ్యము. ఓ సుగ్రీవా! నీ విప్పుడే అంగదుని పురస్కరించుకొని సాగరమును దాఁటి పొమ్ము. నాకొఱకు మిత్త్రకృత్యముగా నీవు చేయఁదగిన దంతయు చేసితివి. ఈవానరముఖ్యులును ప్రాణములను దాఁపక దుష్కరకార్యముల నొనర్చిరి. దైవము దురతిక్రమము. ఇంతటితో మీ మిత్త్రకార్యము ముగిసినది. మీ కందఱకు అనుమతి నిచ్చుచున్నాను. యథేషముగ మీ స్థానములకు పొండు."

శ్లో॥ కిం ను మే సీతయా కార్యం కిం కార్యం జీవితేన వా।
శయానం యోఽద్య పశ్యామి భ్రాతరం యుధి నిర్జితమ్॥ 5

శ్లో॥ శక్యా సీతాసమా నారీ మర్త్యలోకే విచిన్వతా।
న లక్ష్మణసమో భ్రాతా సచివ స్సాంపరాయికః॥ 6

శ్లో॥ పరిత్యక్ష్యా మ్యహం ప్రాణం వానరాణాం తు పశ్యతామ్।
యది పంచత్వ మాపన్న స్సుమిత్రానందవర్ధనః॥ 7

శ్లో॥ కింను వక్ష్యామి కౌసల్యాం మాతరం కిన్ను కైకయీమ్।
కథ మంబాం సుమిత్రాం చ పుత్రదర్శనలాలసామ్॥ 8

శ్లో॥ య థైవ మాం వనం యాన్త మనుయతో మహాద్యుతిః।
అహ మప్యనుయాస్యామి తథై వైనం యమక్షయమ్॥ 17

శ్లో॥ సురుష్టే నాపి వీరేణ లక్ష్మణేన న సంస్మరే।
పరుషం విప్రియం వాపి శ్రావితం న కదాచన॥ 19

శ్లో॥ విసస ర్జైకవేగేన పంచబాణశతాని యః
ఇష్వస్త్రే ష్వధిక స్తస్మా త్కార్తవీర్యా చ్చ లక్ష్మణః॥ 20

శ్లో॥ య న్మయా న కృతో రాజా రాక్షసానాం విభీషణః।
త చ్చ మిథ్యాపలప్తం మాం ప్రధక్ష్యతి న సంశయః॥ 22

శ్లో॥ మిత్త్రకార్యం కృత మిదం భవద్భి ర్వానరర్షభాః।
అనుజ్ఞాతా మయా సర్వే యథేష్టం గన్తు మర్హథ॥ 29

యుద్ధ-సర్గ-49

ఇంతదుఃఖములో కూడ రాముఁడు, "కైకేయివలన కదా ఇంత కష్టము కలిగిన" దని తలంపక, తనతల్లితో సుమిత్రతో సమానముగా కైకేయిని స్మరించుట ఆయన చిత్తశుద్ధికి నిదర్శనముగా నున్నది. సీతాలక్ష్మణాదులవలె కైకేయినిగూర్చి ఆయన మనస్సునందు కూడ ద్వేషమును భావించుట లేదని దీనివలన స్పష్ట మగుచున్నది.

లక్ష్మణుఁడు ఉగ్రస్వభావుఁడే. తండ్రినిగూర్చి యైనను పరుషముగా మాటాడుటకు వెనుదీయనివాఁడే. అయినను అతఁడు రామునివిషయమున మాత్రము, ఎంతగా కోపము రాఁదగినపరిస్థితియందు, కూడ పరుషముగాఁ గాని అప్రియముగా నైనను మాటాడ లేదనుట గమనింపఁదగియున్నది. నిష్కారణముగా సీతచే

నిందింపఁబడి, రాముఁడు కూడ అందులకు సానుభూతి చూపక పోఁగా, "నామాటను నీవు పాటింప లేదు" అనియే నిష్కరుణముగా మందలించుచున్నప్పుడు కూడ లక్ష్మణుఁడు ఒక్క అప్రియమైనమాటను కూడ పలుకలేదు. తల్లి తండ్రి గురువు అన్న మొదలుగా ఎవరిని మనము దైవతములనుగా ఆరాధించుచున్నామో అట్టివారివలన మనకు ఎంత కష్టము కలిగినను సహింపవలసినదే కాని వారిని తిరస్కరించి మాటాడుట తగ దని దీనివలన స్పష్ట మగుచున్నది. కైకేయివిషయమున రాముఁడు అవలంబించిన వినయమునే లక్ష్మణుఁడు రామునియెడల అవలంబించినాఁడు.

లక్ష్మణుఁడు మరణించినచో తానును మరణింతు నని చెప్పుచున్న రాముఁడు విభీషణునకు ఇచ్చినమాట వ్యర్థమై తన్ను దహించు నని చెప్పుట యేమి? మరణము దహనముతో సమానము కాదు. శరీరము పడిపోవుట మరణము. శరీరములో జీవుఁడున్నప్పుడే ఆశరీరమును కాల్చుట యిట్టిట్టి దహనముగా గ్రహింపవలసియున్నది. ఇది మరణముకన్నను బాధాకరము భయంకరము. అంతే కాదు. తనబాణము పరశురామునియూర్ధ్వ లోకములను దహించినట్లే, ఈయసత్యము తనయూర్ధ్వగతులను దహించు ననియు రాముఁడు పరితపించుచున్నాఁడు. మహాపురుషులు మాటతప్పుటకు వెఱచినంతగా మరణమునకు భయపడరు.

రామునివిలాపమును విని యెల్లరును కన్నీరు కార్చఁ జొచ్చిరి. ఇంతలో విభీషణుఁడు సర్వసైన్యమున వ్యవస్థను ఏర్పఱచి గదాపాణియై రామలక్ష్మణు లున్నయెడకు సత్వరుఁడై వచ్చుచుండెను. అతనిని చూచి "ఇంద్రజిత్తు వచ్చుచున్నాఁ" డని భయపడి రామలక్ష్మణులచుట్టునున్న వానరులు పరువిడఁజొచ్చిరి.

సుగ్రీవుఁ డంగదుని చూచి, "వీ రేల యిట్లు పరువెత్తుచున్నారు?" అని యడిగెను. "రామలక్ష్మణులు శరతల్పమున పడియుండుటను చూచుచునే యుంటివి కదా!" అని యంగదుఁడు పలికెను. అనఁగా అప్పటివఱకును విలపించుచున్న రాముఁడు మరల మూర్ఛిల్లె నన్నమాట. అప్పుడే విభీషణుఁడు వచ్చుటయు తటస్థించెను.

ఇంతలో విభీషణుఁడు వచ్చి సుగ్రీవునకు రామునకును జయము పలికెను. సుగ్రీవుఁడు జాంబవంతుని చూచి, "మనవారు ఇతనిని చూచి ఆకారసామ్యమున ఇంద్రజిత్తునుగా భ్రమించి భయపడి పారిపోవుచున్నారు. వారిభీతిని పోఁగొట్టి, వెనుకకు మరలింపుము" అని చెప్పెను. జాంబవంతుఁ డట్లే గావించెను.

తాను తిరిగివచ్చునప్పటికి కూడ ఇంకను మూర్ఛితులుగనే యున్న రామలక్ష్మణులను చూచి విభీషణుఁడు నిరాశ నొంది విలపింపఁజొచ్చెను. "కూటయోధియైన నాసోదరపుత్త్రునిచేత వీ రిద్దఱు ఇట్లయినారు. ఎవరిపరాక్రమము నాశ్రయించి నేను ప్రతిష్ఠను కోరితినో వారు గాఢనిద్ర నొందిరి. నష్టరాజ్యమనోరథుఁడనై నేను బ్రతికియుండియు చచ్చినవానితో సమానుఁడ నైతిని. నా శత్రువైన రావణుఁడు ప్రతిజ్ఞను నిర్వహించుకొని సకాముఁ డైనాఁడు."

శ్లో॥ యయో ర్వీర్య ముపాశ్రిత్య ప్రతిష్ఠా కాంక్షితా మయా।
తా విమౌ దేహనాశాయ ప్రసుప్తౌ పురుషర్షభౌ॥ 18

శ్లో॥ జీవ న్నద్య విపన్నోఽస్మి నష్టరాజ్యమనోరథః।
ప్రాప్తప్రతిజ్ఞ శ్చ రిపుః సకామో రావణః కృతః॥ 19

యుద్ధ-సర-50

తనకు ధర్మవిధానమున రాఁదగినరాజ్యమునుగూర్చి కోరి కను ప్రకటించినంతమాత్రమున విభీషణుఁడు రాజ్యకాంక్షతో అన్నను వీడ్కొనివచ్చె నని తలంచుట అసంగత మని శరణాగతి సందర్భముననే పరిశీలించియుంటిమి. అన్న తన్ను పరిత్యజించిన తరువాత ధర్మపక్షమున చేరి ధర్మమునకు జయమును కలిగించి ధర్మమును సుప్రతిష్ఠితమును గావించి, ఆ ధర్మప్రతిష్ఠవలన తానును ప్రతిష్ఠను పొందవలయును అని విభీషణుఁడు కాంక్షించెను. ఇందులో ధర్మవిరోధ మేదియును లేదు. మఱియు కాంక్ష యున్నప్పుడు, దానికి భంగము కలుగునేమో యని తోఁచినంతనే దుఃఖము కలుగుట సహజము. ఎవనికి దేనియందు ఎంత కాంక్ష యుండునో తద్భంగమున వాని కంత దుఃఖము కలుగక తప్పదు.

సుగ్రీవుఁడు విభీషణుని కౌఁగిలించుకొని యోదార్చుచు, "నీవు రాజ్యమును పొందఁగలవు. సంశయము లేదు. వీరు మూర్ఛ నుండి తేఱుకొని రావణుని సపుత్త్రబాంధవముగా సంహరింపఁ గలరు" అనెను; పిమ్మట సుషేణుని చూచి, "ఇంతయేల! ఈరామలక్ష్మణులఁ గైకొని నీవు కిష్కింధకు పోయి యుండుము. నేను రావణుని సంహరించి సీతను గొనివచ్చెదను" అని పలికెను.

సుషేణుఁడు సుగ్రీవునితో ఇట్లనెను. "ఇప్పుడు వీరికి చికిత్స అవశ్యకము. క్షీరసాగరమున అమృతమథనము జరిగినచోట చంద్రము ద్రోణము అనుపర్వతములు కలవు. అందు సంజీవకరణి విశల్యకరణి మొదలుగా దివ్యౌషధులు కలవు. వానిని గొనితెచ్చుటకు సంపాతిపనసహనుమదాదులను పంపుము" అనెను.

వారిట్లు మాటాడుకొనుచుండఁగా ఱెక్కలవేగమున పుట్టుచున్న వాయువిభ్రమణముచే సాగరమును సంక్షోభింపఁజేయుచు గరుత్మంతుఁ డచ్చటికి వచ్చెను. అయనగాలి సోఁకినంతనే, శర

ములై రామలక్ష్మణులను బంధించియున్న సర్పములు స్వరూపము నొంది అత్యంతభీతితో అమితవేగమున పారిపోయెను. సుప ర్ణుఁడు రామలక్ష్మణులయొద్ద నెమ్మదిగా వ్రాలి వారిని స్పృశించి ముఖములు నిమిరి చల్లని మాటలతో మెల్లగా అభినందించెను. ఆయన స్పర్శతో వారు నిర్వ్రణులై ఆరోగులై బాధారహితులై తేజో వీర్యబలోత్సాహసంపన్ను లైరి. వారు పైకిలేచినతరువాత గరు త్మంతుఁడు వారిని కౌఁగిలించుకొనెను.

గరుత్మంతుఁడు వచ్చినప్పుడు పక్షిరూపమున వచ్చినను, కామరూపత్వముచేత, రామలక్ష్మణులసమక్షమున పురుష రూపము నొంది వారిని కౌఁగిలించుకొనియుండు నని గ్రహింప వలసియున్నది.

రాముఁడు ఆయనను సబహుమానముగా చూచుచు, "ఆర్యా! నిన్ను చూచుచుండఁగా మాతండ్రిగారిని చూచినట్లుగా మనస్సు ప్రసన్నమగుచున్నది; దివ్యాలంకారభూషితుండవై యున్న నీ వెవరు?" అని యడిగెను. గరుత్మంతుఁ డి ట్లనెను. "నేను మీకు సఖుఁడను; మీకు ఈయాపద కలిగిన దని తెలిసినంతనే సత్వరముగా మీకు సాయముఁ గావింప వచ్చితిని. మాయాబల మున ఇంద్రజిత్తు కాద్రవేయులను శరములనుగా ప్రయోగించి నాఁడు. ఈశరబంధమును దేవేంద్రాదులు కూడ సడలింపఁ జాలరు. మీరు అదృష్టవశమున ఈబంధమునుండి విముక్తు లైనారు. మీరు ఎల్లప్పుడు జాగరూకులై యుండవలయును. రాక్ష సులు సహజముగా కూటయోధులు. మీకు ఆర్జవమే బలము. ఇప్పుడు జరిగినదానినిబట్టియే రాక్షసులు మహాకుటిలు లని స్పష్ట మైనది కదా! మీరు అనుక్షణము జాగరూకులై యుండవల యును. ఇంక నాకు అనుజ్ఞ నిమ్ము. నేను పోయివత్తును. ఈ

సఖిత్వము ఏమి యని కుతూహలము నొందకుము. నీవు రావణుని సంహరించి తప్పక సీతను పొందఁగలవు. రాక్షససంహార కార్యము పూర్తియైనతరువాత ఈసఖిత్వము నీకు తెలియఁగలదు."

పిమ్మట గరుత్మంతుఁడు, వానరులు విస్మితులై చూచుచుండఁగా, రాముని మరల కౌఁగిలించుకొని ప్రదక్షిణము గావించి వెడలిపోయెను.

శ్లో॥ అప్రమాద శ్చ కర్తవ్యో యువాభ్యాం నిత్య మేవ హి॥ 52

శ్లో॥ ప్రకృత్యా రాక్షసా స్సర్వే సంగ్రామే కూటయోధినః।
శూరాణాం శుద్ధభావానాం భవతా మార్జవం బలమ్॥ 53

శ్లో॥ త న్న విశ్వసితవ్యం వో రక్షసానాం రణాజిరే।
ఏతే నై వోపమానేన నిత్యం జిహ్మా హి రాక్షసాః॥ 54

శ్లో॥ న చ కౌతూహలం కార్యం సఖిత్వం ప్రతి కాంక్షిణా।
కృతకర్మా రణే వీర సఖిత్వం ప్రతి వేత్స్యసి॥ 57

యుద్ధ-సర్గ-50

రామలక్ష్మణులు జాగరూకులై యుండవలయు నని గరుత్మంతుఁడు హెచ్చరించుట యెందులకు? అప్పుడు వారు అజాగరూకులై యుండుటవలన ఆసర్పబంధనము సంభవించినదా? ఇంద్రజిత్తు అదృశ్యుఁ డైనంతనే అతఁడు ప్రయోగించుచున్న బాణముల పద్ధతినిబట్టి, "ఇవి వాయువ్యములా, ఆగ్నేయములా, సమ్మోహనములా?" అని విమర్శించి గ్రహించుచున్నచో అతఁడు నాగాస్త్రమును ప్రయోగించుచున్నాఁ డని వారికి స్ఫురించియుండవచ్చును. అప్పుడు వారు గారుడాస్త్రమును స్మరించినచో తత్క్షణమే గరుత్మంతుఁడు వచ్చియుండెడివాఁడు. అప్పుడు ఇంతబాధ కలిగియుండదు. ఇదియే కాదు. ఇది విఫలమైన తరువాత ఇంద్ర

జిత్తు మరల ఇట్టి ప్రయోగము మఱియొకటి చేయకుండ నుండఁడు. కావున వానివిషయమున వారు అత్యంతజాగరూకతతో అఖిలాస్త్ర విశేషములను స్మరించుచు నుండవలయు నని గరుత్మంతునియభిప్రాయము. ఆయన యూహించినట్లే ఇంద్రజిత్తు మరల బ్రహ్మాస్త్రముచేత రామలక్ష్మణులనే కాక ఋక్షవానరబలమునంతను పతన మొందించెను.

అద్భుతమైన గరుత్మంతునియాగమనమును, రామలక్ష్మణులపునరుజ్జీవనమును చూచి ఋక్షవానరులు ప్రహృష్టులై భేరీమృదంగశంఖనినాదములతో సింహగర్జనములు చేయుచు లంకాద్వారములపై దాడిఁగావించిరి.

## 3. ధూమ్రాక్షాదులవధ

ఋక్షవానరుల భేరీనినాదసింహగర్జనములను విని రావణుఁడు ఇది యేమో కనుగొని రండని రాక్షసులను పంపెను. వారు పోయి తిరిగివచ్చి రామలక్ష్మణులు శరబంధవిముక్తులై యున్నా రని చెప్పిరి. అంత నతఁడు ఖిన్నుఁడై ధూమ్రాక్షుని పిలిచి రాముని సంహరింప బయలుదేరు మనెను.

ధూమ్రాక్షుఁడు ప్రత్యక్ష మగుచున్న యపశకునముల లెక్కింపక సైన్యపరివృతుఁడై పశ్చిమద్వారమున వెలువడెను. సంకులసమరమున వానరులు రాక్షసులను తఱిమివైచిరి. ధూమ్రాక్షుఁడు విక్రమించి వానరులను సంహరింపఁజొచ్చెను. హనుమంతుఁ డాగ్రహించి యొకమహాశిలతో వానిరథమును గూల్చెను. వాఁడు పెద్దగదతో హనుమంతునితలపై తాడించెను. ఆంజనేయుఁడు దానిని లెక్కపెట్టక ఒక శైలశృంగమును విసిరి ధూమ్రాక్షుని నంతమొందించెను.

ధూమ్రాక్షవధమును విని రావణుఁడు నిట్టూర్చి వజ్ర దంష్ట్రుని పిలిచి సుగ్రీవసహితముగా రాముని సంహరింపు మని పంపెను.

అతఁడు సేనాపరివృతుఁడై దక్షిణద్వారమున వెలు వడెను. వానరులు రాక్షసులను తఱిమివైచిరి. వజ్రదంష్ట్రుఁడు క్రుద్ధుఁడై వానరులను కసిమసంగఁజొచ్చెను. అంగదుఁడు కోపించి వానిని మార్కొని ఒకమహావృక్షమును వానిపై విసరెను. వజ్ర దంష్ట్రుఁడు ఆవృక్షమును ఖండించి మహావేగమున వేలకొలఁది బాణములను అంగదునిపై కురిసెను. అంగదుఁడు పెద్దశిల నెత్తి వైచి వానిరథమును చూర్ణ మొనరించెను. వాఁడు రథమునుండి అమితవేగముతో దూఁకి అంగదుని వక్షమున గదను విసరెను. అది వ్యర్థమై నేలపైఁ బడెను. పిదప వారిరువురును మల్లయుద్ధ మును గావించిరి. మధ్యలో వజ్రదంష్ట్రుఁడు మెఱుపువేగమున ప్రక్కకు దూఁకి సమీపమున పడియున్న కత్తిని చర్మమును గైకొనెను. అంగదుఁడు కూడ చుట్టును పరికించి యొకఖడ్గమును గైకొనెను. ఇరువురును చాలసేపు ఖడ్గయుద్ధ మొనర్చి పరిశ్రాం తులై మోకాళ్లపై ముందుకు వ్రాలిరి. అప్పుడు అంగదుఁడు మెఱుపుమెఱిసినట్లు పైకి లేచి ఖడ్గముతో వజ్రదంష్ట్రుని శీర్షమును ఖండించెను.

వజ్రదంష్ట్రునివధమును విని రావణుఁడు బలాధ్యక్షుని పిలిచి శత్రువధమునకై అకంపనుని పంపు మని చెప్పెను. అకం పనుఁడు సేనాపరివృతుఁడై బయలుదేరివచ్చి వానరసైన్యమును నుఱుమాడఁజొచ్చెను. వానిధాటికి ఋక్షవానరవీరులు పలా యితులు కాఁజొచ్చిరి. కుముదుఁడు మైందుఁడు ద్వివిదుఁడు విజృంభించి రాక్షససైన్యములను హతము కావింపఁజొచ్చిరి.

అకంపనుఁడు క్రుద్ధుఁడై వారిని మార్కొని పారఁద్రోలెను. తమ నాయకులపరాజయమును చూచి ఆంజనేయుఁడు ఆగ్రహించి అకంపనుని మార్కొనెను. అకంపనుఁడు ఆంజనేయునిపై శరవర్ష మును కురిసెను. ఆంజనేయుఁడు దానిని సరకుగొనక ఒకమహా గిరి శృంగమును పైకెత్తెను. దానిని అయన విసరివేయులోపలనే అకంపనుఁడు అర్ధచంద్రబాణములతో శిథిల మొనరించెను. ఆంజనేయుఁడు కుపితుఁడై ఒకమహావృక్షమును గైకొని గిరగిరఁ ద్రిప్పి వానితలపై మోఁది కూల్చెను. రాక్షసులు పారిపోయిరి. వానరులు సింహనాదములు గావించిరి.

## 4. ప్రహస్తవధ

మఱునాఁడు రావణుఁడు ఉదయమే లంకను పర్యటించి గుల్మరక్షణములను పరిశీలించి మంత్రులతో ఆలోచించి ప్రహ స్తునితో ఇట్లనెను. "ఈయుద్ధభారమును నేనో ఇంద్రజిత్తో నీవో వహింపవలె. ఇతరులకు సాధ్యమగునట్లు లేదు. నీపరాక్రమము సామాన్యము కాదు. నిన్ను చూచినంతనే వానరు లందఱు పలా యితు లగుదురు. అంతట ఖిన్నులై రామలక్ష్మణులు నీవశమగు దురు. యుద్ధమున ఆపద సంశయగ్రస్త మైనను శ్రేయస్సు నిస్సంశయము. యుద్ధమునకై ఉద్యమింపక యూరక శత్రువులచే చచ్చుట శ్రేయము కాదు. నీయభిప్రాయమును తెలుపుము." ప్రహస్తుఁ డిట్లనెను. "మనము మొదటనే దీనినిగూర్చి చర్చించి తిమి. మనలో మనకు వివాదము కూడ కలిగినది. సీతాప్రదా నమే శ్రేయస్కర మని నేను నిశ్చయించితిని; కానిపక్షమున యుద్ధము తప్పదని అప్పుడే తెలినది. నీవు నన్ను పెక్కువిధముల బహుమానించితివి. నే నేల నీకు హితము గావింపను? నీవిషయ మున పుత్త్రదారధనాదులఁ గాని జీవితమును గాని లెక్కఁగొనను.

చూడుము. నీకొఱకు నాజీవితమును సమరాగ్నియందు హుత మొనరింతును."

వెంటనే ప్రహస్తుఁడు ఉరగధ్వజవిరాజితమైనరథమునందు రావణుఁడు చూచుచుండఁగా మహాబలపరివృతుఁడై అపశకునములను లెక్కింపక తూర్పుద్వారమున వెలువడెను.

"ఈవచ్చుచున్నమహాకాయుఁ డెవఁ"డని రాముఁడు విభీషణు నడిగెను. విభీషణుఁడు ఇట్లు చెప్పెను. "ఇతఁడు ప్రహస్తుఁడు. లంకలో మూఁడువంతులసేన కధిపతి. ఇతఁడు మహాశూరుఁడు; వివిధాస్త్రవేత్త".

ప్రహస్తుఁడు యుద్ధరంగమున ప్రవేశించినంతనే వానరరాక్షసులకు సంకులముగా సమరము జరిగెను. ప్రహస్తునియనుచరులు విజృంభించి ఋక్షవానరుల నుఱుమాడుచుండఁగా, ద్వివిదుఁడు గిరిశృంగమున నరాంతకు నంత మొందించెను. దుర్ముఖుఁడు సమున్నతుని ఒకపెద్దవృక్షముతో సంహరించెను. జాంబవంతుఁడు మహాశిలతో మహానాదుని మార్కొని వధించెను. తారుఁడు మహావృక్షమును గైకొని కుంభహనుపును నిహతుఁ గావించెను.

తనయనుచరులు హతు లగుట చూచి ప్రహస్తుఁడు మిగుల కోపించి వానరుల కసిమసంగఁజొచ్చెను. నీలుఁ డాతనిని మార్కొనెను. నీలునిపై నతఁడు శరములను వర్షించెను. వర్షమును లెక్కపెట్టని పెద్ద వృషభమువలె నీలుఁడు ఒకసాలవృక్షమును గైకొని ఎదురుగా పోయి అతనియశ్వముల నంతమొందించెను. ప్రహస్తుఁడు రథమునుండి దుమికి ముసలముతో నీలుని లలాటమున ప్రహరించెను. నీలుఁ డొకమహావృక్షమున ప్రహస్తుని వక్ష

ముఖ తాడించెను. ప్రహస్తుఁడు దానిని లెక్కపెట్టక మఱియొక ముసలమును గైకొని పైకివచ్చుచుండఁగా నీలుఁడు మహాశిలను విసరి యాతనిశీర్షమును ప్రక్కలు గావించెను. రాక్షసులు హాహాకారములు గావించుచు లంకలోనికి పారిపోయిరి.

## 5. రావణమకుటభంగము

ప్రహస్తునివధను విని రావణుఁడే స్వయముగా యుద్ధమునకు వచ్చెను. అతనివెంట ఇంద్రజిన్మహాకాయాదులు కూడ బయలుదేరివచ్చిరి. వారి నందఱను విభీషణుఁడు రామునకు వర్ణించి చెప్పెను. రావణుఁడు తన చుట్టునున్న రాక్షసనాయకులను చూచి, "మీ రందఱు నగరరక్షణమునకై లోపలనే యుండుఁడు. అందఱను యుద్ధరంగమున నున్నచో వానరులు మఱియొకవైపునుండి పురములోనికి ప్రవేశింపఁగలరు" అని వారిని పంపెను.

ఇంద్రజిదాదులు నగరము వెలుపలికి వచ్చినతరువాత రావణుఁడు వారిని లోపలికి పొండని చెప్పుట యెందులకు? బయలుదేరుచున్నప్పుడే చెప్పియుండవచ్చును గదా! తనబలగముయొక్క అతిశయమును శత్రువులకు ప్రదర్శించుటకై తనవారిని యుద్ధరంగమువఱకును రానిచ్చి, మరల పురరక్షణముయొక్క జాగరూకతతో, తనయసహాయపరాక్రమమును ప్రకటించుటకొఱకును వారిని వెనుకకు పంపియుండును.

ఈ యేఁబదితొమ్మిదవసర్గమున అనేక విశేషవృత్తములు కలవు. అవియన్నియు ఆవశ్యకములుగా తోఁచుట లేదు.

ఇంద్రజిదాదులు మరలిపోయినతరువాత రావణుఁడు వానరసైన్యమును శరాగ్నులతో నిర్దహింపఁజొచ్చెను. సుగ్రీవుఁ

డుగ్రుఁడై యొకశైలశృంగముతో రావణుని ప్రహరించెను. రావణుఁడు దానిని శరములతో మధ్యలోనే ఛిన్న మొనర్చి అశనితుల్యమైన సాయకమును సుగ్రీవునివక్షమున నాటెను. ఆబాణవేగమున ఆర్తనాద మొనర్చుచు సుగ్రీవుఁడు మూర్ఛిల్లెను.

అది చూచి గవాక్షగవయసుషేణాదులు శైలములతో రావణుని ప్రహరించిరి. అతఁడు వాని నన్నింటిని భేదించి నిశితబాణములతో వారి నందఱను సొమ్మసిల్లఁజేసెను. పిదప నతఁడు వానరులపై నిరంతరమైన శరవర్షమును కురియఁజొచ్చెను. వారు హాహాకారములు చేయుచు రాముని శరణుఁజొచ్చిరి. లక్ష్మణుఁడు అన్నయనుమతి నొంది రావణుని మార్కొనుటకు బయలుదేరెను.

ఇంతలో హనుమంతుఁడు రావణునిరథముపై దూఁకి, "నీవు దేవదానగంధర్వులవలననే యవధ్యత్వమును పొందితివి. వానరుల వలన నీకు భయము ఉండనే యున్నది. ఇదిగో ఈనాదక్షిణ హస్తము నీశరీరమునందు చిరకాలమున్న జీవుని మథింపఁగలదు." అని పలికెను. రావణుఁడు "నీయిష్టము వచ్చినట్లుగా ప్రహరింపుము. నీశక్తి నెఱింగిన పిమ్మటనే నిన్ను కూల్తును." అనెను. "నాచేఁ గూలిననీపుత్త్రుని అక్షుని స్మరింపుము." అని ఆంజనేయుఁడనెను. వెంటనే రావణుఁడు క్రుద్ధుఁడై యఱచేతితో హనుమంతుని వక్షమున ప్రహరించెను. ఆదెబ్బకు హనుమంతుఁడు గిరగిర తిరిగి కొంతసేపటికి స్థైర్యము నొంది కుపితుఁడై రావణుని పిడికిటితో పొడిచెను. ఆప్రేటున కతఁడు భూకంపమునందు శైలమువలె, గ్రక్కదలిపోయెను. వానిపాటునకు దేవర్షిసిద్ధసంఘములు సంతోషించెను. రావణుఁడు తేఱుకొని, "నీవీర్యము శ్లాఘనీయము కదా!" అని ప్రశంసించెను. "ఛీ! నా దేమి బలము! నా ప్రేటు తగిలియును నీవు బ్రతికియే యున్నావు గదా!" అని హను

మంతుఁ డనెను. ఆమాటకు రావణుఁ డుగ్రుఁడై హనుమంతుని పిడికిటితో ప్రహరించెను. మారుతి విహ్వలుఁడై సంచలించి నేలపైఁ బడి మూర్ఛిల్లెను.

రావణుఁడు హనుమంతుని వదలి నీలుని మార్కొనెను. ఇంతలో ఆంజనేయుఁడు తేఱుకొని, నీలుఁడు రావణునిపై శైలాగ్రము విసరుచుండఁగా చూచి, "అన్యునితో పోరాడుచున్నవానిని మార్కొనుట తగదు" అని పలుకుచు మఱియొకవైపునకు పోయెను.

రావణుఁడు నీలునిచేతియందున్న శృంగమును ఏడుబాణములతో నేలఁగూల్చి అతఁడు ప్రయోగించుచున్న వృక్షముల నన్నింటిని ఖండించుచు వానిని శరవర్షమున ముంపఁజొచ్చెను. నీలుఁడు హ్రస్వకాయుఁడై రావణుని ధ్వజాగ్రమున ధనురగ్రమున కిరీటాగ్రమున విహరింపఁజొచ్చెను. రామలక్ష్మణహనుమంతులు కూడ నీలునిలాఘవమునకు సాహసమునకు విస్మితులైరి. రావణుఁడు కూడ సంభ్రాంతుఁడై ధ్వజాగ్రముననున్న నీలునిపై ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను. ఆయస్త్రముచేత నీలుఁడు మూర్ఛిల్లెనే కాని, తండ్రియొక్క అనుగ్రహమువలన స్వతేజోఽతిశయముచేత, మరణింప లేదు.

మూర్ఛిల్లి నేలపైఁ బడిననీలుని వీడి రావణుఁడు తన కభిముఖముగా సన్నద్ధుఁడై వచ్చుచున్నలక్ష్మణునిపై బంగారుపిడిగల బాణములను ఏడింటిని ప్రయోగించెను. లక్ష్మణుడు వానిని ఖండింపఁగా రావణుఁడు మిగులవేగముతో శరములను వర్షించెను. రావణునిబాణములను లక్ష్మణుఁడు ఖండించి రావణుని శరములలో ముంచెను. దైత్యేశ్వరుఁడు సౌమిత్రియొక్క లాఘవమునకు విస్మితుఁడై బ్రహ్మదత్తమైన యొకసాయకమున అతనిని లలాటమున ప్రహరించెను. లక్ష్మణుఁడు సొమ్మసిల్లి వెంటనే

తేఱుకొని రావణునివిల్లు విఱుగనేసి మూఁడుబాణములతో వాని వక్షమును బ్రహరించెను. ఆ బాణముల వేగమునకు రావణుఁడు విచలితుఁడై చాలకష్టముమీఁద తేఱుకొని బ్రహ్మదత్తమైన శక్తిని లక్ష్మణునివక్షమున బ్రయోగించెను. లక్ష్మణుఁడు ఎన్నిబాణములతో దానిని ఛేదింప యత్నించినను అది చెక్కుచెదరక వచ్చి లక్ష్మణునివక్షమును భేదించెను. అతఁడు సోలి నేలపైఁ బడెను. రావణుఁడు రయమున వచ్చి లక్ష్మణుని తీసికొనిపోవుటకు యత్నించెను. లక్ష్మణుఁడు విహ్వలుఁ డయ్యును అచింత్యమైన తనవిష్ణుదేవాంశమును స్మరించెను. వెంటనే ఆతనిశరీరము చాల బరువెక్కెను. అందువలన రావణుఁడు రెండుచేతులతో సౌమిత్రిని పైకి నెత్తుటకు ఎంత ప్రయత్నించినను సాధ్యము కాలేదు. రావణునిదుష్టప్రయత్నమును చూచి హనుమంతుఁడు క్రుద్ధుఁడై ఎగిరి వచ్చి అతనివక్షమున పిడికిటితో పొడిచెను. ఆపోటునకు రావణుఁడు నెత్తురు గ్రక్కి మూర్ఛిల్లెను. ఆంజనేయుఁడు లక్ష్మణుని గైకొనిపోయి రామునియొద్దకుఁ జేర్చెను. హనుమంతుఁడు భక్తుఁడగుటచే లక్ష్మణుఁడు అయనకు తేలికగా నయ్యెను. శక్తి కూడ లక్ష్మణునివదలి రావణునిరథమున తనస్థానమునకు చేరెను.

శ్లో॥ శక్త్యా బ్రాహ్మ్యాతు సౌమిత్రి స్తాడితోఽపి స్తనాంతరే।
విష్ణో రచింత్యం స్వం భాగ మాత్మానం ప్రత్యనుస్మరన్॥110

శ్లో॥ తతో దానవదర్పఘ్నం సౌమిత్రిం దేవకంటకః।
తం పీడయిత్వా బాహుభ్యాం న ప్రభు ర్లంఘనేఽభవత్॥111

యుద్ధ-సర్గ-59

రావణుఁడు తేఱుకొని మరల యుద్ధమునకుఁ గడంగుటను చూచి రాముఁడు హనుమంతు నధిరోహించి రథస్థుఁడైన రాక్ష

సేశ్వరుని మార్కొనెను. లంకేశ్వరుఁడు పూర్వవైరమును స్మరించు రామునకు వాహనమైయున్న మారుతుని పెక్కు బాణములతో ప్రహరించెను. రాముఁడు మిగులకోపముతో అమితవేగమున రావణునియశ్వములను ధ్వజమును సారథిని రథమును తుత్తుమురుగావించి పిడుగువంటిబాణమున అతనివక్షమును భేదించెను. రావణుఁడు ఆర్తుఁడై విచలితుఁ డయ్యెను. ఆతనిచేతనున్నవిల్లు జాఱిపడెను. రాముఁడు మరల అర్ధచంద్రబాణమున వానికిరీటమును పడఁగొట్టెను. రాక్షసవల్లభుఁడు విఱిగినరథముపై అసహాయుఁడై దీనుఁడై యూరక నిలిచియుండెను. వానిదైన్యమును చూచి రాముఁడు కరుణించి యిట్లనెను. "రాక్షసేంద్రా! నీవు మహాభయంకరమైనయుద్ధ మొనర్చితివి; మాపక్షమున పెక్కుమంది వీరులను నిర్జించితివి; అందువలన చాల పరిశ్రాంతుఁడ వైతివి. ఇప్పుడు నిన్ను సంహరింపను. నీవు లంకలోనికి పోయి విశ్రాంతి నొంది మరల ధనుశ్శరములతో రథమునందు రమ్ము; ఇప్పటికి పొమ్ము." అంతట రావణుఁడు చేయునది లేక రథచాపకిరీటహీనుఁడై వెనుదిరిగి నగరములోనికి నడచిపోయెను. వానిభంగపాటునకు దేవగంధర్వాదులు సంతోషించిరి.

శ్లో॥ కృతం త్వయా కర్మ మహ త్సుభీమం
హతప్రవీర శ్చ కృత స్త్వ థాహమ్।
తస్మా త్పరిశ్రాంత ఇతి వ్యవస్య
న త్వాం శరై ర్మృత్యువశం నయామి॥ 140

శ్లో॥ ప్రయాహి జానామి రణార్దిత స్త్వం
ప్రవిశ్య రాత్రించరరాజ లంకామ్।
ఆశ్వస్య నిర్యాహి రథీ చ ధన్వీ
తదా బలం ప్రేక్ష్యసి మే రథస్థః॥ 141

యుద్ధ-సర్గ-59

ఈసర్గలో ఇట్టివిశేషప్రవృత్తములు అనేకములు కలవు. వీనిలో కొన్నియనావశ్యకములుగ నున్నను కొన్నియావశ్యకములు గనే తోఁచుచున్నవి.

## 6. కుంభకర్ణవధ

రామబాణభయపీడితుఁడై రావణుఁడు సభయందు రాక్షసులను చూచుచు ఇట్లనెను. "నేను కావించినతప మంతయు వ్యర్థమైనది. ఇంద్రసమానుడనైన నేను మానవునిచే జయింపఁబడితిని. 'నీకు మానవునివలననే భయము కలుగు' నని బ్రహ్మదేవుఁడు పలికినమాట ఇప్పుడు యథార్థ మగుచున్నది. అనరణ్యుఁడు కూడ తనవంశమున జన్మించినవానిచేత నాకు వినాశము కలుగు నని శపించెను. వేదవతియే జానకిగా జన్మించిన దనుకొందును. ఋషిభాషితము మిథ్య కాదు. ఏ మైనను మీ రందఱును ప్రయత్నపరులై గోపురద్వారములను రక్షించుచుండుఁడు. కుంభకర్ణుని మేల్కొలుపుఁడు. వాఁడు సుఖముగా నిద్రించుచున్నాఁడు. వాఁడు ఏడు ఎనిమిది తొమ్మిది పదిమాసములు కూడ నిద్రించుచుండును. మంత్రాలోచనమునుండి వాఁడు తొమ్మిదిరోజులుగా నిద్రించుచున్నాఁడు. వానిని మేల్కొలుపుఁడు. వాఁడు సర్వరాక్షసశ్రేష్ఠుఁడు. వాఁ డైనచో వానరులను రాజపుత్రులను సంహరింపఁగలఁడు. ఇట్టియాపదలో వానివలన సాయము లేకున్నచో ఇంక వానివలన నేమి ప్రయోజనము?"

శ్లో॥ సుఖం స్వపితి నిశ్చింతః కాలోపహతచేతనః।
నవ షట్సప్త చాష్టౌ చ మాసాన్ స్వపితి రాక్షసః॥ 16

శ్లో॥ మంత్రయిత్వా ప్రసుప్తోఽయ మితస్తు నవమేఽహని।
తం తు బోధయత క్షిప్రం కుంభకర్ణం మహాబలమ్॥ 17

యుద్ధ-సర్గ-60

విభీషణుఁడు కుంభకర్ణునిగూర్చి రామునితో "ఇతఁడు ఆఱుమాసములు నిద్రించుచు ఒక్కదినము మేల్కొనియుండును" (శయితా హ్యేష షణ్మాసా నే కాహం జాగరిష్యతి-శ్లో. 29, సర్గ. 61-యుద్ధకాండ) అని చెప్పఁబోవుచున్నాఁడు "కుంభకర్ణుఁడు ఏడు ఎనిమిది తొమ్మిది పదిమాసములు కూడ నిద్రించుచుండు" నని రావణుఁడు చెప్పుట ఎట్లు కుదురును? కుంభకర్ణుఁడు ఆఱు నెలలు మాత్రమే నిద్రించు నని విభీషణునిమాట కర్థము కాదు. అతఁడు నిద్రింప మొదలుపెట్టినతరువాత ఆఱుమాసములకు లోపల మేల్కొనఁ డన్నమాట. అతని నిద్రయొక్క దీర్ఘత్వము ఆఱునెలలకు తక్కువ ఉండ దని, మేల్కొన్నతరువాత అతఁడు ఒకదినము మాత్రమే లోకవ్యవహారమున పాల్గొని మఱునాఁడే మరల నిద్రింపమొదలుపెట్టు నని గ్రహింపవలసియున్నది.

ఈసందర్భమున గోవిందరాజస్వామి యుద్ధదినములపరిగణనమునుగూర్చి దీర్ఘమైన చర్చ గావించెను. దానిసారాంశమును ఇట్లు గ్రహింపవచ్చును. "సీతాపహరణమునకు పూర్వము పదుమూఁడుసంవత్సరములవనవాసము గడచినది. పంపాతీరమునందు వసంతఋతువు వర్ణింపఁబడుటవలన పదునాల్గవసంవత్సరారంభమున సీత అపహరింపఁబడిన దనుట స్పష్టము. వాలి వధమునకు పిమ్మట వర్షఋతువు వర్ణింపఁబడుటవలన వాలివధ ఆషాఢమునందు జరిగియుండు నని గ్రహింపవచ్చును. ఆశ్వయుజమున సీతాన్వేషణ మారంభ మైనది. స్వయంప్రభగుహయందు వానరులకు చాలకాలము గడచెను. ఫాల్గుణశుద్ధత్రయోదశియందు హనుమంతుఁడు లంకయందు ప్రవేశించెను. ఆరాత్రియందు సీతాసందర్శనము, మఱునాఁడు లంకాదహనము జరిగెను. చతుర్దశీయుక్తపౌర్ణమాసీదినముననే ఆంజనేయుఁడు అంగదాదులతో తిరిగివచ్చి రాముని చేరెను. ఆదినముననే మధ్యాహ్నమున

సైన్యము బయలుదేరెను. మఱునాఁడు వానరసైన్యములు సముద్ర తీరమునకు చేరెను.

లంక దహింపఁబడినప్పుడు ఆదినముననే రావణుఁడు సభ చేసి కొంత మంత్రాలోచనము గావించెను. మఱునాఁ డుదయము ఉషఃకాలమున విభీషణుఁడు అన్నకు రెండవసారి హితోపదేశమును గావించెను. అప్పుడు వెంటనే రావణుఁడు సభను గావింపఁగా అందు విభీషణుఁడు మూఁడవపర్యాయము అన్నకు హితము నుపదేశించి, అతనిచే తిరస్కరింపఁబడి, వెంటనే రాముని యొద్దకు వచ్చెను.

ఫాల్గునబహుళ ప్రథమదినమున రామునిదర్భశయనారంభము. ఆదినముననే కుంభకర్ణునినిద్రయు ఆరంభ మయ్యెను. ప్రథమాద్వితీయాతృతీయాతిథులలో రామునిదర్భశయనము జరిగెను. చతుర్థీపంచమీషష్ఠీసప్తమ్యష్టమీతిథులందు సేతువు నిర్మింపఁబడెను. అష్టమియందు రాత్రి రామాదులు సువేలశైలము నారోహించిరి. నవమియందు లంకను ముట్టడించిరి; వెంటనే యుద్ధ మారంభ మయ్యెను. ఆరాత్రియే నాగాస్త్రబంధనము, విమోక్షము జరిగెను. నాగాస్త్రవిమోక్షము జరిగినంతనే వానరులు చెలరేగఁగా రావణుఁడు పంపఁగా ధూమ్రాక్షవజ్రదంష్ట్రులు ఆరాత్రియే యుద్ధమున మరణించిరి. మఱునాఁడు దశమియందు ఉదయము అకంపనవధ, మధ్యాహ్నమున ప్రహస్తసంహారము జరిగెను. వెంటనే రావణునకు మకుటభంగము, కుంభకర్ణుని మేల్కొలుపుట, కుంభకర్ణునివధము జరిగెను. ఆదినమున సాయంకాలముననే ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముచేత ఋక్షవానరసైన్యములలో అఱువదియేడు కోట్లమందిని పడఁగొట్టెను. ఆరాత్రియే బ్రహ్మాస్త్రవిమోక్షము జరిగినతరువాత, వానరులు లంకను దహించుట, కుంభ

నికుంభయూపాక్ష శోణితాక్ష ప్రజంఘాకంపనముక రాక్షసులయుద్ధము, తత్సంహారము జరిగెను. కావున రెండుదినములయుద్ధమునందు మూలబలము ఇంద్రజిత్తు రావణుఁడు తప్ప తక్కినరాక్షసబల మంతయు నశించె నని గ్రహింపవలసియున్నది. తరువాత మూఁడు రోజులు ఇంద్రజిత్తు పోరాడి వధింపఁబడెను. తరువాత ఆ అవ నాఁటియుద్ధమున, అనఁగా, చతుర్దశియందు మూలబలము వధింపఁబడెను. ఆరాత్రి రావణుఁడు యుద్ధమునకువచ్చి అమావాస్య యందు నిర్విరామముగా యుద్ధమొనర్చి ఆనాఁడే సంహరింపఁ బడెను.

ఈపద్ధతియందు, 'ఇప్పటికి తొమ్మిదిదినములుగా కుంభకర్ణుఁడు నిద్రించుచున్నాఁడు' అని రావణుఁ డన్నమాట కుదురును. అతఁడు రామునిదర్భశయనారంభమునుండి నిద్రించుచున్నాఁడు. కావున రావణునిమకుటభంగము జరిగిననాఁటికి తొమ్మిదిదినము లగును.

హనుమంతుఁడు వినుచుండఁగా అశోకవనమున రావణుఁడు సీతతో, 'నేను పెట్టిన గడువునందు ఇంకను రెండుమాసములు మిగిలియున్నవి' అని చెప్పెను. సీత కూడ ఆంజనేయునితో; 'రావణుఁడు నా కొసంగినగడువునందు రెండుమాసములే మిగిలియున్నవి' అని చెప్పెను. ఈమాటలనుబట్టి వనవాసకాలమున పదునాల్గవసంవత్సరమునందు పదియవమాసముయొక్క ముగింపునందు ఆంజనేయుఁడు సీతను లంకలో చూచె నని యేర్పడుచున్నది. కాని పైన పేర్కొనినపద్ధతినిబట్టి సీతాదర్శనము ఫాల్గునశుద్ధత్రయోదశియందు జరుగఁగా తరువాత పదునేడు దినములకే రావణసంహారము జరిగి, పదునాల్గవసంవత్సరము పూర్తి యగుచున్న దని రాముఁడు తొందరపడుచు పుష్పకవిమానమున బయలుదేరెను. ఇది రెండుమాసము లనుటకు విరుద్ధము కదా!

రెండుమాసము లన్నది రావణుఁడు సీతను తెచ్చినప్పటి నుండి ఇచ్చినగడువులో శేషము. అది వనవాసపరిగణనమునకు సంబంధించినది కాదు. అంజనేయుఁడు తన్ను చూచుటకు వచ్చి నప్పుడు జరుగుచున్నమాసముతో వనవాసమున పదునాల్గవసంవత్సరము పూర్తియగు ననుతలంపుతో సీత 'ఒకమాసమునకు పైన జీవింపను' అని అంజనేయునితో స్పష్టముగా చెప్పెను. అందు వలననే రాముఁడు సీతవార్త తెలిసినవెంటనే లంకపై దండెత్తెను."

గోవిందరాజస్వామి గావించినయీసమన్వయము సమంజసముగనే యున్నది. ఆరంభమున రెండు దినములలోనే అంతమంది రాక్షసమహావీరులు సంహరింపఁబడినారా అని సందేహించుటకు అవకాశము కలదు. కాని రామలక్ష్మణుల యొక్క వానరవీరులయొక్క లోకాతీతమైన బలపరాక్రమముల చేత అది అసంభవము కా దని గ్రహింపవచ్చును.

రావణునిచేత ఆజ్ఞాపింపఁబడినరాక్షసులు గంధమాల్యములను మాంసశోణితభోజనపానీయభాజనములను ప్రభూతముగాఁ గైకొని కుంభకర్ణునిశయనమందిరమున ప్రవేశించి యతనిని మేల్కొలుప మొదలుపెట్టిరి. అతనియుచ్ఛ్వాసనిశ్వాసముల వేగమునకు ఎట్లో తట్టుకొని నిలువఁబడి వారు అతనికి ఎదురుగా మృగమాంసరాశులను ఏర్పఱచి పానీయపాత్రలను నిలిపి, అతని యొడలినిండ గంధమును పూసి కేకలు పెట్టుచు శంఖములు పూరించిరి. అప్పటికిని అతఁడు కదలలేదు. పిదప వారు భేరీమృదంగాదులను గట్టిగా ప్రయోగించిరి. అవియును విఫలము లయ్యెను. అంతట వారు దండకశాంకుశములతో గుఱ్ఱములను ఒంటెలను గాడిదలను ఏనుఁగులను తాడించి ఘోషింపఁజేసిరి. వానిఘోషమువలన కూడ అతనియందు చలనము కలుగలేదు.

తుదకు ఇట్లు లాభము లేదని వారిలో కొందఱు భేరులు ప్రయోగించు చుండఁగా కొందఱు అతని వెంట్రుకలు పట్టిలాగఁ జొచ్చిరి; కొందఱు చెవులు కొఱికిరి; మఱికొందఱు చెవులయందు కుండలతో నీరు పోసిరి; ఇంకను కొందఱు సాహసించి ముసలముద్గరాదులతో వానిని ప్రహరింపఁజొచ్చిరి. ఎట్టకేలకు అతఁడు మెల్లగా స్పర్శ జ్ఞానమును పొంది ఆవులించుచు లేచి కూర్చుండి చేతి కందింపఁ బడినవరాహములను మహిషములను ఇతరమాంసములను పెక్కిం టిని భక్షించి మద్యకుంభములను త్రావెను.

అతఁడు తృప్తి నొందె నని తెలిసినతరువాత, అప్పటివఱ కును వెనుకవైపుగా దాగియున్నరాక్షసులు ఎదుటికి వచ్చి నమ స్కరించిరి. వారిని చూచి, "నన్నేల యింత ప్రయత్నముతో మేలు కొలిపితిరి? రాజు కుశలముగా నున్నాఁడా? అతని కేమియు భయము లేదు కదా! అతని కేమియు భయము కలుగకున్నచో న న్నేల లేపుదురు? అతనిభయకారణము అల్పమై యుండదు. అది యేమో చెప్పఁడు?" అని కుంభకర్ణుఁ డనెను. యూపాక్షుఁ డను మంత్రి యిట్లనెను. "మనకు దేవదానవులవలన భయము లేదు. మానవులవలననే భయము కలిగినది. సీతాపహరణమున రాముని వలన రాజునకు పెద్దవిపత్తు వచ్చిపడినది. పూర్వమే ఒక వానరునిచే లంక దగ్ధమై అక్షకుమారుఁడు ససైన్యముగా హతుఁ డైనాఁడు. ఇప్పుడు స్వయముగా లంకాధినాథుఁడే రామునిచే నిర్జింపఁబడినాఁడు. విరథుఁడు విగతచాపుఁడును అయినమన రాజును ఆరాముఁడు దయఁదలఁచి 'ఇంక పొమ్ము' అని విడిచి పెట్టెను."

ఆమాటలు విని కుంభకర్ణుఁడు వివృతాక్షుఁడై, "ఏమి! మా యన్నకు అంత పరాభవము జరిగెనా! నే నిప్పుడే పోయి వానర

సైన్యమును సంహరించి ఆరామలక్ష్మణులరక్తమును త్రావి వచ్చెదను" అనెను. యూపాక్షుఁడు, "మీయన్నను సందర్శించి గుణదోషములను విమర్శించి పిమ్మట శత్రువులను సంహరించుటకు బయలుదేరుము" అనెను. ఇంతలో కొందఱు రాక్షసులు రావణునియొద్దకు పోయి తిరిగివచ్చి. "రాజు నిన్ను చూడఁగోరుచున్నాఁ" డని కుంభకర్ణునితో చెప్పిరి. కుంభకర్ణుఁ డట్లే యని శయనము నుండి లేచి ముఖప్రక్షాళనముఁ గావించి స్నానమొనర్చి మరల వివిధభక్ష్యములను భుజించి రెండువేలకుండలమద్యమును త్రావి యన్నయొద్దకు బయలుదేరెను.

అన్నయొద్దకు పోవుచున్నకుంభకర్ణుఁడు నగరములోనుండి ప్రాకారముమీఁదుగా వెలుపలనున్నరామాదులకు భయంకరముగా కన్పింపఁజొచ్చెను. వానిని చూచి రాముఁడు ధనుష్పాణియై విభీషణునితో, "ఈపర్వతాకారుఁ డెవ్వఁడు? ఇతఁడు భూమికంతయు ధ్వజమువలె నున్నాఁడు. వీనిని చూచి వానరులు పారిపోవుచున్నారు.ఎవఁ డితఁడు?" అని యడిగెను.విభీషణుఁ డిట్లు చెప్పెను. "ఇతఁడు మారెండవయన్న కుంభకర్ణుఁడు. ఇంతప్రమాణముగల రాక్షసుఁడు మఱియొకఁడు లేఁడు. ఇతఁడు శూలమును గైకొని బయలుదేరఁగా దేవతలు వీనిని చూచి కాలుఁడే అని విమూఢులైరి. తక్కినరాక్షసులకు బ్రహ్మాదులవరదానమున బలము కలుగఁగా ఈతనికి సహజముగనే బలము కలిగినది. ఇతఁడు బాల్యముననే ప్రజలను భక్షించుచుండఁగా వారు దేవేంద్రునకు మొఱపెట్టుకొనిరి. ఇంద్రుఁడు కోపించి వీనిపై వజ్రమును ప్రయోగించెను. ఇతఁడు విచలితుఁడై క్రోధమున మహానాద మొనర్చెను. ఆనాదమునకు ఎల్లరును భీతు లైరి. అంత నితఁడు కుపితుఁడై

ఐరావతదంతమును లాగి దానితో ఇంద్రునివక్షమున ప్రహరించెను. ఇంద్రుఁ డుద్వేగము నొందెను. దేవదానవులు విషాదము నొందిరి. ఇంద్రుఁ డెట్లో వీనినుండి తప్పించుకొని వెడలిపోయెను.

దేవదానవమహర్షిముఖ్యులు బ్రహ్మదేవునియొద్దకు పోయి ఈతఁడు గావించుచున్న యాశ్రమధ్వంసము ప్రజాభక్షణము పరస్త్రీహరణము మొదలగుకృత్యములను చెప్పి, 'వీనిచర్య లిట్లే కొనసాగుచున్నచో త్వరలో లోకము శూన్య మగు' నని విన్నవించిరి. అయన రాక్షసుల నందఱను పిలిపించెను. వారిమధ్యలో అందఱకన్నను మించినమహాకాయముతో నడచివచ్చుచున్న వీనిని చూచి పరమేష్ఠి ఉలికిపడి మరల సర్దుకొని, 'నీవు లోకవినాశముకే పౌలస్త్యునిచే సృష్టింపఁబడినట్లున్నది; కావున ఇప్పటినుండి నీవు చచ్చినవానివలె నిద్రించుచుండుము.' అని పలికెను. ఆమాట శాపమై యితఁడు వెంటనే ఆయనయెదుట నిద్రతో వ్రాలి పడిపోయెను. అప్పుడు రావణుఁడు పరమేష్ఠికి ప్రాంజలించి, "లోకేశ్వరా! మునిమనుమని నీ విట్లు శపించుట న్యాయము కాదు; నీ వచనము మిథ్య కాఁజాలదు; కావున ఇతనికి నిద్రకు జాగృతికిని కాలమును నియమింపుము' అని ప్రార్థించెను. పరమేష్ఠి, 'సరే! నీ వన్నది సమంజసమే; ఇతఁడు ఆఱుమాసములు నిద్రించి ఒక్కనాఁడు మేల్కొనును; ఆదినమున యథేష్టముగ భుజించి లోకవ్యవహారమున పాల్గొనును' అనెను.

అప్పటినుండియు రావణుఁడు ఇతనిసుఖనిద్రకు తగిన యేర్పాటులను గావించెను. ఇతఁడు తానై నిద్ర లేచుటయే కాని, ఇతరులు ఇతనిని మేల్కొలుపరు. ఇప్పుడు రావణుఁడు నీవలన ఆపద నొంది యితనిని మేల్కొలుపుటకు అజ్ఞాపించి యుండును. ఇతఁ డింక వానరులను భక్షించుచు మనపైకి రాఁగలఁడు. ఇత

నిని పీ రేమి వారింపఁగలరు? వీనిని చూచినంతమాత్రముననే నాయకులు కూడ పరువెత్తిపోవుచున్నారు. ఇది శత్రువులకు వెఱపు కలిగించుటకై లంకలో పైకెత్తబడినయొకయంత్ర మని వానరులయందు ఉద్ఘోషింపుఁడు. అట్లయినచో వీరు నిర్భయు లగుదురు."

రాముఁడు నీలుని పిలిచి, "అన్నిద్వారములయందును గోపురములయొద్దను మనసైన్యములను వ్యూహములు చెదరకుండ నిలుపుము; పాదపశైలశృంగాదులను సిద్ధము చేసికొని సన్నద్ధులై యుండుఁడు" అని ఆదేశించెను. నీలుఁ డట్లే గావించెను. గవాక్ష శరభహనుమదాదులు శైలసమానములైన శృంగములను గైకొని ద్వారములకు అభిముఖముగా చనిరి. వానరసైన్యములు ప్రాకారమునొద్ద నున్నరాక్షసులను మర్దింపఁజొచ్చెను.

కుంభకర్ణుఁడు, త్వరతో మేల్కొలుపఁబడుటచే, నిద్రా మదాకులుఁడై రాజమార్గమున వచ్చుచుండఁగా హర్మ్యములనుండి పౌరులు పుష్పవర్షము కురియఁజొచ్చిరి. పాదన్యాసములతో భూమిని కంపింపఁజేయుచు కుంభకర్ణుఁడు రావణుని ప్రాసాద మున ప్రవేశించి పుష్పకమునందున్న యన్నను చూచెను. తమ్ముని చూచినంతనే రావణుఁడు ప్రహృష్టుఁడై లేచి వచ్చి కౌఁగిలించు కొనెను. కుంభకర్ణుఁడు అన్నకు నమస్కరించి కూర్చుండి, "ఏమి పని? నన్నేల మేల్కొలిపితివి? ఎవనివలన నీకు భయము కలిగి నది?" అని గద్దించినట్లుగా అడిగెను. రావణుఁడు కన్ను లెఱ్ఱ వాఱ, "నీవు చాలదినములుగా నిద్రించుచుంటివి; ఇక్కడ జరుగు చున్న దేమో నీకు తెలియుట లేదు; రాముఁడు సముద్రమును దాఁటివచ్చి మనకులమును నిర్మూలించుచున్నాఁడు; ఋక్షవాన రులచే లంక ఏకార్ణవమై యున్నది; రాక్షసముఖ్యులు యథా

శక్తి పోరాడి గతించిరి; వానరులకు క్షయము గాని పరాజయము గాని కలుగుట లేదు." అని చెప్పి నిట్టూర్చి మెల్లగా ఇట్లనెను. "తమ్ముఁడా! ఆపన్నుఁడు నైననన్ను బాలవృద్ధావశేషితమైన లంకను కాపాడుము. నేను ఎన్నఁడును ఏసోదరుని ఇట్లు ప్రార్థింప లేదు. నాకు నీయందు మహాస్నేహము పరమగౌరవమును గలవు. దేవాసురయుద్ధములందు అనేకపర్యాయములు నీవు శత్రువులను అవలీలగా జయించితివి. సకలభూతములయందును నీయంత బలవంతుఁ డెవఁడును లేఁడు."

రాక్షసేశ్వరునిపరిదేవితమును విని కుంభకర్ణుఁడు పెద్దగా నవ్వి, 'అన్నా! మంత్రాలోచనసమయమున అనుకొన్నయాపదయే వచ్చి పడినది. హితులమాటలను పెడచెవిని పెట్టిననీకు రాఁదగినదే సంప్రాప్తమైనది. నీవు మొదట వీర్యదర్పమున అనాలోచితముగా ఈపని చేసితివి. ముందు చేయవలసినపనులు వెనుక, వెనుక చేయవలసినవానిని ముందుగా చేయువాఁడు, నయానయము లెఱుఁగనివాఁడు. దేశకాలముల నెఱుంగక చేయుపనులు దోషములనే కలిగించును. యథాన్యాయముగ సచివులతో ఆలోచించుచు సుహృత్తులను గమనించుచు ఎవఁడు కార్యమును గ్రహించునో వాఁడు కార్యదక్షుఁ డగును. ధర్మార్థకామములను యథాకాలముగా సేవింపనిరాజుయొక్క పరిజ్ఞానము వ్యర్థము. ధర్మార్థకామములను, సచివులతో ఆలోచించుచు, యథాకాలముగా నెవఁడు సేవించునో అతఁడు ఆపద నొందఁడు. శాస్త్రార్థముల నెఱుంగక కొందఱు మంత్రులలో చేరినవారు పశుబుద్ధులై ప్రాగల్భ్యముతో అహితమును హితమునుగా చెప్పుచుందురు. అట్టికృత్యదూషకులను రాజు గమనించి బహిష్కరింపవలె. అట్టివారిని రాజు వారివర్తనమునుబట్టి పరిశీలించి గుర్తింపవలె. చపలుఁడై సాహసముతో వర్తించురాజుయొక్క ఛిద్రములను శత్రువులు గుర్తించి

యాక్రమింతురు. శత్రువును లెక్కింపక ఆత్మరక్షణముఁ గావించుకొననివాఁడు అనర్థములను పొందును. నాతమ్ముఁడు చెప్పిన హితము ఇప్పటి కైనను నీకు ఇష్ట మగుచో అవలంబింపుము."

శ్లో॥ దృష్టో దోషో హి యోఽస్మాభిః పురా మంత్రవినిర్ణయే।
హితే ష్వనభిరక్తేన సోఽయ మాసాదిత స్త్వయా॥ 2

శ్లో॥ శీఘ్రం ఖ ల్వభ్యుపేతం త్వాం ఫలం పాపస్య కర్మణః।
నిరయే ష్వేవ పతనం యథా దుష్కృతకర్మణః॥ 3

శ్లో॥ ప్రథమం వై మహారాజ కృత్య మేత దచింతితమ్।
కేవలం వీర్యదర్పేణ నానుబంధో విచారితః॥ 4

శ్లో॥ యః పశ్చా త్పూర్వకార్యాణి కుర్యా దైశ్వర్య మాస్థితః।
పూర్వం చాపరకార్యాణి న స వేద నయానయౌ॥ 5

శ్లో॥ ధర్మ మర్థం చ కామం చ సర్వాన్ వా రక్షసాం పతే।
భజేత పురుషః కాలే త్రీణి ద్వంద్వాని వా పునః॥ 9

శ్లో॥ త్రిషు చైతేషు యచ్ఛ్రేష్ఠం శ్రుత్వా త న్నావబుధ్యతే।
రాజా వా రాజమాత్రో వా వ్యర్థం తస్య బహుశ్రుతమ్॥ 10

శ్లో॥ కాలే ధర్మార్థకామాన్ య స్సమ్మంత్ర్య సచివై స్సహ।
నిషేవే తాత్మవాన్ లోకే న స వ్యసన మాప్నుయాత్॥ 12

శ్లో॥ హితానుబంధ మాలోచ్య కార్యాకార్య మి హాత్మనః।
రాజా సహార్థతత్త్వజ్ఞై స్సచివై స్స హి జీవతి॥ 13

శ్లో॥ అనభిజ్ఞాయ శాస్త్రార్థాన్ పురుషాః పశుబుద్ధయః
ప్రాగల్భ్యా ద్వక్తు మిచ్ఛన్తి మంత్రే ష్వభ్యంతరీకృతాః॥ 14

శ్లో॥ అశాస్త్రవిదుషాం తేషాం న కార్య మహితం వచః।
అర్థశాస్త్రానభిజ్ఞానాం విపులాం శ్రియ మిచ్ఛతామ్॥ 15

శ్లో॥ అహితం చ హితాకారం ధార్ష్ట్యా జ్జల్పన్తి యే నరాః।
అవేక్ష్య మన్త్రబాహ్యా స్తే కర్తవ్యాః కృత్యదూషణాః॥ 19
శ్లో॥ యో హి శత్రు మభిజ్ఞాయ నాత్మాన మభిరక్షతి।
అవాప్నోతి హి సోఽనర్థాన్ స్థానా చ్చ వ్యవరోప్యతే॥ 20
శ్లో॥ య దుక్త మిహ తే పూర్వం క్రియతా మనుజేన చ।
త దేవ నో హితం కార్యం, య దిచ్ఛసి చ తత్కురు॥ 21
(యుద్ధ-సర్గ-63)

పైప్రసంగమువలన కుంభకర్ణునిరాజనీతిపరిజ్ఞానము విశద మగుచున్నది. ధర్మదృష్టితో విభీషణుఁడు ఏది హిత మని నిశ్చయించెనో రాజనీతిదృష్టితో కూడ అదియే హిత మని కుంభకర్ణుఁడు చెప్పుచున్నాఁడు. అప్రత్యక్షమైన స్వర్గాదిఫలములకు సాధనమైనది ధర్మము. ప్రత్యక్షమై యుద్ధవిజయరాజ్యభోగాదులకు సాధన మైనది నీతి. ఈసందర్భమునందు ఇరువురినిశ్చయము సమానమే యైనను కుంభకర్ణుని నిశ్చయమునకు మూలము నీతియే కాని ధర్మము కాదు. "ఎవఁడు శత్రువుయొక్క బలము నెఱుంగక తన్ను రక్షించుకొనఁడో వాఁడు అనర్థములను పొందుచున్నాఁడు; స్థానమునుండి కూడ తొలఁగింపఁబడుచున్నాఁడు" అనువాక్యమునందు కుంభకర్ణుని యీదృష్టి స్పష్ట మగుచున్నది. అప్పటికి జరిగినదానినిబట్టి రావణునికన్న రాముఁడు చాలబలవంతుఁ డని, ఆవిషయమును గుర్తింపక మూర్ఖముగ పోరాడినచో రాక్షసవీరవినాశము మకుటభంగాదులైన యనర్థములే కాక రావణుఁడు రాజుగా తొలఁగింపఁబడి ఆపదవి విభీషణున కొసంగఁబడు ననియు కుంభకర్ణుఁడు స్పష్టము చేయుచున్నాఁడు. అందువలన కుంభకర్ణుఁడు కేవలము అన్నకు క్షేమదృష్టితోనే విభీషణుఁడు చెప్పినహితమును అవలంబింపు మని చెప్పుచున్నాఁడు.

నిండుసభలో తనకు తమ్ముఁడు హితోపదేశమును చేయు చును సహింపక రావణుఁడు క్రుద్ధుఁడై యిట్లనెను. "ఆచార్యుని వలె అన్న కూడ మాన్యుఁడు. నన్ను నీవు అనుశాసింతువా యేమి? ఈ వాక్పరిశ్రమ యెందులకు? నీ కిష్ట మగుచో నేను చెప్పినట్లు చేయుము. భ్రాంతివలననో బుద్ధిమోహమువలననో బలవీర్యదర్పముచేతనో, దేనివలన నైన నేమి, నీవు చెప్పినది జరుగలేదు. దానినిగూర్చినకథ లిప్పుడు వ్యర్థము. ఇప్పు డేది యుక్తమో దానిని చేయుము. నాయవినీతివలనఁ గలిగినదుస్థితిని నీవిక్రమముచేత చక్కఁబెట్టుము. నాయందు నీకు ప్రేమ గాని విక్రమమునం దభిలాష గాని యున్నచో, నాకార్యము నీకు పరమ కర్తవ్య మని తలంతు వేని, నేను చెప్పినట్లు చేయుము. దీనుని ఆదుకొనువాఁడే సుహృత్తు. విషమదశయందున్నవానికి సాయ మొనర్చువాఁడే బంధువు."

అన్న మిగుల క్షుభితుఁ డయ్యె నని గుర్తించి కుంభకర్ణుఁడు మెల్లగా సాంత్వనపూర్వకముగా ఇట్లనెను. "అన్నా! సంతాపము నొందకుము. స్వాస్థ్యము నొందుము. నేను బ్రతికియుండఁగా నీవు పరితపింపవలసినపని యే మున్నది? బంధుభావమువలన భ్రాతృస్నేహముచేత సర్వావస్థలయందును నేను నీకు హితమునే చెప్పవలసియున్నది. కావున చెప్పితిని. అది నీకు నచ్చ కున్నచో నీయిష్టమే నాకు అనుష్ఠేయము. ఇంక బంధుత్వము వలన ప్రేమచేత నీకొఱకు నేను గావించుయుద్ధమును చూడుము. సుగ్రీవుని సంహరించి రామునిశీర్షమును ఖండించి తెచ్చెదను. ఆరాముఁడు నన్ను సంహరించినతరువాత కదా నిన్ను సంహ రించును. నావిషయమున నాకు సంతాపము లేదు. నాముష్టి వేగమును రాముఁడు సహించినఁ గదా అతనిబాణౌఘములు నా

రుధిరమును త్రాగుము. చిరకాలము శయనించియున్న కుంభకర్ణుని విక్రమమును సకలభూతములు చూచును గాక!"

శ్లో॥ మాం నిహత్య కిల త్వాం హి నిహనిష్యతి రాఘవః।
నాహ మాత్మని సంతాపం గచ్ఛేయం రాక్షసాధిప॥ 40

శ్లో॥ యది మే ముష్టివేగం స రాఘవోఽద్య సహిష్యతి। 46

శ్లో॥ తతః పాస్యన్తి బాణౌఘా రుధిరం రాఘవస్య మే॥ 47

యుద్ధ-సర్గ-63

కుంభకర్ణుఁడు ఈమాటలలో యుద్ధమునందు తనకు రామునకు కూడ మరణము తప్ప దని, యుద్ధవిజయమునుగూర్చి తనపై ఆశలు పెట్టుకొనవల దని స్ఫురింపఁజేసినాఁడు.

మహోదరుఁ డనుమంత్రి ప్రభువుయొక్క ప్రీతికై కుంభకర్ణునివాదమును ఖండించుచు నిట్లనెను. "నీవు మహాకులమున జన్మించియు ప్రాకృతుఁడవై గర్వించి కృత్యము నెఱుంగ జాలకున్నావు. రాజు నయానయము లెఱుంగనివాడు కాదు; తనయొక్క శత్రువులయొక్క హానివృద్ధుల నెఱింగినవాఁడే. ప్రాకృతుఁడైన వాఁడు కూడ చేయుటకు ఇచ్ఛగింపనిపనిని రాజెట్లు చేయును? ధర్మాధర్మములకు నియతమైనఫల మెక్కడ? దీని నంతయు ఆలోచించియే రాజు కార్యనిశ్చయము గావించినాఁడు. మాయభిప్రాయము కూడ అదియే. నీవు ఒక్కడఁవే పోయి రాముని జయింతు ననుటయు సమంజసము కాదు. జనస్థానమందు అతిబలాఢ్యులైన పెక్కువేలమంది రాక్షసులను ఏకవీరుఁడై సంహరించినరాముని నీవు ఒక్కఁడవే ఎట్లు జయింపఁగలవు? ఇప్పుడు నిర్జితులై భీతులై పురమునం దొదిగియున్న రాక్షసముఖ్యులను చూడవైతివి. అసమానుఁడైన యా రాముని నీ వెట్లు నిగ్రహింపఁగలవు?"

ఇట్లు కుంభకర్ణుని తిరస్కరించి మహోదరుఁడు ప్రభువుతో నిట్లనెను. "మహారాజా! 'మహోదరుఁడు ద్విజిహ్వుఁడు సంహ్రాది కుంభకర్ణుఁడు వితర్దనుఁడు రామునివధకై బయలుదేరుచున్నా' రని ప్రకటింపుము. మేము ఆతనిని జయింపఁగలిగినచో మంచిదే. లేకున్నచో మేము రామబాణదారితదేహులమై నీ యొద్దకు వచ్చి, 'మేము రాముని భక్షించి వచ్చితి' మని చెప్పుదుము. అప్పుడు నీవు మాకు బహుమానముల నొసంగి రామ వధమును పురమున ఉద్ఘోషింపుము. పిమ్మట సీత ననుభవింపుము. భర్తృవధమును తెలిపి ఆమెను అనునయించినచో ఆమె నిన్ను పొందఁగలదు."

కుంభకర్ణుఁడు మహోదరుని ధిక్కరించి యిట్లనెను. "పౌరుషహీనులకు మందబుద్ధులకు నీవాక్యములు రుచించును. యుద్ధమునందు కాపురుషులైన మీ రందఱు సభలో ప్రియవాదులై రాజును అనుసరించుచు, హితమును చెప్పక, సర్వనాశమును గావించితిరి. మిత్త్రు లనుపేరుతో మీరు శత్రువులై లంకను రాజశేషముగా చేసితిరి. కోశము క్షీణించినది. బలము హతమైనది. మీదుర్నయమువలన కలిగినవిషమస్థితిని నే నిప్పుడే పోయి మహాయుద్ధమున చక్కఁబెట్టుదును. శూరులు వ్యర్థముగా గర్జింపరు." పిమ్మట అతఁడు రావణుని చూచి, "అన్నా! నీకు వీరితో నేమి? నేను నీభయమును హరింతును. నీవు విగతవైరివై సుఖింపుము." అనెను.

రావణుఁడు పకపక నవ్వుచు కుంభకర్ణుని చూచి, "ఇతఁడు రామునకు భయపడుచున్నాఁడు; సందియము లేదు; సౌహృదమునఁ గాని బలమునఁ గాని నీతో సమానుఁ డెవఁడును నాకు

లేఁడు; నీవు ఇప్పుడే పోయి రామలక్ష్మణులను భక్షింపుము; నిన్ను చూచినంతనే వానరులు పరువెత్తుదురు; అంతటితో రామ లక్ష్మణులహృదయములు పగిలిపోవును" అని చెప్పి తన్ను మరల జన్మించినవానినిగా తలంచెను.

కుంభకర్ణుఁడు శూలమును గైకొని; "సైన్య మెందులకు, నే నొక్కఁడనే పోయి శత్రుసంహారముఁ గావింతును" అనెను. రావణుఁడు, "వానరులు సామాన్యులు కారు; మహాశూరులు; ఒంట రిగా నున్నవానినిగాని, ప్రమత్తుఁడై యున్నవానిని గాని వారు చుట్టుముట్టి సంహరింపఁగలరు; కావున సాయుధబలపరివృతుఁ డవై బయలుదేరుము" అని యాసనమునుండి దుమికి మణిహార మును తమ్మునికంఠమునందు వైచి, అంగదములు అంగుళీయక ములు కుండలములు కేయూరములు మొదలైనయాభరణములతో సుగంధమాల్యాదులతో స్వయముగా వానిని అలంకరించెను. సర్వా భరణభూషితాంగుఁడై కుంభకర్ణుఁడు అన్నను కౌఁగిలించుకొని ప్రద క్షిణనమస్కారములు గావించి ఆశిషములను గైకొని చతురంగబల పరివృతుఁడై బయలుదేరెను. దారిలో అనుచరులతో, "వానరులు నా కేమియు అపకార మొనర్పలేదు; అజాతి పురోద్యానమునకు దూషణము; ఈముట్టడికి మూలము రామలక్ష్మణులు; కావున వారినే వధింతును" అని పలికెను. వా రందఱు ప్రహృష్టులై జయజయ నినాదములు గావించిరి.

కుంభకర్ణుఁడు నూఱువిండ్లవెడల్పు ఆఱువందలవిండ్ల యెత్తు బండిచక్రములంతకన్నులు కలిగి, అలంకృతికి విరుద్ధమైన యాకృతి కలవాఁడై తగులఁబడినకొండవలె కన్పించుచు ప్రాకార మును దాఁటి వెలుపలికివచ్చెను. అతనికి పెక్కుదుర్నిమిత్త ములు కన్పించెను. వాని నాతఁడు లెక్కపెట్టలేదు. వానరులను

చూచి యతఁడు సాగరశైలములు ప్రతిధ్వనించునట్లు గర్జించెను. ఆధ్వనికి నలనీలకుముదగవాక్షాదులు కూడ హృదయములు కంపింప పాఱిపోఁజొచ్చిరి. అంగదుఁడు వారిని చూచి, "ప్రాకృతులైన వానరులవలె మీరు కూడ వీరకృత్యములను విస్మరించి ఎచ్చటికి పాఱిపోవుచున్నారు? ఇతఁడు రాక్షసుఁడు కాఁడు; ఇది వెఱపుగొలుపు నొకపెద్దయంత్రము. ఇది చూచుటకు భయంకరముగా నున్నదే కాని యుద్ధమునకు పనికి రాదు; దీనిని మనము పరాక్రమముచేత భేదింతము; రండు; రండు" అని ప్రోత్సహించెను.

అంతట వా రందఱు పాదపశిలాయుధులై వెనుదిరిగి కుంభకర్ణుని ప్రహరింపఁ జొచ్చిరి. గండశిలలు కూడ వాని శరీరముపైఁబడి శీర్ణములు కాఁజొచ్చెను. అతఁడు దావాగ్నివలె వానరుల నిర్మూలించుచుండెను. ఆతనిధాటి కాగలేక ఋక్షులు వానరులు సేతుమార్గమున పాఱిపోఁజొచ్చిరి. అంగదుఁడు వారిని సంబోధించుచు ఇట్లనెను. "నిలువుఁడు; నిలువుఁడు; వెనుకకు మరలుఁడు. మీరు పాఱిపోయి ఈప్రపంచమున నెక్కడ జీవింపఁగలరు? మిమ్ముఁ జూచి మీభార్యలుకూడ పరిహసింతురు. మహాకులప్రసూతులై మహావీర్యులైన మీరు ప్రాకృతవానరులవలె పాఱిపోవుదు రేమి? ఇట్లు ధిక్కారముల నొందుచు బ్రతుకుటకన్న చచ్చుట మేలు కదా! వీరమార్గము నవలంబింపుఁడు. జయించినచో నైశ్వర్యమును, హతుల మైనచో శాశ్వతకీర్తిని పొందుదుము. ఈకుంభకర్ణుఁడు రామునికంటఁ బడినచో నిప్పులో దూఁకినశలభమువలె దగ్ధుఁ డగును."

పాఱిపోవుచున్నవానరులు అంగదుని చూచి, "అయ్యా! ఇంక యుద్ధము చాలును; ఈకుంభకర్ణునిముందు ఎవరు నిలువఁ

గలరు? ఇది నిలువఁదగిన స్థానము గాని కాలము గాని కాదు; ఎవరికైనను జీవితము ప్రియము కదా!" అనుచు పరువెత్తఁ జొచ్చిరి. అంగదుఁడు రాముని పరాక్రమమునుగూర్చి చెప్పి పెక్కువిధముల ప్రోత్సహించి వారి నందఱను వెనుకకు మరలించెను.

ఋక్షవానరులు యుద్ధము చేయ నిశ్చయించుకొని కుంభకర్ణుని శిలలతో వృక్షములతో ప్రహరింపఁజొచ్చిరి. అతడు గదతో వందలు వేలుగా వానరులసంహరించుచు, చిక్కినవారిని పదులు ఇరువదులుగా భక్షించుచుండెను. ద్వివిదుఁ డొకపర్వత శృంగమును విసరఁగా అది కుంభకర్ణుని చేరక మధ్యలోఁ బడి రాక్షససైన్యమును విధ్వస్త మొనర్చెను. ఆంజనేయుఁడు ఆకాశమున నుండి శిలలను శృంగములను కుంభకర్ణునిపై వర్షించెను. అతఁడు వానిని శూలముచే భగ్న మొనర్చి హనుమంతునివక్షమున పొడిచెను. ఆయాఘాతమునకు హనుమంతుఁడు మూర్ఛిల్లెను. నీలుఁ డొకశైలశృంగమును విసరఁగా దానిని కుంభకర్ణుఁడు ముష్టిప్రహారమున భగ్న మొనర్చెను. పిమ్మట ఋషభశరభనీల గవాక్షగంధమాదను లొక్కుమ్మడిగా వానిని చుట్టుముట్టి ప్రహరించిరి. కుంభకర్ణుఁడు ఋషభుని రెండుచేతులతో పట్టి అదుమగా అతఁడు నెత్తురు గ్రక్కుచు పడిపోయెను. కుంభకర్ణుఁడు ముష్టిఘాతమున శరభుని, మోఁకాటితో నీలుని, అఱచేతితో గవాక్షుని, పాదముతో గంధమాదనుని ప్రహరించెను. అతనిదెబ్బలకు అందఱును సొమ్మసిల్లి నేలఁగూలిరి.

అంతట వేలకొలఁది వానరులు సాహసించి కుంభకర్ణునిపై దూఁకి ప్రహరింపఁజొచ్చిరి. వారి నందఱను అతఁడు మ్రింగుచు చంపుచు విహరింపఁజొచ్చెను. అంగదుఁ డొకశైలశిఖరమును

వానితలపై వైచెను. ఆదెబ్బకు ప్రజ్వలించి కుంభకర్ణుఁడు అంగదునిపై శూలమును విసిరెను. అంగదుఁడు లాఘవమున దానిని తప్పించుకొని కుంభకర్ణునిపై దూఁకి వక్షమున ప్రహరించెను. కుంభకర్ణుఁడు సోలి వెంటనే తేఱుకొని యంగదుని ముష్టిఘాతమున ప్రహరించెను. అంగదుఁడు మూర్ఛిల్లి నేలఁగూలెను.

అంగదునిపాటుఁ జూచి సుగ్రీవుఁడు రోషముతో ఒకపెద్ద పర్వతశృంగమును తెచ్చి ప్రహరింపఁగా అది కుంభకర్ణుని వక్షమునఁ బడి ముక్క లయ్యెను. కుంభకర్ణుఁడు శూలమును గైకొని సుగ్రీవునిపై ప్రయోగింపఁగా, ఆంజనేయుఁడు మధ్యలో దాని నందుకొని నడిమికి విఱిచెను. అది వేయిభారువుల బరువుగల యినుపశూలము. అది విఱుగుట చూచి కుంభకర్ణుఁడు చకితుఁడై దాపుననున్న లంకామలయశైలశృంగమును పెకలించి తనపైకి వచ్చుచున్న సుగ్రీవునిపై వైచెను. సుగ్రీవుఁడు మూర్ఛిల్లగా కుంభకర్ణుఁడు వానిని గైకొని లంకకు బయలుదేరెను. అది చూచి హనుమంతుఁడు, "ఇప్పుడు పోయి కుంభకర్ణుని సంహరించి సుగ్రీవుని విడిపించినచో అది సుగ్రీవునకు అకీర్తికర మగును. ఆతఁడే మూర్ఛనుండి తేఱుకొని తప్పించుకొని రాఁగలఁడు" అని తలంచి యూరకుండెను.

కుంభకర్ణుఁడు నగరమున ప్రవేశించినంతనే పౌరులు జయ జయ ధ్వానములతో అతనిపై పుష్పములను పేలాలను వర్షముగా కురిసిరి. అచల్లదనమునకు సుగ్రీవుఁడు తేఱుకొని రాజమార్గమును చూచి జరిగినదానిని గ్రహించి గోళ్లతో కుంభకర్ణుని కర్ణములను, దంతములతో ముక్కును పాదములతో ప్రక్కలను చీల్చెను. అతఁడు వ్యథనొంది సుగ్రీవుని నేలపై విసరెను. వెంటనే సుగ్రీవుఁ డెగిరి వచ్చి రామునిపార్శ్వమున నిలిచెను.

కర్ణనాసావిహీనుఁడైన కుంభకర్ణుఁడు నెత్తురోడుచు పురములో ముందుకు పోవుటకు లజ్జించి వెనుకకు మరలి ముద్గరమును గైకొని మరల రణరంగమున ప్రవేశించి ప్రళయకాలుని వలె ఋక్షవానరులను నుఱుమాడఁజొచ్చెను. వారు హాహాకారములు గావించుచు రాముని శరణుఁజొచ్చిరి. ఇంతలో లక్ష్మణుఁడు కుంభకర్ణుని మార్కొనెను. కుంభకర్ణుఁడు లక్ష్మణుని అతిక్రమించి రాముని వైపునకే పరువెత్తెను. రాముఁడు కుంభకర్ణుని చూచి అల్లెత్రాటిని దిక్కులు పిక్కటిల్లఁగా ప్రయోగించెను. ఆ ధ్వనినిబట్టి రాముని గుర్తించి కుంభకర్ణుఁడు వికృతముగా నవ్వుచు ఇట్లు గర్జించెను. "రామా! నేను విరాధుఁడను కబంధుఁడను ఖరుఁడను వాలిని మారీచుఁడను కాను; కుంభకర్ణుఁడను. భయంకరమైనయీముద్గరమును చూడుము. దీనితో దేవదానవవీరవరేణ్యుల నందఱను నిర్జించితిని. నీశక్తి నంతయు చూపుము. పిమ్మట నిన్ను భక్షింతును."

సప్తసాలములను వాలిని భేదించినబాణములవలె వజ్రసన్నిభములైన శరములను రాముఁడు కుంభకర్ణునిపై ప్రయోగించెను. అతఁడు ముద్గరముతో ఆబాణములను చెదరఁగొట్టుచు ఋక్షవానరసైన్యమును నుఱుమాడఁజొచ్చెను. ముద్గరమును దాఁటి పెక్కుబాణములు కుంభకర్ణుని శరీరమును చీల్చుచు బాధించుచుండెను. రాముఁడు వాయువ్యాస్త్రమున ముద్గరమును పట్టియున్న బాహువును ఖండింపఁగా దానిక్రిందపడి కొంత సైన్యము హత మయ్యెను. అతఁడు రెండవచేతితో తాటిచెట్టును గైకొనఁగా రాముఁడు దానిని కూడ ఐంద్రాస్త్రమున ఖండించెను. అప్పటికిని కుంభకర్ణుఁడు వెనుకకు నడుగువేయక రామునివైపే వచ్చుచుండెను. రాముఁడు రెండు అర్ధచంద్రబాణములతో వాని

పాదములను ఖండించెను. అప్పటికిని శూరవరేణ్యుఁడైన యా రాక్షసాగ్రణి మొండెముగా నేలపై దొరలుచు నోరు తెఱచుకొని మ్రింగుటకై పైకి వచ్చుచుండఁగా రాముఁడు వానినోటియందు బాణములను నింపి యైంద్రాస్త్రమునే మరల ప్రయోగించి వాని శిరమును ఖండించెను.

రాముఁడు కుంభకర్ణునకు చిత్రవధ నేల కలిగింపవలె? మొదటనే ఆయన అతనిశిరము నేల ఖండింపలేదు? కుంభకర్ణుఁడు సజీవముగా అనేకమృగములను నమిలిమ్రింగెడివాఁడు. రాముఁడు చూచుచుండఁగనే పెక్కుమంది వానరులను అతఁడు భక్ష్యములనువలె భక్షించెను. అట్లు భక్షింపఁబడుచున్నప్రాణులయొక్క వ్యథ అతనికి తెలియునట్లుగా రాముఁ డతనికి చిత్రవధ గావించెను.

## 7. దేవాంతకాదిసంహారము

కుంభకర్ణునివధను విని రావణుఁడు మూర్ఛిల్లి కొంతసేపటికి తేఱుకొని యిట్లు విలపింపఁజొచ్చెను. "అయ్యో! నాదక్షిణ బాహువే పోయినది. నే నింక బ్రతికి ఏమి ప్రయోజనము! నేను కూడ ప్రాణసమానుఁడైన సోదరునే అనుగమింతును. ఇంక నాకు ఈయుద్ధముతో నేమి పని! నాచేత భంగపడినదేవతలు ఇప్పుడు నన్ను చూచి తప్పక పరిహసింతురు. ఇంక నే నెట్లు ఇంద్రుని జయింపఁగలను? మహాత్ముఁడైన విభీషణుని శుభప్రదమైన వాక్యమును నేను గ్రహింపనైతిని. వాఁడు చెప్పినట్లే యిది జరుగుచున్నది. ప్రహస్తకుంభకర్ణులవినాశమువలన వానిమాటలను విననందులకు నాకు సిగ్గు కలుగుచున్నది. ధార్మికుఁడు తేజ

స్వీయు నైనవిభీషణుని త్రోసివేసిన యాపాపకర్మయొక్క విపాకమే యీదుఃఖము."

శ్లో॥ త దిదం మా మనుప్రాప్తం విభీషణవచ శ్శుభం।
యదజ్ఞానా న్మయా తస్య న గృహీతం మహాత్మనః॥ 21

శ్లో॥ విభీషణవచో యావ త్కుంభకర్ణ ప్రహస్తయోః।
వినాశోఽయం సముత్పన్నో మాం వ్రీళయతి దారుణః॥22

శ్లో॥ త స్యాయం కర్మణః ప్రాప్తో విపాకో మమ శోకదః।
య న్మయా ధార్మిక శ్శ్రీమాన్ స నిరస్తో విభీషణః॥ 23

యుద్ధ-సర్గ-68

రావణుఁడు విభీషణునిగూర్చి ధార్మికుఁడు మహాత్ముఁడు అని యనుకొనుట గమనింపఁదగియున్నది. విభీషణుని మాటలయందుఁ గాని చర్యయందుఁ గాని కొంచెము కూడ ధర్మ విరుద్ధమైనది లేదని రావణుఁడు వ్యక్తము చేయుచున్నాఁడు. తమ్ముఁడు తన్ను ఆపదలో వదలిపెట్టిపోయె ననుతలంపున్నచో రావణుఁడు ఇట్లు అనుకొనుట కుదురదు. అట్టితమ్ముని తఱిమివైచుటవలనఁ గలిగినయుత్కటమైన పాపమే వెంటనే యిట్లు ప్రహస్తకుంభకర్ణాదులవినాశరూపమున ఫలము నొసంగుచున్నదని గ్రహించి, అతఁడు తాను చేసినపనికి పరితాపముకన్నను అధికముగా సిగ్గుపడుచున్నాఁడు (వ్రీళయతి). దీనినిబట్టి రావణుఁడే విభీషణుని త్రోసివేసెను కాని, విభీషణుఁడు అన్నను పరిత్యజింప లేదనుట స్పష్టము.

ఇట్లు విలపించుచు రావణుఁడు సోలిపోయెను, దేవాంతకాదులు కూడ పినతండ్రియొక్క మరణమునకు బిగ్గరగా విలపించిరి. కొంతసేపటికి రావణుఁడు తేఱుకొనెను. అప్పుడు

త్రిశిరుఁడు తండ్రిని చూచి యిట్లనెను. "తండ్రీ! మహాపురుషు లిట్లు దుఃఖింతురా! నీకు బ్రహ్మదత్తమైన శక్తి కవచము సాయకము ధనుస్సు సహస్రఖరయుక్తమైన రథమును గలవు. దేవదానవుల నిర్జించినట్లే రాముని కూడ జయింపుము. నీదాఁక నెందులకు నేనే పోయి శత్రువుల జయించి వత్తును."

అమాటలని విని రావణుఁడు తన్ను చచ్చి మరల పుట్టినవానినిగా తలంచెను. దేవాంతకాదులు కూడ అహమహమికతో ముందునకు వచ్చిరి. రావణుఁడు త్రిశిరసునితోఁబాటు వాని సోదరులను దేవాంతకనరాంతకాతికాయులను, వారికి రక్షణముగా యుద్ధోన్మత్తుఁడు మత్తుఁడు అనునామాంతరములు గల తన సోదరులగు మహోదరమహాపార్శ్వులను కూడ పంపెను. వా రందఱు సైన్యపరివృతులై రణరంగమున ప్రవేశించిరి.

ఖరదూషణాదులవలె మహోదరాదులును దాయాదులైన సోదరులో లేక తల్లియొక్క అప్పచెల్లెండ్రకుమారులో అయి యుందురు.

నరాంతకుఁడు హయారూఢుఁడై ప్రాసమును గైకొని వందల కొలఁదిగా వానరులను హతమొనర్పఁజొచ్చెను. భగ్నమగుచున్న కపిసైన్యమును నరాంతకుని విక్రమమును చూచి సుగ్రీవుఁడు వానిని సంహరించుటకు అంగదుని పంపెను. అంగదుఁడు వాని నెదుర్కొని, "ఈప్రాకృతవానరులతో నేమి! నీ ప్రాసమును నాపై ప్రయోగింపుము" అనెను. వాఁడు ప్రాసమును ప్రయోగింపఁగా అది యంగదుని వక్షమునఁ బడి వ్యర్థమయ్యెను. అంగదుఁడు అఱచేతిదెబ్బతో నరాంతకునిహయమును కూల్చెను. నరాంత

కుఁడు క్రిందికి దూఁకి పిడికిలి బిగించి యంగదునితలపై మొత్తెను. అంగదుఁడు విహ్వలించి వెంటనే తేఱుకొని ముష్టిఘాతమున నరాంతకుని గూల్చెను.

అది చూచి దేవాంతకుఁడు త్రిశిరసుఁడు మహోదరుఁడు ఒక్కసారిగా అంగదుని మార్కొనిరి. అంగదుఁడు ముష్వరితో ఘోరమైనయుద్ధము చేయుచుండఁగా చూచి హనుమంతుఁడు దేవాంతకుని, నీలుఁడు త్రిశిరసుని ప్రతిఘటించిరి. దేవాంతకుఁడు హనుమంతుని పరిఘముతో ప్రహరించెను. ఆంజనేయుఁడు పైకెగిరి దానిని తప్పించుకొని పిడికిటిపోటుతో వానితలను పగులఁ గొట్టెను.

త్రిశిరసుఁడు మహోదరుఁడు నీలుని మార్కొనిరి. త్రిశిరసుఁడు నీలునివక్షమున బాణవర్షమును గురియఁగా, మహోదరుఁడు గజాధిరూఢుఁడై మార్గణములను ప్రయోగించెను. నీలుఁడు సొమ్మసిల్లి వెంటనే తేఱుకొని ఒక మహాశైలమును గొనివచ్చి మహోదరుపై వైచెను. ఆదెబ్బకు గజముతో కూడ వాఁడు నేల కంటుకొనెను.

నీలునివైపునుండి తప్పించి త్రిశిరసుని ఆంజనేయుఁడు మార్కొనెను. వాఁడు ఆయనపై బాణౌఘమును పఱుపఁగా, ఆయన గిరిశృంగమును తెచ్చి వానిపై వైచెను. వాఁడు దానిని భేదించుచు ఆయనవిసరుచున్న వృక్షపరంపరను కూడ ఛేదించెను. ఆంజనేయుఁడు వానిపై దూఁకి అశ్వమును గోళ్లతో చీల్చి అమితవేగమున అవతలికి దూఁకెను. వాఁడు ఆయనపై శక్తిని ప్రయోగించెను. దాని నాయన పట్టుకొని విఱిచెను. వాఁడు ఖడ్గముతో ఆయనను ప్రహరింపఁగా, ఆయన పిడికిటితో వానివక్షమున పొడిచెను. వాఁడు సొమ్మసిల్లి నేలఁగూలఁగా అంజ

నేయుఁడు వానిచేతిలోనికత్తిని లాగుకొని సింహనాద మొనర్చెను. వాఁడు ఆయవమానమును సహింపక ఒక్కయుదుటున లేచి ఆయనను పిడికిటితో పొడిచెను. ఆయన దానిని సరకుగొనక వానిఖడ్గముతోనే వానిశీర్షములను ఖండించెను.

మహాపార్శ్వుఁడు గదాపాణియై వానరులను నుఱుమాడు చుండఁగా ఋషభుఁడు వానిని మార్కొనెను. వాఁడు గదతో తాడింపఁగా ఋషభుఁడు సొమ్మసిల్లి తేఱుకొని పిడికిటితో వానిని మొత్తెను. వాఁడు మూర్ఛిల్లి పడినంతనే వానిగదను గైకొని ఋషభుఁడు మహానాద మొనర్చి, వాఁడు లేచినంతనే ఆగదతో వానిని నేలఁగూల్చెను.

తనవారు గతించుటఁ జూచి అతికాయుఁడు క్రుద్ధుఁడై వేయి గుఱ్ఱములు పూన్చినరథముపై నలువురు సారథులతో బయలు దేరివచ్చెను. దానియందు చాలపెద్దవియైన పెక్కువిండ్లు, తూణీరములు, పదిహస్తములనిడివిగలిగినఖడ్గములు, మహాశూల ప్రాసాదు లుండెను. అతఁడు సింహగర్జనము చేయుచు శరపరంపరలతో పైకివచుచున్న వానరసైన్యమును నుఱుమాడఁజొచ్చెను. చాలపెద్దదియైన వానిశరీరమును చూచి కుంభకర్ణుఁడే మరల వచ్చెనేమో యని వానరవీరులు పాఱిపోఁజొచ్చిరి. రాముఁడు వానరులకు ధైర్యముఁ గొలుపుచు విభీషణుని "ఈతఁ డెవఁ" డని యడిగెను. అతఁ డిట్లు చెప్పెను. "ఇతఁడు ధాన్యమాలిని కొడుకు. తపస్సునకు మెచ్చి బ్రహ్మదేవుఁడు వీనికి సురాసురుల వలన అవధ్యత్వమును దివ్యకవచమును భాస్కరప్రభమైన స్యందనమును ప్రసాదించెను. ఇతఁడు వరుణపాశమును ఇంద్రుని వజ్రాయుధమును కూడ ప్రతిహత మొనర్చెను. ఇతఁడు వానరుల నాశ మొనర్చులోపల వీనివధకై ప్రయత్నింపవలె."

ఇంతలో కుముదద్వివిదమైందనీలశరభు లాతనిపై నొక్కు మ్మడిగా పాదపశైలశృంగములను వైచిరి. అతఁడు వాని నన్నిం టిని ఛేదించి వారిని కాలాయసబాణములతో వేధించెను. వా రాతనిని మార్కొనఁజాలక యూరకుండిరి. అతఁడు మూకమీఁద బాణములను ప్రయోగింపక, తన్ను మార్కొననివానిజోలికి పోక, ఎదుర్కొనినవానిని మాత్రమే ప్రహరించుచు రాముని యొద్దకు పోయి, "నేను ప్రాకృతులతో యుద్ధము చేయను; సమర్థుఁడైనవాఁడే నన్ను మార్కొనును గాక" అని సింహగర్జ నము చేసెను. లక్ష్మణుఁడు క్రుద్ధుఁడై జ్యాఘోష మొనర్చెను. దానికి చకితుఁడై యతికాయుఁడు సౌమిత్రిని చూచి, "లక్ష్మణా! నీవు బాలుఁడవు; నీ కేల నాతో యుద్ధము? ప్రక్కకు తొలఁగి ప్రాణములు దక్కించుకొనుము" అనెను. లక్ష్మణుఁడు రోష ముతో; "నేను బాలుఁడ నైనను నీకు మృత్యువునే యగుదును; మాటలతో నేమి ప్రయోజనము? నీవిక్రమమును చూపుము" అనెను.

వారి కిరువురకును యుద్ధము ఘోరముగా జరిగెను. విద్యా ధరగుహ్యకాదులు ఆయుద్ధమును చూచుటకై ఆకాశమున సమా విష్టులైరి. లక్ష్మణుఁ డొకబాణమును అతికాయుని లలాటమున నాటెను. దానికి వాఁడు సోలి వెంటనే తేఱుకొని లక్ష్మణునిబల మును మెచ్చెను. అతికాయునిబాణవృష్టిని ఖండించి సౌమిత్రి ఆగ్నేయాస్త్రమును ప్రయోగింపఁగా, అతికాయుఁడు రౌద్రాస్త్రమును ప్రయోగించెను. రెండును అంతరిక్షమున కొంతసేపు పోరాడి పరస్పరప్రతిహతములై నేలఁగూలెను. అతికాయుఁడు ప్రయోగిం చిన యైషీకక మను నస్త్రమును లక్ష్మణుఁడు ఐంద్రాస్త్రమున వితథ మొనర్చెను. అతికాయునిబాణముల నెల్ల ఖండించి రామా

నుజుఁడు రావణాత్మజునిపై శరములను వర్షింపఁగా అవి యన్నియు వానివజ్రకవచమును భేదింపనేరక వ్యర్థము లయ్యెను. అతికాయుఁ డొకతీవ్రబాణమున సౌమిత్రివక్షమునఁ బ్రహరింపఁగా అతఁడు సోలిపోయి క్షణమాత్రమున తేఱుకొని అతికాయునిసారథిని రథాశ్వధ్వజములను కూల్చెను. కాని అతఁడు ఎంత ప్రయత్నించియు అతికాయునికవచమును భేదింపలేకుండెను. అప్పుడు వాయుదేవుఁడు సౌమిత్రియొద్దకు వచ్చి, "వీనికవచము అభేద్యము; వీనిని బ్రహ్మాస్త్రమున సంహరింపుము" అని యుపదేశించెను. వెంటనే లక్ష్మణుఁడు బ్రహ్మాస్త్రమున వానిశీర్షమును ఖండించెను.

పితృవాక్యపాలనమునందు అతికాయాదులవర్తనము రామునివిధేయతను సైతము మించి ప్రకాశించుచున్నది. దశరథుఁడు రావణునివలె దుర్మార్గుఁడు కాఁడు. ఆయన కేవలము కైకేయీలౌల్యమువలన రాముని అడవికి పంపలేదు. ప్రాణరక్షణమును పొంది ఆయన కైకేయికి వరము లిచ్చెను. ఆవరముల యొక్క ఋణమును తీర్చుకొనుటకై ఆయన రామునియరణ్యవాసము నంగీకరించెను. రాజ్య మిత్తు నని ఆశపెట్టి వెంటనే అరణ్యమునకు పొమ్మనుట దుఃఖదాయకమే యైనను లోకన్యాయవిరుద్ధము కాదు. తండ్రి చేసినయప్పులను కుమారుఁడు తీర్చుట ఆశ్చర్యకరము కాదు.

రావణునివిషయమున అతికాయాదులవిధేయత ఆశ్చర్యకరము. రావణునియందు చౌర్యము క్రౌర్యము స్త్రీలౌల్యము మొదలుగా పెక్కుదుర్గుణములు ప్రబలముగా నున్నవి. అతికాయాదులందు ఇన్నిదుర్గుణము లున్నట్లు ప్రస్తావింపఁబడలేదు. అతికాయునిగూర్చి అతఁడు తపస్వి యని, తన్ను ఎదిరింపని

వారిపై మూకమీఁద బాణప్రయోగము చేయఁ డని, ప్రాకృతు లతో పోరాడఁ డని వాల్మీకి ఉదాత్తముగ వర్ణించెను. ఇట్టి గుణ వంతులైన కుమారులు అంతగుణహీనుఁడైన తండ్రివిషయమున పరమవిధేయులుగా నుండి శరీరత్యాగమునకు సిద్ధపడుట సామాన్యవిషయము కాదు. శూర్పణఖావిషయమున పగతీర్చు కొనుటకు యుద్ధము చేయవలయు నని రావణుఁడు చెప్పి యున్నచో కుటుంబగౌరవదృష్టితో అది సమంజసము కావచ్చును. అది కారణ మైనచో రావణుఁడు సీతను దొంగిలింపవలసిన యక్కఱ లేదు. శూర్పణఖ జనస్థానమునుండి తిరిగివచ్చినంతనే రావణుఁడు యుద్ధమును ప్రకటించి యుండవచ్చును. అప్పు డందఱు యుద్ధమునకు సహజముగనే బయలుదేరి యుందురు. శూర్పణఖవలననే తప్పు జరిగిన దని అందఱు భావించుచుండుట వలన, రావణుఁడు యుద్ధమునకు కారణములను నిరూపించు సందర్భములలో శూర్పణఖావిషయమును ప్రస్తావింపనే లేదు. శూర్పణఖకు సంబంధించి జరిగిన ఖరాదులసంహారమును కూడ రావణుఁడు ప్రధానకారణముగా ప్రస్తావింప లేదు. అతఁడు సీతను ఎట్లైను తాను పొందవలయు ననుటయే మాటిమాటికి ప్రస్తావించెను. ఇది ఎంతో విడ్డూరమైనవిషయము. అతనికి అప్పటికి మండోదరి కాక వేయిమంది భార్య లున్నారు. రావణుఁడు సంహరింపఁబడినప్పుడు వేయిమందిసవతులతో కూడి వచ్చి మండోదరి వానిపైఁబడి విలపించిన దని రాముఁడు పుష్పకమున పోవునప్పుడు సీతకు చెప్పినాఁడు.

శ్లో॥ అత్ర మండోదరీ నామ భార్యా తం పర్యదేవయత్।
సపత్నీనాం సహస్రేణ సాగ్రేణ పరివారితా॥ 9

యుద్ధ-సర్గ-123

కావున రావణుఁడు వేయిమందికిపైన మఱియొక భార్యగా మహావీరునిభార్యయైన పతివ్రత తనకు కావలయు నని, ఆమెకొఱకు తాను కామజ్వరపీడితుఁడైనట్లు నిండుసభలో నిస్సంకోచముగా చెప్పుచున్నాఁడు. ఈపరస్త్రీభోగముకొఱకు అతఁడు రాక్షసుల నంద అను రామునితో యుద్ధము చేయుఁ డని కోరుచున్నాఁడు. దుర్గుణమూర్తియైన యిట్టి తండ్రియొక్క ఇంతనీచమైన కోరికకొఱకు అతికాయాదులు మాఱుమాటాడక యుద్ధమునకు సిద్ధపడుట వారి పితృవాక్యపరిపాలనత్వమునకు ప్రబలనిదర్శనముగా నున్నది. ఇంత విధేయులైన తనయులు తండ్రిహితమును కోరి, ఇది తగదని చెప్పనక్కఱ లేదా! విభీషణకుంభకర్ణాదులు గావించిన యుపదేశములయొక్క ఫలితమును చూచుచు అతనియిష్టమునకు విరుద్ధముగా మాటాడుటకు వారు ఇష్టపడలే దని గ్రహింపవచ్చును.

రాముఁడు కైకేయితో మాటాడునపుడు, "రాజుయొక్క మాట వలన నేను అగ్నియం దైనను దుముకుదును గదా" అని చెప్పెను.

శ్లో॥ అహం హి వచనా ద్రాజ్ఞః పతేయ మపి పావకే।

(అయోధ్యా-సర్గ-18-శ్లో-28).

అది పితృవచనపరిపాలనమునకు పరాకాష్ఠ. దానికి దృష్టాంతము అతికాయాదులవర్తనమునందు కన్పించుచున్నది. ప్రహస్తుఁడు సంహరింపఁబడి, రావణునకు మకుటభంగము జరిగి, కుంభకర్ణుఁడు కూడ వధింపఁబడినతరువాత అతికాయాదులు యుద్ధమునకు పోవుట అగ్నియందు దుముకుటతో సమానమే యగుచున్నది. అయినను వారు తండ్రియొక్క ప్రీతికొఱకు యుద్ధాగ్నియందు శల

భములవలె దూఁకిరి. వారు మారీచునివలె రావణునివలె యుద్ధమున వెనుకంజవేయ కుండుట గమనింపఁ దగియున్నది.

దీనినిబట్టి "మాతృదేవో భవ; పితృదేవో భవ" అను మొదలగు విధులు గుణాపేక్షములు కావని గ్రహింపవలసియున్నది. అనఁగా తల్లి తండ్రి మొదలగువారు గుణవంతులైనప్పుడే దేవతలుగా పూజింపఁ దగినవా రని, గుణహీను లైనప్పుడు పూజార్హులు కా రని తలంచుటకు వీలు లేదు. గుణహీను లైనను, రావణునివలె దుర్గుణమూర్తు లైనను, కుమారులకు భార్యలకు వారు పూజ్యులే యగుదు రని స్పష్ట మగుచున్నది. అట్లే వారివచనములు కూడ గుణదోషవిచారరహితముగానే ఆచరింపఁదగినవే యని గ్రహింపవలసియున్నది. తండ్రివచనమును కుమారులు చక్కఁగా విచారించి గుణదోషములు నిర్ణయించి, అది మంచిదైనచో ఆచరింపవలె నని, చెడ్డ దైనచో తిరస్కరింపవలయు నని చెప్పుట కుదురదు. మంచిచెడ్డలు పురుషబుద్ధికి అధీనములు. తండ్రియాదేశము ఒకనికి మంచిదిగా తోఁచుచుండఁగా, మఱియొకనికి హేయ మైనదిగా తోఁచవచ్చును. రాముఁ డరణ్యమునకు పోవలెయు నన్న దశరథునివచనము రామునిదృష్టిలో అవశ్యకర్తవ్యము కాఁగా, లక్ష్మణునిదృష్టికి అత్యంతహేయముగా కన్పించినది. ఇంక రావణుని యాదేశము అత్యంతము నికృష్ట మని నిస్సందేహముగా పైన నిరూపింపఁబడినది. అయినను "పితృదేవో భవ" అను వేదానుశాసనము ననుసరించి అతికాయాదులు తండ్రియొక్క గుణదోషములను గాని, ఆతనియాదేశముయొక్క ధర్మాధర్మాదులను గాని విచారింపక యుద్ధాగ్నియందు దూఁకి శరీరముల నర్పించిరి. కావున "పితృదేవో భవ" మొదలగు ననుశాసనములు సైనికశాసనమువలె (Military Command) అవశ్యాచరణీయములే కాని విచారణీయములు కావు.

## 8. బ్రహ్మాస్త్రవినిపాతనము

దేవాంతకాదులతో అతికాయుఁడు కూడ హతుఁ డయ్యె నని విని రావణుఁడు రోదన మొనర్చుచు మూర్ఛిల్లి తేఱుకొని యిట్లు విలపించెను. "మహాబలులు మహావీరులు నానాశస్త్రాస్త్ర కోవిదులు యుద్ధములందు పరాజయము నెఱుంగనివారును అయిన ధూమ్రాక్షుఁడు అకంపనుఁడు ప్రహస్తుఁడు కుంభకర్ణుఁడు మొదలుగా ఎందఱో రాక్షసశ్రేష్ఠులు రామలక్ష్మణులచే వానరవీరుల చేతను నిధనము నొందుచున్నారు. ప్రఖ్యాతబలపరాక్రముఁడైన నాపుత్త్రుఁడు ఇంద్రజిత్తు ప్రయోగించిన శరబంధనమునుండి రామలక్ష్మణులు ఎట్లు తప్పించుకొనిరో తెలియదు. యక్షకిన్నర గంధర్వవీరు లందఱును కూడినను దానిని భేదింపజాలరు. అట్టి బంధనమును వా రెట్లు తొలఁగించుకొనినారో తెలియకున్నది. నాశాసనమున యుద్ధమునకు పోయిన శూరు లెల్లరును నిహతులైనారు. ఎవనివిక్రమముచే కుంభకర్ణాదిరాక్షసశ్రేష్ఠులు నిధనమును పొందినారో ఆరాముఁడు నారాయణుఁడే యై యుండునని తోఁచుచున్నది. లక్ష్మణసహితుఁడైన రాముని ఇప్పుడు ప్రతిఘటింపఁగలవాఁ డెవఁడును కన్పించుట లేదు."

పిమ్మట రావణుఁడు భటులను చూచి, "నగరద్వారములను అశోకవనమును మిగుల జాగరూకులై రక్షించుచుండుఁడు; ఋక్షవానరులనుగూర్చి తక్కువగా తలంప వలదు; వారిచర్యల నన్నింటిని ఎప్పటికప్పుడు కనిపెట్టుచుండుఁడు" అని యాజ్ఞాపించి దీనుఁడై సభాభవనమున ప్రవేశించెను.

శ్లో॥ అహో ను బలవాన్ రామో మహ దస్త్రబలం చ వై।
యస్య విక్రమ మాసాద్య రాక్షసా నిధనం గతాః॥ 10½

శ్లో॥ తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్।
తద్భయా ద్ధి పురీ లంకా పిహితద్వారతోరణా॥ 11½

శ్లో॥ అప్రమత్తైశ్చ సర్వత్ర గుప్తై రక్ష్యా పురీ త్వియమ్। 12

యుద్ధ-సర్గ-72

రాముఁడు నారాయణుఁడై యుండు నని రావణుఁడు బావించినంతమాత్రమున అతఁడు తత్త్వజ్ఞుఁ డని విష్ణువుచేత మరణమును పొందవలయు ననుతలంపుతో సీతను హరించి తెచ్చె నని యూహించుటకు వీలు లేదు. అట్టితలంపే అతని కున్నచో శూర్పణఖాపరిభవము ఖరాదులవధ జరిగినంతనే రామునితో యుద్ధము చేసి ఖరాదులవలె మరణించి యుండెడివాఁడు; లంకాయుద్ధమునం దైనను మకుటభంగము జరిగినప్పుడు రాముని యనుమతితో అవమానభారముతో అతఁడు తిరిగివచ్చియుండఁడు; కుంభకర్ణునివలె యుద్ధమును వీడక హతుఁడై యుండెడి వాఁడు. అందువలన రాక్షసనంహారమునందు ప్రసిద్ధుఁడైన నారాయణుఁడే రాముఁడుగా అవతరించె నేమో యను భయము తప్ప అతనికి తత్త్వజ్ఞత గాని వీరోచితముగా విష్ణువవలన మరణమును పొందవలయు నని తలంపు గాని లేవు. అట్టి తలంపు అతని కున్నచో కుంభకర్ణాదులను తనకు మాఱుగా యుద్ధరంగమునకు పంపి బలి పెట్టవలసిన పని లేదు.

రావణుఁడు పుత్రసోదరాదులమరణముచే వ్యధితుఁడై దుఃఖించుచుండఁగా ఇంద్రజిత్తు వచ్చి తండ్రిని ఓదార్చుచు ఇట్లనెను. "తండ్రీ! నే నుండఁగా నీవు పరితపించు టెందులకు? నే నిప్పుడే పోయి శత్రువులను సంహరించివత్తును". రావణుఁడు కుమారు నాశీర్వదించి పంపెను. ఇంద్రజిత్తు సేనాపరివృతుఁడై రణరంగమునకు వచ్చెను.

ఇంద్రజిత్తు యుద్ధరంగమున శత్రువులకు దూరముగా ఒక చోట తనరథముచుట్టును సైనికుల నిలువఁబెట్టి వేదికను నిర్మించి, అందు అగ్నిని ప్రతిష్ఠించి, దానికి నాల్గువైపుల కుశపత్రములను పఱచి తోమరముల నుంచెను. అతఁడు ఎఱ్ఱనివస్త్రములు ధరించి ఇనుపస్రువములతో తాండ్రనమిధలతో అగ్నిని జ్వలింపఁజేసి నల్లనిమేకను సజీవముగా ఆహుతి నొసంగెను. ఆ యొక్క ఆహుతితో అగ్నిహెూత్రుఁడు ప్రజ్వలించి విజయమును సూచించెను. పిదప నతఁడు బ్రహ్మాస్త్రమును ఆవాహన మొనర్చి రథము ధనుస్సు మొదలగుసాధనముల నెల్ల అభిమంత్రించెను.

పిదప ఇంద్రజిత్తు సైన్యపరివృతుఁడై ముందునకు పోయి వానరసేనలపై దాడిచేసెను. సంకులసమరము ఆరంభమయ్యెను. నలనీలగజగవయగవాక్షాదుల నందఱను అతఁడు అదృశ్యుఁడై నిశితమార్గణములచేత సొమ్మసిల్లఁజేసెను. సైన్యమంతయు వ్యథిత మయ్యెను. రాముఁడు వానియద్భుతమైన పరాక్రమమును చూచి లక్ష్మణునితో "ఇతఁడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించుచున్నాఁడు; అదృశ్యుఁడైయున్నవీనిని ప్రతిఘటించుట శక్యము కాదు; కావున నాతోఁబాటు నీవుకూడ ఈయస్త్రపాతమును సహింపుము; మనము వ్రాలినంతనే యితఁడు యుద్ధజయము గైకొని వెడలిపోవును" అని చెప్పుచు బాణపీడితుఁడై లక్ష్మణునితోఁ గూడ సోలి వ్రాలెను. అది చూచి ఇంద్రజిత్తు ప్రహృష్టుఁడై తండ్రియొద్దకు పోయి జయమును నివేదించెను.

అతికాయుఁడు మరణించునప్పటికి మధ్యాహ్నమై యుండును. ఇంద్రజిత్తు అపరాహ్ణమున దాడిచేసి సుమారు రెండున్నరగంటలలో అఱువదియేడుకోట్లమంది వానరులను హతులఁ గావించెను.

శ్లో॥ సప్తషష్టి ర్హతాః కోట్యో వానరాణాం తరస్వినామ్।
అహ్ణః పంచమశేషేణ వల్లభేన స్వయంభువః॥ 12
యుద్ధ-సర్గ-74

ఇంతలో చీఁకటిపడెను. రణరంగ మంతయు స్మశాన సదృశమై నిశ్శబ్దమై భయంకరముగా నుండెను. హతులైనవారితో మూర్ఛితులైనవారితోఁబాటు బ్రతికియున్నవారు భయముచేత అక్కడక్కడ ఒదిగి పడియుండిరి. చీఁకటిలో ఎవరు ఎక్కడ పడియున్నారో తెలియుట లేదు. బ్రహ్మయిచ్చినవరమువలన విభీషణుఁడు ఆంజనేయుఁడు అస్త్రప్రభావమునకు లోను కాలేదు. విభీషణుఁడు వానరవీరుల నుద్దేశించి యుచ్చస్వరమున, "వీరులారా! భయపడకుఁడు; దుఃఖింపవలసినది భయపడవలసినదియు ఏదియును లేదు; రామలక్ష్మణులు బ్రహ్మదేవుని మన్నించి అస్త్రప్రభావమునకు లోఁబడియున్నారు; వారు త్వరలోనే తేఱుకొనఁగలరు; మన కేమియు భయము లేదు" అని యుద్ఘోషించెను. బ్రహ్మాస్త్రమును మన్నించి దానిని ప్రతిఘటింపక మిన్నకున్న యాంజనేయుఁడు ఆమాట విని విభీషణునియొద్దకు పోయి యిట్లనెను. "అయ్యా! ఈయస్త్రఘాతమున ఇంకను సజీవులై యున్న వారిని పరిశీలించి వారికి ఓదార్పును కలిగింతము" అనెను. విభీషణుఁడు అంగీకరించెను.

రామలక్ష్మణులు బ్రహ్మాస్త్రము నెఱింగినవారే! మఱి వారేల సోలిపోయిరి? ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమును ఏయొక్కనిపై ప్రయోగింపలేదు. ఆ యస్త్రముచు ప్రజ్వలింపఁజేసి యతఁడు దానివలన శరములను వర్షించి కోట్లకొలఁదిమందిని హతులను గావించెను. తమపై ప్రత్యేకముగా ప్రయోగింపకుండుటచే రాముఁడుగాని లక్ష్మణుఁడు గాని దానిపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించుటకు వీలు లేకుండెను. అది యమోఘము. దానిపై నిత

రాస్త్రము లేవియు పనిచేయవు. అట్లు ప్రతిఘటించినచో అవి తప్పక సంహరించును. దానిపై మరల బ్రహ్మాస్త్రమునే ప్రయోగించుటకు వీలు కానప్పుడు దానిని ప్రతిఘటింపక మన్నించి యూరకుండుటయే దానినుండి తప్పించుకొనుటకు మార్గము. అందువలన లక్ష్మణుఁడు దానిని ప్రతిఘటించునేమో యని రాముఁడు జాగరూకతతో దానిని సహింపు మని హెచ్చరించెను. ఆయస్త్రఘాతమున ప్రాకృతులు మరణించినను, అస్త్రవేత్తలు మరణింపకున్నను మూర్ఛిల్లుదురు. ఆంజనేయుఁడు విభీషణుఁడు సాక్షాత్తుగా పరమేష్ఠివలన ఆయనయొక్క యస్త్రమువలన బాధ కూడ లేకుండ వరమును పొందియుండిరి. అందువలన వారు స్వస్థతను కోల్పోక కుశలులై యుండిరి. రామలక్ష్మణులకు అస్త్రమంత్రము తెలిసియున్నను అట్టివరము లేదు. అందువలన వారు సోలి వ్రాలక తప్పలేదు. రామలక్ష్మణులపై నేరుగా బ్రహ్మాస్త్రమును ప్రయోగించినచో వారు దానిపై ఆయస్త్రమునే ప్రయోగించి వ్యర్థ మొనరింతు రని ఇంద్రజిత్తు ఆలోచించి వారిపై ప్రయోగింపక సమష్టిగా సైన్యముపై ఆయస్త్రప్రభావమున శరవృష్టి కలుగునట్లు చేసెను. దీనివలన అస్త్రవేత్తలు మఱికొందఱు మహాబలులు బ్రతికినను కోట్లకొలఁదిగా సైన్యము నశించి పెక్కురు వీరులు హతులైరి. మిగిలనవారిని తరువాత సులభముగా నిర్మూలింపవచ్చు నని యింద్రజిత్తు తలంచెను.

విభీషణాంజనేయులు ఉల్కలను గైకొని చీఁకటిలో గుట్టలుగా పడియున్న సామాన్యఋక్షవానరులఁ జూచుచు సుగ్రీవాంగదశరభాదులైనమహావీరులు అక్కడక్కడ సోలి వ్రాలియుండుటను గమనించిరి. అట్లు వెదకుచు వారు ఒకచోట సహజమైన వృద్ధత్వముచేత, సర్వగాత్రశరవిద్ధత్వముచేత శమించుచున్న

పావకునివలె నున్న జాంబవంతుని గాంచిరి. విభీషణుఁ డాత నిని సమీపించి, "ఆర్యా! ఋక్షవల్లభా! నిశితశరపాతమున నీ ప్రాణములకు ముప్పు రాలేదు కదా?" అని యడిగెను. జాంబ వంతుఁడు ప్రయత్నముతో కంఠమును పెగల్చుకొని. "నాయనా! స్వరమునుబట్టి నిన్ను విభీషణునిగా తలంచుచున్నాను. కన్ను తెఱచుటకు కూడ శక్తి లేకున్నది. అంజనామాతరిశ్వలపంటయైన హనుమంతుఁడు సజీవుఁడై యున్నాఁడా?" అని యడిగెను. విభీష ణుఁడు విస్మితుఁడై, "అయ్యా! నీవు రామలక్ష్మణులను సుగ్రీవుని తలంపక మారుతియం దింత స్నేహమును చూపుచున్నా వేమి?" అని యడిగెను. జాంబవంతుఁడు, "రాక్షసేశ్వరా! హనుమం తుఁడు జీవించియున్నచో చచ్చినవా రందఱు బ్రతికినట్లే; అతఁడు పోయినచో బ్రతికియున్నవారు కూడ చచ్చినట్లే యగును; మారుత సమానుఁడైన మారుతి బ్రతికియుండె నేమో చెప్పుము; అట్లయి నచో ఎల్లరు జీవించుటకు అవకాశము కలదు" అని చెప్పెను. అప్పుడు ఆంజనేయుఁడు ముందుకు వచ్చి తనపేరు చెప్పుకొని జాంబవంతునిపాదములకు ప్రణమిల్లఁగా జాంబవంతుఁ డిట్లనెను. "నాయనా! ఆంజనేయా! చిరంజీవి వగుము. రమ్ము. నీవే యిప్పుడు వానరులను రక్షింపఁగలవు. నీవంటి విక్రమశాలి మఱియొకఁడు లేఁడు. ఇది నీవిక్రమము నంతను ప్రకటింపవలసినకాలము. లెమ్ము; హిమవంతమునకు పొమ్ము. అచ్చట కైలాసశిఖరము నకు ఋషభపర్వతమునకు నడుమ ఓషధిపర్వతము కలదు. దానిశిఖరమున మృతసంజీవని, విశల్యకరణి; సువర్ణకరణి, సంధానకరణి యనునోషధులు కలవు. వానిని గైకొనివచ్చి వీరి నందఱను బ్రతికింపుము."

వెంటనే హనుమంతుఁడు మలయపర్వతముపై నెక్కి పర్వతాకారమున దేహమును పెంచి సాగరమునకు నమస్కరించి వాయువేగమును అతిక్రమించి భానుపథమున ఓషధిపర్వతమును చేరెను. దివ్యములైనయా యోషధులు ఆంజనేయుని చూచినంతనే, అతఁడు తమ్ము పెకలించికొని పోవు నని, అంతరానమునొందెను. ఆంజనేయుఁడు క్రుద్ధుఁడై ఆపర్వతశృంగమును పెకలించి లంకకు తెచ్చెను. ఆ యోషధులగాలి సోఁకినంతనే రామాదులు స్వాస్థ్యము నొందుటయే గాక, యుద్ధారంభమునుండి అప్పటివఱకును మృతులై పడియున్నఋక్షవానరు లందఱును జీవించిరి. ఆంజనేయుఁడు ఋక్షవానరవల్లభులకు నమస్కరించి విభీషణుని కౌఁగిలించుకొనెను.

చచ్చినవానరు లందఱు జీవించినను, మృతుఁడైన యొక్క రాక్షసుఁడైనను బ్రతుక లేదు. యుద్ధ మారంభ మైనప్పుడు రాక్షసులు గుట్టలుగా చచ్చిపడియుండుట తనకు మానభంగకరమని రావణుఁడు ప్రతిదినము చచ్చిపోయిన రాక్షసుల నందఱను సముద్రములో వేయుచుండుఁ డని యాజ్ఞాపించెను. అందువలన ఓషధిప్రభావమున రాక్షసులు బ్రతుక లేదు.

శ్లో॥ యదాప్రభృతి లంకాయాం యుధ్యన్తే హరిరాక్షసాః!
తదాప్రభృతి మానార్థ మాజ్ఞయా రావణస్య చ॥ 71

శ్లో॥ యే హన్యన్తే రణే తత్ర రాక్షసాః కపికుంజరైః।
హతాహతా స్తు క్షిప్యన్తే సర్వ ఏవ తు సాగరే॥ 72

యుద్ధ-సర్గ-74

ఋక్షవానరు లందఱును జీవించినంతనే హనుమంతుఁడు మరల ఆశృంగమును యథాస్థానమున నుంచివచ్చెను.

# 9. కుంభనికుంభాదులవధ

మృతులైనవా రందఱు బ్రతుకుటచే వానరబల మంతయు మిగులకోలాహలముతో నుండెను. లంకలోనివారు వానరుల కోలాహలమును విని నిర్విణ్ణులై మహాభీతితో వెలుపలికి రాకుండిరి. అప్పుడు సుగ్రీవుఁడు హనుమంతునితో నిట్లనెను. "కుంభకర్ణుఁడు కుమారులు నిహతులైనా రని రావణుఁడు నిర్విణ్ణుఁడై మనకు బలిగా ఎవరిని పంపుట లేదు. వానికి మనము విరామము ఒసంగుట తగదు. కావున బలశాలులు లాఘవముకలవారును బయలుదేరి ఉల్కాహస్తులై నలువైపుల చుట్టుముట్టి లంకను నిర్దహింపుఁడు" అని యాజ్ఞాపించెను. వెంటనే మంటలుమియుచున్న కొఱవులను గైకొని ఋక్షవానరవీరులు లంకపైకి పోయి ద్వారములను గోపురములను సౌధములను దహింపఁజొచ్చిరి. లంకావాసులహాహాకారములు సముద్రఘోషమును మించెను. రాముఁడు విల్లు ఎక్కుపెట్టి గోపురమును కూల్చెను. "మీదాపున ఏద్వార మున్నచో అద్వారముపైకి పోయి యుద్ధమొనరింపుఁడు; మీలో ఎవరైన వెనుదిరిగినచో వాని నప్పుడే సంహరింపుఁడు" అని రాముఁ డాజ్ఞాపించెను. వెంటనే భయంకరమైన సంకులసమరము ఆరంభ మయ్యెను:

రావణుఁడు క్రోధమున నిట్టూర్చుచు కుంభకర్ణుని పుత్త్రులను కుంభనికుంభులను, వారికి రక్షకులుగా యూపాక్ష శోణితాక్ష ప్రజంఘకంపనులను ఋక్షవానరుల తఱిమివేయుఁ డని పంపెను. వారు తమయాభరణకాంతులచేత చీఁకటిని చీల్చుచు ఋక్షవానరులను మార్కొని తఱిమివేయఁజొచ్చిరి. నగరముపైకివచ్చినవానరులును కొఱవులను పారవైచి యొక్కయంగలో తమస్థానములకు తిరిగివచ్చిరి.

రాక్షసులు వానరులను తఱుముచు రణరంగమునకు వచ్చిరి. అచ్చట కంపనుఁడు అంగదుని మార్కొని యంతము నొందెను. శోణితాక్షుఁడు అంగదుని శరములతో ముంచెను. అంగదుఁడు ఒకవృక్షముతో వానిధనుర్బాణరథములను మర్దించెను. శోణితాక్షుఁడు కత్తిని చర్మమును గైకొని పైకి రాఁగా అంగదుఁడు ప్రక్కకు దూఁకి వానిచేతినుండి ఖడ్గమును లాగికొని దానితో యజ్ఞోపవీతమార్గమున వాని శరీరమును చీల్చెను; అయినను వాఁడు చావలేదు. వానిని తప్పించి ప్రజంఘయూపాక్షులు అంగదు నెదుర్కొనిరి. అది చూచి మైందద్వివిదులు అంగదునకు తోడుగా వచ్చిరి. అంగదుఁడు ప్రజంఘుని ముష్టిఘాతమున కూల్చెను. యూపాక్షుని ద్వివిదుఁడు బాహువులయందు బంధించెను. అది చూచి శోణితాక్షుఁడు ద్వివిదుని ప్రహరించెను. ద్వివిదుఁడు సొమ్మసిల్లి తేఱుకొని శోణితాక్షుఁడెత్తినగదను లాగుకొనెను. ద్వివిదుని సమీపించుచున్నయూపాక్షుని మైందుఁడు అఱచేతితో చఱచెను. ద్వివిదుఁడు శోణితాక్షుని గోళ్లతో చీల్చి నేలకు విసరికొట్టి పిండి చేసెను. మైందుఁడు యూపాక్షుని బాహువులమధ్య నదిమి సంహరించెను.

అది చూచి కుంభుఁడు నిశితశరమున ద్వివిదుని ప్రహరింపఁగా నతఁడు మూర్ఛిల్లెను. సోదరుఁ డట్లగుటఁ జూచి మైందుఁడు పెద్దశిలను వానిపై వైచెను. కుంభుఁడు దానిని భేదించి యొకబాణమున మైందుని ప్రహరింపఁగా నతఁడు మూర్ఛిల్లెను. మేనమామ లిద్దఱు సోలుట చూచి అంగదుఁడు కుంభునిపై శిలాపాదపములను వర్షించెను. వాని నన్నింటిని కుంభుఁడు ఛేదించి

ఏడు మార్గణములతో అంగదుని ప్రహరించెను. అంగదుఁడు ఆ బాణఘాతమునకు సోలి నేల వ్రాలెను.

రాముఁ డిది విని కుంభాదులను మార్కొనుటకు జాంబవదాదులను పంపెను. జాంబవత్సుషేణవేగదర్శులు ద్రుమశిలా హస్తులై వచ్చుచుండుటను చూచి కుంభుఁడు శరవర్షమున వారి రాకను అరికట్టెను. వారు ముందుకు పోలేకపోయిరి. కుంభుని ప్రతి ఘటించుటకు మూర్ఛనుండితేఱుకొన్న యంగదుఁడు ముందునకు రాఁగా, సుగ్రీవుఁడు వానిని గడచి ముందునకు పోయి కుంభునిపై వృక్షములను వర్షించెను.వాని నన్నింటిని వాఁడు ఛేదించి శరపరంపరలతో సుగ్రీవుని నిలువరించెను. సుగ్రీవుఁడు ఆబాణపాతమును సహించుచు తలవంచి, వర్షమునందు వృషభమువలె, కుంభునిపైకి పోయి వానివిల్లు విఱిచి యిట్లనెను. "బ్రహ్మదేవునివరములచేత మీపెదతండ్రి రావణుఁడు దేవతలను జయించెను. మీతండ్రి కుంభకర్ణుఁడు సహజమైనపరాక్రమముచేతనే దేవదానవులను మించెను. నీవు శరప్రహారమునందు ఇంద్రజిత్తుతో పరాక్రమమునందు రావణునకు తుల్యుఁడవు. నీ విప్పుడు రాక్షసులలో శ్రేష్ఠుఁడవు. అద్భుతమైన యుద్ధ మొనర్చి నీవు పరిశ్రాంతుఁడ వైతివి. కొంచెము విశ్రాంతిని పొందుము. పిదప నాబలమును తెలిసికొనఁగలవు." ఆమాటలకు కుంభుఁడు మండిపడి సుగ్రీవునితో మల్లయుద్ధమునకు దిగెను. సుగ్రీవుఁడు వానిని పైకెత్తి సముద్రములోనికి విసరెను. వాఁడు సముద్రములో పడి అక్కడినుండి లేచి పైకెగిరి వచ్చి సుగ్రీవునివక్షమున పిడికిటితో పొడిచెను. సుగ్రీవుఁడు వజ్రతుల్యమైన ముష్టితో ప్రహరించి వాని నంత మొందించెను.

కుంభునిగతిని చూచి నికుంభుఁడు క్రుద్ధుఁడై పరిఘమును గైకొని సుగ్రీవునిపైకి వచ్చుచుండఁగా మధ్యలో హనుమంతుఁడు వానిని మార్కొనెను. వాఁడు దానిని హనుమంతునివక్షమున విసరెను. అది యాయనవక్షమును దాఁకి విశీర్ణమయ్యెను. ఆంజనేయుఁడు వానిని పిడికిటితో పొడువఁగా వాఁడు విచలితుఁడై తేఱుకొని హనుమంతుని బాహువులమధ్య బంధించి నగరాభిముఖముగా తీసికొనిపోఁజొచ్చెను. హనుమంతుఁడు విజృంభించి వానిని ముష్టితో ప్రహరించి బంధనమునుండి తప్పించుకొని వానిని నేలపైఁ బడఁగొట్టి మథించి మెడ నులిచి తల పెకలించి రాక్షససైన్యములోనికి విసరివైచెను.

కుంభాదులవధను విని రావణుఁడు ఖరునిపుత్రుఁడైన మకరాక్షుని యుద్ధమునకు పంపెను. వాఁడు శూరమాని. సైన్యపరివృతుఁడై బయలుదేరుచు వాఁడు అనుచరులను చూచి, "మీరందఱు ముందుపోయి వానరులను సంహరింపుఁడు; నేను వచ్చి రామలక్ష్మణసుగ్రీవుల వధింతును" అని చెప్పెను. రాక్షసులు ఋక్షవానరులను మార్కొనిరి. మకరాక్షుఁడు శరవర్షమున వానరుల ముంచుచుండఁగా రాక్షసులు విజృంభించి ముందునకు రాఁదొడంగిరి. రాముఁడు బాణవర్షమున రాక్షసులను వారించి మకరాక్షునిశరపరంపరులను ఖండించెను. మకరాక్షుఁడు క్రోధతామ్రాక్షుఁడై రాముని చూచి, "నాతండ్రిని చంపిననిన్ను ఇప్పటికి చూడఁగలిగితిని; ద్వంద్వయుద్ధమున నిన్ను సంహరించి పగఁదీర్చుకొందును" అనెను. రాముఁడు నవ్వి, "మకరాక్షా! మీ తండ్రి పదునాలుగువేలమందితో పంచవటిలోనిగ్రద్దలకు మంచి భోజన మయ్యెను; నీవును అట్లే కాఁగలవు; మాటలతో పని యేమి? శక్తిని చూపుము" అనెను. మకరాక్షుఁడు విజృంభించి

రాముని శరపరంపరలతో ముంచెను. రాముఁడు వానిశరములను ఖండించి వానిసూతుని అశ్వములను రథమును కూల్చెను. మకరాక్షుఁడు రథమునుండి దూఁకి రామునిపై శూలమును విసరెను. రాముఁడు దానిని నిశితసాయకమున ఛేదించెను. వాఁడు నిరాయుధుఁడై పిడికిలి బిగించి పైకి వచ్చుచుండఁగా రాముఁడు ఆగ్నేయాస్త్రమున వానిని గూల్చెను.

## 10. మాయామైథిలీవధ

మకరాక్షునివధను విని రావణుఁడు నిర్విణ్ణుఁడై మరల ఇంద్రజిత్తును ప్రోత్సహించి యుద్ధమునకు పంపెను. అతఁడు వెనుకటివలెనే అభిచారికహోమ మొనర్చి రథసహితముగా అంతర్ధానము నొంది వానరులను రామలక్ష్మణులను అంతరిక్షమునుండి శరములను వర్షించుచు పీడింపఁదొడఁగెను. లక్ష్మణుఁడు క్రుద్ధుఁడై సర్వరాక్షససంహారమునకై బ్రహ్మాస్త్రమును ప్రయోగింతు ననెను. రాముఁడు, "ఒక్కనికొఱకు రాక్షసుల నందఱను చంపుట పాడి గాదు; యుద్ధము చేయకున్నవాఁడు, ప్రచ్ఛన్నుఁడు, ప్రాంజలిచేసినవాఁడు, శరణాగతుఁడు, పలాయమానుఁడు, మత్తుఁడు వధార్హులు గారు; అయినను ఇతరమహాస్త్రములతో వీనిని సంహరింప యత్నింపుము" అని చెప్పెను.

శ్లో॥ లక్ష్మణ స్తు సుసంక్రుద్ధో భ్రాతరం వాక్య మబ్రవీత్।
బ్రాహ్మ మస్త్రం ప్రయోక్ష్యామి వధార్థం సర్వరక్షసామ్॥ 37

శ్లో॥ త మువాచ తతో రామో లక్ష్మణం శుభలక్షణమ్।
నైకస్య హేతో రక్షాంసి పృథివ్యాం హంతు మర్హసి॥ 38

శ్లో॥ అయుధ్యమానం ప్రచ్ఛన్నం ప్రాంజలిం శరణాగతమ్।
పలాయన్తం ప్రమత్తం వా న త్వం హన్తు మిహార్హసి॥ 39

శ్లో॥ అస్యైవ తు వధే యత్నం కరిష్యావో మహాబల।
ఆదేక్ష్యావో మహావేగా నస్త్రా నాశీవిషోపమాన్॥ 41
యుద్ధ-సర్గ-80

ప్రచ్ఛన్నుఁడు పలాయమానుఁడు మొదలగువారు వధ్యులు కా రని రాముఁడు చెప్పిన నియమము, యుద్ధము ప్రకటింపఁబడి బ్రహ్మాస్త్రాదులతో సమరము జరుగుచున్నప్పుడు వీరులు పాటింపఁదగినధర్మమే, కాని క్రూరమృగములవంటి హంతకులు బందిపోటుదొంగలు మొదలగువారివిషయమున పాటింపఁదగినది కాదు. అట్టివారివిషయమున వాలివధసందర్భమునందువలె, క్రూరమృగములను వేటాడినట్లు, ఎప్పుడు ఎట్లు వీలైనచో అప్పుడట్లు సంహరించుటయే ధర్మము. ఇంటిలో కన్నములోనికి దూరి పాము దాగియున్న దని తెలిసినప్పుడు దాని నెట్లైనను వెలుపలికి వచ్చునట్లు చేసి సంహరించుట ఎట్లు ఆవశ్యకమో అట్లే ఇండ్లు తగులఁబెట్టి హత్యలు చేసి స్త్రీలను భంగపఱచి పాఱిపోయి దాఁగియుండువారిని కూడ వారి రహస్యస్థావరములపై దాడిచేసి వారు ఎట్లు చిక్కినచో అట్లే హతమొనర్పవలె. ఈ ధర్మమును రాముఁడే ఖరునితో ప్రసంగించునప్పుడు స్పష్టము చేసెను. "నృశంసుఁడై పాపకర్మలను చేయుచు భూతములకు ఉద్వేగమును కలిగించునట్టివాఁడు త్రిలోకపాలకుఁ డయ్యును నిలువఁజాలఁడు. లోకవిరుద్ధములైన కార్యములను జేయువానిని భయంకరమైన దుష్టసర్పమునువలె ప్రతివాఁడును చంపును."

శ్లో॥ ఉద్వేజనీయో భూతానాం నృశంసః పాపకర్మకృత్!
త్రయాణా మపి లోకానా మీశ్వరో౽పి న తిష్ఠతి॥ 3
శ్లో॥ కర్మ లోకవిరుద్ధం తు కుర్వాణం క్షణదాచర।
తీక్ష్ణం సర్వజనో హన్తి సర్పం దుష్ట మి వాగతమ్॥ 4
అరణ్య-సర్గ-29

రావణుఁడు ఇంద్రజిత్తు ఖరాదులవంటివారే. రావణుఁడు విరథుఁడై చిక్కినప్పుడు రాముఁడు చంపకుండుటకు కొన్నిహేతువులు కలవు. రావణుఁడు తప్పించుకొని మూఁడులోకములలో ఎక్కడికి పోయినను అస్త్రములను పంపి సంహరింపఁగలనను నాత్మవిశ్వాసము మొదటి హేతువు. రావణుని అప్పుడే సంహరించినచో, వానికి అనుచరులై వానివలెనే వధ్యులైన ఇంద్రజిత్తు మొదలగువారు తప్పించుకొనిపోవుటయో శరణాగతు లగుటయో సంభవించినచో, వారు గూఢశత్రువులుగా మిగిలియున్నచో, శత్రుశేషము మిగిలియుండు ననుట రెండవకారణము. అందువలన రాముఁడు రావణుని వదలిపెట్టెను. ఇది ఎల్లరకు ఆదర్శమగుటకు వీలు లేదు. కావున బందిపోటుదొంగలవలె మనదేశముపై దాడిచేసి దోచుకొని ప్రజలను హింసించిన మ్లేచ్ఛులు చిక్కినప్పుడు వారిని భారతీయప్రభువులు క్షమించి విడిచిపెట్టుట పామును తన్ని విడిచిపెట్టుటవలె, భయంకరమైన ధర్మద్రోహమని గ్రహింపవలసియున్నది.

రామలక్ష్మణులసంభాషణమును విని యింద్రజిత్తు బ్రహ్మాస్త్రప్రయోగమును విరమించి పురములోనికి వచ్చి ఆలోచింపఁదొడఁగెను. బ్రహ్మాస్త్రప్రభావము కూడ పరిమితమే. దానిప్రభావము ముగిసినతరువాత వెంటనే మరల దానిని ప్రయోగింపరాదు. దానిప్రభావము ముగిసినతరువాత తాను ఇంకను యుద్ధరంగమున అదృశ్యుఁడై యున్నచో రాముఁడు గాని లక్ష్మణుఁడు గాని తనధనుష్టంకారము నుద్దేశించి శబ్దవేధివిద్యతో నారాయణాస్త్రాదులను ప్రయోగించి తన్ను సంహరింపవచ్చును. అందువలన ఇంద్రజిత్తు రణరంగమును వీడి వచ్చెను. కాని యుద్ధ[illegible] సంహరింపఁబడినయసంఖ్యాకులైన రాక్షసమహావీరు

లను తలంచుకొన్నప్పుడు ఆతనిరక్తము ఉడుకఁజొచ్చెను. ఎట్లైనను రాక్షసవీరవధకు ప్రతీకారమును గావింపవలయు నని యతఁడు నిశ్చయించుకొని అందులకు ఉపాయమును ఆలోచించెను.

ఒకపథకము స్ఫురించినంతనే ఇంద్రజిత్తు సేనాసమేతుఁడై పశ్చిమద్వారమున వెలువడెను. రాక్షసులు వానరులపై దాడిచేసిరి. అచ్చట వానరసైన్యమునకు అధిపతియై ఆద్వారమును నిరోధించుచున్న ఆంజనేయుఁడు చూచుచుండఁగా ఇంద్రజిత్తు రథముపై మాయాసీతను గైకొనివచ్చెను. దీనురాలై విలపించుచున్నయామెను చూచి ఆంజనేయుఁడు దుఃఖితుఁడై, "వీఁడు ఈమెను ఏమి చేయఁదలఁచున్నాఁడో?" అని యుద్వేగముతో వానిపైకి సైన్యసహితుఁడై పరుగెత్తెను. వచ్చుచున్న వానరబలమును ఆంజనేయుని చూచి ఇంద్రజిత్తు క్రుద్ధుఁడై యొరనుండి ఖడ్గమును తీసి జుట్టుపట్టుకొని సీతను కొట్టఁజొచ్చెను. ఆమె, "రామా! రామా!" అని విలపింపఁజొచ్చెను. తాము ముందుకు పోయి దాడిచేసినచో వాఁడు అమెను ఏమి చేయునో యని వానరులు ఆంజనేయుఁడును నిలిచిపోయిరి. ఆమె దుస్థితిని చూచి ఆంజనేయుఁడు దీనుఁడై కనుల నీరు కారుచుండఁగా క్రుద్ధుఁడై ఇంద్రజిత్తును నిందింపఁజొచ్చెను. "ఓరీ! దురాత్ముఁడా! బ్రహ్మర్షుల కులమునందు పుట్టి రాక్షసలక్షణమును పూని పతివ్రతను జుట్టుపట్టుకొని తాడింతువా? వినాశకాలము దాపురించియే నీకు ఈ బుద్ధిపుట్టినది. ఓరీ! క్షుద్రుఁడా? నృశంసుఁడా! నీకు జాలి రవంతయైన లేదా? రాజ్యమునకు గృహమునకు భర్తకు కూడ దూరమై పరితపించుచున్న యీదీనురాలు నీకు ఏమి యపకారము చేసినది? ఎందుల కీమెను ఇట్లు బాధించుచున్నావు? నీవు ఈమెను హతమొనర్చి చిరకాలము జీవింపవు."

ఇట్లు చెప్పుచు అంజనేయుఁడు "ఏమైన నగుఁగాక" అని సైన్యముతో దాడిచేయుటకే పూనుకొనెను. ఇంద్రజిత్తు వారి నంద అను వేలకొలఁది బాణములతో నిలువరించి దీనుఁడైయున్న యాంజనేయుని చూచి రోషముతో ఇట్లనెను. "సుగ్రీవుఁడు నీవు రాముఁడును ఎవతెకోఱకై వచ్చి యిచ్చట మాకు ఇంత వినాశమును కలిగించినారో అయీ సీతను నీవు చూచుచుండఁగానే వధింతును; పిమ్మట రామలక్ష్మణులను సుగ్రీవుని నిన్ను అనార్యుఁడైనయా విభీషణుని సంహరింతును. స్త్రీలను వధింపరా దని నీవు చెప్పినమాట నిజమే. అయినను శత్రువులకు ఏది పీడాకరమో అది కర్తవ్యమే యగును." ఇట్లు చెప్పుచు ఇంద్రజిత్తు విలపించుచున్నయాసీతను ఖడ్గముతో యజ్ఞోపవీతమార్గమున చీల్చెను. ఆమె హాహాకారములు చేయుచు ఖండితయై నేలఁగూలెను. అంజనేయుఁడు నిర్విణ్ణుఁ డయ్యెను. వానరులు హాహాకారములతో ఆక్రోశించిరి. ఇంద్రజిత్తు అంజనేయుని చూచి "వానరా! చూచితివా సీతయొక్క గతిని. ఈమెను ముక్కలు ముక్కలుగా ఖండించితిని. ఇంక మీపరిశ్రమ యంతయు విఫలము" అని హర్షముతో మహానాద మొనరించెను.

ఆమహానాదమును విని భీతులై పరువెత్తుచున్న వానరులను సంబోధించి అంజనేయుఁడు ఇట్లనెను. "యుద్ధమును వదలి ఎందులకు మీరు పరువెత్తుచున్నారు? మీశూరత్వ మే మైనది? నేను ముందుకు పోవుచున్నారు. మీరు నావెంట రండు." వారు ఆయనమాటలను మన్నించి మరలి వచ్చి వృక్షములను శైల శృంగములను గైకొని ఆయనవెంట బయలుదేరి రాక్షసులను మార్కొనిరి. హనుమంతుఁడు క్రుద్ధుఁడై యొకమహాశిలను ఇంద్రజిత్తుయొక్క రథముపై విసరెను, అతఁడు రథమును తప్పింపఁగా

అది భూమిలోనికిఁ జొరఁబడెను. ఇంద్రజిత్తు శరవర్షమున వాన రుల నుఱుమాడఁజొచ్చెను. విగతోత్సాహులైన వానరులు ఇంక పోరాడఁజాల రని గుర్తించి హనుమంతుఁడు తానును నిర్విణ్ణుఁడై వానరులను మరలించి రామున కీవార్త చెప్పుటకై బయలు దేరెను. వారు వెనుకకు మరలుటను గమనించి ఆయవకాశము కొఱకే చూచుచున్నయింద్రజిత్తు వేంటనే హోమము గావించుట కొఱకు నికుంభిలకు పోయెను.

హనుమంతునిగర్జనములు కపిరాక్షసులకోలాహలమును విని రాముఁడు జాంబవంతుని జూచి, “పశ్చిమద్వారమునొద్ద అంజనేయుఁడు ఘోరయుద్ధ మొనర్చుచున్నట్లున్నాఁడు. నీవు నీ సైన్యముతో పోయి అతనికి సాయ మొనరింపుము” అని పంపెను. జాంబవంతుఁడు బయలుదేరెను. దారిలో ఆంజనే యుఁడు అతనికి ఎదురై వెనుకకు మరలించి అతనితో కూడ రామునియొద్దకు వచ్చి దుఃఖించుచు ఆయన పాదములపైఁబడి ఇంద్రజిత్తు కావించినపనిని చెప్పెను. రాముఁడు ఆమాట విన్నం తనే మూర్ఛిల్లెను. వానరనాయకులు రామునిచుట్టును జేరి శైత్యోప చారములు చేయఁజొచ్చిరి.

లక్ష్మణుఁడు అన్నను కౌఁగిలించుకొని యిట్లు విలపింపఁ జొచ్చెను. “అన్నా! నీ ధర్మము నిన్ను అనర్థమునుండి రక్షింప లేకపోయినది. ధర్మాధర్మములకు సుఖదుఃఖములు ఫలములుగా నియతితో కన్పించుట లేదు. అధర్మపరులకు అర్థవృద్ధి నీవంటి ధర్మశీలురకు క్లేశములును కలుగుచున్నవి. కావున ధర్మాధర్మ ములు నిరర్థకములు. ప్రతివస్తువు స్థావరముగనో జంగ మముగనో కన్పించుచున్నది. ధర్మాధర్మములు అట్లు కన్పిం చుట లేదు. కావున అవి లేనట్లే. అవి నిజముగా నుండి,

సుఖదుఃఖములను ఒసంగుటకు సమర్థము లగుచో, రావణుఁడు సుఖము నొందుట గాని, నీ విట్టి దుఃఖము నొందుట గాని జరిగి యుండదు. పాపిని వానియధర్మమే హింసించు ననుట పొసఁగదు. వాఁడు చేసిన యధర్మకృత్యము మూఁడుక్షణములలోనే నశించుచున్నది. అట్లు నష్టమైన క్రియ అపాపి నెట్లు హింసింపఁగలదు? ధర్మమే సమర్థమై యున్నచో నీ కిట్టియాపద యెట్లు కలుగును? అది కూడ అసమర్థమై బలమునే యనువర్తించుచున్నది. అట్టి దుర్బలమైన ధర్మము సేవ్యము కా దనియే నామతము. బలమునకు ధర్మము అంగ మగుచో, అంగియైన బలమునే యవలంబింపుము.

నీవు "ధర్మము ధర్మము" అని చెప్పుచు రాజ్యమును వదలుకొని ధర్మముయొక్క మూలమునే ఛేదించితివి. ప్రవృద్ధములైన యర్థములనుండియే, పర్వతములనుండి నదులవలె, సకలక్రియలు, ధర్మములును ప్రవర్తించును. అర్థహీనుని క్రియలన్నియు, వేసవియందు అల్పములైన యేఱులవలె, నశించును. అర్థహీనుఁడే సుఖమును కోరుచు అర్థము నార్జింపవలె, నని పాపము చేయుచున్నాఁడు. అర్థవంతునకే మిత్త్రులు బంధువులు కలుగుచున్నారు. అతఁడే లోకమున పురుషుఁడు, పండితుఁడు. అర్థపరిత్యాగమువలన సంభవించుదోషములనుగూర్చి నీవు రాజ్యమును వదలునప్పుడే చెప్పితిని. అర్థవంతునకే ధర్మార్థకామములు ఫలించి సర్వమును అనుకూలించును. అర్థహీనుఁడు అర్జనవ్యాపారపరుఁడయ్యును అర్థమును సంపాదింపఁజాలఁడు. ధనము కలవాఁడే ఇంకను అధికముగా ధనమును సంపాదింపఁగలఁడు. పెట్టుబడిలేనివాఁడు వ్యాపార మెట్లు చేయఁగలఁడు?

ఏ మైన నేమి! జరిగిన దేమో జరిగిపోయినది. గతమును గూర్చి చింతించుట నిష్ప్రయోజనము. ఇప్పుడు ఇంద్రజిత్తువలన

నేర్పడినయీవిషమపరిస్థితిని నేను నాపౌరుషముచేత తొలఁగింతును. లెమ్ము. మహాత్ముఁడవైన నీవు నీ శక్తిని గుర్తింపుము."

శ్లో॥ శుభే వర్త్మని తిష్ఠన్తం త్వా మార్య విజితేంద్రియమ్।
అనర్థేభ్యో న శక్నోతి త్రాతుం ధర్మో నిరర్థకః॥ 14

శ్లో॥ య ద్యధర్మో భవే ద్భూతో రావణో నరకం వ్రజేత్।
భవాం శ్చ ధర్మయుక్తో వై నైవం వ్యసన మాప్నుయాత్॥19

శ్లో॥ యస్మా దర్థా వివర్ధన్తే యే ష్వధర్మః ప్రతిష్ఠితః।
క్లిశ్యన్తే ధర్మశీలా శ్చ తస్మా దేతౌ నిరర్థకౌ॥ 21

శ్లో॥ అర్థేభ్యో హి వివృద్ధేభ్య స్సంవృత్తేభ్య స్తత స్తతః।
క్రియా స్సర్వాః ప్రవర్తన్తే పర్వతేభ్య ఇ వాపగాః॥ 32

శ్లో॥ అర్థేన హి వియుక్తస్య పురుష స్యాల్పతేజసః।
వ్యుచ్ఛిద్యన్తే క్రియా స్సర్వాః గ్రీష్మే కుసరితో యథా॥ 33

శ్లో॥ సోఽయ మర్థం పరిత్యజ్య సుఖకామ స్సుఖైధితః।
పాప మారభతే కర్తుం తతో దోషః ప్రవర్తతే॥ 34

శ్లో॥ యస్యార్థా స్తస్య మిత్రాణి యస్యార్థా స్తస్య బాంధవాః।
యస్యార్థ స్స పుమాన్ లోకే యస్యార్థా స్స చ పండితః॥35

శ్లో॥ యస్యార్థా ధర్మకామార్థా స్తస్య సర్వం ప్రదక్షిణమ్।
అధనే నార్థకామేన నార్థ శ్శక్యో విచిన్వతా॥ 38

శ్లో॥ హర్షః కామ శ్చ దర్ప శ్చ ధర్మః క్రోధ శ్శమో దమః।
అర్థా దేతాని సర్వాణి ప్రవర్తంతే నరాధిప॥ 39

యుద్ధ-సర్గ-83

ఇందు లక్ష్మణుఁడు నాస్తికవాదమును చేయుచున్నాఁడనుట స్పష్టము. ఇంతమాత్రమున ఆయనకు ధర్మమునందు

శ్రద్ధ లే దని తలంచుటకు వీలు లేదు. ధర్మమునకు ఫలము లే దని యాతఁడు నిశ్చితముగా గ్రహించుచున్నచో సకలసుఖములను వదలి రాముని వెంట ఎందులకు వచ్చెను? అందువలన ఆయనకు ధర్మమునందు శ్రద్ధ లే దని చెప్పుటకు వీలు లేదు. "రామునిధర్మపరత్వమునకు వెంటనే శుభఫలములు కలుగక పోఁగా కష్టములే కలుగుచున్నవి కదా" అనునిర్వేదముతో ఆయన యిట్లు మాటాడుచున్నాఁడు. కోపము వచ్చినప్పుడు తల్లి బిడ్డను కఠినముగా తిట్టును. అంతమాత్రముచేత ఆమెకు బిడ్డయందు ప్రేమ లే దని వెంటనే బిడ్డను పరిత్యజించు నని చెప్పుటకు వీలు లేదు. అట్లే లక్ష్మణునివాక్యములను కూడ గ్రహింపవలసి యున్నది.

లక్ష్మణునివాక్యములను విలాపమాత్రముగ భావించుట వలననే రాముఁడు గాని సుగ్రీవాదులు గాని వానిని లక్ష్యపెట్ట లేదు. కాని బాలురు ఇట్టిమాటలను యథార్థము లని తలంచుట కవకాశము కలదు, అందువలన ఈవాదముయొక్క నిస్సారత్వ మును గ్రహించుట ఆవశ్యకము. ఈవాదములోనిప్రధానాంశములను ఇట్లు గ్రహింపవచ్చును.

"మనుష్యులు కొండలు మొదలగువస్తువులు కన్పించు నట్లుగా ధర్మాధర్మములు కన్పించుటలేదు. కావున అవి వస్తువులే కావు, అవి లేవు.—"ఇది మొదటియంశము. మనకంటికి ఏవి కన్పించుట లేదో అవి లేవనుట కుదురదు. రోగమును కలిగించు సూక్ష్మక్రిములు అనేకములు కన్పింపవు. అంతమాత్రమున అవి లేవనుట కుదురదు. ఆసూక్ష్మక్రిములు సూక్ష్మదర్శిని కైన (Microscope) కన్పించును కదా అన్నచో బుద్ధి, యింద్రియములు సూక్ష్మతమదర్శిని కైనను గోచరింపవు. కాని వానివలననే

ప్రపంచవ్యవహార మంతయు జరుగుచున్నది. కావున కన్పింప నంతమాత్రమున అవి లేవనుటకు వీలు లేదు.

"అవి ఏదో రూపమున ఉన్న వనుకొన్నను, కొందఱు నమ్ముచున్నట్లుగా, వానికి సుఖదుఃఖముల నొసంగు సామర్థ్యము లేదు. వానికి ఆసామర్థ్య మున్నచో రామునివంటిధార్మికునకు ఇంత దుఃఖము, రావణునివంటియధార్మికునకు ఇంత సుఖము కలుగుట సంభవింపదు. కావున ధర్మమువలన సుఖము అధర్మమువలన దుఃఖము కలుగు నని చెప్పుటకు వీలు లేదు."—ఇది రెండవయంశము. లోకములో ప్రతిప్రాణికి ఒకప్పుడు సుఖము మఱియొకప్పుడు దుఃఖము కలుగుచుండుట ప్రత్యక్షమైనవిషయము. ఆ సుఖములు దుఃఖములు నిర్హేతుకములుగా సంభవించు నని చెప్పుటకు వీలు లేదు. లోకములో కారణము లేకుండ కార్యము సంభవించుట లేదు. (There can be no effect without a cause). కృషి లేకుండ పంట పండుట లేదు. పంట లేకుండ భోజనము సిద్ధము కాదు. కొన్నికార్యములకు ఇప్పుడు కారణము కన్పింపకున్నచో అవి పూర్వసిద్ధము లనియే గ్రహింప వలసియున్నది. ఒకఁడు విద్యయందు ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణుఁడై ఉన్నతమైనపదవి పొందినప్పుడు, ఎల్లరకును వానియున్నతపదవియే కన్పించును, కాని వాఁడు అంతవఱకును చేసిన పరిశ్రమ ఎవరికిని కన్పింపదు. అయినను ఉన్నతపదవీప్రాప్తి యను కార్యమునుబట్టి వాఁడు అంతకు పూర్వము పెక్కుసంవత్సరములు చేసిన విద్యాపరిశ్రమ, పదవికొఱకై చేసినప్రయత్నములను కారణములుగా ఊహించి గ్రహించుచున్నాము. ఇట్లే పుట్టుకయందే ఒకనికి సుందరరూపము దృఢశరీరము ఆరోగ్యము కలుగుచుండఁగా, మఱియొకనికి అంగవైకల్యము, దుర్బలశరీరము,

రోగమయత్వము కలుగుచున్నవి. వీనికి సరియైనకారణములను ఇప్పుడు నిరూపించుటకు వీలులేదు. తల్లిదండ్రులవలన ఈ భేదము కలుగుచున్న దని యన్నచో, ఒకఁడు ఉత్తమతల్లిదండ్రులకు జన్మించుచుండఁగా మఱియొకఁడు అధములైనవారి కేల జన్మింపవలె? కావున పుట్టుకతో ఏర్పడుచున్న దేహము, తల్లిదండ్రులు, కుటుంబము, దేశము, కాలము మొదలగు జీవితపరిస్థితికి అంతకును (Entire context of life) హేతువులను తప్పక నిరూపింపవలసియే యున్నది. ఒకఁడు మహారాజపుత్రుఁ డగుట, మఱియొకఁడు దరిద్రునిపుత్రుఁ డగుట, ఇంకొకఁడు గొప్పబుద్ధిశక్తితో జన్మించుచుండఁగా వేఱొకఁడు పిచ్చివాఁడుగా పుట్టుట నిష్కారణముగ సంభవించు ననుటకు వీలు లేదు. అట్లనుట శాస్త్రవిరుద్ధము. లోకములో ప్రతికార్యము తగినకారణమువలన సంభవించుచుండుట ప్రత్యక్షమై యుండఁగా జీవితసౌధమునకు పునాదియైన పుట్టుకకు మాత్రము కారణము లే దనుట యుక్తియుక్తము కాదు, ఇప్పుడు కారణము గోచరింపకున్నచో పుట్టుటకు పూర్వమే అది సిద్ధమై యుండె నని యూహింపవలసియేయున్నది. అందువలన పూర్వజన్మమున చేసినధర్మము ఒకనికి మంచిశరీరమును మంచిబుద్ధిని మంచికుటుంబము నిచ్చుచుండఁగా, మఱియొకనికి వాఁడు పూర్వజన్మమున చేసినయధర్మము యిప్పుడు రోగమయమైన శరీరమును దుష్టబుద్ధిని దుష్కులమును కలిగించుచున్న దనుట స్పష్టము. అనఁగా పూర్వజన్మమునందు ఫలించుటకు అవకాశములేని ధర్మాధర్మములు ఇప్పు డిట్టి జన్మములను కలిగించుచున్నవన్నమాట. అనఁగా ధర్మములు గాని అధర్మములు గాని అత్యుత్కటము లగునవి వెంటనే ఫలించినను, కొన్ని మాత్రమే వెంటనే ఫలింపక కాలాంతరమున ఫలము

నొసంగు ననుట స్పష్టము. కావున ఒకానొకఁడు ఇప్పుడు కేవలము ధర్మమునే ఆచరించుచున్నప్పటికిని దుఃఖమును, వేఱొకఁడు కేవలము అధర్మమునే ఆచరించుచున్నప్పటికి సుఖమును పొందుచున్నచో ఆధర్మాధర్మములు నిరర్థకములైన వని చెప్పుటకు వీలు లేదు. ఇప్పుడు కలుగుచున్నసుఖదుఃఖముల కన్నింటికిని ఇప్పుడు మనము చేయుచున్న ధర్మాధర్మములే కారణములు కావు. పుట్టుటకు పూర్వమే సిద్ధమై విశిష్టమైన జన్మరూపమున ఫలము నిచ్చుటకు ప్రారంభించి ధర్మాధర్మసముదాయమే, అనఁగా ప్రారబ్ధకర్మమే, ధార్మికునకు దుఃఖమును అధర్మవర్తనునకు సుఖమును కలిగించుచున్న దని, ఇప్పుడు వారు చేయుచున్న ధర్మాధర్మములకు ఫలము కాలాంతరమున కలుగు నని చెప్పవలె. ధర్మరాజు పరమధార్మికుఁడై యుండియు కష్టములను పొందె నన్నచో, పూర్వజన్మసిద్ధమైన ప్రారబ్ధకర్మముయొక్క ఫలము ననుభవించుచున్నాఁ డన్నమాట. ఇప్పటిధర్మము కాలాంతరమున సామ్రాజ్యవైభవము స్వర్గభోగము మొదలగువానిరూపమున ఫలించెను. కావున ధర్మాధర్మములకు ఇప్పుడు ఫలము కన్పింపనంతమాత్రమున వానికి సుఖదుఃఖములను కలిగించు సామర్థ్యము లే దని చెప్పుటకు వీలులేదు.

"ఏక్రియ యైనను, ధర్మము గాని అధర్మము గాని, మూఁడుక్షణములలో ముగిసిపోవును. అట్లు నశించినయాక్రియ ఫలము నెట్లొసంగఁగలదు? కావున, ఎవఁడు ఏపాపమును చేయునో ఆపాపమే వానిని హింసించును, ఎవఁడు ఏపుణ్యమును చేయునో అ పుణ్యమే వానిని రక్షించును, అని తలంచుట భ్రాంతియే యగును"—ఇది మూఁడవయంశము. క్రియ మూఁడు క్షణములలో నశించినను దానిప్రభావము నశింపదు. అది

వెంటనే ఫలము నొసంగకున్నను కాలాంతరమున తప్పక ఫలము నొసంగును. ఒకఁడు ఒకహత్య చేసినప్పుడు ఆహత్యాకార్యము మూఁడుక్షణములలోనే ముగిసిపోవచ్చును. వాఁడు రక్షకభటులకు చిక్కి, హత్యనుగూర్చి న్యాయస్థానమున విచారణ జరిగి. న్యాయాధిపతి వానికి శిక్షవిధించునప్పటికి చాలకాలము పట్టవచ్చును. శిక్షవిధించుసమయమున ఆహత్యాకార్యము ఎవ్వరికిని గోచరము కాదు. అయినను ఎప్పుడో జరిగిన హత్యాకార్యమునుబట్టియే న్యాయాధిపతి శిక్షను విధించుచున్నాఁడు. ఇప్పుడు విధింపఁబడుచున్నశిక్షకు పూర్వము వాఁడు చేసినహత్యాకార్యముయొక్క ప్రభావమే కారణము గాని యితరము కాదు. వాఁడు హత్యయే చేయకున్నచో శిక్షకు ప్రసక్తియే లేదు. న్యాయాధిపతి తనకు తానుగా స్వతంత్రించి నిష్కారణముగా ఎవనికిని శిక్ష విధింపలేఁడు. కావున అపరాధి గావించిన హత్యయొక్క ప్రభావమే వానికి శిక్ష కలిగించుచున్న దనుట స్పష్టము. ఇట్లే ధర్మక్రియలనుగూర్చి కూడ గ్రహింపవలసియున్నది. ఒకఁడు ప్రజలకు పెక్కు ఉపకారములను దానములను చేయుచుండును. ఆక్రియలన్నియు లప్పటికప్పుడే నశించిపోవును. మఱునాఁటికి ఎవనికిని గోచరింపవు. అయినను వాని ప్రభావము నశింపదు. ఎన్నికలు వచ్చి ప్రజలు వానియుపకారములను స్మరించి వానిని ప్రతినిధినిగ ఎన్నుకొనుటకు, తక్కినప్రతినిధులు వానిగుణాధిక్యమును గుర్తించి వానినే ముఖ్యమంత్రిగానో ప్రధానమంత్రిగానో ఎన్నుకొనుటకు చాలకాలము పట్టవచ్చును. అతఁడు అపదవిని పొందుచున్నప్పుడు పూర్వ మతఁడు చేసినసత్కార్యము లేవియు ఎవ్వరికిని గోచరము కావు. అయినను అతఁడు పూర్వము ఎప్పుడో చేసిన సత్కార్యములప్రభావమువలననే అతనికి ఈపదవి కలుగుచున్నది. అతఁడు సత్కార్యములే చేయకున్నచో ప్రజలవలన

వానికి ఈపదవి లభించు ప్రసక్తియే యుండదు. ప్రజలు నిష్కారణముగా నెవని నైనను ప్రతినిధిగా మంత్రినిగా ఎన్నుకొనరు. కావున అతఁడు కావించినధర్మక్రియలయొక్క ప్రభావమే వానికి పదవి నొసంగుచున్న దనుట స్పష్టము. కావున పాపకృత్యము పుణ్యకార్యము మూఁడుక్షణములలో నశించినను వాని ప్రభావము కాలాంతరమున ఆపదను అభ్యుదయమును కలిగించు నని గ్రహింపవలసియున్నది.

"అర్థవంతునకే ధర్మార్థకామములు సమకూడుచున్నవి. అర్థహీనుఁడు అర్థమును సంపాదించుటకు కూడ సమర్థుఁ డగుట లేదు. కావున అదియే పరమపురుషార్థము. అందువలన ఎట్లైనను అధర్మమార్గమునం దైనను, అర్థమును సంపాదించుకొనవలె. ధర్మముకొఱకు అర్థమును వదలుకొనువాఁడు బుద్ధిహీనుఁడు"— ఇది నాల్గవయంశము. అర్థవంతునకే ధర్మార్థకామములు సమకూడు నని, యితరులకు సమకూడ వని లోకములో నియతముగా కన్పించుట లేదు. ఒకానొకఁడు మిగుల సంపన్నుఁ డైనను వ్యాపారమునందు నష్టమును పొందవచ్చును; వానిప్రారబ్ధమున పాపము ప్రబలముగా నున్నచో వ్యసనములపాలై అనేకదుఃఖములను పొందవచ్చును. మఱియొకఁడు దరిద్రుఁ డైనను, వాని ప్రారబ్ధమున పుణ్యము ప్రబలముగా నున్నచో, బుద్ధిశక్తిచేతనే వాఁడు సంపదలను ఆర్జించుచు ధర్మకార్యములను చేయుచు కామోపభోగములను కూడ పుష్కలముగా పొందవచ్చును. కావున సుఖదుఃఖములకు ప్రారబ్ధగతములైన పుణ్యపాపములే కారణములు కాని యిప్పటి సంపన్నత, దారిద్ర్యము కారణములు కావు. కావున అర్థమే పరమపురుషార్థ మనుట కుదురదు. అందువలన

అధర్మమార్గము నవలంబించి యైనను ధనమును సంపాదించి నంతమాత్రమున సుఖము కలుగు నని చెప్పుటకు వీలులేదు. ఆ ధనమువలన ఇప్పుడు సుఖము కలుగుట సందేహగ్రస్త మగుచుండఁగా, ఆతఁడు అవలంబించిన యధర్మమునకు పాపఫలము ఎప్పటి కైనను కలుగు ననుట మాత్రము నిస్సందేహమే. కావున ఎట్లైనను ధనమును సంపాదింపవలె నని యధర్మమార్గము నవలంబించుట, కామావేశమున పరకాంతను బలాత్కరించుటవలె, సమంజసము కాదు.

లక్ష్మణుఁ డిట్లు విలపించుచుండఁగా విభీషణుఁడు సైన్యములను గుల్మములను వ్యవస్థితములనుగా నొనరించి రాముని యొద్దకు వచ్చి, రాముని దైన్యమును చూచి యిదే మని యడిగెను. లక్ష్మణుఁడు జరిగినదానిని చెప్పెను. విభీషణుఁ డిట్లనెను. "ఇది యసంభవము. మాయన్నహృదయమును నే నెఱుంగుదును. అతఁడు ఏపరిస్థితియందును సీతను సంహరించుటకు అంగీకరింపఁడు. ఇది యంతయు ఇంద్రజిత్తు కావించినమాయ. వాఁడు వానరులను మోసగించి నికుంభిలయందు హోమము చేయుటకు పూనుకొనియుండును. అది పరిసమాప్త మైనచో వాఁడు అజేయుఁ డగును. దానిని నిర్విఘ్నముగా కొనసాగించుటకే వాఁడు ఈ మాయను ప్రయోగించెను." పిమ్మట విభీషణుఁడు రాము నోదార్చుచు ఇట్లనెను. "రామభద్రా! దుఃఖింపకుము. సీతకు ఎట్టి హానియు జరుగలేదు. ఇప్పుడు ఇంద్రజిత్తుయొక్క హోమమును భగ్న మొనర్చుట తత్క్షణకర్తవ్యము. లక్ష్మణుని మాతో పంపుము. మేము పోయి వానిహోమమునకు భంగమును కలిగింతుము. అప్పుడు వాఁడు వధ్యుఁ డగును. నీవు విషాదము వీడుము. నీవు

దుఃఖించుచున్నచో సైన్య మంతయు నీరసించును. కావున ధైర్యము నవలంబింపుము."

దుఃఖపరవశుఁడైయున్న రామునకు విభీషణుఁడు చెప్పినది మనస్సునకు గోచరము కాక, "నీ వనున దేమి? మరల చెప్పుము" అనెను. విభీషణుఁడు మరల ఇట్లు చెప్పెను. "నీవు ఆజ్ఞాపించినట్లుగా యూథపాలకుల నందఱను తమ స్థానములలో నుండవలసినదిగా నియమించి వచ్చితిని. నీవు అకారణముగా సంతపించుచున్నావు. మనకు ఎట్టి ఆపదయును కలుగ లేదు. రాక్షసులను సంహరించి నీవు సీతను గైకొనఁదలఁచుచున్నచో లక్ష్మణుని నా వెంటఁ బంపుము. ఇంద్రజిత్తు ఇప్పుడు నికుంభిల యందు హోమము నారంభించియున్నాఁడు. హోమకార్యము పూర్తికాకుండ, దానిని భంగ మొనరించి ఎవఁడు వానిని మార్కొనునో వాఁడే వానికి మృత్యు వగునని బ్రహ్మదేవుఁడు చెప్పెను. వాఁడు హోమమును సక్రమముగా పూర్తి కావించినచో వాఁడు మనకు మృత్యు వగును. లక్ష్మణుఁడు ఆ హోమమును భంగ పఱచి వానిని సంహరింపఁగలఁడు. కావున ఇతనిని వెంటనే పంపుము."

రాముఁడు దుఃఖమును వీడి లక్ష్మణుని చూచి, "నీవు హనుమజ్జాంబవదాదిప్రముఖులతో సేనాపరివృతుఁడవై బయలు దేరుము. మాయావిదుఁడైన విభీషణుఁడు సామాత్యుఁడై నీవెంట నుండును. ఇంద్రజిత్తును సంహరించి విజయివై రమ్ము" అని చెప్పెను. లక్ష్మణుఁడు సన్నద్ధుఁడై రామునిపాదములకు ప్రణమిల్లి ఆశీస్సులను పొంది కృతస్వస్త్యయనుఁడై అంగదహనుమజ్జాంబవద్విభీషణాదులతో సేనాపరివృతుఁడై నికుంభిల కేగెను.

## 11. ఇంద్రజిద్వధ

లక్ష్మణుఁడు నికుంభిలకు చేరి, అచ్చట పెద్దవ్యూహముగా మేఘపంక్తివలె బారులు తీరి నిలిచియున్న రాక్షససైన్యమును చూచుచు నిలిచెను. విభీషణుఁడు లక్ష్మణుని చూచి, "ఆరాక్షస సైన్యమును విచ్ఛిన్న మొనర్చినచో ఇంద్రజిత్తు మనకు కన్పించును. కావున ఆసైన్యముపై దాడిచేయ మనసేనలకు ఆజ్ఞాపింపుము" అని చెప్పెను.

లక్ష్మణుఁడు వానరసేనలకు దాడిచేయ నాజ్ఞాపించి తాను కూడ శరవర్షమున రాక్షసబలములను విచ్ఛిన్నము గావింపఁ జొచ్చెను. వానరులకు రాక్షసులకు తుములయుద్ధ మారంభమయ్యెను. ఋక్షవానరయోధులచే రాక్షసబలములు కలగుండు పడెను. అంజనేయుఁడు విజృంభించి రాక్షసుల నుఱుమాడఁ జొచ్చెను. ఇంద్రజిత్తు సైన్యములదీనదశను విని వృక్షవాటమును వెలువడి క్రుద్ధుఁడై రథము నారోహించి మారుతిని మార్కొనుటకు వచ్చుచుండెను. అప్పుడు విభీషణుఁడు లక్ష్మణునకు ఇంద్రజిత్తును చూపుచు, "రథారూఢుఁడై మారుతిని మార్కొనుచున్న వాఁడే యింద్రజిత్తు. నీవు వాని నిప్పుడే ప్రతిఘటించి సంహరింపుము" అని చెప్పెను.

ఆంజనేయుఁ డప్పటికే మేఘనాదునితో యుద్ధము నారంభించియుండుటచే, విభీషణుఁడు లక్ష్మణుని ఆ మహావనములోనికి తీసికొనిపోయి జీమూతమువలె భయంకరమైన యొక న్యగ్రోధమును చూపి, "ఇచ్చట ఇంద్రజిత్తు దేవతలకు బలుల నొసంగి యుద్ధమునకు వచ్చి యదృశ్యుఁడై శత్రువులను వధించును. వాఁడు మరల హోమమును ముగించుటకై యిచ్చటికి వచ్చును. అది ముగిసినచో వాఁడు అవధ్యుఁ డగును. కావున

ఈచెట్టుదగ్గరకు రాకముందే వానిని సంహరింపుము" అని చెప్పెను. లక్ష్మణుఁడు సరే యని విల్లెక్కుపెట్టి సన్నద్ధుఁడై నిలిచి యుండెను.

కొంత సేపటికి ఇంద్రజిత్తు ఆంజనేయునినుండి తప్పించుకొని అగ్నివర్ణమైన రథమునందు అచ్చటికి వచ్చెను. వెంటనే లక్ష్మణుఁడు అతనిని యుద్ధమునకు నాహ్వానించెను. లక్ష్మణుని వెంతనున్న విభీషణుని చూచి యింద్రజిత్తు అతఁడే లక్ష్మణుని తీసికొని వచ్చె నని గ్రహించి మండిపడి విభీషణునితో "నీవు ఇక్కడ పుట్టి పెరిగి మాతండ్రియొక్క వాత్సల్యము ననుభవించి, కుమారుఁడనైన నా కెట్లు ద్రోహము చేయుచున్నావు? జాతిసౌహార్దము సౌభ్రాత్రము మొదలుగా ఏసంబంధము నీకు ప్రమాణము కాలేదు; స్వజనమును వీడి పరభృత్యత్వమును పొందిననీవు లోకనింద్యుఁడవు; శోచ్యుఁడవు. పరులు గుణవంతులైనను, స్వజనులు నిర్గుణులైనను, స్వజనులే మేలు; పరుఁడు పరుఁడే. స్వజనుల వీడి పరులను చేరినవాఁడు, స్వపక్షము నాశమొందింపఁబడిన పిమ్మట పరులచేతనే సంహరింపఁబడును. నీవు కుమారునిమీఁదికే శత్రువుల నుసిగొల్పుచున్నావు. ఇట్టినిర్దయ నీయందు తప్ప లోకమున నెక్కడును ఉండదు,"

శ్లో॥ గుణవాన్ వా పరజన స్స్వజనో నిర్గుణోఽపి వా।
నిర్గుణ స్స్వజన శ్శ్రేయాన్, యః పరః పర ఏవ సః॥ 15

శ్లో॥ య స్స్వపక్షం పరిత్యజ్య పరపక్షం నిషేవతే।
స స్వపక్షే క్షయం యాతే పశ్చా త్తై రేవ హన్యతే॥ 16

విభీషణుఁడు ఇట్లనెను. "నాశీలము నెఱుంగనివానివలె ఏల ప్రేలెదవు? నేను క్రూరకర్ములైన రాక్షసులకులమున జన్మించి నను నాశీలము రాక్షసము కాదు. నేను క్రూరకర్మమునందు అధర్మవిషయములందును రమింపను. ఎంత విషమశీలము కల వాఁ డైనను తమ్ముని నిండుసభలో ధిక్కరించి పరిత్యజించునా? అట్టియన్నను నేను వదలుటలో తప్పేమున్నది? ధర్మభ్రష్టుని పాపనిశ్చయుని విడినచో, చేతినుండి సర్పమును విసరివేసినట్లుగా, అభయము శాంతి సుఖము కలుగును. పరధనదారాపహరణ రతుఁడైనవాఁడు మండుచున్న యిల్లువలె పరిత్యజింపఁదగినవాఁడు. మహర్షులను వధించుట, సకలదేవతలను నిరసించుట, ధర్మాత్ములయెడ రోషాభిమానవైరప్రాతికూల్యములతో వర్తించుట అను గుణములు మీతండ్రియందు జీవితైశ్వర్యనాశకములై యున్నవి. కావున నేను అతనిని వీడితిని. ఇంక ఈలంక నీవు నీ తండ్రియు నుండరు. నీవు దుర్వినీతుఁడవు; కాలపాశబద్ధుఁడవు. నీయిష్టము వచ్చినట్లు ప్రేలుము. ఎట్లైనను నీవు ఈవృక్షము దాపునకు రాఁజాలవు; లక్ష్మణుని మార్కొని బ్రతుకఁజాలవు; వీరోచితముగా ఇతనితో పోరుము; చచ్చి దేవకార్యమును గావింతువు."

అప్పటికి ఆంజనేయుఁడు ఇంద్రజిత్తు గావించిన మోసమును గ్రహించి వడివడిగా న్యగ్రోధవృక్షమునొద్దకే వచ్చి లక్ష్మణునకు వాహన మయ్యెను. హనుమంతునిపై నున్న లక్ష్మణుని చూచి ఇంద్రజిత్తు, "దూదిమూటను నిప్పువలె, నాబాణములు నిన్ను క్షణములో భస్మము చేయును. యుద్ధమున మొదటిరాత్రి వజ్రకల్పములైన నాబాణములకు సోదరు లిరువురు నేలఁగూలి తిరి గదా! అప్పుడే మఱచితివా?" అని యధిక్షేపించెను.

లక్ష్మణుఁ డిట్లనెను. "నీవు మాటలచేతనే కార్యమును గట్టెక్కింపఁ దలంచుచున్నావు. శ్రమచేసి కార్యమును నిర్వహించువాఁడే బుద్ధిశాలి. నీ వప్పుడు అదృశ్యుఁడవై కావించినపని దొంగలకు తగినది. నే నిప్పుడు నీబాణమార్గమునందు ప్రత్యక్షమై యున్నాను. నీశక్తి నంతయు చూపుము."

ఇంద్రజిత్తు అమితవేగమున బాణములను ప్రయోగింపఁగా లక్ష్మణుఁడు విద్ధగాత్రుఁడై పొగలేనియగ్నిజ్వాలవలె కన్పించెను. తనపనికి తానే సంతోషించుచు మేఘనాదుఁడు "ఇదిగో నాబాణములు నీరక్తమును త్రావును. నీశవమును మాయన్న యిప్పుడే చూడఁగలఁడు" అని గర్జించెను. "ఓయీ! వాగ్బలప్రదర్శనమును వదలుము. చెప్పుచున్నదానిని చేసి చూపుము. అప్పుడు నీశక్తిని నేను గుర్తింతును. పరుషవాక్యమును పలుకకుండ ఎట్టి యాక్షేపము నొనరింపక ఆత్మప్రశంసం గావించుకొనక నిన్ను వధింతును చూడుము" అని పలికి లక్ష్మణుఁ డయిదుబాణములతో వానిని ప్రహరించెను. వానివేగమునకు వాఁడు వ్యథితుఁడై మూఁడుబాణములతో సౌమిత్రిని వేధించెను. క్రమముగా పోరు ఘోరమయ్యెను.

శ్లో॥ అనుక్త్వా పరుషం వాక్యం కించి ద ప్యనపక్షిపన్।
అవికత్థన్ వధిష్యామి త్వాం పశ్య పురుషాదన॥ 29
యుద్ధ-సర్గ-88

లక్ష్మణునిధాటికి మేఘనాదుఁడు వివర్ణుఁ డయ్యెను. అది గమనించి విభీషణుఁడు, "లక్ష్మణా! వీఁడు భగ్నత నొందినాఁడు; త్వరపడుము. శకునములును వీని చావునే సూచించుచున్నవి." అని ప్రోత్సహించెను. లక్ష్మణుఁడు విజృంభించెను. ఆతని శరా

హతికి మేఘనాధుఁడు మూర్ఛిల్లి తేఱుకొని క్రుద్ధుఁడై నాగపాశ బంధనమును స్మృతికి తెచ్చుచు మరల ఆక్షేపించి ఏడుబాణము లతో సౌమిత్రిని, పదింట హనుమంతుని, నూఱింట విభీషణుని ప్రహరించెను. లక్ష్మణుఁడు "రావణతనూజా! రణరంగమున శూరు లిట్లా ప్రహరించునది? నీబాణములు అల్పవీర్యములై లఘు వులై పుష్పములవలె సుఖస్పర్శములై యున్నవి" అని పరిహ సించుచు నిశితబాణపరంపరలతో వానికవచమును చీల్చెను. విగత కవచుఁడై వాఁడు శరవిద్ధుఁ డయ్యును వెనుకకు తగ్గక విజృం భించి శరసహస్రమున లక్ష్మణుని కవచమును భేదించెను. అట్లు వారు శరవిద్ధాంగు లయ్యును యుద్ధవిముఖులు కాక వృత్రవాస వులవలె ఎంతసే పైనను పోరుచునే యుండిరి.

వారిపోరును చూచుచు విభీషణుఁడు అమాత్యపరివృతుఁడై శరవర్షమున రాక్షసుల ముంచుచు ఋక్షవానరులఁ జూచి ఎలుఁ గెత్తి ఇట్లు ఉద్ఘోషించెను. "ఋక్షవానరవీరులారా! వినుఁడు ఇంక రావణునకు మిగిలిన యాశాలేశము ఈమేఘనాదుఁ డొక్కఁడే నేనే వీనిని చంపఁగలను. కాని తండ్రి నైన నేను కుమారుని చంపుట యుక్తము కాదు. రామకార్యార్థమై యందులకు నేను పూనుకొన్నను బాష్పములు నాకన్నులను నిరోధించును. వీనిని లక్ష్మణుఁడే సులభముగా సంహరింపఁగలఁడు. రావణుని బల మంతయు నశించినది. కుంభకర్ణాదులు నిహతు లైరి. ఇంక లంకను గోష్పదముగా మీరు లంఘింపవచ్చును. వీని కనుచరు లుగా నున్నయీరాక్షసులను సంహరింపుఁడు."

అమాటలచేత ఋక్షవానరయోధులు ఉత్సాహముతో రాక్ష సులపై విజృంభించిరి. జాంబవంతుఁడు శిలాపాదపవర్షమున రాక్షసుల నుఱుమాడఁజొచ్చెను. విభీషణునిమాటలకు మండిపడి

మేఘనాదుఁడు లక్ష్మణుని వదలి పినతండ్రిని భయంకరముగా మార్కొనెను. ఆంజనేయుఁడు లక్ష్మణుని దింపి శిలాపాదపములతో రాక్షసులను హత మొనర్పఁజొచ్చెను. విభీషణుఁడు తెచ్చియుంచిన యభేద్యకవచమును అతనియమాత్యులు లక్ష్మణునకు తొడిగిరి.

ఇంద్రజిత్తు పినతండ్రితో ఘోరముగ పోరి మరల లక్ష్మణుని మార్కొనెను. ఇరువురియందు నారిలాగుట గాని శరములు వేయుట గాని గోచరింపకుండెను. బాణవర్షమున ఇరువురును కప్పఁబడుచుండఁగా గగనము సైతము నిండిపోయెను. సూర్యుఁడస్తమించి చీఁకటి క్రమ్ముచుండఁగా నికుంభిలావనము రక్తప్రవాహమయ మయ్యెను. వాయువు స్తంభించెను. పావకుఁడు ప్రజ్వలింప లేదు. "లక్ష్మణుఁడు జయించును గాక! లోకములకు స్వస్తి యగును గాక!" అని మహర్షులు దీవింపఁజొచ్చిరి. రెండుపక్షములందును అలాతములు వెలుఁగు లీనెను.

లక్ష్మణుఁడు నాల్గుబాణములతో ఇంద్రజిత్తుయొక్క హయములను పీడించి నిశితభల్లమున సారథితలను తెగవేసెను. మేఘనాదుఁడే సారథ్యమును వహించుచు రథమును శరపరంపరలకు తప్పించి త్రిప్పఁజొచ్చెను. వాఁడు పగ్గములను గైకొనుటను చూచి లక్ష్మణుఁడు వానిని నిశితశరములతో పీడించెను. పగ్గములు వదలుటకుఁ గాని విల్లు ఎక్కుపెట్టుటకుఁ గాని సాధ్యము గాక ఇంద్రజిత్తు విషాదము నొందెను. అది చూచి వానరులు లక్ష్మణుని మెచ్చిరి. అదియే అదనుగా ప్రమాధిరభసశరభగంధమాదనులు నలువురు మేఘనాథునిరథాశ్వములపై దూఁకి నాలుగింటిని సంహరించి వెంటనే లక్ష్మణునియొద్దకు చేరిరి.

ఇంద్రజిత్తు రథమునుండి దుమికి మరల లక్ష్మణుని మార్కొనెను. కొంతసేపైన తరువాత చీఁకటి ప్రబలుచుండఁగా అతఁడు రాక్షసవీరులను పిలిచి మెచ్చుచు హర్షము నొందించుచు, "మీరు విక్రమమున నాతో సమానులు మీరు ముందునకు పోయి లక్ష్మణుని మార్కొని ఋక్షవానరులతో పోరుచుండుఁడు. మీరు విజృంభించినచో నేను ఇక్కడలేనిలోపము గోచరింపదు. నేను ఇంతలోపల శీఘ్రముగ నగరములోనికి పోయి రథమును శస్త్రసంచయమును గొనివచ్చి వీరెని అంత మొందింతును." అని చెప్పెను. వారు అందులకు అంగీకరించి ముందునకు పోయి విజృంభించిరి. ఇంద్రజిత్తు చీఁకటిచాటున ఋక్ష వానరుల వంచించి లంకలోనికి పోయి శస్త్రసంభరితమైనరథమును గైకొని ముహూర్తమాత్రమున రణరంగమున ప్రత్యక్షమయ్యెను. వానిగమనాగమనలాఘవమునకు లక్ష్మణుఁడే కాక విభీషణుఁడు కూడ విస్మితుఁ డయ్యెను. ఇంద్రజిత్తుయొక్క ధాటికి ఋక్షవానరులు తట్టుకొనఁజాలక లక్ష్మణుని శరణుఁ జొచ్చిరి. సౌమిత్రి ఇంద్రజిత్తును మార్కొని వానివిల్లును ఖండించెను. వాఁడు మఱియొకవిల్లును గైకొనఁగా లక్ష్మణుఁడు దానిని కూడ ఖండించి అయిదుబాణములతో వానిని ప్రహరించెను. మేఘనాదుఁడు అబాణఘాతమున రక్తమును క్రక్కి మరల తేఱుకొని పోరఁజొచ్చెను. లక్ష్మణుఁడు సూతుని సంహరింపఁగా గుఱ్ఱములు అటునిటు పరిభ్రమింపఁజొచ్చెను. సౌమిత్రి హయముల నింకను బాణములతో తాడించెను. మేఘనాదుఁడు లక్ష్మణుని కవచమును భేదించుటకు పెక్కు శరములను ప్రయోగించి అవి వ్యర్థ మగుటఁ జూచి యది యభేద్య మని తలంచెను.

ఇంతలో విభీషణుఁడు సౌమిత్రిని గడచి ముందునకు పోయి ఇంద్రజిత్తును మార్కొనెను. వాఁడు సౌమిత్రిని వదలి

విభీషణునిపై నిశితబాణములను ప్రయోగించెను. విభీషణుఁడు వానిని లెక్కఁగొనక గదతో హయములను సంహరించెను. ఇంద్రజిత్తు రథమునుండి దూఁకి విభీషణునిపై శక్తిని ప్రయోగించెను. దానిని లక్ష్మణుఁడు శరములతో విచ్ఛిన్న మొనర్చెను. విభీషణుఁడు అయిదుబాణములను మేఘనాదునివక్షమున నాటెను. వాఁడు వ్యథితుఁడై క్రోధముతో యమదత్తమైన యొకమహాస్త్రమును విభీషణునిపై ప్రయోగించెను. కుబేరుఁడు స్వప్నమున తనకు నుపదేశించిన యొకమహాస్త్రమును లక్ష్మణుఁడు స్మరించి దానిని ఇంద్రజిత్ప్రేరితమైనయస్త్రముపై ప్రయోగించెను. రెండు అస్త్రములు అంతరిక్షమున పోరి ఒకదానిచే నొకటి విహతములై నేలఁగూలెను. అది చూచి లక్ష్మణమేఘనాదులు లజ్జించిరి. సౌమిత్రి వారుణాస్త్రమును ప్రయోగించెను. ఇంద్రజిత్తు దానిని రౌద్రాస్త్రమున ప్రతిహత మొనరించి ఆగ్నేయమును ప్రయోగించెను. లక్ష్మణుడు దానిని సౌరమున నివారించెను. ఇంద్రజిత్తు అసుర్కరమును ప్రయోగింపఁగా దానినినుండి కూటముద్గరశూలఖడ్గాదులు వెలువడఁ జొచ్చెను. దానిని లక్ష్మణుఁడు మాహేశ్వరమున నిర్మూలించెను.

శ్లో॥ కుబేరేణ స్వయం స్వప్నే య ద్దత్త మమితాత్మనా।
దుర్జయం దుర్విషహ్యం చ సేంద్రై రపి సురాసురైః॥ 48
యుద్ధ-సర్గ-90

మహర్షులు, పితరులు, గంధర్వగరుడోరగాదులు శతక్రతుని పురస్కరించుకొని లక్ష్మణునకు రక్షగా అంతరిక్షమున నిలిచిరి. సౌమిత్రి ఐంద్రాస్త్రమును సంధించి, "దాశరథియైనరాముఁడు ధర్మాత్ముఁడు సత్యసంధుఁడు పౌరుషమునం దసమానుఁడు కూడ అగునేని, ఓశరమా! నీవు ఇంద్రజిత్తును చంపుము" అని

శపథ మొనర్చి ప్రయోగించెను. అది యింద్రజిత్తుయొక్క శీర్ష
మును ఖండించెను.

శ్లో॥ ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది।
పౌరుషే చాప్రతిద్వంద్వ శ్శ రైనం జహి రావణిమ్॥ 69
యుద్ధ-సర్గ-90

ఇంద్రజిత్తును సంహరించుటకు లక్ష్మణుఁడు ఐంద్రాస్త్ర
మును ప్రయోగించుట సాభిప్రాయముగా నున్నది. మేఘనాదుఁడు
ఇంద్రుని జయించి బంధించి అవమానించి ఇంద్రజిత్తు అను
ప్రఖ్యాతిని పొందెను. అందువలన సకలదేవతలలో ఇంద్రునకు
మేఘనాదునిపై తీవ్రమైన కోప ముండుట సహజము. అందువలన
అయస్త్రమునకు అధిదేవతయైన యింద్రుఁడు తన సకలశక్తిని విని
యోగించి మేఘనాదుని చంపుటకు పూనుకొనుట సహజము. కాని
యింద్రుని శక్తికూడ వానిని సంహరించుటకు సమర్థము కా దేమో
అని లక్ష్మణుఁడు రాముని ధర్మాత్మత్వముపై సత్యసంధతపై
అద్వితీయమైన పరాక్రమముపై ఆధారపడి శపథమును కూడ
చేసెను.

ఎట్టివాఁడు ధర్మాత్ముఁ డగును? ధర్మమును శాస్త్రముల
వలన సంప్రదాయము ననుసరించి తెలిసికొన్నవాఁడు ధర్మజ్ఞుఁడు.
ఆధర్మములను యథావిధిగ ఆచరించువాఁడు ధార్మికుఁడు. అట్లు
ధర్మమార్గమున వర్తించునప్పుడు, అందులకు ప్రతిబంధకము
లుగా ఎన్నిసంకటములు సంభవించినను ధర్మాచరణమును వద
లనివాఁడు ధీరుఁడు. అట్లు ధీరతతో నిరంతరము ధర్మమునే
ఆచరించువానికి ధర్మాచరణము స్వభావమే యగును. ఎట్టి క్లిష్ట
పరిస్థితియందును, ఏది ధర్మమో ఏది యధర్మమో నిశ్చయింప
లేక ఎల్లరును సందేహపడుచున్నప్పుడు కూడ, ధర్మస్వభావుఁడైన

వానికి ధర్మమే స్ఫురించును. అట్లు ఎవనికి ధర్మము ఆత్మ యగునో, అనఁగా మనస్స్వరూప మగునో, వాఁడు ధర్మాత్ముఁడు. ధర్మజ్ఞులైన వా రందఱు ధార్మికులు కాఁజాలరు. "నేను ధర్మ మునే ఆచరింతును; అధర్మమును చేయను" అని దృఢముగా నిశ్చయించుకొన్నవారు కూడ, ప్రబలములైన సంకటములు సంభ వించినప్పుడు కామవేగమునకో క్రోధవేగమునకో తట్టుకొనలేక ధర్మమును తప్పుట సంభవించుచుండును. అట్టి సంకటములలో కూడ ధీరుఁడైనవాఁ డొకానొకఁడే ధర్మమార్గమును వీడక ధర్మ మునే ఆచరించుచుండును. అట్టి ధీరునకే ధర్మము ఆత్మ యగును.

పితృవాక్యమును పాలించుటకు రాముఁడు నిశ్చయించిన ప్పుడు లక్ష్మణుఁడే కాక కౌసల్య, దశరథుఁడు కూడ అనిశ్చ యమునుండి రాముని మరలించుటకు ప్రయత్నించిరి. అమాత్య పురోహితసహాయుఁడై భరతుఁడు రాముని మరలించుటకు ఎంతో ప్రయత్నించెను. తుదకు వసిష్ఠమహర్షి సైతము అందులకు ప్రయ త్నించెను. ఎవరు ఎన్నివిధముల చెప్పినను రాముఁడు తాను గావించినధర్మనిశ్చయమునుండి మరల లేదు. అది ధీరత్వము. ఆధీరత్వమువలన ధర్మము ఆయనకు ఆత్మయే యైనది. అందు వలన ఆయన ధర్మాత్ముఁ డయ్యెను.

సత్యమైన సంధ, అనగా ప్రతిజ్ఞ, ఎవనికి కలదో వాఁడు సత్యసంధుఁడు. ఆసగా చెప్పినమాటను తప్పక నిర్వహించు వాఁడు సత్యసంధుఁడు. రాక్షసులను సంహరింతు నని మహర్షు లకు మాటఇచ్చినతరువాత, సీత ఎంతగా బోధించినను, ఆ మాటనువదలుకొనుటకు రాముఁ డంగీకరింపక రాక్షససంహార మును గావించెను. అట్లే సుగ్రీవునకు విభీషణునకును ఇచ్చిన

మాటప్రకారము ఆయన వాలిని రావణుని సంహరించి వారి రాజ్యముల నొసంగెను. అట్లే ఆయన పదునాలుగేండ్లు వనవాసము చేయుదు నని కైకేయికి ఇచ్చిన మాటను కూడ నిర్వహించి సత్యసంధుఁ డయ్యెను.

ధర్మాత్ముఁడైనవాఁడు సత్యసంధుఁడు కాకుండునా? రాముఁడు ధర్మాత్ముఁ డని చెప్పినతరువాత సత్యసంధుఁ డగు నని వేఱుగా చెప్పుట ఎందులకు? తైత్తిరీయోపనిషత్తులోని ధర్మానుశాసనము నందే "సత్యమును చెప్పుము"; ధర్మమును ఆచరింపుము" అని సత్యము తరువాత ధర్మము పేర్కొనఁబడి యున్నది. సత్యము కూడ ధర్మమే యైనను, అది సకలధర్మములలో శ్రేష్ఠమైన దను విషయమును స్పష్ట మొనర్చుటకే శ్రుతి ముందుగా సత్యమును పేర్కొని తరువాత ధర్మమును చెప్పినది. సత్యమును నిలుపుకొనవలసినప్పుడు, కొన్నిధర్మములను పాటించుటకు వీలులేని పరిస్థితి సంభవించినచో, ఆధర్మములను వదలుకొనియైనను సత్యమును నిలుపుకొనవలసినదే యనుట శ్రుతియొక్క తాత్పర్యముగా గ్రహింపవలసియున్నది. సత్యమును నిర్వహించినతరువాత ధర్మభంగమువలన కలిగినపాపమును తపస్సు మొదలగువానిచేత పోఁగొట్టుకొనవచ్చును. కాని సత్యభంగమువలన కలిగినపాపమును అట్లు పోఁగొట్టుకొనుటకు సాధ్యము కాదన్నమాట. అందువలననే ఏకలవ్యునిబొటనవ్రేలును ఖండింపఁజేయుట అధర్మమే యైనను ద్రోణుఁడు అర్జునునకు ఇచ్చినమాటకొఱకు అట్టియధర్మమునకు పాల్పడెను. ఆయధర్మమువలన కలిగినపాపమును ఆయన ప్రాయశ్చిత్తాదులవలన పోఁగొట్టుకొనెను. అసత్యసంధత వలననే ఆయన బ్రహ్మలోకమునకు పోఁగలిగెను. కౌసల్యమాటను వసిష్ఠునివచనమును నిరాకరించుచు వారిమనస్సునకు కష్టము

కలుగుచున్నప్పటికి రాముఁడు తన వాక్యమును వదలుకొన కుండు టయు నిట్టిదే. ఇట్లు సత్యవాక్యపరిపాలనము విశిష్టమైన దగుటచే ఇందు, రాముఁడు ధర్మాత్ముఁ డని చెప్పినతరువాత సత్యసంధుఁ డనియు పేర్కొనఁబడినది.

అస లీ శపథముల కర్థ మేమి? శపథములవలన విశేష శక్తు లుదయించి ఎట్లు అద్భుతకార్యములు జరుగును? సీతాదేవి శపథము చేసినంతనే ఆంజనేయునివాలమునందున్న యగ్ని దేవుఁడు లంకను తగులఁబెట్టుచు ప్రజ్వలించుచున్నను వాలము నకు చల్లనిస్పర్శను కలిగించు టేమి? లక్ష్మణుని శపథమువలన ఇంద్రాస్త్రమునకు అధికమైన తేజ మెట్లు కలిగినది? శాపము లిచ్చుట వరము లిచ్చుట ఎట్టిదో శపథములు చేయుట కూడ అట్టిదే. తపస్సులు చేసి గాని గురుసేవ పతిశుశ్రూష మొదలగు వానివలనఁ గాని యార్జించినపుణ్యఫలము సాధారణముగా లోకాం తరముననో జన్మాంతరముననో ఫలించును. అట్లు కాక ఆపుణ్య ఫలమును తీవ్రమైనసంకల్పముచేత సంకల్పించుచున్నసమయ ననే ఫలించునట్లు చేయుటయే శాపము నొసంగుట, వరము నిచ్చుట, శపథము చేయుటయు అగుచున్నది. పుణ్యాత్ములు తీవ్రముగ సంకల్పించినప్పుడు, ఫలప్రదాతయైన పరమేశ్వరుని ప్రేరణమున, ఆయాదేవతలు ఆసంకల్పమునకు అనుకూలముగ వర్తింతురు. అందువలన లక్ష్మణునిశపథమువలన ఆయస్త్రము నకు అధిదేవతయైన యింద్రుఁడే కాక అగ్నివాయువరుణాదిదేవ తలు కూడ ఆయస్త్రప్రభావమునకు దోహదము చేసి రని గ్రహింప వలసియున్నది.

ఇంద్రజిత్తు మరణించినంతనే విభీషణునితో కూడి వానరు లందఱును ప్రహర్షముతో జయనినాదములు గావించిరి. అంత

రిక్షమున దేవతలయొక్క మహర్షులయొక్క సాధువాదములు ప్రబలెను. గంధర్వులు పాడిరి. అప్సరసలు ఆడిరి. దేవతలు దుందుభులు ప్రయోగించి పుష్పవర్షమును కురిసిరి. దేవదానవ గంధర్వులు గగనమునందు గుంపులుగా కూడి సంతోషముతో "బ్రాహ్మణులు భయరహితులై నిశ్చింతులై యింక చరింతురు గాక!" అని పలికిరి. ఇంద్రజిత్తుయొక్క వధను చూచి ఇంద్రుఁడు ప్రహృష్టుఁడై మరలపోయెను.

శ్లో॥ ఊచు శ్చ సహితా స్తుష్టా దేవగంధర్వదానవాః।
విజ్వరా శ్శాంతకలుషా బ్రాహ్మణా విచర న్త్వితి॥ 88

యుద్ధ-సర్గ-90

సంతోషించినవారిలో దానవులు కూడ ఉండుట గమనింపఁ దగియున్నది. లంకలో ఉండిరావణునివలన ఉపకారములు పొందుచు సుఖభోగములతో నున్నవారు తప్ప ఇతరప్రాంతము లలో ఉన్నదైత్యులు దానవులు రాక్షసులు కూడ రావణునివలన ఇంద్రజిత్తువలనను భయపడుచునే యున్నారనుట స్పష్టము.

దేవదానవగంధర్వులు తమకు భయము తీరెన దని సంతోషమును ప్రకటింపక, "బ్రాహ్మణులు నిర్భయులై చరింతు" రని పలుకుట యేమి? దేవదానవగంధర్వు లందఱును విశేషశక్తులు కలవారు. వారు ఆశక్తులను వేదవిహితములైన యజ్ఞాదికర్మల వలన ఉపాసనలవలన పొందియుండిరి. అట్లే లోకమున ఎవరి కైనను అభ్యుదయము వేదవిజ్ఞానము వలననే సంభవించు చున్నది. ఆవిజ్ఞానము బ్రాహ్మణులయందు సస్వరమైనవేదరూప మున వెలయుచున్నది. ఖరాదిరాక్షసులవలన నిరంతరభీతిచే బ్రాహ్మణులు అధ్యయనాధ్యాపనములను జపహోమాదికార్యము లను చక్కఁగా నిర్వహించుకొనలేకుండిరి. చిత్రకూటమునుండి

జనస్థానమువఱకు మహర్షులు రామునకు ఈవిషయమునే అనేక విధముల నివేదించుచుండిరి. బ్రాహ్మణులు నిర్భయులై యున్ననే తప్ప వేదధర్మము చక్కఁగా ప్రవర్తింపదు. వేదధర్మము చక్కఁగా ప్రవర్తించిననే తప్ప ఈలోకమున ప్రజలకు సుఖము గాని యితర లోకములలో నున్న దేవపితృగంధర్వాదులకు హవ్యకవ్యముల వలన సంతృప్తి గాని సంభవింపదు. సకలలోకములలో ఎల్లరకు సుఖము శాంతి యుండవలయు నన్నచో, బ్రాహ్మణులు నిర్భయులై వేదధర్మములను ప్రవర్తింపఁజేయుట ఆవశ్యకము. అనఁగా జగత్కళ్యాణమునకు నిర్భయమైన బ్రాహ్మణ్యము మూల మన్నమాట. అందువలన దేవదానవగంధర్వులు తమప్రహర్షమును పైవిధముగా ప్రకటించిరి.

ఇంద్రజిత్తు నిహతుఁ డైనంతనే ఋక్షవానరులవిజృంభణమున హతశేషమైన రాక్షససైన్యము పలాయిత మయ్యెను. రాక్షససహస్రములలో ఒక్కఁడు కూడ రణరంగమున కన్పింపలేదు. లక్ష్మణుఁడు ప్రహృష్టుఁడై విభీషణహనుమంతులను అవలంబించి, జాంబవదాదిపరివృతుఁడై ఋక్షవానరసైన్యములు జయజయనినాదములతో చనుదెంచుచుండ, మెల్లగా రామునియొద్దకు వచ్చి ప్రణమిల్లి పరిశ్రాంతిచే నిట్టూర్చుచు ప్రక్కఁగా నిలుచుండెను. విభీషణుఁడు రామునకు జయము పలికి మహాహర్షముతో, "సౌమిత్రి మేఘనాదుని తలను తెగ నేసె" నని నివేదించెను. రాముఁడు అమితసంతోషముతో తమ్ముని దగ్గరకు తీసికొని మూర్ధాఘ్రాణము గావించెను. అన్న తన్ను మెచ్చుచుండుటకు లక్ష్మణుఁడు లజ్జించుచుండఁగా, రాముఁడు అతనిని కౌఁగిలించుకొని యొడి యందుంచుకొని మాటిమాటికి ప్రీతితో చూచుచు

"వత్సా! దుష్కరకార్య మొనర్చి పరమకళ్యాణమును సాధించితివి; ఇంద్రజిద్వధమున రావణునిదక్షిణబాహువు తెగినట్లే; ఇంక రావణుఁడు కూడ హతుఁ డైనట్లే. నీతోఁ బాటు విభీషణహనుమంతులు కూడ మహాకార్యమును నిర్వహించిరి; ఎట్టైన నేమి మూఁడ హెూరాత్రములకు మేఘనాదుఁడు నిహతుఁ డైనాఁడు; ఇంక రావణుఁడు బయటపడక తప్పదు; నా చేత చచ్చుటయును తప్పదు. తమ్ముఁడా! నీవలన నాకు సీతయే కాదు సర్వవసుంధరయు స్వాధీనమైనది" అని సుషేణుని జూచి, "ఆర్యా! ఈ మహాయుద్ధమున లక్ష్మణవిభీషణాదులైన ఋక్షవానరవీరు లందఱును విక్షతగాత్రులై యున్నారు. వీరి నందఱను విశల్యులను గావించి, ఎల్లరకును స్వాస్థ్యమును గలిగింపుము" అని చెప్పెను.

వెంటనే సుషేణుఁడు లక్ష్మణునకు ఒక పరమౌషధమును వాసన చూపెను. వాసనచూచినమాత్రముననే లక్ష్మణుఁడు విశల్యుఁడు నిర్వ్రణుఁడును అయ్యెను. విభీషణాదులకును సుషేణుఁడట్లే చికిత్సఁ గావించెను. శ్రీరామునిస్కంధావారమున ఆనంద కోలాహలము మిన్నుముట్టెను.

గద్యము

ఆపస్తంబసూత్ర కౌండిన్యసగోత్ర
పోలూరి వేంకటనరసాంబా నారాయణామాత్యపుత్ర
హనుమజ్జానకీరామశర్మ ప్రణీతంబైన
శ్రీరామాయణతరంగిణియందు
ఏకవింశంబైన లక్ష్మణతీర్థంబు
సమాప్తంబు.

# 22. రఘునందనతీర్థము

## 1. రాక్షససేనాసంహారము.

రావణుఁడు పుత్త్రవధను విని పిడుగుమొత్తినట్లు నిశ్చేష్టుఁడై మూర్ఛిల్లి కొంతసేపటికి తెప్పఱిల్లి యిట్లు విలపించెను. "ఇంద్రజిత్తు హతుఁ డయ్యె నని విని ఇప్పుడు దేవగణములు లోకపాలకులు మహర్షులు అందఱును నిర్భయులై సుఖముగా నిద్రింతురు. నాయనా! మేఘనాదా! నీవు గతించినంతనే నాకు మూఁడులోకములు శూన్య మయ్యెను. నేను గతించినప్పుడు నాకు ప్రేతకర్మలు చేయవలసినవాఁడవు నీవు. అది యిప్పుడు విపరీత మైనది కదా! రామలక్ష్మణసుగ్రీవులు బ్రతికియుండఁగా నావైరశల్యమును పెకలింపకయే నన్ను అనాథుని చేసి ఎక్కడకి పోయినావురా! తండ్రీ!" ఇట్లు అతఁడు విలపించుచుండఁగా శోకము తగ్గిపోయి దానికి మాఱుగా కోప మతనిని ఆవేశించెను. అది వైరమూలమైన వైదేహిపై ప్రసరించెను. క్రోధముచేత అతఁడు వికృతాననుఁడగుచు ఏవైపుచూచిన ఆవైపుననున్నరాక్షసులు భీతులై యొదుగఁ జొచ్చిరి. వారిని చూచి అతఁ డిట్లనెను. "వేలయేండ్లు తపస్సుచేసి సంపాదించినబలము నాకున్నది. రణరంగమున నన్ను ఎవఁడు మార్కొనును? నాకొడుకు వానరులను వంచించుటకై మాయాసీతను సంహరించెను. వానిపగతీర్చుకొనుటకై రామునకు ప్రాణసమానమైన సీతను సంహరించి వాని సంకల్పమును యథార్థముగ నిర్వహింతును."

శ్లో॥ అద్య దేవగణా స్సర్వే లోకపాలా మహర్షయః।
హత మింద్రజితం శ్రుత్వా సుఖం స్వప్స్యన్తి నిర్భయాః॥ 10

శ్లో॥ మమ నామ త్వయా వీర గతస్య యమసాదనమ్।
ప్రేతకార్యాణి కార్యాణి, విపరీతే హి వర్తసే॥ 14
యుద్ధ-సర్గ-92

ఇట్లనుచు రావణుఁడు ఖడ్గమును గైకొని అశోకవనమునకు బయలుదేరెను. వానివిజృంభణమును చూచి భృత్యులు ఒకరి నొకరు చూచుకొనుచు, "మనరాజు సామాన్యుఁడు కాఁడు, నలువురు లోకపాలురను జయించినవాఁడు. ఇంక నితఁడు రామలక్ష్మణుల వధించును. బలపరాక్రమములలో మనమహారాజునకు సాటి యెవ్వరు?" అని చెప్పుకొనుచు సింహగర్జనములు గావించుచు అతని వెన్నంటిరి. సుహృత్తులు ఆతనిని స్త్రీహత్యా ప్రయత్నమునుండి వారింప యత్నించుచు పెక్కువిధముల బోధించిరి. అయినను అతఁడు వారిమాటలను వినక వడివడిగా అశోకవనమున ప్రవేశించెను.

క్రోధవికృతాననుఁడై అమితసంరంభముతో ఖడ్గహస్తుఁడై వచ్చుచున్నరావణుని చూచి సీత భీతయై యిట్లు విలపించెను. "వీఁడు నన్ను చంపుటకే వచ్చుచున్నాఁడు. నే నప్పుడు క్షుద్రురాలనై హనుమంతునిమాటను విన నైతిని. అప్పు డాతనిమాట వినియున్నచో తత్క్షణమే పతియొద్దకు చేరియుందును. ఇప్పుడు నా కీగతి పట్టియుండెడిది కాదు." ఇట్లు విలపించుచు ఆమె కౌసల్యను తలఁచి జాలిపడి మంథరను కైకను నిందింపఁ జొచ్చెను.

శ్లో॥ హనూమత స్తు తద్వాక్యం న కృతం క్షుద్రయా మయా।
య ద్యహం తస్య పృష్ఠేన తదా యాయా మనిర్జితా॥ 55
శ్లో॥ నాద్యైవ మనుశోచామి భర్తు రంకగతా సతీ॥ 56
యుద్ధ-సర్గ-92

హనుమంతునివీఁపుపై రామునియొద్దకు చేరుట అనుచిత మని ఎన్నోవిధముల దృఢముగా నిరూపించినసీత ఇప్పుడు అదియే మంచి దని భావించుచున్న దన్నచో ప్రాణభీతి ఎంత వారి కైనను ఎంత మనోవైకల్యము నైనను గలిగింపఁగల దనుట స్పష్టము.

ఇంతలో సుపార్శ్వుఁ డనుమంత్రి రావణుని చేరి సాను నయముగా ఇట్లు మందలించెను. "మహారాజా నీకు తెలియని ధర్మములు లేవు. నీవు సాక్షాత్తుగా వైశ్రవణుని సోదరుఁడవు; వేద విద్యాప్రతస్నాతుఁడవు; స్వకర్మనిరతుఁడవు. ఇట్టి నీవు స్త్రీ హత్యను గావింపవలయు నని ఎట్లు అనుకొనుచున్నావు? నీ క్రోధము నంతను వీరోచితముగా రామలక్ష్మణులపైఁ జూపి పగఁ దీర్చుకొనుము. నేఁడు కృష్ణచతుర్దశి రేపు అమావాస్యనాఁడు యుద్ధమునకు బయలుదేరి రాముని సంహరించి మైథిలిని పొందుము."

శ్లో॥ వేదవిద్యావ్రతస్నాత స్స్వకర్మనిరత స్తథా।
స్త్రియాః కస్మా ద్వధం వీర మన్యసే రాక్షసేశ్వర॥ 64

శ్లో॥ అభ్యుత్థానం త్వ మద్యైవ కృష్ణపక్షచతుర్దశీ।
కృత్వా నిర్యా హ్యమావాస్యాం విజయాయ బలై ర్వృతః॥66
యుద్ధ-సర్గ-92

మంత్రిమాటలను మన్నించి రావణుఁడు వెనుకకు మరలి సభకు వచ్చి సింహాసనమున కూర్చుండి బలముఖ్యులను చూచి ప్రాంజలియై యిట్లనెను. "చతురంగబలములతో ఇప్పుడు మీరు పోయి రాముని చుట్టుముట్టుఁడు. నేను రేపు మీతో కూడి రాముని సంహరింతును."

వారు ఆమాటలతో సుద్రిక్తులై నానాయుధపాణులై చతురంగబలములతో వచ్చి ఋక్షవానరులపై విజృంభించి ప్రాణములను లెక్కింపక పోరఁజొచ్చిరి. సూర్యోదయసమయమునకు యుద్ధము ఘోర మయ్యెను. అనఁగా వారు చతుర్దశినాఁటి రాత్రియే యుద్ధమునకు వచ్చిరన్నమాట.

శ్లో॥ స సంగ్రామో మహాభీమ స్సూర్య స్యోదయనం ప్రతి। 8

యుద్ధ-సర్గ-93

రాక్షసులధాటికి నిలువఁజాలక ఋ వానరులు రాముని శరణుఁజొచ్చిరి. రాముఁడు రాక్షససైన్యమున ప్రవేశించి శరవర్షమున నుఱుమాడఁజొచ్చెను. విధ్వస్త మగుచున్న రథగజహయాదులు కన్పించుచుండెను, కాని రాముఁడు కన్పింపకుండెను. రాముఁడు గాంధర్వాస్త్రమును ప్రయోగించెను. దానిప్రభావమున రాక్షసులకు రామసహస్రము కన్పింపఁజొచ్చెను. రాక్షసులు ఒండొరులను రామునిగాఁ దలంచుచు చంపుకొనఁజొచ్చిరి; కొంత సేపటికి రాముఁడు మరల కుండలీకృతకార్ముకుఁడై కన్పించెను. అప్పుడు కూడ అలాతచక్రమువలె గిరగిరఁ దిరుగుచున్న కాంచన కార్ముకాగ్రమును మాత్రమే రాక్షసులు చూడఁగలిగిరి, కానీ వారికి రాముఁడు కన్పింపలేదు. రామునిధనుశ్చక్రమును వారు కాలచక్రముగనే తలంపఁజొచ్చిరి. పదివేలరథములు, పదునెనిమిదివేలయేనుఁగులు, పదునాల్గువేలహయములు, రెండులక్షల పదాతిబలము దివసముయొక్క అష్టమభాగమున రామునిచే హత మయ్యెను. హతశేషులు పలాయితు లైరి. దేవగంధర్వాదులు విస్మితులై సాధువాదములు గావించిరి. రాముఁడు సమీపమునందున్న సుగ్రీవవిభీషణహనుమజ్జాంబవదాదులను చూచి, "ఈ

దివ్యమైనయస్త్రబలము నాయందుఁ గాని లేక త్ర్యంబకునియందుఁ గాని మాత్రమే కన్పించును" అని చెప్పెను.

శ్లో॥ ఏత దస్త్రబలం దివ్యం మమ వా త్ర్యంబకస్య వా॥ 38

యుద్ధ-సర్గ-93

ఇందు రాముఁడు విష్ణువును పేర్కొనకుండుట గమనింపఁదగియున్నది. తాను విష్ణువుయొక్క అంశమున జన్మించె నని చెప్పుట ఆయనయభిప్రాయమై యుండును.

అద్భుతముగా అమితభయంకరముగా అప్రతిమమైనయా రాక్షసంహారము జరిగినంతనే రాక్షసీరాక్షసులు భయభ్రాంతులై గుంపులు కూడి యిట్లు విలపింపఁజొచ్చిరి. "వృద్ధురాలు కరాళయు నైన యీ శూర్పణఖ కందర్పసుందరుఁడైనయారాము నెట్లు చేరినది? లంకానివాసులయొక్క ఖరదూషణాదులయొక్క భాగ్యహీనతవల్ల లోకవధ్యురాలైన యీశూర్పణఖ ముడుతలు పడినశరీరముతో తెల్లనివెంట్రుకలతో వృద్ధురా లయ్యును యువకుఁడైన రాముని కామించినది. ఆనిమిత్తముననే రావణుఁ డీవైరమును పూనినాఁడు. విరాధకబంధఖరాదులవధ వాలిసంహారము రామునియజేయత్వమునకు నిదర్శనములు. కావున ఇంక రావణుఁడు హతుఁడు కాక తప్పదు. అతఁడు విభీషణుహితవచనములను వినియున్నచో లంక యిట్లు శ్మశానమై యుండదు. కుంభకర్ణుఁడు ఇంద్రజిత్తు నిహతు లైనను రావణుఁడు అపాయమును తెలిసికొనకున్నాఁడు. ఆయనకు దేవతలవలన భయము లేకున్నను మానవులవలన ఉండనే యున్నది. ఈసీత రాక్షసజాతికి కాలరాత్రియే. రామునినుండి మనలను రక్షించువా రెవ్వరును లేరు. అతనినే శరణముపొందినవిభీషణుఁడు మంచిపని చేసినాఁడు."

## 2. విరూపాక్షాదులవధ

ఈయార్తనాదములను విలాపములను వినుచు రావణుఁడు క్రుద్ధుఁడై మహోదరమహాపార్శ్వవిరూపాక్షులను యుద్ధమునకు బయలుదేర నాజ్ఞాపించి, తానును బీరములు పలుకుచు సహస్ర కలశసమన్వితమై జాంబూనదస్తంభవిరాజితమై అష్టతురంగ యుక్తమైన మహారథము నధిష్ఠించి బయలుదేరెను. వానివెంట లక్షరథములు మూఁడులక్షలయేనుఁగులు అఱువదికోట్లహయ ములు అంతసంఖ్యయే గలిగినఖరములు ఉష్ట్రములు, అసంఖ్యాక మైన పదాతిబలము బయలుదేరెను. అప్పుడు ఉల్కాపాతము రుధిరవర్షము నక్కలకూఁతలు వామనేత్రబాహుస్పందనము మొదలుగా పెక్కు ఉత్పాతములు గోచరించెను. రావణుఁడు వానిని లెక్కపెట్టక రణరంగమున ప్రవేశించి ఋక్షవానరుల నుఱుమాడుచు పోయి రాము నెదుర్కొనెను.

రావణునివిజృంభణమును చూచి రాక్షసులు ఋక్షవాన రులపైఁ బడిరి. ఆదాడియొక్క తీవ్రతను చూచి సుగ్రీవుఁడు తన గుల్మమున సుషేణుని నిలిపి రాక్షససైన్యమున ప్రవేశించి దానిని కసిమసంగఁజొచ్చెను. అది సహింపక విరూపాక్షుఁడు తనపేరు చెప్పుకొనుచు రథమునుండి దుమికి గజము నారోహించి సుగ్రీవుని శరవర్షమున ముంచెను. సుగ్రీవుఁడు క్రుద్ధుఁడై యొకవృక్షముతో గజమును కూల్చెను. విరూపాక్షుఁడు గజమునుండి దూఁకి ఖడ్గ మును గైకొని సుగ్రీవుని ప్రహరించెను. సుగ్రీవుఁడు సొమ్మసిల్లి వెంటనే తెప్పతిల్లి వానిని పిడికిలితో పొడిచెను. వాఁడు దానిని తప్పించుకొని సుగ్రీవునివక్షమున పిడికిటితో ప్రహరించెను. సుగ్రీవుఁడు విరూపాక్షునిలలాటమున ముష్టిప్రహారము గావించి కూల్చెను.

విరూపాక్షునివధనుచూచి రావణుఁడు దైవవివర్యయము నకు వ్యథితుఁడై చెంతనున్నమహోదరుని చూచి, "ఇప్పుడు నాకు జయాశ నీయందే యున్నది. స్వామిఋణము తీర్చుకొనుసమ యము వచ్చినది; విక్రమింపుము; శత్రువుల వధింపుము" అని ప్రోత్సహించెను.

వాఁడు రథారూఢుఁడై వానరసైన్యమునఁ జొచ్చి దానిని నిర్దహింపఁజొచ్చెను. సుగ్రీవుఁడు వానిపై మహాశిలాపాదపములను ప్రయోగించెను. వాఁడు వానిని బాణములతో చేదించెను. సుగ్రీ వుఁడు క్రిందపడియున్నపరిఘమును గైకొని వానిహయములను చదిపెను. వాఁడు రథమునుండి దూఁకి గదను విసరి సుగ్రీవుని చేతియందున్న పరిఘమును భగ్న మొనర్చెను. సుగ్రీవుఁడు ముసలమును గైకొనఁగా మహోదరుఁడు మరల గదను ప్రయో గించెను. ఒండొంటిని దాఁకి రెండును భగ్నములై నేలఁగూలెను. మహోదరుఁడు ఖడ్గమును గైకొనఁగా సుగ్రీవుఁడు కూడ ఖడ్గ మును గైకొని వానిని మార్కొనెను. చాలసేపు వారు ఖడ్గయుద్ధ మును సమముగాఁ గావించిరి. తుదకు మహోదరుఁడు సుగ్రీ వునికవచముపై ఖడ్గప్రహారము గావించెను. కత్తి కవచమునందు దిగఁబడెను. మహోదరుఁడు కత్తిని లాగుకొనుచుండఁగా సుగ్రీ వుఁడు వాని శీర్షమును ఖండించెను.

మహోదరునివధమును చూచి వానివెంటనున్నసైన్యము పలాయిత మయ్యెను. రాముఁడు హర్షము నొందఁగా రావణుఁడు క్రుద్ధుఁ డయ్యెను.

మహాపార్శ్వుఁడు క్రోధముతో సుగ్రీవునిపైకి వచ్చుచుం డఁగా అంగదుఁడు వానిని మార్కొనెను. మహాపార్శ్వుఁడు శర

పరంపరలను కురియుచుండఁగా అంగదుఁడు పరిఘమును గైకొని వానిపై విసరెను. దానిఘాతమునకు సూతునితో కూడ వాఁడు విచేతనుఁడై రథమునుండి క్రిందికి దొరలెను. ఇంతలో జాంబవంతుఁ డొకమహాశిలను వైచి వానిరథాశ్వములను అంత మొందించెను. మహాపార్శ్వుఁడు స్మృతి నొంది అంగదగవాక్ష జాంబవంతులను శరములతో ప్రహరించెను. అంగదుఁడు పరిఘమును గైకొని విసరి వానిధనుస్సును శిరస్త్రాణములను భగ్న మొనర్చి అమితవేగమున పోయి వాని కర్ణమూలమున చఱచెను. వాఁడు పరశ్వధమును గైకొని యంగదునివామాంసఫలకమున విసరెను. అంగదుఁడు ఆపరశ్వధమును పైనఁ బడకుండ పట్టుకొని విసరివైచి ముష్టిఘాతమున వానిహృదయమును ప్రక్కలంచెను. రామాదులు అంగదుని ప్రశంసించుచుండఁగా వానరులు సింహనాదము గావించిరి.

## 3. లక్ష్మణమూర్ఛ

తనయనుచరులగతిని చూచి రావణుఁడు మహాక్రోధమున సూతుని చూచి, "సూతా! సీతాపుష్పము, ఆశ్రితఫలప్రదము, సుగ్రీవాదిప్రశాఖమైన రామవృక్షమును నిర్మూలించి గతించిన రాక్షసులపగను తీర్చెదను; రథమును రామునిపైకి పోనిమ్ము" అనెను. సూతుఁ డట్లే రథమును ముందుకు నడిపెను.

రావణుఁడు తనమార్గమున కడ్డముగా నున్న వానరసైన్యమున ప్రవేశించి తామసాస్త్రమున దానిని నిర్మూలింపఁజొచ్చెను. వానరులు పలాయితులైరి. రావణునకు రామలక్ష్మణులు దృగ్గోచరులైరి. లక్ష్మణుఁడు ముందునకు వచ్చి రావణుని మార్కొనెను. అతఁడు లక్ష్మణుని అతిక్రమించి రామునకు అభిముఖుఁ

డయ్యెను. రామరావణులబాణవర్షమున ఆకాశము గవాక్షితము వలె నయ్యెను. రావణుఁడు నారాచములను రామునిలలాటమున ప్రయోగించెను. నీలోత్పలదళప్రభమైన యానారాచమాలను రాముఁడు శీర్షమున వహించి వ్యథ నొందక రౌద్రాస్త్రమును ప్రయోగించెను. అది రావణునికవచమును ఛేదింపలేక వితథ మయ్యెను. రాముఁడు మరల రావణునిలలాటమున పరమాస్త్ర మును ప్రయోగింపఁగా, అది బహుబాణములుగా విభక్తమై రావ ణునిపైకి వచ్చెను. వాఁడు దానిని శరపరంపరలతో ప్రతిహత మొనర్చి అసురాస్త్రమును ప్రయోగించెను. దానినుండి సింహ వ్యాఘ్రాదిముఖములతో పెక్కుబాణములు బయలుదేరెను. రాముఁడు ఆగ్నేయస్త్రమున దానిని హత మొనర్చెను. రావ ణుఁడు మయునిచే నిర్మింపఁబడిన మఱియొకయస్త్రమును ప్రయో గింపఁగా దానినుండి శూలగదాముద్గరముసలాదులు ప్రభవింపఁ జొచ్చెను. రాముఁడు దానిని గాంధర్వాస్త్రమున వితథ మొన రించెను. రావణుఁడు సౌరాస్త్రమును ప్రయోగించెను. దానినుండి వెలువడుచున్న యగ్నిచక్రములను రాముఁడు బాణపరంపరలచే భగ్న మొనర్చెను. రావణుఁడు పదిబాణములతో రామునిమర్మ ములందు ప్రహరించెను. రాముఁడు కూడ రావణుని శరవర్ష మున ముంచి అతఁడు విచేతనుఁ డగుటఁ జూచి కొంత విరా మము నొసంగెను.

రావణుఁడు తేఱుకొన్నంతనే లక్ష్మణుఁడు ఏడుబాణము లతో రావణునిరథముపైనున్న మనుష్యశీర్షధ్వజమును ఛేదించి యొకబాణమున సారథిని కూల్చి అయిదుశరములతో ధనుస్సును విఱుగఁగొట్టెను. విభీషణుఁడు ముందునకు వచ్చి గదతో రథా శ్వములను కూల్చెను. రావణుఁడు రథమునుండి దూఁకి యొక మహాశక్తిని విభీషణునిపై ప్రయోగించెను. లక్ష్మణుఁడు దానిని

శరములతో ఛేదించెను. రావణుఁ డంతకన్నను బలవత్తరమై అమోఘమైనశక్తిని గైకొని విభీషణు నుద్దేశించి గిరగిరఁ ద్రిప్పఁ జొచ్చెను. విభీషణునకు ప్రాణసంశయస్థితి దాపురించెను. దానిని వారించుటకై లక్ష్మణుఁడు ముందునకు వచ్చి రావణునిపై శర వర్షమును కురిసెను. రావణుఁడు దాని నెల్ల ఆశక్తిచేతనే వారించి లక్ష్మణుని చూచి యిట్లనెను. "లక్ష్మణా! నీబలము శ్లాఘ్యము; విభీషణుని తప్పించితివి. కావున ఇది నీపై పడకతప్పదు. ఇది నీప్రాణములను హరించుట నిశ్చితము." ఇట్లనుచు రావణుఁడు మయనిర్మితము మాయాశక్తిమహితము అష్టఘంటాసమలంకృత మును అయినయామాయాశక్తిని ప్రయోగించెను. అది పరమభయం కరముగా వచ్చుచుండఁగా చూచి రాముఁడు, "సౌమిత్రికి స్వస్తి యగును గాక! ఓశక్తీ! నీవు హతోద్యమవై వ్యర్థ మగుము" అని పలికెను. అది మహావేగమున వచ్చి లక్ష్మణుని వక్షమును చీల్చి భూమియందు దిగఁబడెను. నేలవ్రాలినలక్ష్మణుని చూచి రాముఁడు వ్యథితుఁడై, "ఇది విషాదమునకు సమయము కా" దని రావణుని మార్కొని ఘోరయుద్ధ మొనర్పఁజొచ్చెను.

వానరవీరులు లక్ష్మణుని జేరి ఆశక్తిని పెకలింపఁజాలక పోయిరి. రాముఁడు వచ్చి దానిని రెండుచేతులతో పట్టిలాగి విఱిచివైచెను. ఆన్యవధానమున రావణుఁడు విరామము నొసం గక రామునిపై శరవర్షమును కురిసెను. రాముఁడు దానిని లెక్క పెట్టక తమ్ముని కౌఁగిలించుకొని హనుమత్సుగ్రీవులను చూచి, "మీరు వీనికి చుట్టును నిలిచి కాపాడుచుండుఁడు. ఇది పరా క్రమకాలము గాని శోకమునకు సమయము కాదు. నాకంటఁబడి రావణుఁడు బ్రతికిబయటపడరాదు. మీ రందఱు సుఖముగా పర్వతాగ్రములయందు ఆసీనులై రామరావణయుద్ధమును చూడుఁడు. గంధర్వులు దేవతలు ఋషులు మొదలుగా మూఁడు లోకములవారు యుద్ధమున రామునియొక్క రామత్వమును

చూతురు గాక! ఈలోకమున యుద్ధము జరిగినప్పు డెల్ల ఈ భూమి యున్నంతవఱకు మనుష్యులే కాక దేవతలు కూడ నా పరాక్రమమునుగూర్చి చెప్పుకొనునట్లుగా విక్రమింతును" అని చెప్పి రాముఁడు రావణుని శరవర్షమున ముంచెను. రామరావణుల శరసంఘాతముచేత ఆకాశము నిరంతర మయ్యెను.

శ్లో॥ సుఖం పశ్యత దుర్ధర్షా యుద్ధం వానరపుంగవాః।
ఆసీనాః పర్వతాగ్రేషు మ మేదం రావణస్య చ॥ 54

శ్లో॥ అద్య పశ్యన్తు రామస్య రామత్వం మమ సంయుగే।
త్రయో లోకాః సగంధర్వా స్సదేవా స్సర్షి చారణాః॥ 55

శ్లో॥ అద్య కర్మ కరిష్యామి య ల్లోకా స్సచరాచరాః।
సదేవాః కథయిష్యన్తి యావ ద్భూమి ర్ధరిష్యతి।
సమాగమ్య సదా లోకే యథా యుద్ధం ప్రవర్తితమ్॥ 56

యుద్ధ-సర్గ-100

రాముఁడు యుద్ధము చేయుచుండియే సుషేణుని చూచి, "సుషేణా! చూడుము లక్ష్మణుఁడు వ్యథితుఁడై నేలపైఁబడి పామువలె పొర్లుచున్నాఁడు. ప్రాణములకన్నను ప్రియతరుఁడైన వీఁ డిట్లు రక్తపుమడుగులో పొరలుచుండఁగా చూచుచున్న నాకు యుద్ధము చేయుటకు శక్తి ఎట్లు కలుగును? నాపరాక్రమము సిగ్గు పడుచున్న ట్లున్నది. చేతినుండి విల్లు జాఱు నట్లున్నది. బాణములు పట్టుతప్పుచున్నవి. దృష్టిబాష్పాకుల మగుచున్నది. శోకము ప్రబలమై మూర్ఛ వచ్చునట్లున్నది" అని విలపింపఁజొచ్చెను. మర్మాభిహతుఁడైన లక్ష్మణుడు బాధతో అఱచుచు పొరలు చుండెను. తమ్ముని దుస్థితిని చూచి రాముఁడు మహాక్రోధమున రావణుని రథమును విఱుగఁగొట్టి సూతుని కూల్చి హయములను

చంపి దీప్తములైనబాణములతో వాని శరీరము తూట్లు పడు నట్లుగా ప్రహరించెను. రావణుఁడు ఆబాణవేగమును సహింపఁ జాలక పలాయితుఁ డయ్యెను.

శ్లో॥ లజ్జతీవ హి మే వీర్యం భ్రశ్య తీవ కరా ద్ధనుః।
సాయకా వ్యవసీద న్తి దృష్టి ర్బాష్పవశం గతా॥ 6
యుద్ధ-సర-101

అప్పుడు రాముఁడు తమ్మునియొద్దకు వచ్చి వానిని కౌఁగి లించుకొని యిట్లు విలపింపఁజొచ్చెను. "అయ్యో! ఇంక నేను విజ యమును సాధించినను అది నా కేమి ప్రీతిని కలిగించును? ఈ యుద్ధముతో నిం కేమి పని? ప్రాణములతోనైన నా కేమి పని యున్నది? వీఁడు సర్వమును త్యజించి నావెంట ఎట్లు వచ్చి నాఁడో అట్లే నేనును వీనివెంట యమలోకమునకు పోయెదను. ఏదేశమం దైనను భార్యలు లభింతురు. ఎక్కడ నైనను బంధు వులు కూడ ఏర్పడుదురు. సహోదరుఁడు లభించుదేశము మాత్రము ఎక్కడను కన్పింపదు. అయోధ్యకు పోయితి నేని సుమిత్ర కేమి చెప్పుదును? కౌసల్యతో నే మందును? భరత శత్రుఘ్నులమొగము లెట్లు చూడఁగలను? అక్కడ కలుగు బంధు విగర్హణముకన్న నాకు ఇచ్చుట మరణమే శ్రేయస్కరము. అక్కటా! జన్మాంతరమున నే నేమి పాపమును చేసితినో కదా! నాయెదుటనే నాకు ప్రాణాధికుఁడైన తమ్ముఁడు నిహతుఁ డైనాఁడు."

శ్లో॥ దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః।
తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః॥ 15
యుద్ధ-సర్గ-101]

సుషేణుఁడు రాముని ఓదార్చుచు నిట్లు చెప్పెను. "రామభద్రా! సేనాముఖమున బాణఘాతముతో తుల్యమైన యీశోకమును వీడుము. లక్ష్మణుఁడు మృతి నొందలేదు. అట్టిలక్షణములేవియు ఇతనియందు కన్పించుట లేదు. వీనికి ముఖమునందు కాంతి తప్ప లేదు. దుఃఖింపకుము." ఇట్లు రాముని ఓదార్చి సుషేణుఁడు హనుమంతుని చూచి, "పూర్వము నీకు జాంబవంతుఁడు చెప్పియున్నాఁడు కదా! ఓషధిపర్వతమున దక్షిణశృంగమునం దున్న విశల్యకరణి సంధానకరణి అను నోషధులను గొనివచ్చి సౌమిత్రి నుజ్జీవింపఁజేయుము" అని చెప్పెను.

వెంటనే హనుమంతుఁడు ఓషధిపర్వతమునకు మనోవేగమున పోయెను. అచ్చట నున్న యసంఖ్యాకములైనతీగలలో ఆయన సుషేణుఁడు చెప్పినయోషధులను గుర్తింపఁజాలక ఆ శిఖరమును పెకలించి ముహూర్తమాత్రమున లంకకు తీసికొని వచ్చి యొకచోట దింపెను. కొంచెము విశ్రమించి సుషేణుని పిలిచి, "అయ్యా! నీవు చెప్పినయోషధు లేవో నాకు తెలియ లేదు; ఇదిగో ఆశిఖరమును తెచ్చితిని; ఆయోషధులను నీవే పరిశీలించి గైకొనుము" అని చెప్పెను. ఆంజనేయునివేగమునకు ఎల్లరును విస్మితు లైరి.

సుషేణుఁడు ఆంజనేయు నభినందించి ఓషధులను తెచ్చి నలిపి లక్ష్మణునకు వాసన చూపించెను. వెంటనే లక్ష్మణుఁడు వ్రణబాధారహితుఁడై లేచి కూర్చుండెను. వానరులు సాధువాదములు జయనాదములు గావించిరి. రాముఁడు లక్ష్మణుని కౌఁగిలించుకొని. "వత్సా! భాగ్యవశమున మృత్యువునుండి బయల్పడిన నిన్ను జూడఁగలిగితిని; నీవు గతించినచో నాకు జీవితము గాని సీతతోఁ గాని యీవిజయముతోఁ గాని పని యే మున్నది?"

అనెను. లక్ష్మణుఁడు నీరసత్వమువలన శిథిలస్వరముతో మెల్లగా నిట్లనెను. "అన్నా! భార్యాపహర్తను చంపుదు నని పూర్వము ప్రతిజ్ఞ చేసి, సత్యపరాక్రముఁడ వయ్యును, సత్యహీనుఁడైన యొక యల్పునివలె, ఇట్లు మాటాడుట తగదు. సత్యవాదులు ప్రతిజ్ఞను వితథ మొనరింపరు. ప్రతిజ్ఞాపాలనము కదా మహత్త్వమునకు లక్షణము. నాకొఱకు నీవు నైరాశ్యమును పొందఁదగదు. రావణుని ఇప్పుడే సంహరించి ప్రతిజ్ఞను పాలింపుము. తీక్ష్ణదంష్ట్రలుగలిగి గర్జించుచున్న సింహమునకు కన్పించిన మహాగజమువలె, నీబాణపథమునకు గోచరుఁడైన శత్రువు బ్రతికిపోవుట యేమి? సూర్యుఁ డస్తమించులోపల ఆదురాత్ముఁడు శీఘ్రముగ వధింపఁబడవలయు ననియే నేను కోరుచున్నాను.

శ్లో॥ తాం ప్రతిజ్ఞాం ప్రతిజ్ఞాయ పురా సత్యపరాక్రమ।
లఘుః కశ్చి దివాసత్త్వో నైవం త్వం వక్తు మర్హసి॥ 51

శ్లో॥ న హి ప్రతిజ్ఞాం కుర్వన్తి వితథాం సత్యవాదినః।
లక్షణం హి మహత్త్వస్య ప్రతిజ్ఞాపరిపాలనమ్॥ 52

శ్లో॥ నైరాశ్య ముపగన్తుం చ నాలం తే మత్కృతేఽనఘ।
వధేన రావణ స్యాద్య ప్రతిజ్ఞా మనుపాలయ॥ 53

శ్లో॥ న జీవన్ యాస్యతే శత్రు స్తవ బాణపథం గతః।
నర్దత స్తీక్ష్ణదంష్ట్రస్య సింహ స్యేవ మహాగజః॥ 54

శ్లో॥ అహం తు వధ మిచ్ఛామి శీఘ్ర మస్య దురాత్మనః।
యావ దస్తం న యా త్యేష కృతకర్మా దివాకరః॥ 55

యుద్ధ-సర్గ-101

## 4. రావణరథాపనయనము

లక్ష్మణుఁ డిట్లు చెప్పుచుండఁగా రావణుఁడు వేఱొకరథ మును గైకొని వచ్చెను. రాముఁడు లేచి సన్నద్ధుఁడై నేలపై నిలు చుండి రావణునితో యుద్ధము చేయఁజొచ్చెను. ఆయుద్ధమును చూచుటకు దేవతలు ఋషులు ఆకాశమునందు గుంపులు కూడిరి. రావణుఁడు రథమునం దుండఁగా రాముఁడు నేలపై నుండి పోరాడుట అసమయుద్ధముగా నున్న దని వారు చెప్పుకొనఁ జొచ్చిరి. ఆమాటలను విని మహేంద్రుఁడు తనరథమును రామున కిమ్మని మాతలిని పంపెను. మాతలి రథమును తెచ్చి రాముని చూచి ప్రాంజలియై, "రామభద్రా! అమరేశ్వరుఁడు నీవిజయ మునకై రథమును పంపినాఁడు; ఇది యైంద్రమైన మహాచాపము; ఇది దివ్యమైన కవచము; ఇవిగో ఆదిత్యసంకాశములైన శర ములు; ఇదియే శక్తి; నీవు రథము నారోహించి వీని నుపయో గించుకొనుచు రావణుని సంహరింపుము" అని విన్నవించెను.

రాముఁడు రథమునకు నమస్కరించి దాని నధిరోహిం చెను. రథారూఢులైన రామరావణుల ద్వంద్వయుద్ధము అద్భుత ముగా నుండెను. రావణుఁడు ప్రయోగించినగాంధర్వమును గాంధ ర్వముచేత, దైవమును దైవముచేత రాముఁడు ప్రతిహత మొన ర్చెను. రావణుఁడు రాక్షసాస్త్రమున పన్నగములను సృష్టింపఁగా రాముఁడు గారుడాస్త్రమున వానిని హరించెను. పదితలలతో ఇరు వదిచేతులతో రావణుఁడు విజృంభించి మాతలిని శరపరంపరచే పీడించి దివ్యమైనకాంచనకేతువును ద్రుంచి హయములను విక్షత ములఁ గావించెను. అది చూచి దేవతలు విభీషణాదులును విషా దము నొందిరి. బాణమును సంధించుటకు కూడ రామునకు

పీలులేనంతవేగమున రావణుఁడు శరములను వర్షించెను. రాముఁడు క్రుద్ధుఁడై విజృంభించెను. అసురులు దశగ్రీవునకు జయము పలుకుచుండఁగా దేవతలు ఋషులు ఋక్షవానరవీరులు రామునకు జయము పలుకఁజొచ్చిరి. రావణుఁ డొకమహాశూల మును అతిప్రయత్నముతో రామునిపై ప్రయోగించెను. రాముఁడు దానిపై పెక్కుశరములను ప్రయోగించెను. అవి యన్నియు వ్యర్థము లగుటఁ జూచి రాముఁడు ఇంద్రుఁ డొసంగినశక్తిని దానిపై ప్రయోగించెను. శక్తిచే శూలము భగ్న మయ్యెను. పర స్పరబాణఘాతములచేత రామరావణు లిర్వురును పూచినమోదు గులవలె నైరి.

రాముఁడు రావణుని సమీపించి రోషముతో ఇట్లనెను. "ఓయీ! నేను లేకుండఁ జూచి నాభార్యను దొంగిలించి శూరుఁడ నని తలంచుచున్నావు. నాయెదుట నీ వామెను సమీపించి యున్నచో అప్పుడే హతుఁడవై యుండెడివాఁడవు. శూరుఁడ నని చెప్పుకొనుచు దొంగతనముగా సీత నెట్లు హరించితివి? ఇప్పటికి నిన్ను దండించుటకు అవకాశము కలిగినది. ఇప్పుడు నీతలను తెగనేసి క్రవ్యాదములకు భూరిభోజనము కల్పింతును." ఇట్లనుచు రాముఁడు రావణుని శరాసారమున ముంచెను. అప్పుడు రామునకు వీర్యబలోత్సాహహర్షములు రెట్టింపయ్యెను; సకలాస్త్రములును ప్రతిభాసింపఁజొచ్చెను. ఆయనయొక్క బాణప్రయోగమునందు కూడ వేగము హెచ్చెను. రామునిబాణపరంపరలచేత వానరుల శిలాపాదపవర్షముచేత కాలుచేయాడక రావణుఁడు ప్రతిక్రియ చేయలేకుండెను. రావణునిదుస్థితిని చూచి సారథి రథమును రణ రంగమునుండి చాలనిపుణముగా తప్పించి యవ్వలకుఁ గొని పోయెను.

రావణుఁడు క్రుద్ధుఁడై సూతుని చూచి, "ఓయీ! ఏల యిట్లు చేసితివి? ఎందులకు మహావీరుఁడనైన నన్ను లెక్కపెట్టక, నా యభిప్రాయము నెఱుంగక రథమును శత్రుసమక్షమునుండి తప్పించితివి? చిరకాలార్జితమైన నాయశమును నాశ మొనర్చితివే! ప్రఖ్యాతవీర్యుఁడైన శత్రువు చూచుచుండఁగా, యుద్ధలుబ్ధుఁడనైన నేను కాపురుషుఁడను గావింపఁబడితిని; నీవు అజ్ఞానము చేతనో లేక శత్రువులచే బహుమతి నొందియో యిట్లు చేసియుందువని తలంతును; ఈపని శత్రువునకు తగును గాని హితకాంక్షికి తగదు; శత్రువు తొలఁగిపోకముందే త్వరగా రథమును రణరంగమునకు మరలింపుము" అని గద్దించెను.

సూతుఁడు రావణు ననునయించుచు ఇట్లు చెప్పెను. "మహారాజా! నేను పిఱికివాఁడను గాను; మూఢుఁడను గాను; శత్రువులవలన నుపస్కారమును పొందలేదు. నీహితమును మాత్రమే కోరి నీయశస్సును రక్షించుటకే నీకు అప్రియ మైనను ఇట్లు గావించితిని. నీవు అల్పునివలె అనార్యునివలె నన్ను దోషదృష్టితో చూడఁదగదు. మహాయుద్ధమున నీవు పరిశ్రాంతుఁడవై తివి. నీయందు వీర్యప్రకర్షము కన్పించుట లేదు. గుఱ్ఱములును అలసిపోయినవి. సూతుఁడు దేశకాలములను రథి యొక్క బలాబలములను ఉపసర్పణాపసర్పణములను గుర్తించుచుండవలె. నీకు హయములకు కూడ కొంత విశ్రాంతి కలిగించుటకొఱకే యిట్లు చేసితిని. ఇంక నేమి చేయుమందువో ఆజ్ఞాపింపుము. అట్లే చేసెదను."

రావణుఁడు సంతుష్టుఁడై వానికి హస్తాభరణములను బహూకరించి, "రామునకు అభిముఖముగా రథముఁ దోలుము; రణమునందు శత్రువులను చంపక రావణుఁడు వెనుకకు మరలఁడు"

అనెను. సూతుఁడు రథమును మరలించి రణరంగమునకు తెచ్చెను.

శ్లో॥ రథం శీఘ్ర మిమం సూత రాఘవాభిముఖం నయ।
నాహత్వా సమరే శత్రూన్ నివర్తిష్యతి రావణః॥ 25
యుద్ధ-సర్గ-104

దీనితర్వాత ప్రసిద్ధమైన యాదిత్యహృదయస్తోత్ర మున్నది. ఈసర్గయొక్క ఆరంభమున ఇట్లున్నది. "యుద్ధము చేయుటకు వచ్చినరావణుని చూచి రాముఁడు యుద్ధపరిశ్రాంతుఁడై చింతించు చుండెను. దేవతలతో కూడి యుద్ధమును చూచుటకు వచ్చిన యగస్త్యుఁడు అట్లు చింతతో నున్నరాముని సమీపించి పలికెను." అప్పుడు అగస్త్యుఁ డుపదేశించినదే ఆదిత్యహృదయము. కాని రాముఁడు యుద్ధపరిశ్రాంతుఁడై రావణుని చూచి చింతించు చున్నాఁ డనుట గడచిన రెండుసర్గలలోని సందర్భమునకు విరుద్ధముగా నున్నది. రాముఁడు రావణుని ధిక్కరించి మాట్లాడినతరువాత, "రామునిబలము వీర్యము హర్షము అస్త్రబలము కూడ రెట్టింపైనవి. విదితాత్ముఁడైన యాయనకు సకలాస్త్రములును ప్రాదుర్భవించెను. ప్రహర్షమువలన చేతియందు వేగము కూడ హెచ్చెను." అని వర్ణింపఁబడెను. పెంపొందుచున్న రాముని శక్తికి రావణుఁడు నిస్తేజుఁడు నిశ్చేష్టుఁడును అగుటఁ జూచి సారథి రథమును రణమునుండి తప్పించెను. ఇట్టిసందర్భమున రావణుని చూచి రాముఁడు చింతాకులుఁ డయ్యె ననుట పొసఁగదు. మఱియును రావణుఁడు యుద్ధమునకు వచ్చుచుండఁగా, రాముఁడు వానిని అప్పుడే మార్కొనవలసియుండఁగా, ఇంత అల్పమైన వ్యవధానమునందు, అగస్త్యుఁడు ఆకాశమునుండి దిగి వచ్చి రామునకు సావకాశముగా ఆదిత్యహృదయమును ఉపదేశించె

ననుట, పిదప రాముఁడు మూఁడుపర్యాయములు ఆచమన మొనర్చి శుచియై ఆదిత్యుని చూచి ఆదిత్యహృదయమంత్రమును జపించి ధనుర్ధరుఁడై యుద్ధమునకు సిద్ధమయ్యె ననుటయు అసంగతముగా నున్నది. అందువలన ఈసర్గ ప్రక్షిప్త మనియే చెప్ప వలసియున్నది.

శ్లో॥ బభూవ ద్విగుణం వీర్యం బలం హర్ష శ్చ సంయుగే।
రామ స్యాస్త్రబలం చైవ శత్రో ర్నిధనకాంక్షిణః॥ 24

శ్లో॥ ప్రాదు ర్బభూవు రస్త్రాణి సర్వాణి విదితాత్మనః।
ప్రహర్షా చ్చ మహాతేజాః శీఘ్రహ స్తతరోఽభవత్॥ 25

యుద్ధ-సర్గ-103

శ్లో॥ తతో యుద్ధపరిశ్రాన్తం సమరే చింతయా స్థితమ్।
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్॥ 1

శ్లో॥ దైవతై శ్చ సమాగమ్య ద్రష్టు మభ్యాగతో రణమ్।
ఉపగ మ్యాబ్రవీ ద్రామ మగస్త్యో భగవా నృషిః॥ 2

శ్లో॥ ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వాతు పరం హర్ష మవా ప్తవాన్।
త్రి రాచమ్య శుచి ర్భూత్వా ధను రాదాయ వీర్యవాన్॥ 29

శ్లో॥ రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్।
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్॥ 30

యుద్ధ-సర్గ-105

కొంత ఊటిల్లనవచ్చును." యుద్ధము జరుగుచుండఁగా మధ్యలో అగస్త్యుఁడు సావకాశముగా దీనిని ఉపదేశించుట కేవలము అసంభవము కాదు; రావణునిరథమును సారథి దూరముగా తీసుకొనిపోవుటకు మరల తీసికొనివచ్చుటకు వారి సంభాషణమునకు

సుమారు ఒకగంటయైన పట్టవచ్చును; ఆసమయములో అగస్త్యుఁడు రామునకు ఆదిత్యహృదయమును ఉపదేశించుట, అంజనేయాదు లెవ రైనను తెచ్చియిచ్చుజలములతో మూఁడు పర్యాయములు ఆచమించి శుచియై ఆస్తోత్రమును జపించుట అసంభవము కాదు. కావున దీనిని ప్రక్షిప్త మని చెప్ప నక్కఱ లేదు."

సూతరావణులసంవాదసమయమున అవకాశమున్నమాట నిజమే. ఈయవకాశము ననుసరించియే ఈస్తోత్రము నిచ్చట చేర్చియుందురు. అవకాశ మున్నది కాఁబట్టి అగస్త్యుఁడు రామునకు దీనిని ఉపదేశించె ననుట సహేతుకము కాదు. అగస్త్యుఁ డిట్టియుపదేశము రామునకు చేసియుండు ననుటకు తగినహేతువు కన్పించుట లేదు. రాముఁడు యుద్ధపరిశ్రాంతుఁడై రావణుని చూచి దిగులుపడుచుండినప్పుడు కదా రామునకు ప్రోత్సాహము కలిగించుటకై అగస్త్యుఁడు దీనిని ఉపదేశించియుండవలె. కాని సందర్భము ఇందులకు కేవలము విరుద్ధముగా నున్నది. రాముని విజృంభణమునకు రావణుఁడే నిస్తేజుఁడు నిశ్చేష్టుఁడు అగుచుండఁగా సూతుఁడు రథమును తప్పించెను. పైగా రామునకు బలము హర్షము వర్ధిల్లుచున్న వని కూడ చెప్పఁబడినవి. అందువలన రామునకు అగస్త్యుఁ డిట్టియుపదేశము చేయవలసిన యక్కఱయే లే దనుట స్పష్టము. ఈసందర్భముననే కాక రావణుని మార్కొనిన యే సందర్భమునందు కూడ రాముఁడు రవ్వంతయైన దీనతను గాని దిగులును గాని పొందలే దని గ్రహింపవలసియున్నది.

గోవిందరాజస్వామి ఈస్తోత్రమునకు వ్యాఖ్యను ముగించుచు ఇట్లనెను. "ఈసర్గ కొన్నికోశములలో కన్పించుట లేదు. ఉడారియును దీనిని వ్యాఖ్యానింప లేదు. ఇందు ప్రతిపాదింపఁ

బడినయాదిత్యపరత్వము, గ్రంథారంభమునుండి ప్రతిపాదింపఁ బడుచుండిన నారాయణపరత్వమునకు విరుద్ధముగా కూడ నున్నది."

గో. టీక:—అయం చ సర్గః కేషుచిత్ కోశేషు న దృశ్యతే, ఉడారిణా న వ్యాఖ్యాత శ్చ। ఆరంభాత్ప్రభృతి ప్రబంధప్రతిపాదితనారాయణపరత్వ విరుద్ధం చ అత్ర ప్రతిభాతి సూర్యపరత్వమ్।

ఈస్తోత్రము ఒకానొకమహర్షి చే రచింపఁబడియుండు ననుటకు, అందువలన చాల పవిత్రమైన దనుటకును ఎట్టిసందేహము లేదు. అయినను ఇచ్చట గ్రంథసందర్భమునుబట్టి ఇది ప్రక్షిప్తమనియే తలంపవలసియున్నది. ఈసర్గనువదలి దీనికి పూర్వమందున్నసర్గను దీనికి తరువాతనున్న సర్గతో కలిపి చదివినచో లోపము ఏమియు కన్పింపదు; గ్రంథము అఖండముగా సాగిపోవును.

## 5. రావణసంహారము

రావణునియాజ్ఞ ననుసరించి సారథి రథమును రణరంగమునకు తీసికొనివచ్చెను. ఆరథముయొక్క రాకనుచూచి రాముఁడు మాతలితో ఇట్లనెను. "మాతలీ! చూచితివా! రావణుని సంరంభము. ఇతఁడు కడువడిగా అపసవ్యసరణిలో వచ్చుచుండుట చూడఁగా ఆత్మవినాశమునకు పూనుకొన్నట్లు తోఁచుచున్నది. నీవు జాగరూకతతో వీని కభిముఖముగా మనరథమును తోలుము. నిశ్చింతుఁడవై తొందరపాటు లేకుండ దృష్టిని హృదయమును ఏకాగ్రముగ నుంచుకొని రథమును రయమున నడపుము. పురందరునిసారథివైన నీకు నేను చెప్పుట యనుచితము. అయినను

యుద్ధోత్సాహవశుఁడనై నీకు జ్ఞప్తిచేయుచున్నానే కాని నేర్పుట లేదు."

అమాటలకు మాతలి సంతోషించి రావణునిరథమునకు అప్రదక్షిణముగా తమకు ప్రదక్షిణగమన మగునట్లు రథమును రావణునకు అభిముఖముగా నడపెను. అప్పుడు రావణవినాశ సూచకములైన యుత్పాతములు, రామవిజయద్యోతకములైన శుభ శకునములు పెక్కుగోచరించెను. రావణుని రథముపై గ్రద్ద లాడు చుండఁగా, వాయువు ప్రతికూలముగ వీచుచు రథముపై దుమ్మెత్తి పోసెను. పిమ్మట రావణునిరథముపై రక్తవర్షము, రాక్షససైన్య మున పిడుగులును పడఁజొచ్చెను.

రామరావణులు విజృంభించిరి. రామునికౌశలమును చూచుచు వానరులు, రావణునిచాతుర్యమును గనుచు రాక్షసు లును విస్మితులై యూరక నిలుచుండిరి. జయమును కాంక్షించుచు రాముఁడు, చావునకు తెగించి రావణుఁడు తమశక్తి నంతయుఁ గూడఁగట్టుకొని పోరఁ జొచ్చిరి. రావణుఁడు రామునిధ్వజముపై శరములను ప్రయోగింపఁగా అవి రథశక్తిని తాఁకి నేలఁగూలెను. రాముఁ డొకనిశితశరమున రావణునిధ్వజమును గూల్చెను. రావ ణుఁడు క్రుద్ధుఁడై రామునిహయములను శరపరంపరలచే ప్రహ రింపఁగా అవి పద్మనాళములచే తాడింపఁబడినట్లు అసంభ్రాంత ములై యుండెను. వారిబాణవర్షములచే అకాశము నిరంతర మయ్యెను. వారు రథములను సవ్యాపసవ్యగతులలో త్రిప్పుచు ఒకరిరథము నొకరు భగ్న మొనర్చుటకు ప్రయత్నించుచుండిరి. రావణుఁడు ఎంత దృఢముగా ప్రహరించియు రాముని వ్యథ నొందింపఁజాలక మాతలిని శరాసారమున ముంచెను. కాని అతఁడు కూడ అసురవర్యుని శరములకు కనుగంద లేదు. అయి

నను తనసారథిని ప్రహరించుట తన్ను అవమానించుటగా తలంచుచు రాముఁడు మహాక్రోధముతో నమితవేగమున వేలకొలఁది బాణములతో సూతాశ్వసమేతముగా రావణునిరథమును ముంచెను. రావణుఁడు తేఱుకొని గదాముసలపరిఘాదులతో రామునిరథమును నింపెను. దేవతలు మహర్షులు చింతాక్రాంతులై "గోబ్రాహ్మణులకు స్వస్తి యగును గాక! లోకములు శాశ్వతములై యుండును గాక! రాముఁడు రావణుని జయించును గాక!" అని జపింపఁజొచ్చిరి. గంధర్వాప్సరసలసంఘములు యుద్ధమును, అనిమిషత్వము సార్థకముగా,చూచుచు ఇట్లనిరి. "గగనాకారమైనది గగనమే. సాగరముతో పోలఁగలిగినది సాగరమే. రామరావణుల యుద్ధము కూడ రామరావణులయుద్ధమువలెనే యున్నది." అట్లు పగలు రాత్రి కూడ విరామము లేకుండ యుద్ధము జరుగుచునే యుండెను.

శ్లో॥ తౌ తు తత్ర నిమిత్తాని దృష్ట్వా రావణరాఘవౌ।
కృతబుద్ధీ స్థిరామర్షౌ యుయుధాతే హ్యభీతవత్॥ 6

శ్లో॥ స్వస్తి గోబ్రాహ్మణేభ్య స్తు లోకా స్తిష్ఠంతు శాశ్వతాః
జయతాం రాఘవ స్సంఖ్యే రావణం రాక్షసేశ్వరమ్॥ 49

శ్లో॥ ఏవం జపంతోఽపశ్యం స్తే దేవా స్సర్షిగణా స్తదా।
రామరావణయో ర్యుద్ధం సుఘోరం రోమహర్షణమ్॥ 50

శ్లో॥ గంధర్వాప్సరసాం సంఘా దృష్ట్వా యుద్ధ మనూపమమ్।
గగనం గగనాకారం సాగర స్సాగరోపమః॥ 51

శ్లో॥ రామరావణయో ర్యుద్ధం రామరావణయో రివ।
ఏవం బ్రువంతో దదృశు స్త ద్యుద్ధం రామరావణమ్॥ 52

శ్లో॥ నైవ రాత్రిం న దివసం న ముహూర్తం న చ క్షణమ్।
రామరావణయో ర్యుద్ధం విరామ ముపగచ్ఛతి॥ 66

క్రమముగా రావణుఁడు నిస్తేజుఁ డయ్యెను. ఇంక వీనిని సంహరింపవలయు నని రాముఁ డొకనిశితశరమున రావణుని తలను తెగనేసెను. అద్భుతముగా దానిస్థానమున అట్టిదే మఱియొక శిరస్సు ఉద్భవించెను. అట్లు రాముఁడు నూఱు శీర్షములను ఖండించినను రావణుఁడు పతన మొందలేదు. అనఁగా దేహబలము క్షీణించినను రావణుఁడు మాయాబలముచేత సహజశీర్షమును కప్పిపుచ్చుచు మాయాశీర్షములను సృష్టించుచుండె నన్నమాట. ఖరుని మారీచుని వాలిని సంహరించినవి సప్తసాలములను భేదించినవి యగుతన బాణము లెందులకు వితథము లగుచున్నవో తెలియక రాముఁడు జాగరూకుఁడై వానివక్షమున శరవర్షమును కురిసెను. రావణుఁడు కూడ అతిప్రయత్నముతో గదాముసలములను రామునిపై విసరుచుండెను. అప్పుడు మాతలి రామునితో ఇట్లనెను. "రామభద్రా! ఏల తెలియనివానివలె ఆ రాక్షసు ననువర్తించుచు బాణములతో క్రీడించుచున్నావు? ఇంక కాలహరణము చాలును. బ్రహ్మాస్త్రమును ప్రయోగింపుము. వీనికి వినాశకాలము దాపరించినది" వెంటనే రాముఁడు అగస్త్యుఁ డొసంగిన బ్రహ్మదత్తమైన బాణమున బ్రహ్మాస్త్రము నభిమంత్రించి ప్రయోగించెను. అది వాని హృదయమును భేదించి నేలను తాఁకి మరల వచ్చి రామునియమ్ములపొదిలో ప్రవేశించెను. రావణుఁడు వజ్రాహతుఁడైన వృత్రునివలె రథము నుండి దొరలి నేలఁగూలెను.

వానరులు ప్రహర్షముతో విజయనాదములను గావించుచు రాక్షసులపైఁబడిరి. వారు భీతులై లంకలోనికిఁ బరువెత్తిరి. అంత

రిక్షమున దేవదుందుభులు మ్రోఁగెను. వాయువు సుఖముగా వీచెను. పుష్పవృష్టి కురిసెను. మహర్షులు దేవతలు సాధువాదములు గావించిరి.

శ్లో॥ ఏవ మేవ శతం ఛిన్నం శిరసాం తుల్యవర్చసామ్॥ 57
న చైవ రావణ స్యాంతో దృశ్యతే జీవితక్షయే॥ 58
యుద్ధ-సర్గ-107

## 6. మండోదరీవిలాపము

సోదరుఁడు నేలఁగూలినంతనే విభీషణుఁడు శోకవేగమున వివలితుఁడై ఇట్లు విలపించెను. "అన్నా! నేను ఎంత చెప్పినను వినవైతివి. దాని కిప్పుడు ఫల మిట్లు కలిగినది కదా! నీవు కూలుట యనఁగా సూర్యుఁడు నేల వ్రాలినట్లుగా, చంద్రుఁడు చీఁకటిలో మగ్నుఁడైనట్లుగా నున్నది."

రాముఁడు విభీషణుని అనునయించుచు ఇట్లు చెప్పెను. "విభీషణా! ఇతఁడు రణమున నిశ్చేష్టుఁడై మరణింపలేదు; చండవిక్రముఁడై మరణించెను. పరలోకమున అభ్యుదయమును కోరువారే ఇట్లు రణమునఁ గూలుదురు. క్షత్రధర్మమునందు స్థిరముగా నుండినయిట్టివారినిగూర్చి విలపింపరాదు. యుద్ధమున ఇంద్రాదులను సైతము గడగడలాడించిన మహావీరుఁడు కాలవశమున వీరోచితముగ కూలినపుడు శోకింపఁదగదు. యుద్ధమున ఒక్కనికే ఎల్లప్పుడు విజయము కలుగదు. వీరుఁడు శత్రువులను సంహరించును; లేక వారిచే నిహతుఁ డగును. యుద్ధహతుఁడైన క్షత్రియుఁడు శోచ్యుఁడు కాఁడు. కావున తత్త్వము నవలంబించి విజ్వరుఁడవై యనంతరకార్యమునకు పూనుము."

విభీషణుఁడు దుఃఖించుచు ఇట్లనెను. "రామచంద్రా! ఇతఁడు సామాన్యుఁడు కాఁడు; అహితాగ్ని, మహాతపస్వి, వేదాంత విదుఁడు; కర్మశూరులలో అగ్రగణ్యుఁడు. ఇతనికి ప్రేతకార్యముల నొనర్ప ననుమతింపుము." రాముఁ డిట్లు చెప్పెను. "మిత్రమా! వైరములు మరణాంతములు; మనప్రయోజనము తీరినది. ఇతఁ డింక నీకు నెట్లో నాకును అట్లే. ఇతనికి సంస్కారము గావింపుము."

ఇంతలో రావణునిభార్యలు, ఇతరులు వారించుచున్నను ఆగకుండ, అంతఃపురమునుండి వికీర్ణకేశలై విలపించుచు వడివడిగా భర్తపడియున్నయెడకు వచ్చి ఆతనిశరీరముపైఁబడి అనేకవిధముల రోదనముఁ గావింపఁజొచ్చిరి.

మండోదరి దీనయై భర్తను చూచుచు ఇట్లు విలపించెను. "రాక్షసేశ్వరా! మూఁడులోకములను జయించిననిన్ను మానవమాత్రుఁ డెట్లు సంహరించెను? మానవుఁ డొకఁడు ఇంతపని చేసెనన్నచో నమ్మలేకున్నాను. రామరూపమున కృతాంతుఁడే వచ్చెనా లేక వాసవుఁడే వచ్చెనా? వాసవునకు ఇంతశక్తి యెక్కడిది? మహాయోగి పరమాత్మ సనాతనుఁడు అనాదిమధ్యనిధనుఁడు సత్యపరాక్రముఁడు శంఖచక్రగదాధరుఁడు శ్రీవత్సలాంఛనుఁడును అయిన విష్ణుదేవుఁడే మనుష్యరూపమును పొంది, వానరత్వమును పొందినదేవతలతో కూడి, లోకములకు హితమును చేయఁగోరి, దేవతలకు శత్రుఁడవై లోకభయంకరుఁడవైయున్న నిన్ను రాక్షసపరివారముతో సంహరించె నని వ్యక్త మగుచున్నది.

పెక్కుమంది రాక్షసులతో ఖరుని సంహరించిననాఁడే రాముఁడు మానవుఁడు కాఁ డని విదిత మైనది. దేవతలకు కూడ

ప్రవేశింప శక్యముకాని లంకయందు హనుమంతుఁడు చొఱఁబడి అంతపని చేసినప్పుడే అది ప్రాకృతులకార్యముఁ కా దని మేము వ్యథ నొందితిమి. ఇట్టి నిదర్శనములను పెక్కింటిని చూపి రాముని తో వైరము వల దని నేను ఎంతగా చెప్పుచున్నను నీవు విన వైతివి. అది యిట్లు ఫలించినది.

నీవు పూర్వము ఇంద్రియములను జయించి తపస్సువలన శక్తుల నార్జించి మూఁడులోకములను జయించితివి. ఆవైరమును స్మరించి కాఁబోలు ఇప్పుడు ఇంద్రియములు విజృంభించి నిన్ను జయించినవి. శరీరము స్వజనము ఐశ్వర్యము అనువానివినాశ మునకే నీకు సీతపై కాంక్ష కలిగినది. రోహిణికన్నను అరుంధతి కన్నను పాతివ్రత్యముచేత విశిష్టయైన సీతను నీవు అవమానించి చాల అక్రమ మొనర్చితివి. నీవు ఆమెను మోసగించి తెచ్చి కోరి కను తీర్చుకొనలేకపోఁగా ఆపతివ్రతయొక్క తపస్సుచేతనే, నిశ్చ యముగా, దగ్ధుఁడ వైతివి. నీవు మొదట ఆమెను తాఁకి నప్పుడె దగ్ధుఁడవు కాకుండుటయే ఆశ్చర్యకరము.

నీవు మన్మథవశుఁడవై గుర్తింపవైతివి కాని సీతకన్నను అందగత్తెలైన స్త్రీలు నీకు ఎందఱు లేరు? కులమునందుఁ గాని దాక్షిణ్యముచేతఁ గాని ఆసీత నాకన్న అధికురాలా ఏమి? అసలు ఆమె నాకు సమాన యగునా? నీవు మోహమువలన యథార్థ మును గుర్తింప వైతివి. ఎప్పు డైనను ఎవ్వని కైనను మృత్యువు నిర్నిమిత్తముగ సంభవింపదు. అట్లే నీకు కూడ మైథిలీనిమి త్తముగా మృత్యువు సంభవించినది. నీవు మృత్యువును దూరము నుండి తెచ్చుకొంటివి. ఇంక సీత రామునితో సుఖముగా విహ రించుచుండఁగా నేను శోకసాగరమున మునకలు వేయుచుందును.

అయ్యో! నా కిట్టి వైధవ్యదశ కలుగు నని ఎన్నఁడును ఊహింపనైతినే! 'నా తండ్రి దానవరాజు; నాభర్త రాక్షసేశ్వరుఁడు; నాకుమారుఁడు శక్రనిర్జేత' అని గర్వించుచుంటిని. లోకమున నీ యంతవాఁ డెవఁ డున్నాఁడు? యుద్ధమున ఎన్నో మాయలను సృష్టించి లోకపాలురను జయించి దేవాసురమానవకన్యల నెంద ఱనో హరించి తెచ్చితివి. కైలాసగిరియందున్న శంకరుని కూడ కంపింపఁజేసినవాఁడవు కదా నీవు! పరమేశ్వరవినిర్మితమైన ధర్మ వ్యవస్థను నీవు కదా భేదింపఁ గలిగితివి. మాకు సకల కామ భోగములను సమకూర్చునట్టి వల్లభుఁడవు నీవిట్లు పడియుండఁగా చూచుచు బ్రతికియున్ననేను ఇంక శాశ్వతముగ స్థిరముగనే యుందును.

రాజమర్యాదలను ఎంతో అభిమానించువాఁడవు కదా నీవు! నగరద్వారమునుండి అవకుంఠనము లేకుండ కాలినడకను వచ్చు చున్న పట్టమహిషిని చూచి ఏల కోపింపవు? అసూర్యం పశ్యలైన నీభార్య లందఱును మేలిముసుఁగులు లేక లజ్జను వీడి వెలుపల కెట్లు వచ్చుచున్నారో చూడుము. నీవు ఎందఱనో కుల స్త్రీలను విధవలను గావించి వారిశాపములను పొందితివి. పతి వ్రతలయశ్రువులు నేలపై నూరక రాల వను మాట నీయెడల యథార్థ మైనది.

నీకు భయము కలుగుట నే నెన్నఁడును చూడలేదు. నిర్భ యుఁడవైన నీకు తుద కింత భయ మేల కలిగినది? లోకవిజేత వైన నీవు మానవునకు భయపడి నారీచౌర్యము నెట్లు చేసితివి? అతీతానాగతవర్తమానముల నెఱింగిననామఱఁది నీవు సీతను తెచ్చినంతనే యిది రక్షోవినాశక మని చెప్పెను. అతఁడు చెప్పి నదే నిజమయ్యెను. నీవు కామక్రోధవశుఁడవై రాక్షసకులమును

అనాథ మొనర్చితివి. ఏ మైనను ప్రఖ్యాతబలపౌరుషుఁడవై ధీరోచితముగా పోరాడి రణరంగమున వీరమరణము నొందిన నిన్ను గూర్చి శోకింప నక్కఱ లేదు. స్త్రీస్వభావముచేత నాబుద్ధి కారుణ్యవశమై యున్నది. నీసుకృతమును దుష్కృతమును గైకొని నీ మార్గమున నీవు పోయితివి. నీవినాశమున అనాథనై మిగిలి యున్న నన్నుగూర్చియే నేను శోకించుచున్నాను. ప్రియురాలిని వలె ఈరణభూమిని కౌఁగిలించుకొని న న్నేల అప్రియనువలె పలుకరింపవు?"

ఇట్లు విలపించుచు మండోదరి మూర్ఛిల్లెను. ఆమెను సవతులు ఓదార్పఁ జొచ్చిరి.

శ్లో॥ వ్యక్త మేష మహాయోగీ పరమాత్మా సనాతనః।
అనాదిమధ్యనిధనో మహతః పరమో మహాన్॥ 14

శ్లో॥ తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః।
శ్రీవత్సవక్షా నిత్యశ్రీ రజయ్య శ్శాశ్వతో ధ్రువః॥ 15

శ్లో॥ మానుషం వపు రాస్థాయ విష్ణు స్సత్యపరాక్రమః।
సర్వైః పరివృతో దేవైః వానరత్వ ముపాగతైః॥ 16

శ్లో॥ సర్వలోకేశ్వర స్సాక్షా ల్లోకానాం హితకామ్యయా।
సరాక్షసపరీవారం హతవాం స్త్వాం మహాద్యుతిః॥ 17

శ్లో॥ ఇంద్రియాణి పురా జిత్వా జితం త్రిభువనం త్వయా।
స్మరద్భి రివ తద్వైర మింద్రియై రేవ నిర్జితః॥ 18

శ్లో॥ ఆనయిత్వా తు తాం దీనాం ఛద్మ నాత్మస్వదూషణ।
అప్రాప్య చైవ తం కామం మైథిలీసంగమే కృతమ్।
పతివ్రతాయా స్తపసా నూనం దగ్ధోఽసి మే ప్రభో॥ 23

శ్లో॥ నం త్యన్యాః ప్రమదా స్తుభ్యం రూపే ణాభ్యధికా స్తతః।
అనంగవశ మాపన్న స్త్వం తు మోహా న్న బుధ్యసే॥ 28

శ్లో॥ న కులేన న రూపేణ న దాక్షిణ్యేన మైథిలీ।
మయాధికా వా తుల్యా వా తత్తు మోహా న్న బుధ్యసే॥ 29

శ్లో॥ సర్వథా సర్వభూతానాం నా స్తి మృత్యు రలక్షణః।
తవ తావ దయం మృత్యు ర్మైథిలీకృతలక్షణః॥ 29

శ్లో॥ హా! పశ్చిమా మే సంప్రాప్తా దశా వైధవ్యకారిణీ।
యా మయాసీ న్న సంబుద్ధా కదాచి దపి మందయా॥ 39

శ్లో॥ పితా దానవరాజో మే భర్తా మే రాక్షసేశ్వరః।
పుత్త్రో మే శక్రనిర్జేతా ఇ త్యేవం గర్వితా భృశమ్॥ 40

శ్లో॥ దృష్ట్వా న ఖ ల్వసి క్రుద్ధో మా మి హానవకుంఠితామ్।
నిర్గతాం నగరద్వారా త్పద్భ్యా మే వాగతాం ప్రభో॥ 62

శ్లో॥ ప శ్యేష్టదార దారాం స్తే భ్రష్టలజ్జావకుంఠనాన్।
బహి ర్నిష్పతితాన్ సర్వాన్ కథం దృష్ట్వా న కుప్యసి॥ 65

శ్లో॥ యా స్త్వయా విధవా రాజన్ కృతా నైకాః కులస్త్రియః।
పతివ్రతా ధర్మపరాః గురుశుశ్రూషణే రతాః।
తాభి శ్శోకతప్తాభి శ్శప్తః పరవశం గతః॥ 63

శ్లో॥ ప్రవాద స్సత్య ఏవాయం త్వాం ప్రతి ప్రాయశో నృప।
పతివ్రతానాం నాకస్మా త్పతం త్యశ్రూణి భూతలే॥ 67

శ్లో॥ కథం చ నామ తే రాజన్ లోకా నాక్రమ్య తేజసా।
నారీచౌర్య మిదం క్షుద్రం కృతం శౌండీర్యమానినా॥ 68

శ్లో॥ న హి త్వం శోచితవ్యో మే ప్రఖ్యాతబలపౌరుషః!
స్త్రీస్వభావా త్తు మే బుద్ధిః కారుణ్యే పరివర్తతే॥ 74

శ్లో॥ సుకృతం దుష్కృతం చ త్వం గృహీత్వా స్వాం గతిం గతః।
ఆత్మాన మనుశోచామి త్వద్వియోగేన దుఃఖితామ్॥ 75

శ్లో॥ ప్రియా మి వోపగుహ్య త్వం శేషే సమరమేదినీమ్।
అప్రియా మివ కస్మా చ్చ మాం నేచ్ఛ స్యభిభాషితుమ్॥85
యుద్ధ-సర్గ-101

"ఇతఁడు మహాయోగియైనవిష్ణువే" అని రామునిగూర్చి మండోదరి యనుట గమనింపఁదగియున్నది. ఖరాదులసంహారము తెలియవచ్చినప్పటినుండి లంకలో రామునిగూర్చి తర్జన భర్జనలు జరుగుచునే యుండియుండును. విష్ణుదేవుఁడు రాక్షస సంహారకుఁడుగ రాక్షసజాతిచరిత్రలో ప్రసిద్ధుఁడై యుండుటచేత మయుఁడు మాల్యవంతుఁడు విభీషణుఁడు మండోదరి మొదలగు వారు విష్ణుదేవుఁడే రాముఁడుగ అవతరించె నని తలంచి యుందురు. విష్ణుదేవుఁడు రాముఁడుగ, దేవతలు ఋక్షవానరులు గా అవతరించి రను దేవరహస్యము ఋషులయాశ్రమప్రాంతము లలో తిరుగుచున్న రాక్షసగూఢచారులవలన కూడ వారికి తెలిసి యుండవచ్చును. అయినను విష్ణువు రాముఁడుగనే అవతరించె నను విషయమును వారు నమ్ముటకు తగినహేతువులను గూడ వారు గుర్తించియుండవలె. అనఁగా విష్ణుదేవునిలక్షణము లేవి యైనను కొన్ని వారికి రామునియందు గోచరించియుండవలె.

మండోదరి చెప్పినవిష్ణుదేవునిలక్షణములలో మూఁడు విభాగము లున్నవి. పరమాత్మ, సనాతనుఁడు, అనాదిమధ్య నిధనుఁడు, ధాత, శాశ్వతుఁడు, ధ్రువుఁడు మొదలగులక్షణములు మొదటివిభాగము. ఇవి కేవలము శాస్త్రగమ్యములైన లక్షణ ములు. విష్ణుదేవుఁడు ఎదుట సాక్షాత్కరించినప్పుడు కూడ

ఉజ్జ్వలమైన యాయనవిగ్రహము గోచరించునే కాని ఈలక్షణ ములు గోచరింపవు. బ్రహ్మాదిదేవతలు ఆయనను స్తవము చేయుచు ఉపనిషత్తులలో ప్రతిపాదింపఁబడినపరమాత్మయొక్క లక్షణము లతో ప్రశంసించుచున్నప్పుడే ఆయన పరమాత్మ యని గ్రహింపఁ దగియుండును. కావున అట్టిలక్షణములు మానవస్త్రీకి జన్మించిన యొకానొకనియందు ప్రకట మగుట అసంభవము.

ఇంక శంఖచక్రగదాధారుఁడు, శ్రీవత్సమును వక్షమునందు కలవాఁడు, నిత్యలక్ష్మీవిరాజితుఁడు అనులక్షణములు రెండవ విభాగము. ఇవి విష్ణుదేవునకు సహజములు. ఆయన సాక్షా త్కరించినప్పుడు ఈలక్షణములను అయనయందు గుర్తింప వచ్చును. కాని ఆయన మానవుఁడుగ జన్మించినప్పుడు ఈలక్ష ణము లేవియు మానవశరీరము నందు గోచరింపవు. రాముని యందు చతుర్బాహువులు గాని శంఖచక్రాదులు గాని శ్రీవత్సాది లక్షణములు గాని ఎప్పుడును వ్యక్తములు కాలేదు. ఆయన శ్రీకృష్ణునివలె "నేను పరమాత్మను'' అని కాని, "విష్ణుదేవుఁడను" అని కాని ఎప్పుడును ప్రకటింపలేదు. బ్రహ్మదేవుఁడు తన్ను పరమాత్మనుగా స్తవము చేసినప్పుడు కూడ ఆయన "నన్ను నేను దశరథాత్మజునిగ మానవుఁడైన రామునిగ తలంచుచున్నాను" అని చెప్పెను. విష్ణుదేవత్వము ప్రకటమై యుండినచో, బ్రహ్మ రావణునకు ఇచ్చినవరము ననుసరించి, విష్ణుదేవుఁడు రావణుని సంహరించుట కుదురదు. అందువలన విష్ణుదేవుఁడు తన దేవత్వ మును విస్మరించి మానవత్వమును పూర్తిగా అవలంబించుటకే సంకల్పించి కౌసల్యయందు రాముఁడుగ అవిర్భవించెను. రాముఁ డుగ ఆవిర్భవించినతరువాత అయనయందున్న వైష్ణవశక్తిసంప న్నత మానవత్వముయొక్క పరిదికి లోఁబడియే వ్యక్తమైనది. కాని

అమానవముగా దివ్యముగా ఎప్పుడును వ్యక్తము కాలేము. కావున ఎప్పుడును వ్యక్తములు కాని యీలక్షణములను బట్టి కూడ రాముఁడు విష్ణుదేవుఁ డని మండోదరి మొదలగువారుగుర్తించుట కుదురదు.

ఇంక మహాయోగి అనులక్షణ మొక్కటి మూఁడవవిభాగము. ఇది యొక్కటియే విష్ణుదేవునియందు రామునియందు సమానముగా గుర్తింపదగినది. కాని మహాయోగు లెల్లరు విష్ణువులు కారు. అజేయమైనపరాక్రమముతో దుష్టసంహారము శిష్టరక్షణము చేయుమహాయోగి విష్ణువై యుండవచ్చు నని యూహించుట కవకాశ మున్నది. మహర్షులకు అభయ మొసంగి ఖరాదులను సంహరించుట, సుగ్రీవునకు శరణ మొసంగి వాలిని నిగ్రహించుట మొదలగుసంఘటనములవలన, దుష్టసంహారము శిష్టసంరక్షణము స్పష్టముగనే రామునియందు గోచరించుచున్నవి. ఈలక్షణములు ధార్మికుఁడు పరాక్రమశాలియునైన యేరాజపుత్రునియం దైనను ఉండవచ్చును. కావున ఇంతమాత్రమున రాముఁడు విష్ణుదేవుఁడే యని నిశ్చయించుటకు వీలు లేదు. ఈలక్షణములతో పాటు మహాయోగిత్వము కూడ ఉన్నప్పుడే విష్ణుదేవత్వమును నిశ్చయించుట యుక్త మగును. విష్ణుదేవునకు శిష్టరక్షణము దుష్టశిక్షణము మొదలగులక్షణములు ఆయాసందర్భములలో ఆవశ్యకము లైనప్పుడు ఆవిర్భవించి గోచరించుచుండును. అందువలన అవి నైమిత్తికము లగుటచే తాత్కాలికములు. మహాయోగిత్వము సహజ మగుటచే నిత్యలక్షణము. అందువలన ఆయనను గుర్తించుటకు అదియే ప్రధానలక్షణము. కావుననే మండోదరి మహాయోగిత్వమును మొట్టమొదట పేర్కొనెను.

రామునియందు ఈమహాయోగిత్వమును ఆమె ఎట్లు గ్రహింపఁగలిగినది? ఇది పరాక్రమాదులవలె పైకి కన్పించునది

కాదు. ఇది బహిరంగవర్తనమునుబట్టి ఎంతో నిశితమైనపరిశీలనముతో గుర్తింపఁదగినయాంతరంగికమైన లక్షణము. మయుఁడు మాల్యవంతుఁడు విభీషణుఁడు మొదలగువారు రామునిగూర్చి గావించుచున్నచర్చలవలన ఆమె ఈవిషయమును గ్రహించియుండును. వారైనను రామునిచరిత్రము ననుసరించి ఈలక్షణమును ఎట్లు నిరూపించియుందురు? శాస్త్రాచార్యసంప్రదాయములవలన మహాయోగియొక్క లక్షణములు ఇట్లుండు నని తెలిసినవారు రామునివర్తనమును పరిశీలించి అలక్షణములను ఆయనయందు గుర్తించియుందురు.

మహాయోగియొక్క లక్షణ మేమి? శ్రీకృష్ణుఁడు అర్జుననకు యోగియొక్క లక్షణములను అనేకవిధములుగా నిరూపించి చెప్పెను. వానిలో కొన్నింటినిబట్టి యోగిలక్షణములను ఇట్లు సంగ్రహముగా గ్రహింపవచ్చును. "కర్మఫలమును ఆశ్రయింపక తనకు శాస్త్రముచేత కార్యములుగా విధింపబడిన కర్మలను ఎవఁడు చేయుచుండునో వాఁడు సన్న్యాసి యోగియు నగును. అగ్నిహోత్రాదులను పరిత్యజించినవాఁడు, పరోపకారము దానము మొదలగుక్రియలను వదలుకొన్నవాఁడు సన్న్యాసి కాఁడు, యోగియును కాఁడు. దేనిని సన్న్యాస మని చెప్పుచున్నారో, అర్జునా, దానిని యోగ మని ఎఱుంగుము. సంకల్పమును వదలుకొనని వాఁడు ఎవఁడును యోగి కాఁడు. ఎవనియొక్క కార్యములన్నియు కామసంకల్పరహితములై యుండునో, జ్ఞానాగ్నిచేత ఎవనికర్మ లన్నియు దగ్ధము లైనవో అట్టివానిని పండితుఁ డని బుధులు చెప్పుదురు."

శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః।
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్ని ర్న చాక్రియః॥ 6-1

శ్లో॥ యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ।
న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన॥ 6-2

శ్లో॥ యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః॥ 4-19

భగవద్గీత.

అగ్నిహోత్రాదికర్మలను దానాదిక్రియలను వదులుకొని కాషాయ వస్త్రాదులను ధరించినవానిని చూచి లోకులు సన్న్యాసి యని యోగి యని, ధర్మకర్మనిర్వహణపరుఁడైనవానిని,మహాత్ముని గూడ, సంసారి యని భ్రమించుచుందురు. ఈభ్రమవలననే అనేకులు శ్రీరాముఁడు శ్రీకృష్ణుఁడు మొదలగువారియందుండు మహాయోగిత్వలక్షణములను గుర్తింపఁజాలకున్నారు. చిరకాలము శ్రీకృష్ణునితో గాఢస్నేహముతో కలిసిమెలసియున్నప్పటికిని అర్జునుఁడు, తనయెదుటనున్న శ్రీకృష్ణుఁడు స్థిత ప్రజ్ఞుఁడే యని గుర్తింపలేక, "స్థితప్రజ్ఞుఁడైనవాఁడు ఎట్లుండును, ఎట్లు మాటాడును, ఎట్లు నడచును" అని శ్రీకృష్ణునే ప్రశ్నించెను. అనఁగా అంతకాలము ఆయనతో కలిసిమెలసియున్నను ఆయనయందున్న స్థితప్రజ్ఞలక్షణము లేవియు అర్జునునకు గోచరింపలేదన్నమాట. కావున కాషాయాంబరాదులనుబట్టి యొకానొకఁడు యోగి యని గాని, పీతాంబరాదులను బట్టి మఱియొకఁడు యోగి కాఁడని గాని గ్రహించుటకు వీలులేదు. అందువలన శ్రీకృష్ణుఁడు, విధ్యుక్తములైనకర్మలను అచరించుచున్నను ఫలము నాసింపకుండుటయే యోగియొక్క ముఖ్యలక్షణముగా నిర్దేశించెను.

దేనిని సన్న్యాస మని పెద్దలు చెప్పుచున్నారో అదియే యోగ మని కూడ భగవానుఁడు ఉద్ఘాటించుచున్నాఁడు. సర్వకర్మలను వదలుకొనుచున్న సన్న్యాసికి తపోదానాదులందు ప్రవర్తించుచుండు యోగికి సామ్య మెట్లు కుదురును? ఒకఁడు నివృత్తిని మఱియొకఁడు ప్రవృత్తిని అవలంబించుచున్నట్లు కన్పించు

చున్నను, ఇరువురివృక్పథము మాత్రము సమానమే. సర్వకర్మలను తత్ఫలవిషయమైన సంకల్పమును సన్న్యాసి యెట్లు వదలుకొనుచున్నాఁడో అట్లే యోగి కూడ కర్మలను చేయుచున్నను వాని ఫలవిషయమైన సంకల్పమును వదలుకొనుచునే యున్నాఁడు. అట్లు సంకల్పమును పరిత్యజింపనివాఁడు ఎవఁడును యోగి కాఁజాలఁడు. కావున తనకు విహితములైనకర్మలను ఆచరించుచున్నను ఎవఁడు వానిఫలములనుగూర్చి తలంపనే తలంపఁడో వాఁడు సన్న్యాసితో సమానుఁడే యగును.

ఈవిషయమునే పండితలక్షణముగా కూడ భగవంతుఁడు నిరూపించెను. చక్కఁగా ఆరంభింపబడు కార్యములు సమారంభములు. లోకమున ప్రయోజనముపై దృష్టి లేకుండ మందబుద్ధి యగువాఁడు కూడ చిన్న పనిని కూడ చేయఁడు. అట్టియెడల మహాకార్యములను ఆరంభించువాఁడు ఈలోకమునందు పదవీ సంపద్భోగకీర్తిసమ్మానాదులను గాని పరలోకమునందు స్వర్గాది భోగములను గాని కోరుచుండుట సహజము. కోరికయే కామము. ఆకామములు సంపద స్వర్గము మొదలగు ఫలములవలన తీరును. అందువలన ఆఫలములకొఱకే ప్రతివ్యక్తి వానికి సాధనములైన విద్య, వృత్తి, యజ్ఞము మొదలగువానిని సంపాదించుటకొఱకు సంకల్పము చేయుచున్నాఁడు. పండితుఁడు ఆవిధముగా ఫలములను కోరఁడు; అందువలన వానికి సాధనముగా ఏకార్యముకొఱకును సంకల్పము చేయఁడు; కాని తనకు కర్తవ్యములుగా ప్రాప్తములైన కార్యములను చేయుచునే యుండును. నడచుచున్న వానికి గమ్యమునందే దృష్టి యుండును గాని తనయుత్తరీయము చేతులు తల మొదలగువానియందు కలుగుచుండు కదలికలపై దృష్టి యుండదు. ఆ కదలికలు (Movements) వానిచేత ఉద్దేశింపఁబడకయే జరుగుచుండును అట్లే పండితుఁడు చేయుపనులు

కూడ సంధ్యావందనమువంటి చిన్నపనులనుండి యుద్ధమువంటి మహాకార్యములవఱకు సంకల్పరహితములుగానే జరుగుచుండును. అనఁగా వానికి ఆకార్యములందు కర్మభావనయే యుంత దన్న మాట. కర్మఫలభావనారాహిత్యమువలన జ్ఞానముకలుగును. ఆ జ్ఞానమే అగ్నియై అతఁడు చేయుచున్న శుభాశుభకర్మలవలన కలుగు ఫలమును ఎప్పటికప్పుడు దహించుచుండును. అట్లు ఎవనియొక్క కర్మలు జ్ఞానాగ్నిచేత దగ్ధ మగుచున్నవో అట్టివానిని పండితుఁ డని బుధులు చెప్పుదురు. కావున పండితుఁడే యోగియు నగును.

అట్లయినచో యోగికి సంకల్పములే యుండవా? సంకల్పమే లేకున్నచో ఏపని యైనను ఎట్లు జరుగును? యోగికి కోరికలుండవు. అందువలన ఈలోకమున సంపత్సమ్మానాదులకొఱకుఁ గాని పారలౌకికములైన స్వర్గాములకొఱకుఁ గాని అతఁడు ఎట్టి కామ్యకర్మను చేయఁడు. అతనికి ఏకోరికయు లేకున్నను, ప్రారబ్ధము ననుసరించి శరీరము ఏర్పడియుండుటవలన, ఆశరీరమునకు సంబంధించిన తల్లి, తండ్రి, బంధువులు, శత్రువులు మొదలగువారితో అతఁడు వ్యవహరింపవలసియే యుండును. అతఁడు ఆవ్యవహారమును జరుపునపుడు తల్లి తండ్రి సోదరులు మొదలగువారివిషయమున ఏసందర్భమునందు ఎట్లు వర్తింపవలయును నని శాస్త్రము విధించుచున్నదో అట్లే వర్తించుచుండును. అట్టియెడల "ఇది నాకు శాస్త్రవిహితమైన కృత్యము; కావున చేయుచున్నాను" అనునిశ్చయముతోనే చేయుచుండును గాని, "ఈపని చేసినచో ఈఫలము కలుగును" అను తలంపుతో అతఁడు చేయఁడు. అతఁడు తల్లిదండ్రులకుఁ గాని గురువులకుఁ గాని సేవచేయునప్పుడు "ఈసేవ చేయుటవలన నాకు ఆశీస్సులు ప్రశంసలు విద్యాపారీణత సంపద మొదలగునవి కలుగును" అను తలంపుతో చేయఁడు; "ఈసేవచేయుట నాకు ...

కావున చేయుచున్నాను" అను నిశ్చయముతోనే చేయును. అట్టి నిశ్చయముతో చేయువాఁడు తాను చేయుచున్న సేవకు అనుకూల ఫలము లేకపోఁగా ప్రతికూలముగా నింద కష్టము నష్టము మొదలగునవి కలుగుచున్నప్పటికిని తనకు కర్తవ్యమైన కార్యమును విడఁడు.

ఈవిషయమును రాముఁడు రాజ్యపరిత్యాగసందర్భమున విస్పష్టముగ చెప్పినాఁడు. పితృసేవాఫలముగా రాజ్యము రాక పోఁగా అరణ్యవాసము కలుగుచున్నందులకు రాముఁడు పితృభక్తికి విముఖుఁడై తండ్రిమాటను నిరాకరించునేమో యని కైకేయి సందేహించుచుండఁగా రాముఁడు ఇట్లు నిశ్చితముగా చెప్పెను. "నేను అర్థపరుఁడను కా నమ్మా; ఏదో సామాన్యముగా ఈలోకములో ఉండఁదలంచుకొని యున్నాను. కేవలమైన ధర్మమునందు నిలిచియున్న నన్ను ఋషులతో సమానముగా నెఱుంగుము."

శ్లో॥ నా హ మర్థపరో దేవి లోక మావస్తు ముత్సహే।
విద్ధి మాం ఋషిభి స్తుల్యం కేవలం ధర్మ మాస్థితమ్॥ 20

అయోధ్యా-సర్గ-19

అర్థ మనఁగా ప్రయోజనము. ఏపని నైనను ప్రయోజనమునందు మాత్రమే దృష్టి కలిగి చేయుచుండువారు అర్థపరులు. అట్టివారు పితృసేవ భర్తృసేవ మొదలగుధర్మకర్తవ్యములను కూడ సంపద సుఖము మొదలగుప్రయోజనముల కొఱకే చేయుచుందురు. తాము కోరుచున్నయాప్రయోజనములకు భంగము కలిగినను, లేదా భంగము కలుగునేమో యని తోఁచినను అర్థపరులు పితృభక్తి భర్తృభక్తి మొదలగుధర్మములను సైతము విడనాడుటకు వెనుదీయరు. అందులకు కైకేయియే నిదర్శనము. తన కుమారుఁడు రాజు కావలయు నని ఆమె కోరినప్పుడు భర్త

అందులకు అనుకూలింపనప్పుడు వెంటనే భర్తృభక్తి అనుధర్మ మును వీడి ఆయనకు మరణాంతమైనవ్యథను కలిగించుటకు కూడ సిద్ధపడినది. ఇది కేవలమైన యర్థపరత్వము. ఆమె, భర్తృ సేవ అనునది ఆయనవలన సుఖమును అభ్యుదయమును పొందు టకు సాధనము మాత్రముగానే భావించుచున్నది; కాని ధర్మకర్త వ్యముగా తలంచుట లేదన్నమాట. భర్తృసేవ ధర్మకర్తవ్య మను తలంపు ఉన్నచో ఆమె భర్తను అట్లు నిర్బంధించియుండదు; ఆయనయభిప్రాయమునకు అనుకూలముగనే వర్తించియుండెడిది. మఱి రాముఁడు చేయుచున్న పితృసేవ యిట్టిది కాదు. ఆయన పితృసేవకు ఏఫలమును ఆసించుట లేదు. "తండ్రిని దేవునిగా కలిగియుండుము" (పితృదేవో భవ) అని వేదము విధించు చున్నది కావున, పుత్త్రుఁడుగా తనకు అది కర్తవ్యము కావున రాముఁడు తండ్రికి సేవ చేయుచున్నాఁడు. ఇది కేవలధర్మపర త్వము. తండ్రి రాజ్యము నిచ్చుచున్నాఁ డన్నప్పుడు ఆయన యందు అధికమైనయాదరము కాని, ఆయనవలన అడవికి పోవ లసివచ్చినప్పుడు తిరస్కారభావము కాని రవ్వంతయు రాముని యందు కలుగలేదు. ఆయనయందు పితృభక్తి రెండు సందర్భము లందును సమానముగనే యున్నది. పితృభక్తిని ధర్మముగా పితృసేవను కర్తవ్యముగా ఆయన భావించుచుండుటవలన ఏ సందర్భమునందును వానిని వీడుట యనునదియే ఆయనవిషయ మున సంభవింప లేదు.

ఈదృష్టితో చూచినచో రామునిజీవిత మంతయు ధర్మకర్తవ్యా చరణపరంపరారూప మనియే విశద మగును. ఆయన తనకు కావలె నని కోరినది ఎప్పుడు ఏదియును లేదు. తాటకాసంహా రము యజ్ఞసంరక్షణము అనుమహాకార్యములను తండ్రియాదేశ

మున మహర్షియాజ్ఞగా ఆయన నిర్వహించినాఁడు; విశ్వామిత్రుని యాదేశమున శివధనువును ఎక్కుపెట్టినాఁడు. తండ్రియభిలాషను అనుసరించి ఆయన సీతను భార్యనుగా పరిగ్రహించినాఁడు. అట్లే తండ్రి కైకేయి కిచ్చినవరముకొఱకు ఆయన అడవికి పోయెను. అక్కడ తాపసులరక్షణముకొఱకు రాక్షసులను శిక్షించుట క్షత్రియునకు కర్తవ్య మని మహర్షులు నివేదింపఁగా ఆయన, సీత వారించుచున్నను, రాక్షసులను వధింతు నని ప్రతిజ్ఞ చేసెను. ఖరాదులవధనిమిత్తముగ రావణుఁడు సీత నపహరించి నప్పుడు, వానిని సపరివారముగా వధించుట తనకు కర్తవ్యమగుటచేతనే ఆయన సుగ్రీవునిసాహాయ్యమును పొంది రావణుని నిర్మూలించెను. ఏసందర్భమునందును రాజ్యము సంపద కీర్తి మొదలుగా దేని నాసించియైనను ఆయన చేసినపని యొక్కటియు కానరాదు; శాస్త్రవిహితమై తనకు ఎప్పుడు ఏది కర్తవ్యముగ ప్రాప్తించెనో దానిని కూడ, ఫలముపై దృష్టి లేకయే, కేవల ధర్మబుద్ధితోనే నిర్వహించెను. ఆయన గావించినసమారంభము లన్నియు కామసంకల్పవర్జితములే. అందువలన ఆయన యోగి, పండితుఁడు అని గ్రహింపవలసియున్నది.

అట్లయినచో అడవికి బయలుదేరునప్పుడు యుద్ధములకు పూనునప్పుడు ఆయన ఆకార్యములనుగూర్చి సంకల్పమే చేయలేదా? ఆయన అడవికి బయలుదేరునప్పుడు వనవాసమున తాపసవ్రతము నవలంబించుటకై స్నానము చేయుదు నని లక్ష్మణునితో ఇట్లనెను. "లక్ష్మణా! నన్ను అనుసరించుచు పరితాపరహితుఁడవై నాయభిషేకముకొఱకై జరుగుచున్న కార్యకలాపమును విరమింపఁజేయుము. అభిషేకముకొఱకు తెచ్చినఘటములతోనే నాకు తాపసవ్రతస్నానము అగును గాక। ఇవియును

వలదు. రాజద్రవ్యమయమైనయీజలముతో నా కేమి పని! నేను స్వయముగా తోడుకున్నతోయముతోనే నాకు వ్రతాదేశ మగును గాక!"

శ్లో॥ తస్మా దపరితాపః సం స్త్వ మ ప్యనువిధాయ మామ్।
ప్రతిసంహారయ క్షిప్ర మాభిషేచనికీం క్రియామ్॥ 26

శ్లో॥ ఏభి రేవ ఘటై స్సర్వై రభిషేచనసంభృతైః।
మమ లక్ష్మణ తాపస్యే వ్రతస్నానం భవిష్యతి॥ 27

శ్లో॥ అథ వా కిం మ మైతేన రాజద్రవ్యమయేన తు।
ఉద్ధృతం మే స్వయం తోయం వ్రతాదేశం కరిష్యతి॥ 28
అయోధ్యా-సర్గ-22

తి. టీక:-రాజద్రవ్యమయేన రాజ్యాభిషేకసాధనమంగళ ద్రవ్యప్రచురేణ। స్వయం స్వహస్తే నోద్ధృతం తోయం మే వ్రతాదేశం వ్రతసంకల్పాధికారమ్॥

వ్రతాదేశ మనఁగా వ్రతముకొఱకు సంకల్పమే. రాముఁ డప్పుడు బావినుండి జలమును స్వయముగా తోడుకొని స్నానము చేసి, ఆచమన మొనర్చి, వనవాసమును చేయుదు నని సంకల్పించి దీక్షఁ గైకొనె నని దీనివలన స్పష్ట మగుచున్నది.

మహాపురుషు లెవరైనను, మహాయోగులు కూడ, యథావిధిగ సంకల్పము చేయకుండ ఏపనికిని పూనుకొనరు. కాని వారి సంకల్పములకు సామాన్యులసంకల్పములకును చాలభేదము కలదు. మహాపురుషులు ఏకార్యమునుగూర్చి సంకల్పము చేసినను, వారికి ఆకార్యముయొక్క ఫలమునందు అపేక్ష యుండదు. సామాన్యులు ఫలాపేక్ష లేకుండ ఏకార్యమునకు పూనుకొనరు. మహాయోగులసంకల్పమునకు శాస్త్రచోదనము తప్ప

మఱియొక హేతు వేదియు నుండదు. సామాన్యులసంకల్పము లకు, ఒక్కొకప్పుడు శాస్త్రచోదనము కూడ హేతువుగా నున్నను, ఫలాపేక్షయే ప్రధానకారణముగా నుండును. కావున ఒకానొకఁడు ఒకకార్యమునకు సంకల్పించుచున్నాఁ డనఁగా ఫలమునుద్దేశించియే సంకల్పించుచున్నాఁ డని గ్రహింపవలసియుండును. అందువలన సంకల్ప మనఁగా ఫలమునుగూర్చి సంకల్ప మనియే లోకమున రూఢమై యున్నది. అట్టిఫలసంకల్పము మహాయోగులకార్యా రంభములయందు ఉండదు. కావున, వారియారంభము లన్నియు కామసంకల్పవర్జితములై యుండు నని, వారు సన్న్యస్తసంకల్పు లనియు చెప్పఁబడుచున్నది.

మహాయోగి యనఁగా గొప్పవాఁడైన యోగియని యర్థము. యోగు లందఱును గొప్పవారు కారా? యోగమునకు ముఖ్య లక్షణమైన స్థితప్రజ్ఞత్వము అందఱియందును సమానముగా నుండదా? సంకల్పమును సన్న్యసింపనివాఁడు ఎట్లు యోగి కానే రఁడో (న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన) అట్లే స్థితప్రజ్ఞత్వము లేనివాఁడు కూడ యోగి కాఁజాలఁడు. ఆరెండును ఇంచుమించుగా సమానధర్మములే. అందువలన యోగలక్షణము లైన ఫలసంకల్పరాహిత్యము స్థితప్రజ్ఞత్వము యోగు లందఱి యందును సమానముగానే యుండును. అట్లయినచో యోగులలో ఒకానొకనిని మహాయోగి యనుటకు హేతు వేమి? యోగుల యందు యోగలక్షణము సమానముగా నున్నను, శరీరబుద్ధీంద్రి యముల శక్తిసామర్థ్యములు సమానముగా నుండవు. కొందఱి యందు తపశ్శక్తులు మహిమలు అధికముగా నుండును. కొందఱి యందు అవి యేవియు లేకపోవచ్చును. అందువలన తపశ్శక్తుల యొక్క మహిమలయొక్క తారతమ్యము ననుసరించి లోకులు

కొందఱను మహాయోగు లని గుర్తించుచుందురు. మహర్షు లనే కులు యోగులే. అయినను వా రందఱు వ్యాసపరాశరుల వలె మహాగ్రంథములను నిర్మింపఁ గలిగియుండరు; అట్లే నర నారాయణులవలె రాక్షససంహారదక్షులై యుండరు. కావున శక్తి సామర్థ్యములచేత మహాకార్యనిర్వహణదక్షులైన యోగులు మహా యోగు లని లోకమునందు ప్రసిద్ధు లగుచున్నారు. అందువలన జగత్పాలనదక్షుఁడైన విష్ణువును మహాయోగినిగా మండోదరి పేర్కొనుచున్నది.

## 7. విభీషణతిరస్కారణము

మండోదరి విలపించి మూర్ఛిల్లినతరువాత రాముఁడు విభీష ణుని జూచి, స్త్రీల నోదార్చి రావణునకు సంస్కారమును గావింపు మని చెప్పెను. బుద్ధిశాలియైనవిభీషణుఁడు చక్కఁగా విమర్శించి ధర్మార్థసహితముగా వినయముతో ఆమాటలను తిరస్కరించుచు రామున కిట్లనెను. "రామభద్రా ధర్మభ్రష్టుఁడు క్రూరుఁడు నృశం సుఁడు అనృతవాది పరదారాసక్తుఁడును అయినవీనికి నేను సంస్కారము నొనర్చుట తగదు. ఇతఁడు నాకు భ్రాతృరూపమున నున్న శత్రువు. అన్నగా ఇతఁడు నాకు పూజ్యుఁడే యైనను, నావలన పూజ నొందఁదగినవాఁడు కాఁడు. ఈవిషయమున లోకులు నన్ను నృశంసుఁ డని తలంపవచ్చును. కాని వారే వీనిదుర్గుణములను గూర్చి విన్నప్పుడు ఆలోచించి నేను చేసినది మంచిపని యనియే చెప్పుదురు."

శ్లో॥ త మువాచ తతో ధీమాన్ విభీషణ ఇదం వచః ॥ 92

శ్లో॥ విమృశ్య బుద్ధ్యా ప్రశ్రితం ధర్మార్థసహితం వచః॥
త్యక్తధర్మవ్రతం క్రూరం నృశంస మనృతం తథా॥ 93

శ్లో॥ నాహ మర్హామి సంస్కర్తుం పరదారాభిమర్శనమ్ ।
భ్రాతృరూపో హి మే శత్రు రేష సర్వాహితే రతః 94

శ్లో॥ రావణో నార్హతే పూజాం పూజ్యోఽపి గురుగౌరవాత్।
నృశంస ఇతి మాం రామ వక్ష్యన్తి మనుజా భువి॥ 95

శ్లో॥ శ్రుత్వా తస్యాగుణాన్ సర్వే వక్ష్యన్తి సుకృతం పునః! 96

యుద్ధ - సర్గ. 111

అన్నకూడ తండ్రివలెనే, పూజ్యుఁడై యుండఁగా విభీషణుఁడు సంస్కారము చేయ నని ఇట్లు తిరస్కరింపవచ్చునా? ఒకధర్మవిశేషము ననుసరించి అతఁ డిట్లనెను. ఈ విషయమున మను విట్లు చెప్పెను. "వ్యర్థముగా పుట్టిన వారికి అనఁగా స్వధర్మకర్మలను చాలవఱకు వదలుకొన్న వారికి. ఉన్న, తవర్ణములకు చెందినస్త్రీలయందు హీనవర్ణులైన పురుషులకు జన్మించినసంకరులకు, వేదబాహ్యములైన పరివ్రాజకలక్షణములతో కాషాయాంబరాదులను ధరించువారికి, విషముతినుట ఉరివేసికొనుట మొదలగువానివలన శరీరమును పరిత్యజించు వారికి ఉదకప్రదానాదికమును జరుపరాదు".

శ్లో॥ వృథాసంకరజాతానాం ప్రవ్రజ్యాసు చ తిష్ఠతామ్ ।
ఆత్మన స్త్యాగినాం చైవ నివర్తే తోదకక్రియా॥ 89

కుల్లూకభట్టటీక : జాతశబ్దః ప్రత్యేక మభిసంబధ్యతే। వృథాజాతానాం బాహుళ్యేన త్యక్తస్వధర్మాణాం, సంకరజాతానాం హీనవర్ణేన ఉత్కృష్టస్త్రీషు ఉత్పన్నానాం; వేదబాహ్యరక్తపటాది ప్రవ్రజ్యాసు వర్తమానానాం; అశాస్త్రీయవిషోద్బంధనాదినా కామతశ్చ కృతజీవితత్యాగినామ్ ఉదకాదిక్రియా న కర్తవ్యా।

పైనిషేధము ననుసరించి పరస్త్రీలోలుడై మిథ్యాపరివ్రాజకుఁడై సీత నపహరించినరావణుఁడు సంస్కారమునకు అర్హుఁడు కాఁడని విభీషణుఁడు చెప్పెను.

ధర్మమునందు విభీషణునకుఁ గలశ్రద్ధకు రాముఁడు చాల సంతోషించి యిట్లనెను "విభీషణా! నేను నీప్రభావమువలన రావణుని జయించితిని. కావున నేను నీకు ప్రియ మొనర్పవలసి యున్నది. అయినను మిత్రునకు ప్రియముకన్నను శ్రేయస్సును కలిగించుటయే యుక్తము. నీకు ఏది యుచితమో దానినే నేను చెప్పవలసియున్నది. ఈనిశాచరుఁడు, అధర్మరతుఁడు అనృత పరుఁడు అనుట నిశ్చితమే. కాని యితఁడు తేజస్వి; శూరుఁడు; సంగ్రామములందు మహేంద్రునిచే కూడ ఓడింపఁబడ లేదని వినుచున్నాము. ఇతఁ డెట్లుయినను మహాబలుఁడు, మహాత్ముఁడు. వైరములు మరణాంతములు. మన ప్రయోజనము కూడ తీఱినది. ఇంక నితనికి సంస్కారమును చేయుము. ఇతఁడు నీకు ఎట్లో నాకును అట్లే యగును. ధర్మజ్ఞా! ఇతఁడు విధిపూర్వకమైన సంస్కారమును నీవలన పొందఁదగియున్నాఁడు. నీవు కూడ యశోభాజనుఁడ వగుదువు".

శ్లో॥ మరణాంతాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్।
క్రియతా మస్య సంస్కారో మ మా ప్యేష యథా తవ॥ 101

శ్లో॥ త్వత్సకాశా ద్దశగ్రీవ స్సంస్కారం విధిపూర్వకమ్।
ప్రాప్తు మర్హతి ధర్మజ్ఞ త్వం యశోభా గ్భవిష్యసి॥ 102

యుద్ధ — సర్గ. 111

ఈప్రసంగమున రామునిమహనీయత చక్కఁగా వ్యక్త మగుచున్నది. "ధర్మజ్ఞా!" అని రాముఁడు విభీషణుని సంబోధించుట సాభిప్రాయముగా నున్నది. విభీషణుఁడు ధర్మకర్తవ్య మేదియో తెలియక ఇట్లు మాటాడుట లేదు. అతఁడు విలపించుచు, "రామచంద్రా! ఇతడు ఆహితాగ్ని, మహాతపస్వి, వేదాంతము

నెఱింగినవాఁడు; కర్మశూరులయందగ్రేసరుఁడు. ఈతనికి ప్రేత కృత్యములను నీయనుగ్రహమున చేయఁగోరుచున్నాను" అని రాముని ప్రార్థించెను. రాముఁ డతనిని ఓదార్చుచు రావణునకు సంస్కారమును తప్పక కావింపు మని చెప్పెను. మండోదరీ విలాపమైన తరునాత రాముఁడు మరల రావణునకు సంస్కారమును గావింపు మని విభీషణుని హెచ్చరించెను. రెండు పర్యాయములు రాముఁ డిట్లు చెప్పఁగా,దానికివిరుద్ధముగా విభీషణుఁడు ఇట్లేల మాటాడెను? ఇచ్చట రామునియొక్క అనువృత్త్యర్థమే విభీషణుఁడు ఇట్లు మాటాడె నని మహర్షి నిర్దేశించినాఁడు. (రామ స్యైవానువృత్త్యర్థ ముత్తరం ప్రత్యభాషత-శ్లో. 93-సర్గ. 111) అనఁగా రాముని అనుసరించుటయే ప్రయోజనముగా గలిగి అతఁడు మాటాడె నన్నమాట. రాముని అనుసరించుట యనఁగా రాముఁడు చేసినట్లుగా చేయుట అనునర్థము కుదురదు. పెద్దలకు ప్రేతకర్మ చేయవలసివచ్చినప్పుడు రాముఁడు మానుకొనినసందర్భ మేది యును లేదు. కావున రాముని అనుసరించుట యనఁగా రాముని వాక్యము ననుసరించి వర్తించుట యనియే గ్రహింపవలసియున్నది అట్టియెడల రామునివాక్యమునకు విరుద్ధముగా ఇట్లు విభీషణుఁడు మాటాడుట అనువృత్తి ఎట్లగును? మండోదరీ విలాపమును విన్నతరువాత రాముని యభిప్రాయము ఎట్లుండునో దాని ననుసరించుటకొఱకు విభీషణుఁడు ఇట్లు మాటాడె నని తలంపవలసి యున్నది.

విభీషణునివిలాపమునకు మండోదరీవిలాపమునకు చాల భేదము కలదు. మరణించినవాఁడు దుర్జనుఁ డైనను వాని బంధుమిత్రులే కాక తటస్థులైనవారు కూడ, చచ్చిన వానిని ఇంకను సాధించు టేల యని, సాధ్యమైనంతవఱకు వానిగుణము లనే స్మరించి చెప్పుకొనుచుందురు. విభీషణునియందు కూడ

రావణునిగూర్చి తన్ను పెంచి పెద్దవానిని చేసినవాఁడు గదా అను మమకారమే మొఁదట పైకి వచ్చినది. అందువలన ఇతరులకు ఎవరికిని సాధారణముగా రావణునివిషయమున స్ఫురింపని పెక్కు గుణవిశేషములను అతఁడు పేర్కొనెను. ఆ విలాపమును వినుచున్న వారికి "ఒక్కస్త్రీవ్యసనమువలన ఇట్లయినాఁడు, కాని లేకున్నచో ఈరావణుఁడు ముల్లోకముల నేలఁ దగినవాఁడు కదా" అని యనుతాపము తప్పక కలుగును. అట్లే అంత మహనీయునకు ఎంతో శ్రద్ధతో ఎంత ఘనముగానో ప్రేతకార్యములను జరుపవలె నను నిశ్చయము కూడ ఎల్లరకును కలుగును.

మండోదరీవిలాపము ఇందులకు విరుద్ధముగా నున్నది. ఆమెవిలాపమున రెండు ముఖ్యాంశములు కలవు. భర్త మరణించినందుకన్నను ఆమె, అప్పటిదాఁక తాను అనుభవించుచున్న ప్రాభవము పోయినందుకే, దుఃఖించుచున్న దనుట మొదటిది. ఇంత దుష్టుఁడు ఇట్లు గాక ఎట్లు మరణించును లెమ్మనునది రెండవది. భర్తయే కాక పుత్త్రులు బంధువు లందఱును నశించుటవలన విభీషణుఁడు రాజైనయంతనే అతనిభార్య బిడ్డలును ప్రాభవమును పొందుచుండఁగా, తాను దిక్కులేని దానివలె వారిని ఆశ్రయించుకొనియుండవలసివచ్చిన దనుభావన ఆమెను అమితముగా బాధించుచున్నది. ఇట్టిదుర్గతికి కారకుఁడైనభర్తపై కోపము ఆమెహృదయమును ప్రజ్వలింపఁజేయుచున్నది. రావణుఁడు సీతను తెచ్చినప్పటినుండియు ఆమెకు అతనిపై కోపము ప్రతిదినము ప్రబలుచుండెనని మన మూహింపవచ్చును. స్త్రీలకు సవతిమచ్చరమువలె దుఃఖదాయకమైనది మఱియొకటి లేదు. సవతులను నిగ్రహించి తమప్రాభవమును నిలుపుకొన నిశ్చయించినపుడు వారు భర్తృ

మరణమును కూడ లెక్కింపరు. కైకయే యిందులకు ప్రబల నిదర్శనము. రామునకు పట్టాభిషేకముచేసి కౌసల్యకు రాజమాత పదవిని దశరథుఁడు కలిగించుచున్నాఁ డని తోఁచినంతనే ఆమె, "ఈ వృద్ధుఁడైనభర్త పోయినఁబోవును గాక; లోకము నిందించిన నిందించుఁగాక; ఎట్లయినను నా కుమారునకే పట్టాభిషేక మగునట్లు చేసి రాజమాతనుగా నాప్రాభవమును నిలుపుకోవలసినదే" అను నిశ్చయముతో వర్తించిన దనుట స్పష్టమే. అట్లే మండోదరి కూడ సీతను రావణుఁడు తెచ్చినప్పటినుండియు తన ప్రాభవవినాశమును శంకించుచునే యున్నది. ఆంజనేయుఁడు సీత నన్వేషించుచు వచ్చినప్పుడు, రావణుఁడు నిద్ర మేల్కొనినంతనే సీతను స్మరించి ఆమెయొద్దకు నూఱుమందియంతఃపురస్త్రీలతో వెళ్లెను. అప్పు డతఁడు సీతను ప్రలోభపెట్టుచు "నిన్ను అంతఃపురేశ్వరిని చేయుదును; ఇదుగో తలవంచి నీపాదములకు ప్రణమిల్లుచున్నాను; నాకు భార్య వగుము" అని ప్రార్థించి భంగపడెను. ఈదృశ్యమును అతనివెంట వచ్చియుండి మండోదరి కూడ చూచుచునుండవచ్చును. ఆమె అప్పుడు అక్కడికి వచ్చియుండ దనుకొన్నను, ఆమెకు ఆ విషయము తెలియకుండ నుండుట అసంభవము. సవతులో పరిచారికలో ఆ విషయమును ఆమెకు తప్పక తెలియఁజేయుదురు. ఆవిషయమును ఆమె విన్నప్పుడు ఆమెహృదయ మెట్లు భగ్గు మని యుండునో యూహింపవలసినదే కాని వర్ణింప నలవికాదు. సీతవంటి మహాపతివ్రత కూడ, లంకలో తాను నశించినచో పిమ్మట రాముఁడు పెక్కుమంది భార్యలతో సుఖించు నేమో అనునూహచేతనే, ఎంతో పరితపించినది. రాముఁడు వేరొకస్త్రీని కోరి తన్ను నిరాకరించు నను తలంపు కూడ ఆమెకు లేదు. అయినను తాను పోయినతరువాత

జరుగవచ్చు నను సవతుల సన్నివేశమును ఊహించి ఆయూహనే ఆమె భరింపలేకపోయినది. మండోదరివిషయము అటువంటి యూహ కాదు. ప్రత్యక్షముగానే తనభర్త తన్నుత్రెక్కపెట్టక మఱి యొకస్త్రీని తెచ్చి ఆమెను అంతఃపురేశ్వరిని చేయుదు నని, ఆమెను లోఁబఱచుకొనుటకై ఆమెపాదములకు ప్రణమిల్లుటకు సిద్ధపడు చున్నాఁడు. ఇంతకన్నను ఏభార్యకైనను అవమాన మేమున్నది? రాజర్షికులమున సంవర్ధితురాలైన సీతకే, సవతులనుగూర్చి యూహించినంతనే అంతపరితాపము కలుగఁగా, రజోగుణ ప్రధానమైన రాక్షసకులమున జన్మించిన మండోదరికి రక్త ముడికి యుండుట సహజము. ఏకారణముచే నైనను సీత రావణునకు లోఁబడినచో మండోదరికి ప్రాభవము పోక తప్పదు. శత్రువులచే రావణుఁడు సంహరింపఁబడినపుడు కూడ ఆమె అనాథ యగుట తప్పదు. తనదుర్గతి కంతకు రావణుఁడే మూల మని తోఁచి నప్పుడు అతనిపై ఆమెకు పట్టరానంత కోపము కలుగుట సహజము; ఆకోపమును ప్రకటించి అతనిని ధిక్కరించినచో, పతివ్రతగా అది తనకు పాపకృత్య మగుటయే కాక, భర్తృధిక్కారణము వెంటనే సంభవించును. ఎందఱో భార్యలు గల అతఁడు ఆమెమొగము నైన చూడకుండ నుండవచ్చును. అందువలన కోపము నామె తనయందే యణఁచుకొనుచు నుండెను. అతఁడు మరణించి నంతనే, కట్టతెగినచెఱువులోనుండి నీరు దూఁకివచ్చినట్లు దుఃఖము తో కలిసి కోపము కూడ, ఆమెకు తెలియకుండఁగనే, వెల్లువగా వెల్లుబికి వచ్చినది. అందువలన, అతనిచేత అవమానితుఁడైన యింద్రుని వంటివాడు అతని ఘోరకృత్యములను చెప్పవలసి వచ్చినచో ఎట్లు చెప్పనో అట్లు, ఆమె అతని దుష్కర్మముల నన్నింటిని ఏకరువు పెట్టెను. మహాయోగియైన విష్ణువే ఇట్లు

అవతరించె నని రాముని ప్రశంసించుచు రావణునిపాపకర్మముల నన్నింటిని, "శంకరుని ఉద్ధూత లూఁగించినవాఁడు, లోకమును క్షోభింపఁజేసినవాఁడు, భూతములను ఆక్రోశింపఁజేసినవాఁడు, వేల కొలఁది దానవేంద్రులను యక్షులను సంహరించినవాఁడు, అనేక యజ్ఞములను భంగపఱచినవాఁడు, ధర్మవ్యవస్థను భేదించినవాఁడు యుద్ధమునందు మాయను సృష్టించువాఁడు, మనుష్యాసురదేవ కన్యలను హరించినవాఁడు" అని వరుసగా పేర్కొనెను. అట్లే ఆమె సీతను పతివ్రతలలో శ్రేష్ఠురాలినిగా ప్రశంసించి ఆమెను రావణుఁడు మోసగించి తెచ్చుట సాటిలేని ఘోరకృత్య మని యూని పల్కుచు భర్తను "దుర్మతి" అని కూడ సంబోధించినది

శ్లో॥ అరుంధత్యా విశిష్టాం తాం రోహిణ్యా శ్చాపి దుర్మతే।
సీతాం ధర్షయతో మాన్యాం త్వయా హ్యసదృశం
కృతమ్॥ 21

శ్లో॥ జేతారం లోకపాలనాం క్షేప్తారం శంకరస్య చ। 49

శ్లో॥ దృప్తానాం నిగృహీతార మా విష్కృతపరాక్రమమ్।
లోకక్షోభయితారం చ నాదై ర్భూతవిరావిణమ్॥ 50

శ్లో॥ హన్తారం దానవేంద్రాణాం యక్షాణాం చ సహస్రశః। 52

శ్లో॥ నైకయజ్ఞవిలోప్తారం త్రాతారం స్వజనస్య చ।
ధర్మవ్యవస్థాభేత్తారం మాయాస్రష్టార మాహవే॥ 53

శ్లో॥ దేవాసురనృకన్యానా మాహర్తారం తత స్తతః। 54

(యుద్ధ - సర్గ. 111)

ఈవిలాపమును విన్నంతనే ఎవని కైనను "ఇంత దుర్మార్గుఁ డైనవానిని ఇట్లా సంహరింపవలసినది! వీని ముక్కులు చెవులు కన్నులు కాలుసేతులు ముక్కలు ముక్కలుగా నఱికి కదా చంపవలసినది! పతివ్రతామతల్లియైన సీతాదేవిని వంచించినయీ ఘోరకర్మునకు ప్రేతకర్మలు చేయవలయునా! అంతకన్నను అకృత్య మే ముండును?" అని తప్పక స్ఫురించును. విభీషణుఁడు పేర్కొన్న రావణునిగుణము లన్నియు ఈదోషోద్ఘాటనమున మునిఁగిపోయినవి. అందువలన అప్పుడు రామునియభిప్రాయ మెట్లుండునో తెలిసికొని ఆ విధముగా చేయవలయునను తలంపుతో విభీషణుడు, "ఇట్టిదుర్మార్గునకు నేను ప్రేతకర్మలు చేయ" నని చెప్పెను.

ఈ దోషోద్ఘాటనమును వినుచున్నను రాముఁ డేమియు చలింప లేదు; తనయభిప్రాయమును మార్చుకొన లేదు. తన భార్యను హరించి తనకు మహావ్యథను కలిగించినను రామునకు రావణునిపై ద్వేష మేమియును లేదు. తేలునకు కుట్టుట, పామునకు కఱచుట ఎట్లు స్వభావమో దుర్జనులకు సాధువులను పీడించుట సహజగుణము. తేలుపై పాముపై పగను సాధించుట ఎంత నిరర్థకమో దుష్టులపై ద్వేషమును వహించుట కూడ అనుచితమే. అందువలన ఇతరులకు అపకారము జరుగకుండుటకై తేలును పామును ఎట్లు చంపవలయునో అట్లె దుర్జనులను కూడ సంహరింపవలె. తప్పుచేసినవానిని దండించుచున్నయధికారికి దండింపఁబడుచున్నవానియందు ద్వేష ముండవలసినపని యే మున్నది? ధర్మశాస్త్రదృష్టితో వాఁడు చేసినతప్పునకు దండనము విధించి, వానికి ప్రాయశ్చిత్తమును కలిగించి, వానికి సద్గతులను కలిగించుటయే ధర్మపాలకులకు ప్రధానలక్ష్యము. రాముఁడు

ఈవిషయమును వాలివధసందర్భమున స్పష్టముగా నిరూపించెను ఆ పద్ధతినే ఆయన రావణునివిషయమున కూడ అవలంబించెను. ఇది రామునియౌదార్యమునకు పరాకాష్ఠ అని చెప్పవచ్చును. కాని అనర్హులయందు ఔదార్యమును చూపుట ధర్మసమ్మతమా ? విభీషణుని యభిప్రాయమునకు మూలమైన మనుస్మృతియందలి నిషేధమునకు గతియేమి? రావణుఁడు విలోమసాంకర్యమున జన్మించినవాఁడు కాదు, మహర్షివలన రక్షోజాతిస్త్రీయందు జన్మించిన వాడు. అతఁడు పూర్తిగా స్వధర్మములను త్యజించినవాఁడు కాదు. విభీషణుఁడు చెప్పినట్లుగా అతడు ఆహితాగ్ని, మహాతపస్వి, స్వజనరక్షకుఁడు. అందువలన అతడు వృథాజాతుఁడు కాదు. వంచనము కొఱకు పదినిమేషములు అతఁడు పరివ్రాజకవేషమునువహించినను, వేదబాహ్యులైన బౌద్ధులవలె, నేటి సంప్రదాయదూరులైన సన్న్యాసులవలె,అక్రమమైన పరివ్రాజకజీవితమును అవలంబింపలేదు. అట్లే అతడు ఆత్మహత్యకు పాల్పడలేదు. యుద్ధమున వెన్ను చూపక వీరోచితముగా పోరాడుచు అతఁడు మరణించెను. క్షత్త్రియులకు వీరమరణము పాపములకు ప్రాయశ్చిత్తమును కలిగించి సుగతి నొసంగును. కావున రావణుఁడు సంస్కారమునకు అర్హుఁడే యని గ్రహింపవలసియున్నది.

రాముఁడు ధర్మనిరూపణపూర్వకముగా రావణునకు సంస్కారమును చేయుమని చెప్పుచు, “ఇతఁడు నీకు ఎట్లో నాకు కూడ అట్లే యగును” అనుట గమనింపఁదగియున్నది; మిత్త్రుఁడైన విభీషణునిసోదరుఁడు తనకు కూడ సోదరుఁడే యని రాముని యభిప్రాయము. సోదరుఁడుగా రావణునకు కర్మలు చేయుట విభీషణునకు ఎంత కర్తవ్యమో రామునకు అంతే కర్తవ్య మగును. ఏకారణముచేత నైనను విభీషణుఁడు రావణునకు ప్రేతకర్మలను చేయఁజాలకపోయినచో, జటాయువునకు చేసినట్లు,తానే చేయవలసి

యుండు నని రామునియభిప్రాయము. రావణునకు ప్రేతకర్మలు జరుగకున్నచో, ఆకర్తవ్యలోపము విభీషణునిసద్గతికి నిరోధకమగును. అట్టిదుర్గతినుండి మిత్త్రుని రక్షింపవలయు నని రాముని తలంపు. మైత్రీబంధమున ఇంత బాధ్యత యున్నదని మనము గ్రహింపవలసియున్నది.

## 8. రావణునకు సంస్కారము

రాముఁడు చెప్పినతరువాత విభీషణుఁడు త్వరపడి లంకలోనికి పోయి రావణునియగ్నిహోత్రములను శకటములపై నుంచుకొని, చందనకాష్ఠాదులను ముక్తామణిప్రవాళాదులను యాజకులైన విప్రులను వెంటఁబెట్టుకొని రణభూమికి వచ్చెను రావణుని శరీరమును పట్టువస్త్రముతో కప్పి తూర్యఘోషముతో ద్విజులు సౌవర్ణశిబికయం దుంచిరి. పుష్పములతో పతాకలతో చిత్రితమైన యాశిబికను వారు విభీషణపురోగాములై దక్షిణాభిముఖముగాఁ గైకొనిపోయిరి. చందనాదికాష్ఠములతో మఱికొందఱు శిబికప్రక్కన నడవఁజొచ్చిరి. యాజకులు అగ్నులను గైకొని శిబికకు ముందు నడచుచుండిరి. అంతఃపురస్త్రీలు రోదన మొనర్చుచు శిబికకు వెనుక మెల్లగా వచ్చుచుండిరి.

ఒకపరిశుద్ధప్రదేశమున చందనపద్మకోశీరకాష్ఠములతో కొందఱు చితిని ఏర్పఱచి, అందు రాంకవచర్మమును పఱచి, దానిపై రావణశరీరము నుంచిరి. చితికి దక్షిణపూర్వదేశమున ఆహవనీయాగ్నిని, ఉత్తరపశ్చిమదేశమున గార్హపత్యాగ్నిని, దక్షిణపశ్చిమము నందు దక్షిణాగ్నిని స్థాపించిరి. యాజకులు దక్షిణపూర్వదేశమున వేదియందు పావకుని ప్రజ్వలింపఁజేసి పృషదాజ్యపూర్ణమైన స్రువమును రావణునిస్కంధమునం దుంచిరి. పాదములయొద్ద సోమలతను తెచ్చుట కుపయోగించు శకటమును, ఆతనియూరువుల యొద్ద యజ్ఞీయద్రవ్యములను దంచుట కుపయోగించుసులూఖల

మును, అగ్నిహోత్రసాధనములైన అరణి ఉత్తరారణి దారుపత్రము మొదలగువానిని యథాస్థానముగ నుంచి యాజకులు పితృమేధమును గావించిరి. అందు మేధ్యమైన పశువును విశసన మొనర్చి హోమము గావించి, వారు చితిపై పఱచియుంచిన రాంకవచర్మమును ఘృతముతో తడిపిరి. పిమ్మట వారు రావణుని శరీరమును గంధమాల్యవస్త్రలాజాదులతో అలంకరించిరి. విభీషణుఁడు విధిపూర్వకముగా సోదరుని శరీరమునకు అగ్నిప్రదానము గావించెను. పిమ్మట అతఁడు స్నానముచేసి అర్ద్రవస్త్రములతో దర్భలయందు సోదరునకు తిలోదకము నొసంగి స్త్రీల నందఱను అనునయించి నగరములోనికి పంపి, తాను రాముని యొద్దకు వచ్చి నిలుచుండెను.

రావణసంహారమును చూచి దేవగంధర్వాదులు రాముని కీర్తించుచు వెడలిపోయిరి. రాముఁడు మాతలిని సత్కారపురస్సరముగా వీడ్కొలుపఁగా, అతఁడు రథమును గైకొని వెడలిపోయెను. రాముఁడు సంతోషముతో సుగ్రీవుని కౌఁగిలించుకొనెను. లక్ష్మణుఁడు అన్నకు అభివాదనముఁ గావించెను. పిమ్మట రాముఁడు సుగ్రీవవిభీషణాదులతో స్కంధావారమునకు తిరిగివచ్చి లక్ష్మణుని జూచి, "లక్ష్మణా ఈవిభీషణుఁడు మనకు ఎంతో ఉపకారమును గావించెను; నీవు పోయి ఇతనిని లంకయంను అభిషేకింపుము; ఇదినాకు పరమమైన కోరిక" అనెను. లక్ష్మణుఁడు అట్లే యని విభీషణునివెంట ఋక్షవానరముఖ్యులతో లంకలోనికరిగెను.

గద్యము

ఆపస్తంబసూత్ర కౌండిన్యసగోత్ర పోలూరి
వేంకటనరసాంబానారాయణామాత్యపుత్ర
హనుమజ్జానకీరామశర్మ ప్రణీతంబైన
శ్రీరామాయణతరంగిణియందు
ద్వావింశంబైన రఘునందనతీర్థము
సమాప్తము

# 23. జానకీ తీర్థము

## 1. అభయప్రదానము

లక్ష్మణుఁడు వానరులచే సౌవర్ణఘటములలో సముద్రోదకమును తెప్పించి శుభముహూర్తమున లంకలో రాక్షసులసమక్షమున విభీషణుని రాజుగా అభిషేకించెను. పిదప రాక్షసముఖ్యులు ఋక్షవానరనాయకులు కూడ అతనిని అభిషేకించిరి. యుద్ధమునందు బంధుమిత్రులను కోల్పోయి ఖిన్నులైయున్న పౌరముఖ్యులను అనునయవాక్యములతో విభీషణుఁడు ప్రసన్నులను గావించెను. వారు దధి అక్షతములు పుష్పములు మోదకములు లాజలు మొదలగు మంగళద్రవ్యములను రాజునకు కానుకలొసంగిరి. వానరరాక్షసముఖ్యులతో కూడి లక్ష్మణునివెంట విభీషణుఁడు రామునియొద్దకు వచ్చి ఆ మంగళద్రవ్యములను రామలక్ష్మణులకు నివేదించెను.

రాముఁడు విభీషణుని ప్రీతికొఱకు వానిని గైకొని, హనుమంతుని చూచి "ఆంజనేయా! ఈమహారాజుయొక్క అనుమతితో వైదేహియొద్దకు పోయి మనకుశలమును రావణునివధమును చెప్పి, ఆమె ఏ మనునో నాకు తిరిగివచ్చి చెప్పుము" అనెను.

ఆంజనేయుఁడు విభీషణునియనుమతి నొంది అశోకవనమునకు పోయి ఇంకను రాక్షసీపరివృతయై దీనయై యున్న సీతను చూచి ప్రణతియొనర్చి నిలిచెను. సీత హనుమంతుని గుర్తించి హర్షము నొంది యూరకుండెను. ఆంజనేయుఁడు సంతోషముతో ఇట్లనెను. "అమ్మా! నీప్రభావముచేత రాముఁడు రణాంగణమున రావణుని సంహరించెను. సుగ్రీవలక్ష్మణసహితుఁడైన రాముఁడు కుశలియై యున్నాఁడు; నిన్ను కుశల

మడుగు మని నన్ను పంపెను. ఇంక నీకు భయము లేదు. లంక ఇప్పుడు విభీషణునియధీనమం దున్నది."

ఆమె ఆమాటలను విని సంతోషపారవశ్యము నొంది మాట లాడ లేకుండెను. హనుమంతుఁడు మరల, "అమ్మా! దేనినిగూర్చి చింతించుచున్నావు? ఎందులకు మాటాడవు?" అని యడిగెను. ఆమె బాష్పగద్గదకంఠయై యిట్లనెను. "అంజనేయా! పరమప్రియ వాక్యశ్రవణమువలనఁ గలిగినహర్షపారవశ్యముచేత నేనుమాటాడఁ జాలకుంటిని. ఇంతటిప్రియమును చెప్పుచున్ననీకు ఈయఁదగిన బహుమతి ఏదియును తోఁచుట లేదు. నీవు చెప్పుచున్న యీ ప్రియమునకు వెండి బంగారము రత్నములు రాజ్యము ఏది యిచ్చి నను తగియుండు నని తోఁచుటలేదు." ఆమాటలకు హర్షము నొంది అంజనేయుఁ డిట్లనెను." ఆర్యురాలా! భర్తృహితపరాయణవై ఇట్లు పలుకుట నీకే తగియున్నది. రత్నములరాసులకన్న దేవ రాజ్యముకన్నను నీయీవాక్యము మిన్నయైనది. విజయశ్రీవిరా జితుఁడైన రాముని చూచినంతనే నాకు దేవరాజ్యాదికము ప్రాప్తిం చినట్లే మహానందము కలిగినది." ఆమాటలకు సీత చాల సంతో షించి అంజనేయునివాక్చాతుర్యమును బుద్ధిమహిమను తేజఃక్షమా ధృతిస్థైర్యవినయాదికమును ప్రశంసించెను.

అంజనేయుఁడు ప్రహృష్టుఁడై యిట్లనెను. "నీవు అనుమ తించినచో నిన్ను ఇంతకాలమునుండి బాధించుచున్నయీరాక్షస స్త్రీలను వివిధఘాతములతో మర్దింతును. ఈవరము నాకొసం గుము. వీరిని ముష్టిజంఘాజానుప్రహారములతో దంతములతో కర్ణనాసాకేశచ్ఛేదనము గావించి చంపుదును." ఆమాటలను విని ఆరాక్షసస్త్రీలు ప్రాణభీతితో "అమ్మా! రక్షింపుము, రక్షింపుము" అని ఆమెపాదములపైఁ బడిరి.

దీనవత్సలయైనవైదేహి వారికి అభయ మొసంగుచు హను మంతునితో ఇట్లనెను. "ఆంజనేయా! రాజవశ్యులై అజ్ఞాపాలనముఁ గావించుచున్నదాసీలపై నెవఁడైన కోపము నొందునా? పురాకృత దుష్కృతమువలన నాకు ఈదుర్దశ సంభవించినది. దీనికి వీరు కారణము కాదు. రావణునియాజ్ఞచే కదా వా రట్టు చేయు చుండిరి. అతఁడు హతుఁడైనపిమ్మట అట్లేల చేయుదురు? వీరు దుర్బుద్ధితో స్వయముగా నన్ను బాధించియున్నపక్షమున కూడ ఇప్పుడు ప్రాణభీతితో నన్ను శరణము వేడుచున్నప్పుడు, వీరిని హింసించుట మనకు తగదు. పూర్వము ఒక సందర్భమున వ్యాఘ్రమునకు ఋక్షము చెప్పిన శ్లోక మొకటి యున్నది; వినుము. "అపకారము చేయుచున్న వారిని చూచి ప్రాజ్ఞుఁడు తాను కూడ పాపమును చేయఁబూనుకొనఁడు. అపకారులకు కూడ ప్రత్యప కారమును చేయరా దనుమర్యాద రక్షింపఁదగినది కదా! సత్పురు షులకు చరిత్రమే భూషణము". వధార్హులైనవారు పాపులైనను శుభవర్తను లైనను వారియందు ఆర్యుఁడు కారుణ్యమునే చూప వలయును. ఎప్పుడేని యెకప్పుడు అపరాధమునే యొనర్పనివాఁ డొకఁడు కలఁడా? లోకహింసావిహారులై క్రూరులైన రాక్షసులకు పాప మొనర్చుట సహజము. అట్టియెడల వారివిషయమున సత్పురుషులు అమంగళ మొనర్పరాదు."

ఈ సందర్భమునందలి పూర్వగాథను గోవిందరాజస్వామి టీకలో ఇట్లు వివరించెను. ఒకవ్యాధుఁడు పులిచేఁ దఱుమఁబడి ఒకచెట్టుపై కెక్కెను. అక్కడ ఒకభల్లూక ముండెను. దానిని చూచి వాఁడు గడగడ వణఁకఁజొచ్చెను. భల్లూకము వానిదుస్థి తికి జాలిపడి అభయ మొసంగెను. పులి చెట్టుదగ్గరకు వచ్చి, భల్లూ కమును చూచి "మనుష్యుఁడు మృగముల కెల్ల శత్రువు; వీనివలన

నీకును అపాయము కలుగును. కావున వీనిని పడఁద్రోయుము" అనెను. భల్లూక మిట్లనెను. "నీవు చెప్పినది నిజమే. అయినను వీఁడు నా తావునకుఁజేరినాడు. నన్ను చేరినవానిని పడఁద్రోయుట మిక్కిలి యధర్మము. నేను అట్లు చేయను." పిమ్మట కొంతసే పటికి భల్లూకము నిద్రించెను. అప్పుడు పులి వ్యాధుని చూచి, "నేను వెడలిపోయిన తరువాత ఇది మేల్కొని నిన్ను భక్షింపఁ గలదు; కావున దీనిని క్రిందికి త్రోయుము" అనెను. వ్యాధుఁడు ఆ మాటలను నమ్మి విశ్వాసహీనుఁడై ఆయెలుఁగుబంటిని క్రిందికి త్రోసెను. అది వెంటనే మేల్కొని మఱియొకకొమ్మ నందుకొని క్రిందపడలేదు. పులి నవ్వుచు ఋక్షమును చూచి, "వీనినైజ మెట్టిదో తెలిసివచ్చినది కదా! ఇంక నైనను ఈవిశ్వాసఘాతకుని క్రిందికి త్రోయుము" అనెను. ఆ బోయవాఁడు భల్లూకమును చూచి ప్రాణభీతితో సమస్కరించుచు, "తప్పును మన్నింపుము; క్షమింపుము; రక్షింపుము" అని విలపింపఁజొచ్చెను. ఋక్షము పులి మాటను అంగీకరింపక పై శ్లోకమును చెప్పెను. పులి విసుఁగు నొంది వెడలిపోయిన తరువాత వ్యాధుడు ఋక్షమునొద్ద సెలవుఁ గైకొని యింటికి చేరెను.

శ్లో॥ న పరః పాప మాదత్తే పరేషాం పాపకర్మణామ్।
సమయో రక్షితవ్య స్తు; సన్త శ్చారిత్రభూషణాః॥ 42

శ్లో॥ పాపానాం వా శుభానాం వా వధార్హాణా మథాపి వా।
కార్యం కారుణ్య మార్యేణ; న కశ్చి న్నాపరాధ్యతి॥ 43

శ్లో॥ లోకహింసావిహారాణాం రక్షసాం కామరూపిణామ్।
కుర్వతా మపి పాపాని నైవ కార్య మశోభనమ్॥ 44

యుద్ధ-వర్గ-113

కందుమహర్షివాక్యమును ప్రమాణీకరించి రాముఁడు, ఋక్షగీతమును ప్రమాణ మొనర్చి జానకియు అభయప్రదానమును గావించిరి. రామునిచే అభయమును పొందిన విభీషణుఁడు, సీతవలన రక్షింపఁబడిన యీ దాసీలును అభయప్రదానమునకు అర్హులే. రావణునివంటివానిని కూడ వీ రిరువురు క్షమింపఁగల వారే. లోకోత్తరమహిమాన్వితులైన వారి కది చెల్లినఁ జెల్లును గాక! సామాన్యుల కిది వర్తింపదు. ప్రజారక్షణబాధ్యతను వహించుప్రభువులకు, రాజకీయనాయకులకు ఇది ఏమాత్రము వర్తింపదు. ఇట్టి స్వభావము ప్రభువునకున్న దని తెలిసినచో అపరాధు లందఱును శరణాగతులు కాకుందురా? అప్పుడు వారి నందఱను క్షమించివదలిపెట్టుచున్నచో సాధువుల గతి ఏమగును? శిక్షాస్మృతి ఎందులకు? కావున శరణాగతత్రాణము అహింస మొదలగు నియమము లన్నియు మహాపురుషులకు వ్యక్తినిష్ఠము లైన వ్రతములే కాని అందఱకును అవలంబనీయములు కాదు.

త్రిజట తనస్వప్నమును చెప్పినప్పుడే ఈ దాసీలు శరణ మి మ్మని సీతను ప్రార్థించిరి. ఆమె శరణ మొసంగెను. ఇది యంతయు ఆంజనేయుఁడు వృక్షముపైనుండి చూచుచు వినుచునే యుండెను. ఆ విషయము తెలిసియుండియు ఆయన ఇట్లేల పలికెను? తరువాత సంభవించిన పెక్కుసంఘటనలపరంపరవలన ఆయన ఆ విషయమును విస్మరించియుండును.

ఆంజనేయుఁడు ఆమెయౌదార్యమునకు సంతోషము నొంది, "అమ్మా! నీవు రామునకు తగిన ధర్మపత్నివి; ఇంక నేను రాముని యొద్దకు పోవలసియున్నది; ఆయనకు ఏమి చెప్ప మందువు?" అవి యడిగెను. అమె "భక్తవత్సలుఁడైన భర్తను చూడఁ గోరు

చున్నాను" అనెను. "నీ విప్పుడే పూర్ణచంద్రాస్యుఁడైన రామభద్రుని చూడఁగలవు'' అని పలికి ఆంజనేయుఁడు అటనుండి బయలుదేరెను.

## 2. రామునియభిప్రాయము

ఆంజనేయుఁడు రామునియొద్దకు వచ్చి ఇట్లు చెప్పెను. "రామచంద్రా! ఈ మహారంభమునకు ఫలస్వరూపయైన వైదేహి నిన్ను చూడఁగోరుచున్నది. శోకసంతప్తయైన యామెను వెంటనే చూడుము." ధార్మికవర్యుడైన రాముఁ డిదివిని కనులలో నీరునిండుచుండఁగా కొంతసేపు చింతానిమగ్నుఁడై గాఢముగ నిటూర్చి నేలపై చూపు నిలిపి విభీషణునితో, "మిత్రమా! శిరస్స్నాతానులిప్తయై దివ్యాభరణభూషితయైన సీతను ఇటకు శీఘ్రముగ తీసికొనిరమ్ము" అనెను.

శ్లో॥ ఏవ ముక్తో హనుమతా రామో ధర్మభృతాం వరః।
అగచ్ఛ త్సహసా ధ్యాన మీషద్బాష్పపరిప్లుతః॥ 5

శ్లో॥ దీర్ఘ ముష్ణం వినిశ్వస్య మేదినీ మవలోకయన్।
ఉవాచ మేఘసంకాశం విభీషణ ముపస్థితమ్॥ 6

శ్లో॥ దివ్యాంగరాగాం వైదేహీం దివ్యాభరణభూషితామ్।
ఇహ సీతాం శిరస్స్నాతాం ఉపస్థాపయ మా చిరమ్॥ 7

యుద్ధ-సర్గః 114.

చిరకాలమునకు ప్రియురాలైన ధర్మపత్నిని పతివ్రతను చూడఁగలిగినందులకురాముఁడు సంతోషపారవశ్యమును పొందక దైన్యమును పొందు టెందులకు? ఏవనితను చూడవలయు నని

ఆయన అహోరాత్రములు అత్యంతదుఃఖము నొందెనో అట్టి ప్రియురాలిని, రావణసంహారమైనంతనే, లేక, రావణసంస్కార మైనంతనే గాని, వెంటనే తానే చూచుటకు తొందరపడక అంజనేయుని పంపుట ఎందులకు? వనవాసవ్రతముచే తాను నగరమున ప్రవేశింప లేకున్నను తనస్కంధావారముననే అంతః పురము నేర్పఱచి అందు ప్రవేశపెట్టుమని విభీషణునితో చెప్పియుండవచ్చును. అట్లేల చేయలేదు? కనుల నీరు నిండు చుండగా గాఢముగా నిట్టూర్చుచుండె ననుటవలన, ఆయన జనా పవాదమును గూర్చి ముందే శంకించి సీతను వెంటనే పరిగ్రహిం చుటకుఁ గాని, నిర్దోషయైన ధర్మపత్నిని పరిత్యజించుటకుఁ గాని నిర్ణయింప లేక చింతానిమగ్నుఁ డయ్యె నని వ్యక్త మగుచున్నది. ఆయన ఆలోచించి తుదకు ఆమెను స్వీకరించుటకు ముందు అగ్నిశోధనము కావింపక తప్ప దను నిశ్చయమునకు వచ్చెను. ఆనిశ్చయము తోఁచినంతనే ఆయన, ఇప్పటికే ఎన్నో బాధల నొందియున్నయామెను మరల బాధపెట్టవలసి వచ్చుచున్నదే యని, దుఃఖితుఁడై బాష్పపరిప్లుతుఁ డయ్యెను.

ఇందులకే ఆయన ఆమెను శిరస్స్నాతనుగా దివ్యాభరణ భూషితనుగా చేసి తీసికొని రమ్మని విభీషణునకు ఆదేశించెను. చిరకాలము భర్తకు దూరముగా రావణుని సమీపమున నుండుటచే తన పాతివ్రత్యముయొక్క అభంగురత్వమును నిరూపించుకొను టకై సీత తాను అంతకాలము ఏమలినావస్థయందున్నదో ఆయవ స్థలోనే, నిరాభరణగా, కృశాంగిగా, దీనురాలుగా, మలినవసనగా, ధూళిధూసరశరీరముతో జడలుగట్టిన కేశపాశముతో పతికి కన్పింపవలయు నని తలంచుట సహజము. కాని ఆమె పాతివ్ర త్యముయొక్క అభంగురత్వమునుగూర్చి రామునకు ఎట్టి సందే

హమును లేదు. ఆమె ధూళిధూసరశరీరముతో ఆయనకు కన్పింప నక్కఱలేదు. ఆమెయొక్క పరిస్థితి నంతను ఆంజనేయుఁడు మొదటిసారి చూచి వచ్చినప్పుడే స్పష్టముగా వర్ణించి చెప్పెను. అప్పటి నుండి రావణసంహారము వఱకు మధ్యకాలమున ఏమైన మార్పు సంభవించియుండు నేమో యని తెలిసికొనుటకు రాముఁడు ఇప్పుడు మరల ఆంజనేయుని బంపెను. ఆంజనేయుఁడు ఇప్పుడు పోయి చూచి వచ్చి ఆమె పూర్వ మెట్లు మలినాంగియై కృశాంగియై యున్నదో ఇప్పుడు కూడ అట్లే ఉన్నదని స్పష్టము చేసెను. కావున రామునకు సీత శీలమునుగూర్చి రవ్వంతయు సందేహమునకు అవకాశములేదు. అట్టి మహాపతివ్రతను అగ్నిశుద్ధిని పొందుమని చెప్పవలసివచ్చినందులకే ఆయన వ్యథ నొందుచున్నాఁడు. అగ్నిప్రవేశము చేయవలసివచ్చినచో రజోమలినవస్త్రశరీరయై ఆమె అగ్నిహోత్రమునందు ప్రవేశించుట తగదు. అగ్నిహోత్రమునకు, మనము అర్పించు ఏవస్తువైనను శుచిగనే యుండవలయును. ఈకారణముచేతనే శవమునకు సైతము స్నానము చేయించి వస్త్రాదులతో అలంకరించి శుచి యొనర్చి ఆగృహస్థునిచే అర్చింపఁబడిన యగ్నులకు, ఆతని శరీరమునే చరమాహుతిగ అర్పించుచున్నారు. రావణుని శరీరసంస్కారమునందు ఈవిషయమును గమనించియే యున్నాము. కావున అగ్నిహోత్రునకు అర్పింపఁబడునట్టి యేపదార్థమైనను శుచిగానే యుండవలయును. అందువలన అగ్నిహోత్రమునందు ప్రవేశింపవలసియున్న సీత శుచియై సర్వాభరణభూషితగా ఉండ వలయు నని రాముఁడు ఉద్దేశించెను. ఈవిషయమును మహర్షి అగ్నిప్రవేశసందర్భవర్ణనమున స్పష్టమొనరించెను. హుతాశనునియందు ప్రవేశించుచున్న యా మహాభాగను, యజ్ఞమునందు అర్పింపఁబడుచున్న పూర్ణాహుతినివలె

సంస్కరింపఁబడి యధ్వరమునందు అర్పింపఁబడుచున్న యాజ్య ధారనువలె హవ్యవాహనునియందు పడుచున్నయామెను చూచుచు స్త్రీ లందఱును ఆక్రోశించిరి. పూర్ణాహుతియందు శ్రేష్ఠములైన పదార్థము లన్నియు శుచిగా సమకూర్పఁబడుచుండుట ప్రసిద్ధమే. అట్లే అగ్నిహోత్రమునందు నిరంతరముగా అర్పింపఁబడునాజ్య ధార బంగారువర్ణమున ఉజ్జ్వలముగా ప్రకాశించుచుండును. ఈ రెండు ఉపమానములచేత సీత శుచిగా శ్రేష్ఠమైనపదార్థముగా అగ్ని హోత్రమునకు అర్పింపఁబడె నని మహర్షి స్పష్టమొనర్చినాఁడు. ఇందులకే రాముఁడు ఆమెను శిరస్స్నాతనుగా సర్వాభరణభూషి తనుగా చేసి తీసికొని రమ్మని యాదేశించినాఁడు.

శ్లో॥ దదృశు స్తాం మహాభాగాం ప్రవిశన్తీం హుతాశనమ్।
ఋషయో దేవగంధర్వా యజ్ఞే పూర్ణాహుతీ మివ॥ 31

శ్లో॥ ప్రచుక్రుశు స్స్త్రియ స్సర్వా స్తాం దృష్ట్వా హవ్యవాహనే।
పతన్తీం సంస్కృతాం మన్త్రై ర్వసోర్ధారా మి వాధ్వరే॥ 32

యుద్ధ – సర్గ. 116

## 3. రాముని రోషావేశము

విభీషణుడు అంతఃపురమునకు పోయి తన స్త్రీలతో సీత యొద్దకు పోయి ప్రాంజలియై, "అమ్మా! భర్త నిన్ను చూడఁగోరు చున్నాఁడు; దివ్యాంగరాగములతో అలంకారములచేత భూషితవై యాన మారోహించి బయలుదేరుము" అనెను. ఆమె స్నాన మొన ర్చకయే, అప్పటివఱకును అక్కడ ఎట్లున్నదో అట్లే, రాముని చూతు ననెను. భర్త చెప్పినట్లు చేయవలయును కదా అని విభీ షణుఁ డనెను. సీత యంగీకరించెను. వెంటనే విభీషణుని స్త్రీలు

ఆమెను అంతఃపురమునకు తీసికొనిపోయి స్నానము చేయించి యంగరాగములతో దివ్యాభరణములతో, అలంకరించిరి. పిమ్మట నామె శిబికయందు కూర్చుండి రాక్షసభటపరివృతయై రాక్షసస్త్రీలు వెంటవచ్చుచుండఁగా రామునియొద్దకు బయలుదేరెను.

విభీషణుఁడు సీతయొక్క ఆగమనమును నివేదించుటకై ముందుగా రామునియొద్దకు పోయెను. విభీషణుఁడు రాముని సమీపమునకు పోయి నిలిచియున్నను, అతఁడు వచ్చెనని యెఱిం గియు, రాముఁడు చింతానిమగ్నుఁడై అతని వంక చూడలేదు, పలు కరింపలేదు. అయినను, విభీషణుఁడే రామునకు నమస్కరించి సంతోషముతో "సీత వచ్చియున్న" దని నివేదించెను. రక్షోగృహ మందు చిరకాల మున్నసీత వచ్చినదని విభీషణుఁడు విన్నవించి నంతనే హర్షము దైన్యము రోషము రాము నావేశించెను. ఆమెను తనదగ్గరకు శీఘ్రముగా తీసికొని రమ్మని విభీషణునకు ఆదేశిం చెను. ఇది విభీషణుని యుద్దేశమునకు విరుద్ధము. రాముఁడు స్వయముగా ఆమెకు ఎదురేగి ఆమెను చూచి కుశల మడిగి మహా రాణికి ఉచితముగా ప్రత్యేకమైన శిబిరమునందు విడిది గావించు నని విభీషణుఁడు ఊహించెను. అందులకే అతఁడు ముందుగా వచ్చి సీతయొక్క రాకను తెలిపెను. కాని రాముఁడు ఆమెవిషయ మున ఏమియు ఉత్సాహమును పొందక, తాను ఉన్నచోటు నుండి కదలక, వానరసైన్యమధ్యము నుండియే ఆమెను తీసికొని రమ్మని ఆదేశించెను,

శ్లో॥ సోఽభిగమ్య మహాత్మానం జ్ఞాత్వాపి ధ్యాన మాస్థితమ్।
ప్రణత శ్చ ప్రహృష శ్చ ప్రాప్తాం సీతాం న్యవేదయత్॥ 16

శ్లో॥ తా మాగతా ముపశ్రుత్య రక్షోగృహచిరోషితామ్।
హర్షో దైన్యం చ రోష శ్చ త్రయం రాఘవ మావిశత్॥ 17

యుద్ధ - సర్గ. 114.

రక్షోగృహమున చిరకాలము నిర్బంధమున నుండి సీత తన యొద్దకు వచ్చుచున్న దన్నప్పుడు హర్షము దైన్యము రోషము రాముని ఆవేశించె నని వాల్మీకిమహర్షి స్పష్టముగ నిర్దేశించెను. చిరకాలమునకు ప్రియురాలు, తనదగ్గరకు వచ్చుటవలన ఆయనకు హర్షము కలుగుట సహజము. కాని అయోధ్యలోని ప్రజలు ఆమె శీలమును శంకింతు రేమో అను నూహ తోఁచినపుడు దైన్యము కలిగియుండును. కాని ఆయనకు రోషము కలుగుటకు హేతు వేమున్నది? రావణునిపై నుండిన రోషము, అతఁడు వధింపఁ బడినంతనే, చల్లారినది. వైరములు మరణాంతములే అని ఆయ నయే చెప్పినాఁడు. ఇంక రోషమునకు ప్రత్యక్షనిమిత్తము సీతయే యని సిద్ధమగుచున్నది.

ఈరోషమునకు హేతువును అనేకులు అనేకవిధములుగా ఊహించిరి. "నేను అగ్నియందు ప్రవేశింతును" అను సంకల్ప మును పొంది, సీత తన శీలమును నిరూపించుకొనుచు శపథము చేయవలయు ననుతలంపుతో ఆమెకు రోషము కలుగునట్లు తీవ్ర ముగా మాటాడుటకొఱకు రాముఁడు రోషమును తనయందు ఆరోపించుకొనె నని గోవిందరాజస్వామి వ్యాఖ్యానించెను (అత్ర రోషో భావిశపథోపయోగిత్వా దారోపిత ఇతి ద్రష్టవ్యమ్). కాని మహర్షి రోషమునుగూర్చి దానిని రాముఁడు తన యందు ఆరోపిం కొనె నని చెప్పలేదు. హర్షదైన్యములతో రోషము కూడ ఆయనను ఆవేశించె నని చెప్పెను. అనఁగా హర్షము దైన్యము ఏవిధముగా

అప్రయత్నముగా, ఆయనయందు పొంగివచ్చెనో అట్లే రోషము కూడ ఆయనయొక్క ప్రయత్నము లేకయే పొంగివచ్చె నన్న మాట. ఈమూఁడు భావములు రాముని ఆవేశించె ననియే మహర్షి నిర్దేశించెను. ఆవేశమునందు ఆరోపము ఉండదు. ఆరోప మెప్పుడును ఆలోచనపూర్వకముగానే యుండును. ఆలోచనపూర్వ కముగా తెచ్చుకొను భావము ఆవేశము కానేరదు. భీమునకు దుశ్శా సనునియెడలఁగల కోపమును అభినయించునటుఁడు ఆభావము లను చేష్టలను ఆలోచనపూర్వకముగా కౌశలముతో తనయందు ఆరోపించుకొనును. కాని వానికే యథార్థజీవితమునందు ఏదేని అవమానము సంభవించినప్పుడు వానికి తెలియకుండఁగనే కోపము పొంగి వానిని ఆవేశించును. మహర్షి రోషము ఆవేశించెను (రోషః ఆవిశత్) అని స్పష్టముగా చెప్పియుండుటవలన రాము నియందు హర్షదైన్యములతో పాటు రోషావేశమే కలిగె నని చెప్పవలసియునది.

అంతకష్టమును పొందిన సీతవిషయమున ఆయన జాలిని పొందక రోషావేశము నెందులకు పొందెను? ఆమె వచ్చు చున్న దనఁగానే వనవాసారంభమునుండి రావణసంహారమువఱకు తమకు సంభవించినవిపత్పరంపర లన్నియు ఆయన మనస్సున క్రమముగా మెదలియుండును: రావల దని ఎంత వారించినను వినక మొండిపట్టుదలతో ఆమె రామలక్ష్మణులవెంట అడవులకు వచ్చియుండుటయే ఈకష్టపరంపరల కంతకును మూలము. ఆమె రాకున్నచో వారి కింత మనస్తాపము కలిగియుండదు. ఋషుల యభ్యర్థనవలన వారు ఏదోవిధముగా రాక్షసనిర్మూలనము గావిం చియుందురు. అడవులలో ఆమెను రక్షించుకొనుచుండుట వారికి పెద్దకర్తవ్యభార మయ్యెను. మాయామృగమునుగూర్చి, అది మారీ చునిమాయయే యని లక్ష్మణుఁడు దృఢముగా చెప్పుచుండఁగా,

అతనిమాటలను లెక్కింపక ఆమెమృగమును తెమ్మని రాముని ప్రోత్సహించి పంపుట, పిమ్మట లక్ష్మణుని శంకించి నిందించి ఆశ్రమమునుండి పంపివేయుట, ఆమెవిపత్తునకు వారిదుఃఖము నకు ప్రత్యక్షకారణములు. సీతచే అత్యంతపరుషముగా బహుధా నిందితుఁడై తనయొద్దకు వచ్చినలక్ష్మణుని రాముడు ఓదార్పక పోఁగా "నామాటను నీవు పాటింపలేదు" (నాకరోః వచనం మమ) అని పరుషముగా పలికి ఇంకను బాధించెను. అప్పుడు తమ యిరువురి మధ్య నలఁగిపోయిన లక్ష్మణునియొక్క వ్యథ రాముని హృదయమున నాటుకొనియే యున్నది.

లక్ష్మణునిది మూగబాధ. రామునిపై కోపము వచ్చినప్పుడు సీత ఆకోపమును పరుషవచనములతో వెలిగ్రక్కుటకు సంకోచింపలేదు. అడవులకు వెంట రావల దని ఆయన అన్నప్పుడు ఆమె ఎంతో పరుషముగా ఆయనను మందలించినది. జరుగనున్న అగ్నిప్రవేశసందర్భమున కూడ ఆమె పరుషముగనే మాటాడినది. ఎంతకష్టము కలిగినను లక్ష్మణుఁడు తనలో తాను బాధపడినాఁడే కాని ఒక్కమాట కూడ పరుషముగా రామునిగూర్చి పలుకలేదు. పరమమైన లక్ష్మణునియాభక్తిని రాముఁడు గమనించుచునే యున్నాఁడు. అందువలననే ఆయన, నాగపాశబంధన సందర్భమున లక్ష్మణుఁడు నిశ్చేష్టుఁడై పడియున్నప్పుడు, "వీఁడు ఎంత కోపముతో ఉన్నప్పుడు కూడ నన్నుగూర్చి పరుషముగాఁ గాని విప్రియమును గాని పలికినట్లు గుర్తు లేదు" అనుచు విలపించెను. అట్టివానికి ఆమె మరణాధికమైనవ్యథను కలిగించుచు నిందించిన దన్నచో ఆయనకు ఆమెపై ఎంతైనకోపము కలిగియుండవచ్చును. మహావీరులకు మరణము ఒకలెక్క కాదు. అపనిందవలన కలుగు తిరస్కారము వారికి మరణాధికమైనవ్యథను కలిగించును.

శ్లో॥ సురుష్టే నాపి వీరేణ లక్ష్మణేన న సంస్మరే।
పరుషం విప్రియం వాపి శ్రావితం న కదాచన॥ 19

యుద్ధ - సర్గ - 49

ఇంతే కాదు. మృగముకొఱకు బయలుదేరునప్పుడు రాముఁడు సీత వినుచుండఁగా లక్ష్మణుని ఇట్లు ఆదేశించెను. "ఈనృశంసుఁడైన మారీచునిచేత ఎందఱో మునులు హింసింపఁబడినారు..... నాయొద్దకే వచ్చినవీఁడు అగస్త్యునిచేత వాతాపివలె, హతుఁడగును. ఇక్కడ నీవు సన్నద్ధుఁడవై మైథిలిని రక్షించుచుండుము .......చర్మప్రధానుఁడై మృగముగా వీఁడింక ఉండఁడు. నీవు ఆశ్రమస్థుఁడవై సీత విషయమున అప్రమత్తుఁడవై యుండుము." ఇందు రాముని యాదేశము సీతకు కూడ గర్భితమై యున్నది. సీతను రక్షించుచుండుట రాముని యాజ్ఞగా లక్ష్మణునకు ఎంత కర్తవ్యమో, ఆతని రక్షణమును నిరాకరింపకుండుట సీతకు కూడ అట్లే కర్తవ్యము. మారీచుని మాయను గూర్చి లక్ష్మణుఁడే కాక రాముఁడు కూడ చెప్పియుండినను ఆమాటలను నమ్మక లక్ష్మణుని నిందించి పంపుటవలన ఆమె రాముని యాజ్ఞను తిరస్కరించినట్లే యయ్యెను. ఇన్నికారణములచేత సీత వచ్చుచున్న దన్నంతనే రామునకు రోషావేశము కలిగెను.

శ్లో॥ ఏతేన హి నృశంసేన మారీచే నాకృతాత్మనా।
వనే విచరతా పూర్వం హింసితా మునిపుంగవాః॥ 36

శ్లో భవే ద్ధతోఽయం వాతాపి రగస్త్యే నేవ మాం గతః।
ఇహ త్వం భవ సన్నద్ధో యంత్రితో రక్ష మైథిలీమ్॥ 46

శ్లో॥ త్వచా ప్రధానయా హ్యేష మృగోఽద్య న భవిష్యతి।
అప్రమత్తేన తే భావ్య మాశ్రమస్థేన సీతయా॥ 49

అరణ్య — సర్గ. 43.

సీతాదేవి శిబికలో నుత్సవముతో వచ్చు చుండఁగా ఆమెను చూడవలయు నను కుతూహలముతో ఋక్షులు వానరులు చుట్టును మూగఁజొచ్చిరి. వేత్రహస్తులు వారిని బెత్తములతో ప్రక్కలకు త్రోయుచు మార్గమేర్పఱచుచు వచ్చుచుండిరి. త్రోయఁబడుచున్న ఋక్షవానరయోధులు భీతులై కలకల మొనర్చుచు ప్రక్కలకు దుముకఁజొచ్చిరి. వారి భంగపాటును చూచి సహింపక రాముఁడు విభీషణునివంక దహించుచున్నట్లు చూచుచు, సోపాలంభముగా నిట్లనెను. "నన్ను లెక్కపెట్టక నాయీజనము నేల క్లేశమొందించు చున్నావు? ఈయుద్యోగమును ఈక్షణమే మాన్పింపుము. వీ రందఱు నావారు. స్త్రీలకు వృత్తమే ఆవరణము; గృహములు వస్త్రములు ప్రాకారములు మేలిముసుఁగులు మొదలగు రాజలాం ఛనములు సంరక్షకములు కావు. అదియును గాక దుఃఖసమయ ములందు ఆపదలయందు యుద్ధములలో స్వయంవరక్రతువివా హములందు ఇతరులకు కన్పించుట స్త్రీలకు దోషావహము కాదు. యుద్ధభూమికి వచ్చుచు మహాకష్టమందున్న యీామె, అందును నాసమక్షమునందు, ఎల్లరకును కన్పించుటలో దోషము లేదు. ఆమె శిబికను దిగి నడచుచు నాదగ్గరకు రావచ్చును. ఈ ఋక్ష వానరు లందఱు ఆమెను చూడవచ్చును.

శ్లో॥ ఉత్సార్యమాణాన్ దృష్ట్వాథ జగత్యాం జాతసంభ్రమాన్।
దాక్షిణ్యా త్తదమర్షా చ్చ వారయామాస రాఘవః॥ 24

శ్లో॥ సంరబ్ధ శ్చాబ్రవీ ద్రామ శ్చక్షుషా ప్రదహ న్నివ।
విభీషణం మహాప్రాజ్ఞం సోపాలంభ మిదం వచః॥ 25

శ్లో॥ కి మర్థం మా మనాదృత్య క్లిశ్యతేఽయం త్వయా జనః।
నివర్త యైన ముద్యోగం; జనోఽయం స్వజనో మమ॥ 26

శ్లో॥ న గృహాణి న వస్త్రాణి న ప్రాకారా స్తిరస్క్రియాః।
నేదృశా రాజసత్కారాః, వృత్త మావరణం స్త్రియః॥ 27

శ్లో॥ సైషా యుద్ధగతా చైవ కృచ్ఛ్రే చ మహతి స్థితా।
దర్శనే నాస్తి దోషోఽస్యా మత్సమీపే విశేషతః॥

శ్లో॥ విసృజ్య శిబికాం తస్మా త్పద్భ్యా మే వాపసర్పతు।
సమీపే మమ; వైదేహీం పశ్య న్త్వేతే వనౌకసః॥ 30

యుద్ధ - సర్గ. 114

విభీషణుఁడు చకితుఁడై సంభ్రమముతో శిబికయొద్దకు పోయి వేత్రహస్తులను వారించి సీతను నడచి రమ్మని చెప్పెను. రాముని మాటలు విని లక్ష్మణసుగ్రీవులు హనుమంతుఁడు మిగుల వ్యథనొందిరి. సీత సిగ్గుతో కుంచించుకొని పోవుచు, విభీషణుఁడు వెంట వచ్చుచుండఁగా, రాముని యొద్దకు వచ్చి విస్మయముతో ప్రహర్షముతో స్నేహముతో రామునిముఖమువంకఁ జూచెను.

శ్లో॥ లజ్జయా త్వవలీయన్తి స్వేషు గాత్రేషు మైథిలీ।
విభీషణే నానుగతా భర్తారం సాభ్యవర్తయత్॥ 33

శ్లో॥ విస్మయా చ్చ ప్రహర్షా చ్చ స్నేహా చ్చ పతిదేవతా।
ఉదైక్షత ముఖం భర్తు స్సౌమ్యం సౌమ్యతరాననా॥ 34

యుద్ధ - సర్గ, 144.

## 4. రాముని పరుషభాషణము.

సీత వచ్చి వినమ్రయై తనపార్శ్వమున నిలచియుండుటఁ జూచి మిగుల గంభీరుఁడై రాముఁడు ఎల్లరు వినుచుండ ఇట్లనెను.

"" నిన్ను నేను యుద్ధమున గెలుచుకొంటిని; పురుష ప్రయత్నమున చేయఁదగినదానిని చేసితిని. నా క్రోధమునకు అంతమును చూచితిని. అవమానమును తొలఁగించుకొంటిని శత్రువుతోపాటు అవమానము కూడ హత మయ్యెను. లోకమునకు నాపరాక్రమము విదితమైనది. నాశ్రమ సఫల మైనది. ఇప్పుడు ప్రతిజ్ఞ దీర్చుకొని స్వతంత్రుఁడ నైతిని. నేను లేనప్పుడు, నీవు రావణునిచే హరింపఁబడుట అనుదైవకృతమైన దోషమును పౌరుషముచే తొలఁగించితిని. ప్రాప్తించిన యవమానమును పరాక్రమముచే తొలఁగించుకొనకున్నచో ఎంతవాని కైనను పౌరుషమువలన ప్రయోజన మేమున్నది? సముద్రమును లంఘించి లంకను మర్దించిన యాంజనేయుని పరిశ్రమ, తగినయాలోచనము చెప్పుచు యుద్ధమునందు ససైన్యముగ విక్రమించిన సుగ్రీవునియుద్యోగము, దుష్టుఁడైన యన్నను వదలి నన్ను చేరి సాహసమొనర్చిన విభీషణుని విక్రమము ఇప్పటికి ఫలించినవి."

ఇట్లు మాటాడుచున్నరాముని జూచి సీత బెదరినలేడిపిల్లవలె కన్నులు పెద్దవి చేసి యశ్రువులు వర్షింపఁజొచ్చెను. అట్లున్న ప్రియురాలిని చూచుచున్న యారాజునకు జనప్రవాదమువలని భయముచేత హృదయము రెండుగా చీలినట్లయ్యెను.

శ్లో॥ పశ్యత స్తాం తు రామస్య సమీపే హృదయప్రియామ్।
జనవాదభయా ద్రాజ్ఞః బభూవ హృదయం ద్విధా॥ 11

యుద్ధ - సర్గ. 115.

హృదయము ఎంత వ్యథిత మగుచున్నను రాముఁడు గాంభీర్యమును వీడక మరల ఇట్లనెను. "అవమానమును తొలఁగించు

కొనుటకై మానమును కాంక్షించువాఁడు ఏమి చేయునో అదియే నేను రావణసంహారమునఁ గావించితిని. జానకి! నీకు భద్ర మగును గాక! మిత్త్రులతోఁ గూడి నేను చేసిన యీపరిశ్రమ యంతయు నీకొఱకు కాదని యెఱుంగుము. అపవాదమును తొలఁగించుకొనుటకు, వృత్తమును రక్షించుకొనుటకు, ప్రఖ్యాత మైన మావంశమునకుఁ గలిగిన యపకీర్తిని తొలఁగించుకొనుటకే నేను ఇంత పరిశ్రమఁ గావించితిని. నేత్రరోగికి దీపమువలె, సందే హాగ్రస్తచరిత్రవైన నీవు నాయెదుట మిగుల ప్రతికూలముగా కన్పించుచున్నావు. కావున నీకు అనుమతి నొసంగుచున్నాను. నీవు యథేష్టముగ దశదిశలలో ఎటేని పొమ్ము. నాకు నీతో పని లేదు. పరునియింటియందున్న స్త్రీని స్నేహలోభముతో సత్కుల ప్రసూతుఁ డెవఁడు పరిగ్రహించును? రావణునియంకమున నలఁ గిన దానిని, వానిచే దుష్టములైన దృక్కులతో చూడఁబడిన దానిని నిన్ను మహాకులప్రసూతుఁడ నని చెప్పుకొనుచు నేనెట్లు స్వీకరింతును? నిన్ను యుద్ధమున గెలుచుకొనుట వలన ప్రయోజ నము తీఱినది. నీయందు నాకు ఆసక్తి లేదు. యథేష్టముగ పొమ్ము. ఇంక నీవు, నీకు సుఖముగా నుండుచోటు — లక్ష్మణ భరతశత్రుఘ్నులయొద్ద కాని, సుగ్రీవవిభీషణులయొద్ద కాని— ఎవరియొద్ద నుండఁదలంతువో నిశ్చయించుకొనుము. తనయింటి యందే దివ్యరూపమనోహరవై యున్న నిన్ను, వైదెహీ, రావణుడు చూచుచు చిరకాలము ఓర్పు వహించియుండఁడు."

శ్లో॥ యత్కర్తవ్యం మనుష్యేణ ధర్షణాం పరిమార్జతా।
తత్కృతం రావణం హత్వా మ యేదం మానకాంక్షిణా॥13

శ్లో॥ విదితశ్చాస్తు భద్రంతే యోఽయం రణపరిశ్రమః।
సుతీర్ణః సుహృదాం వీర్యాత్, న త్వదర్థం మయా కృతః॥15

శ్లో॥ ప్రాప్తచారిత్రసందేహా మమ ప్రతిముఖే స్థితా।
దీపో నేత్రాతుర స్యేవ ప్రతికూలాసి మే దృఢమ్॥ 17

శ్లో॥ త ద్గచ్ఛ త్వానుజానేఽద్య యథేష్టం జనకాత్మజే।
ఏతా దశదిశో భద్రే; కార్య మస్తి న మే త్వయా॥ 18

శ్లో॥ కః పుమాంస్తు కులే జాతః స్త్రియం పరగృహోషితామ్।
తేజస్వీ పున రాదద్యాత్ సుహృల్లోభేన చేతసా॥ 19

శ్లో॥ రావణాంకపరిక్లిష్టాం దృష్టాం దుష్టేన చక్షుషా।
కథం త్వాం పున రాదద్యాం కులం వ్యపదిశన్ మహత్॥ 20

శ్లో॥ త దద్య వ్యాహృతం భద్రే మయైత త్కృతబుద్ధినా।
లక్ష్మణే వాథ భరతే కురు బుద్ధిం యథాసుఖమ్॥ 22

శ్లో॥ శత్రుఘ్నే ఽ థ సుగ్రీవే రాక్షసే వా విభీషణే।
నివేశయ మన స్సీతే యథా వా సుఖ మాత్మనః॥ 23

శ్లో॥ న హి త్వాం రావణో దృష్ట్వా దివ్యరూపాం మనోరమామ్।
మర్షయే చ్చ చిరం సీతే స్వగృహే పర్యవస్థితామ్॥ 24

యుద్ధ - సర్గ. 115.

పై సందర్భమును గమనించినచో రాముఁడు అయోధ్యా ప్రజలందు సంభవించు నపవాదమును స్పష్టముగా నూహించె నని విదిత మగుచున్నది. సీతాదేవిని రావణుఁడు రెండుచేతులతో పట్టుకొని ఆకాశములో పోవునప్పుడు జాఱిపడిపోకుండ తన శరీరమునందు గట్టిగా అదుముకొని తీసికొనివచ్చినాఁడు. ఆమె వానిశరీర లగ్నయై యుండఁగా సుగ్రీవాదులు కూడ చూచిరి. తరువాత లంకలో ఆమెను తఱచుగా రావణుఁడు కామపూర్ణములైన దృక్కుక్కులతో చూచుచునే యున్నాఁడు. ఈపరిస్థితి అక్కడ నున్నవారి

కండఱకును విదితమే. ఆమెయొక్క మనస్సు పవిత్రముగనే యున్నను, రావణునిశరీరసంపర్కము కలిగినప్పుడు, వానిచేత దుష్టదృక్కులతో చూడఁబడుచునప్పుడు, ఆమెశరీరము, అంతకు పూర్వము ఎట్లు పవిత్రముగా నున్నదో, తరువాత కూడ అట్లే పవిత్రముగా నున్నదని చెప్పుటకు వీలులేదు. పూజాద్రవ్యములను మనము శుచిగా సమకూర్చి పెట్టుకొన్నప్పుడు, ప్రమాదవశమున కుక్క వచ్చి వానిని తాఁకినప్పుడు లేదా అశుచియైనవాఁడైవడైనవచ్చి తాఁకినప్పుడు, అవి యన్నియు అశుచి యగుచున్న వని వానిని పరిత్యజించి మరల పూజాద్రవ్యములను సమకూర్చుకొనుట లోకమున పరిపాటిగా నున్నది. అట్టియెడల రావణుని శరీరమునందు నలఁగినసీతను రాముఁడు ఎట్లు మరల భార్యనుగా పరిగ్రహింపఁగలఁడు? ఈకారణముచేత ఆమెను కేవలము పరిత్యజించి యూరకొనుటయు సమంజసము కాదు. తన్ను సర్వాత్మనా ప్రేమించుచు తన్ను వీడలేక వెంటవచ్చిన ప్రియురాలిని, తనచేత పోషింపఁబడి రక్షింపఁబడవలసిన భార్యను, దైవికముగా సంభవించిన సంఘటనము నెపముగా చేసి, తనబాధ్యత ఏమియు లేనట్లు, వదలిపెట్టిపోవుట ఏభర్తకైనను ఎట్లు ధర్మ మగును? ఇది రామునకు పెద్ద ధర్మసంకట మైనది,

ఆమెదైన్యమును చూచుచున్న సుగ్రీవాంజనేయాదులకు ఎవరికిని జనప్రవాదమునుగూర్చిన సమస్య మనస్సులందు లేదు. అది రాముని హృదయముననే ప్రబలముగా తోఁచుచుండెను. ఆయనకు కలిగినశంక కేవలము ఊహ కాదని తరువాత అయోధ్యాపౌరులలో ప్రబలిన ప్రవాదమువలన నిరూపితమైనది. ఆమెను అయోధ్యాప్రజలు మహారాణిగా అంగీకరింపఁజాల రనుట స్పష్టము. ప్రజలు తాము ఎట్టివారైనను తమ్ము పరిపాలించు రాజు రాణి

శీలవంతులై యుండవలయు నని కోరుకొనుట సహజము. ఇది ఇక్ష్వాకులకాలమున అయోధ్యాప్రజలకు మాత్రమే స్వభావము కాదు. అన్నికాలములలో, ప్రపంచములోని యన్ని దేశములలో ప్రజాస్వభావము సాధారణముగా ఇట్లే యుండెను. ఈ యిరువది యవ క్రీస్తుశతాబ్దమున కూడ పాశ్చాత్యదేశమైన ఇంగ్లాండులో, రాజు గాపలసిన యెనిమిదవ యెడ్వర్డు భార్యానిమిత్తముగా రాజ్యమును వదలుకొనవలసివచ్చుట గమనింపఁదగియున్నది. ఒక భర్తకు విడాకు లిచ్చినవనితను ఎడ్వర్డు ప్రేమించి పెండ్లాడఁ దలఁచెను. విడాకులిచ్చినస్త్రీ తమకు రాణిగా ఉండరాదని, ఇది సంప్రదాయవిరుద్ధ మని, ఆదేశప్రజలు మంత్రులు పట్టు పట్టిరి. అతఁడు భార్యను వదులుకొనలేక రాజ్యమును వదులుకొనెను. ఈ కాలమున పాశ్చాత్యదేశములయందే ప్రజాభిప్రాయ మిట్లుండఁగా, రామునికాలమున అయోధ్యాప్రజలు రావణునిశరీరమునందు నలఁగినసీతను రాణిగా పనికిరా దని నిరాకరించుట ఆశ్చర్యకరము కాదు; నిరాకరింపకుండుట ఆశ్చర్య మగును. ఒకవేళ రాముఁడు సీతయందలియనురాగముచే రాజ్యమును వదులుకొని, ఏయాశ్రమమునందో ప్రశాంతముగా ఉండవచ్చు ననుకొన్నను, అదియును సాధ్యము కాదు. "ఈరాముడు ఎంత స్త్రీలోలుఁడు? రాక్షసునిచేతికి చిక్కి వానియింటియందు సంవత్సరమున్న భార్యను వదులుకొన లేక యింకను ఆమెతో కాపురము చేయుచున్నాఁడే" అను అపకీర్తి శాశ్వతముగా ప్రజలయందు ఉండనే ఉండును. అందువలన జనవాదభయముచేత రామునిహృదయము రెండుగా చీలినట్లయ్యె నని రామునకు కలిగిన యత్యంతతీవ్రమైనవ్యథను ఒక్కమాటలో వాల్మీకి చెప్పెను.

అంతే కాదు రామునకు సీతయందు శీలవిషయమున ఎట్టి సందేహము లేదనువిషయమును కూడ వాల్మీకి నిస్సందేహముగా

వ్యక్తీకరించెను. తనసమీపమున నిలిచి తనమాటలచే దుఃఖితయై కన్నీరు వర్షించుచున్న హృదయప్రియురాలిని చూచుచు రాముఁడు వ్యథ నొందె నని మహర్షి చెప్పెను (సమీపే హృదయ ప్రియామ్). ఆమె అయనకు ప్రియురాలు మాత్రమే కాక హృదయ ప్రియఁగా నుండె నని మహర్షి అనుచున్నాఁడు. అనఁగా ఆమె అయనహృదయమునందు స్థిరముగా నెలకొన్నప్రియురా లన్నమాట. ఆమెయందు శీలదోషము ఏమియు లే దని ఆయన భావించు చుండుటయే ఈప్రియత్వమునకు కారణము. ఆమె శీలదోషరహి తయై యున్నదని ఆంజనేయునిమాటలవలననే స్పష్టమైనవి. ఈ విషయమునే ఆయన, "నేత్రరోగికి దీపమువలె నీవు నాకు ప్రతి కూలముగా నున్నావు" అని చెప్పుచు, ఆమె దీపమువలెనే శీల కాంతితో ప్రకాశించుచున్న దని, అయినను జనాపవాద మను భయముతో కలఁకనొందియున్నతనకు ఆమె ప్రతికూలముగ నున్న దని దోషమును తనయందే ఆరోపించుకొనెను. అందువలన ఆయన ఆమెశీలమునుగూర్చి రవ్వంతయు సందేహించుట లే దనుట స్పష్టము.

అట్లయినచో, "తనయింట నున్న సౌందర్యవతివైన నిన్ను చూచుచు రావణుఁడు చిరకాలము ఓర్పు వహించియుండఁడు" అని ఆయన ఎట్లు ఉద్ఘాటించెను? అట్లనుటవలన ఆమెశీలము రావణునిచేత భంగపడియుండు నని ఆయన తలంచుచున్నట్లు స్పష్ట మగుచున్నది కదా! అది ఆయన జనప్రవాదము ననుస రించి చెప్పినమాట. పరస్త్రీభంగకరణమునందు రావణుఁడు ప్రసిద్ధుఁడు. అందులకు ప్రతిబంధకములుగా వానికి ఏర్పడిన శాపములు ప్రసిద్ధములు కావు. కావున స్త్రీలంపటుఁడైన రావణుఁడు ఆమెను మాటిమాటికి చూచుచు బలాత్కరింపకుండ ఉండు నని ప్రజలు నమ్మరు: బలాత్కరించియుండు ననియే వారు తలం

తురు. ఆయాపరిస్థితులయందు ఏది సంభావ్యమో, అనఁగా జరిగియుండఁదగినదో (Probable), దానినే ప్రజలు నమ్ముదురు. కాని అందులకు భిన్నముగా యథార్థముగా ఇట్లు జరిగిన దని ఎంత చెప్పినను నమ్మరు. ఒక్కొక్కప్పుడు కల్పితవృత్తాంతము కన్న యథార్థమే ఆశ్చర్యకరమై నమ్ముటకు వీలుగాకుండును (Some times truth is stranger than fiction).

ఆయన జనప్రవాదమునకు ఇంత ప్రాముఖ్యము నిచ్చి పతివ్రతయైన పత్నికి వ్యథను కలిగించుట న్యాయమా? రాజునకు జనవాదము తప్పక మన్నింపఁ దగినదనియే వాల్మీకియభిప్రాయము. అందువలన "జనవాదభయమువలన రాజుయొక్క హృదయము రెండుగా చీలినట్లయ్యె" నని నిర్దేశించెను (జనవాదభయాత్ రాజ్ఞః). అధర్మమునకు భయపడవలెఁ గాని, ప్రజ లేదో అనుకొందు రని వారిమాటలను రాజు లెక్కపెట్టవలెనా? ప్రజలను రంజింపఁజేయువాఁడు రాజు. ప్రజలను ధర్మమార్గమున పాలించుచు తాను కూడ ధర్మమునందు వర్తించుచున్నచో ప్రజలు అట్టిరాజునందు అనురక్తు లగుదురు. అట్టిప్రభువునందు రాజశబ్దము సార్థక మగును. అట్లు గాక తాను ధర్మమార్గమున వర్తింపక ప్రజలను మాత్రము ధర్మమార్గమునందు నిలుపుటకు ప్రయత్నించుప్రభువును చూచి, వానిప్రభుశక్తికి వెఱచి లోఁబడియున్నను, మనస్సులో వానిని ద్వేషించుచునే యుందురు. అంతేకాదు. అవకాశము కలిననప్పుడు, "నీ కొకధర్మము, మాకు మఱియొక ధర్మమా" అని రాజును ధిక్కరించుటకు, ధర్మము నతిక్రమించుటకు కూడ పూనుకొందురు. కావున అట్టిప్రభువు రాజశబ్దమునకు యోగ్యుఁడు కానేరఁడు. అందువలన రాజు, "నేను ధర్మమునందే వర్తించుచున్నాను; ప్రజలు ఏమనుకొన్నను నాకేమి?" అను తలంపుతో వర్తింపరాదు. ప్రజలకు తనవిషయ

మున అపోహ కలుగుటకు అవకాశము ఏర్పడకుండునట్లే రాజు వర్తింపవలయును. కావున రావణునిచే అపహరింపఁబడి లంకలో సంవత్సరమున్నసీతను మరల భార్యనుగా స్వీకరించి అయోధ్యకు తీసికొనిపోయినచో, రాముఁడు భార్యాలోలుఁడై చెడినభార్యను కూడ మరల స్వీకరించెనని తలంతురే కాని యామెశీలము భంగ పడలే దని వారు తలంపరు. అప్పుడు వారు సీతను రాముని కూడ నిందించుచునే యుందురు. అభిమానవంతులకు, అందును పరిపాలకులకు, నిందను భరించుచు బ్రతుకుచుండుట మరణాధిక మైన వ్యథను కలిగించును. అందువలన రాముఁడు వెంటనే సీతను స్వీకరించుటకు పూనుకొనలేదు. దీనినిబట్టి, నేఁటిప్రజా స్వామ్యమునందుకన్న, ధార్మికులైనప్రభువులు ప్రజాభిప్రాయ మును ఎంతగా మన్నించుచుండిరో వ్యక్త మగుచున్నది.

రామునకు ప్రజాభిప్రాయమే ప్రధానవిషయ మైనచో ఆయన ఆవిషయమునే సూటిగా చెప్పి, "ఈపరిస్థితులయందు ప్రజలు నీశీలమును పవిత్రముగ నున్న దని తలంపలేరు. వారి యపవాదును నేను భరింపలేను.కావున నీవు ఏదేని శపథము చేసి నీశీలపవిత్రతను నిరూపించుకొనిననే తప్ప నేను నిన్ను స్వీక రింపఁజాలను" అని నెమ్మదిగనే చెప్పియుండవచ్చును. ఆమెను చూడఁగానే క్రోధముతో ఇంతపరుషముగా మహాజనసమక్షమున "నిన్ను పరిత్యజించుచున్నా"నని ప్రకటింపవలసినపనియేమున్నది? ఆయన ఇట్లు ప్రశాంతముగా చెప్పకుండుటకు కారణములు అనేక ములు కలవు. ఆయన ఉద్దేశించుచున్నప్రజాపవాదము అప్పటికి ఊహామాత్రమేకాని సిద్ధమైనది కాదు. అసిద్ధమై ఊహామాత్రమైన హేతువు నవలంబించి ఆమె యిప్పుడు శపథము చేయవలయు నని ఆయన చెప్పినచో ఆమాటపరిహాసాస్పదముగా నుండును. ఆయన సాధారణవ్యక్తులవలె, "అయ్యో! దైవికముగా ఇంత

ఘోరము జరిగినది! ఈమె శపథము చేయకున్నచో ప్రజ లెట్లు నమ్ముదురు; నమ్మకున్నచో నాగతి యేమి?" అని అంగలార్చినచో వెంటనే విభీషణసుగ్రీవాదులు మిత్రకృత్యముగా కల్పించుకొని "ఆంజనేయుని మాటలవలన ఆమెపాతివ్రత్యము వ్యక్తమగుచునే యున్నదికదా; ఆవిషయమున మీకు సందేహములేదు; మాకును సందేహము లేదు. ప్రజలు ఎవ్వడో ఏదో యనుకొందు రని శపథము చేయవలసినదిగా ఆమె నిప్పుడు మహాజనసమక్షమున నిర్బంధించుట తగదు, అయోధ్యలోని ప్రజలకు నచ్చఁజెప్పుటకు ఇంతకాలము ఆమెయొద్దనున్న సరమ త్రిజట మొదలైనరాక్షస స్త్రీలను తీసికొనిపోవచ్చును; వారిచేత చెప్పించి మేము కూడ చెప్పి ప్రజలకు విశ్వాసము కలుగునట్లు చేయుదుము; దీని కామె శప థము చేయుట ఎందులకు?" అని అనేకవిధములుగా సీతా రాములకు ప్రియముగా చెప్పుదురు.

ఆట్లే వారు రావణశరీరస్పర్శవలన కలిగినదోషమును గూర్చి కూడ ప్రాయశ్చిత్తవిధానములను పేర్కొందురు. శత్రు వులు దాడిచేయునప్పుడు ఒక్కొక్కప్పుడు వారివలన స్త్రీలు భంగ పడుట సంభవించును. ఆస్త్రీలకు శీలభంగము జరిగిన దని భర్తలు వారిని పరిత్యజించుట న్యాయము కాదు. స్త్రీలను రక్షింప వలసినబాధ్యత పురుషులపై నున్నది. పురుషులు అశక్తులై పరా జితులై స్త్రీలను రక్షింప లేకుండుట పెద్దయాపద. అట్టియాప దలో భంగపడినస్త్రీలు మరల కుటుంబములలో చేరుటకు వచ్చి నచో వారిని నిరాకరించుట తగదు. పరులసంపర్కమువలన వారి యందు కలిగినదోషములను పరిహరించుటకు ధర్మశాస్త్రములలో ప్రాయశ్చిత్తవిధానములు పేర్కొనఁబడియున్నవి. అందువలన

అప్రాయశ్చిత్తవిధానములతో సీతకు పరిశుద్ధిని కలిగించి నిస్సంకోచముగ స్వీకరింపవచ్చు నని విభీషణాదులు చెప్పవచ్చును. అంతే కాదు. ఆమె లంకలో నున్నసంవత్సర మంతయు తపస్సు చేయుచున్నట్లే యున్నది; కావున ఆతపస్సు చాంద్రాయణాది వ్రతములను అన్నింటిని మించినది అని, ఆమెను వెంటనే ప్రాయశ్చిత్తాదు లేవియు లేకుండఁగనే స్వీకరింపవచ్చు ననియు వారు చెప్పవచ్చును.

ఈప్రియవచనములు ఏవియు ప్రయోజకములు కావు. వీరి మాటలను అయోధ్యాప్రజలు విశ్వసింతు రనుట అసంభావ్యము. విభీషణసుగ్రీవాంగదులు రామునివలన ఉపకారము పొందిన వారు. కావున రామునకు ప్రత్యుపకారముగా తమయనుచరులను గైకొని వచ్చి వీరు ఇట్లు ప్రచారముచేయుచున్నా రని వారు తలంతురే కాని రావణునివలన సీత భంగపడ లే దన్న విషయమును నమ్మరు. అగ్నిప్రవేశము జరిగి దేవతలు ప్రత్యక్షమై సీతను పవిత్రనుగా రామునకు అప్పగించిన తరువాత కూడ వారు నమ్మలేదు కదా! ఇంక ఏశోధనము లేకుండ రాముఁడు సీతను స్వీకరించినచో వారు ఆమె శీలపవిత్రతను నమ్ముట అసంభవ మనుట స్పష్టము. అగ్నిప్రవేశమే జరుగకున్నచో అక్కడ నున్న ఋషివానరు లైనను సీత పవిత్రతను రామునిధర్మపరత్వమును పూర్తిగా నమ్ముదు రని చెప్పఁజాలము.

కావున రాముఁడు నెమ్మదిగా సూటిగా ప్రజాభిప్రాయమును ఉద్ఘాటించి ఈసమస్యను పరిష్కరింపఁ గలుగుట అసంభవము. అందువలన ఆయన ప్రజాపవాదమును ఉద్ఘాటింపకుండ, నెపము వారిపై పెట్టకుండ, "రావణుఁడు ఓర్చియుండఁడు" అని వారికి కలుగఁబోవుసందేహమును తనమీఁదనే పెట్టుకొని అనిష్ఠురతను తానే భరించెను.

ఆ సందేహమునకు పరిష్కారముగా నైనను రాముఁడు "నీవు శపథ మొనర్చి నీశీలమును నిరూపించుకొన్నచో నిన్ను స్వీకరింతును" అని చెప్పియుండవచ్చును. అట్లు చెప్పక, "నీవు నాకు అక్కఱ లేదు; నేను నిన్ను పరిత్యజించుచున్నాను. నీ యిష్టము వచ్చినచోటునకు పొమ్ము" అని ఏల ప్రకటించుచు అమితక్రోధముతో ఆమె కేల అంతవ్యథను కలిగించెను? ఆమెను శిక్షించుటకే ఆయన అట్లు కఠినముగా ప్రవర్తించెను. లక్ష్మణుని యందు ఆమె నిర్హేతుకముగా శీలదోషమును ఊహించి నిందించి మరణాధికమైనవ్యథను కలిగించినది. దానికి శిక్షగా ఆయన ఆమె రావణునివలన భంగపడియుండు ననుసూహను దృఢముగా ఉద్ఘాటించి ఆమెకు కూడ అట్టివ్యథనే కలిగించెను. లక్ష్మణునివిషయమున సీత గావించినయూహ నిరాధారమైనట్లు ప్రజాపవాదవిషయమున రామునియూహ నిరాధారము కాదు. అందువలన ఆయన అట్లు మాట్లాడుట అసమంజసము కాదు. "శపథమును చేసినచో నిన్ను స్వీకరింతు" నని ఆయన చెప్పియున్నచో లక్ష్మణునకు కలిగినంతవ్యథ ఆమెకు కలిగి యుండదు. అందువలననే ఆయన పరిత్యాగమును తనతుది నిర్ణయముగనే ప్రకటించెను. విభీషణసుగ్రీవాదులు మధ్యలో ఇందు కల్పించుకొనుటకువాదప్రతివాదములకు అవకాశము లేకుండుటకై కాలాంతకునివలె రౌద్రమును ప్రకటించెను. అందువలన వా రెవరు ఆయనతో మాటాడఁ జాలక పోయిరి. ఈపద్ధతి వలన ఆమె, లక్ష్మణునివలె, కొంతసేపు మరణాధికవ్యథ నొంది అగ్నిశోధనము నొందుటకు నిశ్చయించుకొనెను. ఆయన ప్రజాపవాదమును నెమ్మదిగా ప్రస్తావించి విభీషణాదులు కల్పించుకొని ప్రసంగించుటకు అవకాశ మొసంగినచో; అగ్నిప్రవేశనిర్ణయము ఇంత సులభముగా అల్పకాలమున సంభవించియుండదు.

రాముఁ డామెను పరిత్యజించితి నని చెప్పి యూరకుండక లక్ష్మణభరతశత్రుఘ్నసుగ్రీవాదులయొద్ద నెవరిదగ్గఱ నైనను ఉండవచ్చు నని చెప్పుట యెందులకు? భర్త భార్యను ఏకారణముచేత నైనను పరిత్యజింపవలసివచ్చినప్పుడు ఆమెను నిరాధారముగ వదిలిపెట్టుట ధర్మము కాదు. ఆమెయొక్క మనుగడకు మార్గమును చూపించవలె. అందువలన ఆమెమనుగడకొఱకు ఆయన తనకు సంబంధించినవారియొద్ద నెవరిదగ్గర నైనను ఉండవచ్చు నని చెప్పెను.

మహాజనమధ్యమున అశ్రుతపూర్వము ఘోరము నైన రామునిప్రసంగము విని సీత సిగ్గుతో తనయంగములలో తాను చొచ్చుకొనిపోవుచున్నట్లుగా కుంచించుకొనిపోయి కన్నీరు వర్షించుచు దుఃఖించెను. కొంతసేపైనతరువాత బాష్పపరిక్లిన్నమైన మోమును దుడుచుకొనుచు గద్గదకంఠముతో క్రుద్ధురాలై మెల్లగా భర్తతో నామె యిట్లనెను. "వీరపుంగవా! ప్రాకృతుఁడు ప్రాకృతస్త్రీనివలె, ఏల యనుచితములు దారుణములు నైనయిట్టిమాటలను న న్ననుచున్నావు? నేను నీ వనుకొనుచున్నస్త్రీలవంటిదానను కాను. నాచరిత్రముపై ప్రమాణము చేసి చెప్పుచున్నాను. ప్రాకృతస్త్రీలవర్తనమునుబట్టి నీవు సమస్తస్త్రీజాతిని శంకించుచున్నావు. నీవు సహవాసముచేత ఇంతకు పూర్వము నన్ను పరీక్షించి నాస్వభావమును గ్రహించియుంటి వేని, ఈశంకను విడుము. నేను రాక్షసునిశరీరస్పర్శమును పొందినప్పుడు, అది నాయిష్టమువలన జరిగినది కాదు. అందులకు దైవమే అపరాధి. నాయధీనమైన హృదయము మాత్రము నీయందే వర్తించుచున్నది. పరాధీనములైన యంగముల విషయమున, అసమర్థురాలనైన నే నేమి చేయఁగలను? నీసాహచర్యమున పెరిగి పెద్దదాననైన

నన్ను నీవు యథాతథముగా గ్రహింపకున్నచో నేను ఇంక శాశ్వతముగా నిహతురాలనైనట్లే. మహావీరుఁడైన యాంజనేయుని నన్ను అవలోకించుటకై పంపితివి కదా! ఓరాజా! అప్పుడే నన్ను పరిత్యజించినట్లు ఏల చెప్పి పంపలేదు? అట్లు చెప్పి పంపినచో అప్పుడే యీహనుమంతుని యెదుట జీవితమును త్యజించియుందును. అప్పుడు నీవు గాని నీమిత్త్రులు గాని ప్రాణములు పణముగా చేసి యింత పాటుపడవలసియుండెడిది కాదు. నీవు రోషమునే ఆవలంబించి అల్పునివలె నాయందలి స్త్రీత్వమును మాత్రమే పురస్కరించుకొని నన్నుగూర్చి ఆలోచించుచున్నావు. నేను జనకజ ననుట ప్రవాదమాత్రమే. నేను అయోనిజను. బాల్యమునఁ గావించిన పాణిగ్రహణమును నాభక్తిని శీలవృత్తాదికమును సర్వమును నీవు వెనుకకుఁ ద్రోసితివి."

శ్లో॥ కిం మా మసదృశం వాక్య మీదృశం శ్రోత్రదారుణమ్।
రూక్షం శ్రావయసే వీర ప్రాకృతః ప్రాకృతా మివ॥ 5

శ్లో॥ న తథాస్మి మహాబాహో యథా మా మవగచ్ఛసి।
ప్రత్యయం గచ్ఛ మే స్వేన చారిత్రేణైవ తే శపే॥ 6

శ్లో॥ పృథక్స్త్రీణాం ప్రచారేణ జాతిం త్వం పరిశంకసే।
పరిత్యజైనాం శంకాం తు యది తేఽహం పరీక్షితా॥ 7

శ్లో॥ య దహం గాత్రసంస్పర్శం గతాస్మి వివశా ప్రభో।
కామకారో న మే తత్ర దైవం తత్రాపరాధ్యతి॥ 8

శ్లో॥ మదధీనం తు యత్తన్మే హృదయం త్వయి వర్తతే।
పరాధీనేషు గాత్రేషు కిం కరిష్యా మ్యనీశ్వరా॥ 9

శ్లో॥ సహసంవృద్ధభావేన సంసర్గేణ చ మానద।
యది తేఽహం న విజ్ఞాతా హతా తే నాస్మి శాశ్వతా॥ 10

శ్లో॥ ప్రేషిత స్తే మహావీరో హనుమా నవలోకకః।
లంకా స్థాహం త్వయా రాజన్ కిం తదా న విసర్జితా॥ 11

శ్లో॥ ప్రత్యక్షం వానర స్యాస్య తద్వాక్యసమనన్తరమ్।
త్వయా సంత్యక్తయా వీర త్యక్తం స్యా జ్జీవితం మమ॥ 12

శ్లో॥ న వృథా తే శ్రమోఽయం స్యాత్ సంశయే న్యస్య జీవితమ్।
సుహృజ్జన పరిక్లేశో న చాయం విఫల స్తవ॥ 13

శ్లో॥ త్వయా తు నృపశార్దూల రోష మే వానువర్తతా।
లఘు నేవ మనుష్యేణ స్త్రీత్వ మేవ పురస్కృతమ్॥ 14

శ్లో॥ అపదేశేన జనకా న్నోత్పత్తి ర్వసుధాతలాత్।
మమ వృత్తం చ వృత్తజ్ఞ బహు తే న పురస్కృతమ్॥ 15

శ్లో॥ న ప్రమాణీకృతః పాణి ర్బాల్యే మమ నిపీడితః।
మమ భక్తి శ్చ శీలం చ సర్వం తే పృష్ఠతః కృతమ్॥ 16

యుద్ధ-సర్గ-116

రాముఁ డేమియు మాటాడ లేదు. దీనుఁడై చింతానిమగ్నుఁడైయున్న లక్ష్మణుని చూచి సీత యిట్లనెను. "సౌమిత్రీ చితిని ఏర్పఱుపుము. ఈవ్యథకు అదియే మందు. ఇట్టి యపవాదముచే ప్రహతనై ఇంక జీవింప నిచ్చగింపను. మహాజన మధ్యమున అప్రీతుఁడైన భర్తచేత పరిత్యక్తనైననాకుఁ దగినగతి హుతాశనునందు ప్రవేశించుటయే,"

శ్లో॥ చితాం మే కురు సౌమిత్రే వ్యసన స్యాస్య భేషజమ్।
మిథ్యాపవాదోపహతా నాహం జీవితు ముత్సహే॥ 18

శ్లో॥ అప్రీతేన గుణై ర్భర్త్రా త్యక్తాయా జనసంసది।
యా క్షమా మే గతి ర్గన్తుం ప్రవేక్ష్యే హవ్యవాహనమ్॥ 19

యుద్ధ-సర్గ-116

లక్ష్మణుఁడు దీనుఁడై రామునివంకఁ జూచి ఆకృతిచేత సూచితమైన యాయనయభిప్రాయము నెఱిఁగి చితిని ఏర్పఱిచెను.

ఈసందర్భమున రామునివర్తనమును చిత్తవృత్తిని పరిశీలించుచు శ్రీ శ్రీనివాసశాస్త్రిగారు గావించిననిరూపణము గమనింపఁదగియున్నది. వారు ఒకయుపన్యాస మంతయు, అనఁగా ఆంగ్లగ్రంథమున 165-186 పుటలు దీనికై వినియోగించినారు. వారియభిప్రాయసారాంశమును గ్రహించుటకై అందులోని ముఖ్యవాక్యములను కొన్నింటిని పరిశీలింతము.

"ఆయన నల్వురను పేర్కొని సీతతో ఇట్లనుచున్నాఁడు; 'ఈనలువురిలో ఎవరిమీద నైనను నీప్రీతిని నిలుపుకొనుము. నేను దానిని లెక్కపెట్టను. వీరిలో ఎవరినో ఒకరిని ఎన్నుకొనుము' ఆయన ఆమెకు ఎట్టి స్వేచ్ఛ నొసఁగుచున్నాఁడో చూడుడు. ఇక్కడ, మర్యాదారహితమైన యీభాషణమునకు వ్యాఖ్యాతలు సంక్షోభము నొంది ఈవాక్యమున మనము అపార్థమును గ్రహింపరాదని ఆతురత నొందుచున్నారు. అందువలన, తన మనుగడకొఱకు రక్షణముకొఱకు సీత వీరిలో ఎవరినైన నొకరిని ఆశ్రయించి యుండవలయు ననుతలంపుతో మాత్రమే రాముఁడిట్లు చెప్పుచున్నాఁడని వా రందరు. రాముఁడు ఉద్దేశించిన 'దదియే' అని వ్యాఖ్యాత చెప్పుచున్నాఁడు. సాధ్వులారా! సత్పురుషులారా! నాయభిప్రాయ మిది. రామునిప్రసంగమును, ఇక్కడ, మృదువుగా నొనరింపవలసినయక్కఱ లేదు. రాముఁడు పరుషములైనవిషయములనే యుద్దేశించెను. ఆయన కోపముతో నున్నాఁడు. ఆయన అసంతృప్తుఁడైయున్నాఁడు. ఆయనహృదయమున వ్యథ యున్నది. ఆయన నిస్సందేహముగా ఆమెశీలమును శంకించుచున్నాఁడు."

"He mentions four people and says to Sita, 'well, you may fix your affections on any one of these four people. * I do not mind choose one or other of these as you like."' See what the freedom that he gives her is. Here, out raged by the un-sparing language, commentators are anxious that we should not put a sinister construction upon the passage. So they say that Rama here can only have meant that Sita should chose one of these people as the giver to her of a maintenance allowance, that she might go and reside under the protection of one of these people. 'That is what Rama meant,' says the commentator. † Ladies and gentle men, my opinion is that there is no need to soften the language here. Rama meant harsh things. He was angry. He was dissatisfied There was trouble in his breast. He suspectd her fidelity without a doubt .

---

* **Five persons according to Bombay Edition inclnding satrenghna.**

శత్రుఘ్నే వాథ సుగ్రీవే రాక్షసే వా విభీషణే।

† Govindaraja's comment referred to runs thus.

"అత్ర లక్ష్మణాదౌ మనఃకరణం నామ అనాథాయా రక్షకత్వేన తత్తద్గృహే వర్తనమ్। భర్త్రా పరిత్యక్తాయాః స్త్రియా బంధుగృహే వాసవిధానాత్। "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" ఇతి స్మృతేః (Cf. Manu 5.148) న త్వత్రాన్యథా గ్రహీతుం యుక్తమ్। మహాపురుషేణ తాదృశోక్త్యయోగాత్॥"-P. 170

1 "........శ్రీరామునకు అట్టివిషయములను ఆరోపింపవచ్చునా అనిమీరు అనవచ్చును. కాని మీరు ఇ.. ప్రిదినములు నాయాలోచనమును అనుసరించుచున్నచో నాయుద్దే ..ను సమ

గ్రముగా ఇట్లు గ్రహించియుందురు. శ్రీరాముఁడు మానవ మాత్రుఁడే. కోపము వచ్చినప్పుడు ఆయన, మూర్ఖు లనఁదగిన మాటలను, అనెను. దుఃఖితుఁ డైనప్పుడు ఆయన అమితముగ కన్నీరు వర్షించెను. ఇందు సందేహ మేమియును లేదు. ఈ ప్రసంగమును మృదువు నొనరింపవలసినయక్కఱ లేదు...."

" ...You may say, 'can we ascribe such things to Sri Rama ?" But my whole point if you have followed me these days is that Sri Rama was Just a human being and when he was angry he said foolish things. When he was sorry he wept bitter tears. There is no doubt about it ..."P. 171.

2 "....ప్రతివ్యక్తియు తనముఖమును ప్రక్కకు త్రిప్పు కొనెను. వారు ఆయనముఖమువంక నైనను చూడకుండిరి. ఆయనముఖమును చూచుటకు కూడ వారు భయపడుచుండిరి. ప్రతివ్యక్తియు వణఁకుచుండెను. తనయిష్టము వచ్చినట్లు ఏపని నైనను చేయుటకు చాలినంతగా తననైతికశ్రేష్ఠత్వమును శ్రీ రాముఁడు సకలప్రపంచమునందు స్థాపించె నని యిదివఱకే మీకు చెప్పియుంటిని. అత్యంతమైన యపరాధవిషయమున కూడ ఆయనతో ఒక్కమాట చెప్పుట కైనను ఒక్కఁడును సాహ సింపకుండెను....."

"....Every body turned his face in another directon. They did not even look at his face. Even to look at his face they were so afraid. Every body quaked. I told you this before as proof that Sri Rama had establishad his moral supremacy over the whole world to such an extent that

he could do any thing he pleased. Even against the most wrong thing nobody dared to say a word ..." P. 174.

"....సరే! ఈసందర్భమున రాముని వర్తనమును భార్యాశీలమునుగూర్చి ఆయనకు కలిగినసందేహమునుబట్టియే వ్యాఖ్యానింపవలసియున్నది. ఆసందేహమునకు ఆధార మేదియును లేదు. అయినను అది ఆయనహృదయమును కలఁతపెట్టుచునేయున్నది.

"....Well, upon this occasion Rama's conduct has to be explained by his suspicion of Infidelity. Unfounded as it was, it was still there rankling in his bosom ..." P. 175.

3) సాధ్వులారా! సత్పురుషులారా! నేను ఈదినము విక్షోభకమైన యొక మానవభావమునుగూర్చి చెప్పుచున్నాను. మనమనస్సులను కల్లోలిత మొనర్చువానిలో, మనకు ఆత్మవిస్మృతిని కలిగించి మనలను పశువులనుగా వర్తింపఁజేయువానిలో అమర్షము (లేక అక్షమ) అనునది అత్యంతనికృష్ట మైనది. భార్యవిషయమున శీలశంక కలిగినపుడు, తప్పు జరిగిన దని తోఁచినప్పుడు, దీనిస్వరూపము వ్యక్త మగును. ఇది కలిగినపుడు మర్యాద సర్వము విస్మృత మగును; ప్రతీకారమున తుదిచర్యకు మీరు పాల్పడకుండ మీసంస్కారవిశేష మేదియును మిమ్ము ఆపలేదు. మనుష్యులయనుభవములోనున్న భావములలో చాల నికృష్టమైనయుద్రేకము అమర్షము. ఉన్నతవంశసంభవుఁడై యథార్థముగా మహనీయుఁడైన వానియందు అది పరమనికృష్ట మగును. ఆత్మగౌరవమును సంభావించుచున్నప్పుడు, తనభార్య సౌందర్యవతి యని, ఆమె శీలవతియే యైనను, ఇతరులకు ఆమెయందు వ్యామోహము కలుగు నని తోఁచినప్పుడు, అతఁడు యథార్థముగ ఉదాత్తస్వభావుఁడే యైనను, నికృష్టమైన విధ్వంసకచర్యకు

పాల్పడును. కాఁబట్టి శ్రీరాముఁడు ఈయమర్షముయొక్క ప్రభావమునకు లోఁబడి సీతాపరిత్యాగమును నిస్సంశయముగా ప్రకటించెను...."

"Ladies and Gentleman, I have been speaking to you today of a violent human passion. Of all feelings that make them forget them selves and become beasts in carrying out its dictates, Jealousy is the worst, Jealousy where your wife's honour is concerned and you suspect that some thing wrong has happened Then you forget all decency. No notion of any kind can deter you from taking the last step of Vengeance. Jealousy is one of the worst passions known to men and it is the worst of all when a man has genuine greatness when he comes of high family. when he cares for his honour, when he thinks that his wife is handsome and though faithful, might be coveted by others. Then it is that a true and noble nature descends to the most violent action. Sri Rama therefore under the infiuence of this Jealousy decreed the complete abandonment of Sita .." P. 181.

4) డెస్డెమోనాకంఠము నులిమివేయఁబడినతరువాత, ఆమె దోషరహిత యని యథార్థము బయల్పడి అంతయు ముగియుచున్నప్పుడు తుదిక్షణమున లొడోవికో "నిన్నుగూర్చి ఏ మని చెప్పవలె?" అని ఒథెల్లోను అడిగినపుడు, అతఁడు చెప్పినసమాధానమును వినుఁడు. శ్రీరాముఁడు చెప్పుచున్నదానికి అది ఎంత చక్కఁగా సరిపోవుచున్నది! ఎంతసహజము! ఎంత యథార్థము!

ఒథెల్లో:-ఏమి! ఏమైన చెప్పఁడు. నేను ఆత్మగౌరవము కొఱకు చేసినదే కాని, ద్వేషముతో చేసినది యేదియు లేదు. మీరు చెప్పఁదలఁచుకొన్నచో నన్నుగూర్చి గౌరవార్హుఁడైన హంతకుఁడని చెప్పఁడు...."

"Then Lodovico asks Othello at the last moment when every thing is over and Desdemona has been choked and all is found out and the truth has come out, "what shall be said to thee ?" and listen to the answer. How true, how natural, how exactly a parallel to what Sri Rama says."

Othello :—Why, any thing.
An honourable murderer, if you will;
For nought I did in hate, but all in honour.
(Othello V.ii 293-295) P. 182.

5) "....,తనజారిణీత్వమువలన తనభర్తసాధించినమహాకార్యము విధ్వంసము నొందె నని తెలిసికొని గనివరి, పశ్చాత్తప్తురాలై పరివ్రాజికలమఠమునందు చేరెను. ఆమె అక్కడ ఉన్నప్పుడు, మిగులదారుణమైన యొకరణమునుండి తిరిగి వచ్చుచు, ఆర్థర్, వ్రణములవలన తనజీవితము ముగింపునకు వచ్చుచున్నదని తెలిసి కూడ, తన జీవితోద్దేశ మేది యని అతఁడు భావించుచున్నాఁడో ఆమహాకార్యమును తనపేరును ప్రతిష్ఠను భంగపఱచినదానిని, తనప్రేమకు మన్ననకు పాత్రమైయుండియు తన్ను మోసగించి నాశమొందించిన భార్యను చూచి ఆమెయొద్ద వీడ్కోలును పొందకుండ ఈలోకమును వీడుటకు ఇష్టపడక, ఆమెను చూచి ఆమెయొద్ద వీడ్కోలును పడయుటకై మఠములోనికి వచ్చెను. ఈ తుదిదృశ్యమునందు కవియొక్క కౌశలము ఉత్తమస్థాయిలో కన్పించుచున్నది. ఆర్థర్ ప్రభువు,

క్రైస్తవుఁ డగుటచే, తనభార్యనుగూర్చి పరుషమైన తీర్పును ప్రకటింపక, ఆమె ఎంత వికృతముగా వర్తించె నన్న విషయమును మాత్రమే చెప్పెను. కాని, రామునివలెఁ గాక, ఒథెల్లోవలెఁ గాక, అతఁడు ఆమెను క్షమించుటకే ప్రయత్నించెను. అతని యందు అమర్షముః ఉన్నచో, అది బీజమాత్రముగనే యుండెను. దాని నతఁడు అతిక్రమించెను. ఇది చాల అసామాన్యమైన విషయము. ఇది సాధారణముగా జీవితమునందు మీరు చూడఁ గలిగినది కాదనుకొందును. భార్యయొక్క లజ్జావహమైనవర్తనమువలన లాభపడఁగోరునట్టినీచులుతప్ప, ఇతరుఁ డెవఁడును తనభార్యచేత మోసగింపఁబడి రోషముతో నున్నప్పుడు ఆమెను సాధారణముగా క్షమింపఁ డని మీ రెఱుంగుదురు. అట్టివారిని కూడ మన మెఱుంగుదుము. కాని చుఱుకుఁదనము కలవాఁడు తప్పక అట్టిభార్యను ఏవగించుకొనును. ఆర్థర్ ప్రభువు సాధారణ మానవునికన్న అధికుఁడు. మీకు ఇదివఱకే నేను చెప్పినట్లు అతనియందు దివ్యాంశము కూడ కొంత కలదు. ఇంచుమించుగా సాధారణమానవుల కందనిదని తోఁచునట్టి స్థాయిలో మాటాడఁ గలుగుట ఆయనకే చెల్లినది...."

"... But when Guinevere found out how she had undone her husband's work, feeling repentance she went to a nunnery and when she was there, returning from one of his most sanguinary battles, Arthur, Knowing that his end was near and unwilling though mortally wounded that he should leave this earth without a final interview with her whom he had loved and adored but who had ruined him, his name and all the work for which he came into life, desiring to see her and take leave of her, he comes into this

nunnery. In this final secne the poet is seen at his very best. King Arthur being a christian, instead of pronouncing harsh Judgment upon his wife, tells her how wicked she has been. But unlike Rama, unlike Othello, he tries to forgive her. If there was Jealonsy in him, it was there only in the germ. He had outlived it. Now that is a most extraordinary thing. I do not think it is a thing which you can find commonly in life. when a man is Jealous, when a man has been betrayed by his wife, he seldom forgives her, as you know, unless he is one of those craven creatures who wishes to profit by the shame of his wife. Such people we know too. But commonly a man of spirit resents that. It was left to Prince Arthur who was more than an ordinary man, who, I told you, partook of divinity to some extent, it was left to him to speak in language which almost seems to be above the common reach of humanity."

P. 183, 134.

6) ఉత్తరకథలో జరిగినసంఘటనమున ఇంతమాత్రము గానైన న్యాయగురుత్వము లేదు. నోటిదుడుకుతనముకలవారు కొందఱు అయోధ్యావీథులలో చులుకుగా మాటాడుచుండుటయే హేతువుగా ఇది సంభవించినది. ప్రజలు తనవర్తనమునుగూర్చి మిగుల స్వేచ్ఛగా చర్చించుచున్నా రని, వారు ఒకరి కొకరు ఇట్లు చెప్పుకొనుచున్నా రని రామునకు వార్తలు వచ్చెను....వారు ఇట్లు చెప్పుకొనుచున్నారు. "రావణునియింటియందు కొంతకాలముండిన స్త్రీతో కూడి నిద్రించుచు అతఁడు ఏవిధమైన సుఖమును పొందఁ గలుగుచున్నాఁడు? అసలు అతఁ డెట్లు సుఖపడఁగల్గుచున్నాఁడు? రాక్షసునిచేత లంకకు తీసికొనిపోఁబడి రాక్షసస్త్రీలమధ్య నివ

సించినస్త్రీని సమీపించుటకు ఏల సంకోచించుట లేదు?" ఈ క్రిందివాక్యమున కవి మానవస్వభావపరిజ్ఞానమున తన పరిణత మైన ప్రజ్ఞను ఇట్లు చూపుచున్నాఁడు. "రేపో లేక ఎల్లుండియో మనస్త్రీలు తప్పు చేసినప్పుడు మనము కూడ దానిని సహింపవల సియే యుండును. నీవు నగరవీథులలోనికి పోయినను, లేక పల్లె సీమలలో నడచుచున్నను ప్రజలు ఇట్టివిషయమునే మాటాడు చున్నారు?" ఈవిషయము రామునకు నివేదింపఁబడినంతనే ఆయన సహజముగ ఆందోళితుఁ డయ్యెను....." "ఇది ముగ్గురు తమ్ములతో ఆయన చెప్పినది. ఈయపవాదులను వినఁగానే ఆయన వారిని పిలిపించెను. "నేను జీవితమును పరిత్యజింతును; ఆత్మహత్యఁ గావించుకొందును. మిమ్ము అందఱను సంతోషముతో చంపఁగలను. నేను అపయశస్సునకు ఎంతో భయపడుచున్నాను. ఆవశ్యక మైనచో నన్ను నేను చంపుకొందును." ఈక్రమమున సీతకు ఇచ్చిన స్థాన మెట్టిదో చూడుఁడు. "అపయశస్సునుండి నా పేరును రక్షించుటకై మిమ్ము చంపుదును; నన్ను చంపుకొందును." సీతసంగతి యే మున్నది? ఆమెను బలిపెట్టుట సోదరులను బలి పెట్టుటవలె పెద్దవిషయము కాదు. ప్రాచీనకాలమున ఏస్త్రీ యైనను భర్తకు ఇష్టము వచ్చినట్లు వినియోగించుకొనఁదగిన సొంతయాస్తి అను సిద్ధాంత ముండె నని మీకు చెప్పియున్నాను. ఈజనులయొక్క గుణదోషములను నిర్ణయించునప్పుడు, స్త్రీకి స్వతంత్రమైన యునికి ఆనాఁడు గుర్తింపఁబడలే దని మీరు స్మరింపవలసియున్నది....మనుష్యుఁడు తనజీవితమునే బలిపెట్టు టకు సిద్ధపడినప్పుడు, అతఁడు దేనిని లెక్కపెట్టును?....అట్టి సన్నివేశమునందు, ఏస్త్రీని నీవు గౌరవించుచు ప్రేమించుచు పూజించుచు సకలాభరణములతో అలంకరించి నీసమస్తజీవిత ముపై పెత్తనము చేయుటకు అనుమతించుచున్నావో, ఇంత

ముఖ్యముగా బావింపఁబడుచున్న యామెయే, ఇట్టి విపత్తులందు, జీవితపువిలువల యొక్క తూకమునందు, కేవలము ఇంద్రియార్థముయొక్క స్థాయికి, అనఁగా భోగసాధనము యొక్క స్థితికి దిగజాఱుచున్నది! అంతకు మించినవిలువ ఆమెకు లేదు."

7) "....ఇప్పుడు సీతను దేశమునుండి బహిష్కరింపవలెనని రాముఁడు శాసించుచున్నాఁడు. ఈపర్యాయము రాముఁడు నీచస్థితినుండి నీచతరస్థితికి దిగజాఱుచున్నాఁడు. తనయంతరాత్మయొక్క సాక్ష్యమునకు విరుద్ధముగా ఆమెను బహిష్కరించుటకు సిద్ధపడుటయేః కాక, అపనిని రహస్యముగా చేయుచున్నాఁడు. ఆమెకు అవిషయమును ఆయన చెప్పుట లేదు...."

"In the later incident there was no such heavy Justification. It was all because of certain slanderous tongues that were busy in the streets of Ayodhya. Reports came to Sri Rama that his subjects were discussing his conduct pretty freeiy and that thay were saying things like this to each ether they say to themselves, "what sort of happiness can he have sleeping with that woman who has lived for a time in Ravana's house ? How can he enjoy? How does he not shrrink from a woman who has been taken to Lanka by a Rakhasa and who has lived among Rakshasis ? And then this is the way the poet shows his consummate knowiedge of human nature in this passage, Tomorrow or the day after When owr women misbehave, we must also put up with it " P. 175.

"Whether you go into the streets of the city or whether you walk into the rural parts, this is the kind of thing that people say". When this was

reported to Sri Rama, of course he naturally hesitated . i' P. 176.

" .. This is spoken by Rama to his three brothers. He has summoned them as soon as he heard these slanders. "I shall abandon my own life, take my life and I should be glad to kill you all. I shrink so much from ill-fame that I shall kill myself if necessary.'? See the place assigned to Sita in the gradation. "I should kill you, I shall Kill myself in order to rescue my name from infamy ?" What about Sita ? Sacrificing her is not so big as sacrificing the brothers because as I told you, the theory was in the old days that any woman was only the private property of the husband, completely at his disposal .." P. 177

"....in such a situation a woman whom you otherwise honour and love and adore and hang all your Jewells upon and allow to dominate your whole life-well, a woman you treat with all consideration when however she is weighed in the balance of real values in a crisis like this, she sinks into the position of 'indriyartha,' a means of gratifying our senses, no more. Now Rama decrees that Sita should be banished. This time Rama sinks lower and lower. Not only does he, against the testimony of his own conscience, agree to banish Sita but he does it secretly. He does not tell her .." P, 179.

శ్రీ శ్రీనివాసశాస్త్రిగారు గావించిన విమర్శనమున ప్రధానముగా ఏ దంశములు కలవు. వానిని క్రమముగా పరిశీలింతము.

(1) "రాముఁడు నిస్సందేహముగా సీతశీలమును శంకించెను. ఆయన మానవమాత్రుఁడే. కోపమువచ్చినప్పుడు ఆయన మూర్ఖులనఁదగిన మాటలను (Foolish things) అనెను. అనుట మొదటియంశము. రాముఁడు సీతశీలమును శంకింపలే దని వాల్మీకి మహర్షి రాముఁ డామెను హృదయప్రియనుగా చూచె ననుమాటవలన స్పష్ట మొనర్చినాఁడు. ఇంతే కాక ఆమె దీపశిఖవలె నున్న దని చెప్పుట వలన కూడ రాముఁడు ఆమెను పవిత్రురాలినిగానే భావించుచున్నాఁ డనుట స్పష్టము. "రావణుఁడు నిన్ను బలాత్కరింపకుండ నుండునా?" అని ఆయన అడుగుటలో ప్రజలకు కలుగఁబోవు శంకను ప్రకటించుటయే ఆయన తాత్పర్యము. అది ఆయన హృదయ మని మనము గ్రహించుటకు వీలు లేదు. రావణుఁడు సంవత్సరము గడువు ఇచ్చె నని, సీత పవిత్రశీలయై యున్న దని అంజనేయుఁడు చెప్పినమాటలను ఆయన నమ్మకుండుటకు హేతు వేమియును లేదు. అందువలననే ఆయన చూడామణిని చూచి నప్పుడు, సముద్రమును చేరినప్పుడు, లంకకు చేరినతరువాత కూడ ఆమెను స్మరించి దుఃఖించెను. కావున ఆయనకు ఆమె శీలము విషయమున శంక ఏమాత్రము లేదు. సాధారణ స్త్రీలే శీలము భంగపడినప్పుడు శరీరమును వెంటనే త్యజించుచుందురు. అట్టియెడల అనసూయాదులచే ప్రశంసింపఁబడినసీత, శీలము భంగపడినచో, ఆవిషయమును దాఁచి తన్ను వంచించు నని రాముఁడు కలలో నైన అనుకొనియుండఁడు. రావణుఁడు ఆమెను తీసికొనిపోవుట దైవికము. అం దామెదోష మే మున్నది? కావున రాముఁ డామెపై కోపపడుటకు అవకాశమే లేదు. ఆయన ఆసమయమున కోపమును ప్రకటించుచున్నాఁడే కాని కోపవశుఁడు కాలేదు. "రాముఁడు మానవమాత్రుఁడే; కాఁబట్టి కోపము వచ్చి నప్పుడు మూర్ఖు లనఁ దగినమాట లనెను" అనుటయు కుదురదు. కోపమువచ్చినవా రందఱు మూర్ఖముగ ప్రసంగింపరు. రాముఁడు

మానవమాత్రుఁడు కాఁడు; బ్రహ్మర్షియైన విశ్వామిత్రునిచేత మహాత్ముఁ డని (అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్), శత్రువైన మారీచునిచేత రూపొందిన ధర్మ మని (రామో విగ్రహవాన్ ధర్మః), మండోదరిచేత సైతము "మహాయోగి" యని ప్రశంసింపఁబడినవాఁడు. ఆయన మానవుఁడే యైనను మనవంటివాఁడు కాఁ డనుట స్పష్టము. అట్టివాఁడు కోపవశుఁడై మూర్ఖప్రసంగమును గావించె ననుట అయుక్తము.

(2) "ఆయన ఆమెతో పరుషముగా మాటాడుచుండఁగా అత్యంతమైనయాయపరాధవిషయమున అయనతో ఒక్కమాట చెప్పుట కైనను ఒక్కఁడును సాహసింపకుండెను" అన్నది రెండవ యంశము-ఇందు అపరాధమే లేదు. భరతసుగ్రీవాదులలో ఎవరి యెద్దనైనను ఉండు మని రాముఁడు సీతతో చెప్పినప్పుడు వారిలో ఒకరిని భర్తనుగా స్వీకరింపు మనుట రాముని భావ మని శాస్త్రిగారు నిశ్చయించుచున్నారు. ఇది రాముని యభిప్రాయము కా దని వ్యాఖ్యాతలు చెప్పుచున్నను శాస్త్రిగారు అంగీకరించుట లేదు. రాముని ధర్మదృష్టి ననుసరించి వ్యాఖ్యాతలు రాముని వచనములను వివరించినారు. భార్యను పరిత్యజింపవలసినప్పుడు నిరాశ్రయనుగా వదలుట ధర్మశాస్త్రవిరుద్ధము. ఆమెకు ఆశ్రయమును తప్పక కల్పింపవలె. అందువలననే ఆయన మరల ఆమెను పరిత్యజించినప్పుడు వాల్మీకియాశ్రమముచెంతనే వదలిపెట్టు మని లక్ష్మణునకు నిర్దేశించెను; కారడవిలో దింపిరమ్మన లేదు. అదియును గాక, దైవికముగా పరునిచేత భంగపడినపతివ్రతయే కాదు సాధారణస్త్రీ యైనను జారిణి యగునా? భర్త స్వీకరింపని పక్షమున ఆమె స్వతంత్రముగ జీవించుటకు ఏర్పాటు చేయవలె, లేదా అనాథశరణాలయమున చేర్పవలయునే కాని,

మఱియొకనికి భార్యగా నిచ్చుట, లేదా వేశ్యాగృహమున కప్పగించుట కాని చేయుదురా? చెడుటవలన తన కక్కఱలేని భార్యను ఎవఁడైనను ఇతరులను స్వీకరింపు మని చెప్పునా? అట్లు చెప్పుట ఆ బంధువులను మిత్రులను అవమానించుటకాదా! సాధారణ మానవుఁడే అట్లు చేయఁడు. ఇంక మహాపురుషుఁ డట్లు చేయునా?

ఆయన మహాపురుషుఁడే యైనను మానవుఁడేకావున కోపము వచ్చినప్పుడు వివేకము కోల్పోవుట సహజమే యని శాస్త్రిగారి యభిప్రాయము. మానవుఁడైనవాఁడు ఎప్పుడైననొకప్పుడు ఏదేని యుద్రేకమునకు లోఁబడి వివేకమును కోల్పోవుట సహజ మని వారియభిప్రాయము. కాని అవివేకము మానత్వముకు అనివార్యమైనయొకలక్షణము కాదు. మానవత్వ మనఁగా నేమి? ఆఁకలిదప్పికలను సుఖదుఃఖములను పొందుచుండుట ప్రాణిలక్షణము. సకలజంతువులకును ఇది సామాన్యము. ఈలక్షణముచేత మానవుఁడు కూడ జంతువే. కాని పశువులలో గోవువలె జంతువులలో మానవుఁడు ఉన్నతుఁడు. జంతువులు దుఃఖకారణమును తొలఁగించుకొనుటకు సుఖసాధనములను పొందుటకు స్పష్టమైనయాలోచనతో (Clear thinKing) ప్రవర్తింపఁజాలవు. అవి కొంతవఱకు సహజప్రేరణతో (Instinct) అట్లు ప్రవర్తించుచుండును. మానవులయందీప్రవర్తనము పరిణత స్థాయిలో (Evolved state) ఉన్నది. కావున బుద్ధిపూర్వకముగా దుఃఖకారణమును తొలఁగించుకొనుటకు, సుఖసాధనములను సమకూర్చుకొనుటకుఁ బ్రయత్నింపఁగలుగుటయే మానవలక్షణము. ఈలక్షణముచేత జంతుజాతిలో మానవజాతి యున్నత మగుచున్నది. ఈబుద్ధియొక్క పరిణతిచేతనే సుఖసాధనమైనధర్మమును దుఃఖప్రాపకమైన యధర్మమును శాస్త్రము ననుసరించి గ్రహించువారు పండితులు. వారికి శాస్త్రమే చక్షుస్సు. అట్టిధర్మజ్ఞులలో కూడ

సకలజీవితసన్నివేశములలో ఎట్లు వర్తించుట ధర్మమో గుర్తించి అట్లు ధర్మమునే ఆచరించువారు మహాత్ములు. వారు మనవలెనే దైవికముగా వచ్చిపడుచున్న సుఖమును దుఃఖమును అనుభవించుచున్నను ధర్మమును తప్పి వర్తింపరు. అదియే వారి మహత్త్వము. కావున మానవుఁడైనంత మాత్రమున ఎవ్వఁడైనను ఎప్పుడో ఒకప్పుడు తప్పక అవివేకమునకు పాల్పడు నని సిద్ధాంతము చేయుటకు వీలు లేదు. సుఖమును దుఃఖమును అనుభవించుచు దుఃఖకారణమును తొలగించుకొనుటకు సుఖసాధనములను సంపాదించుకొనుటకు ప్రయత్నించుచుండుట అనులక్షణముచేత రాముఁడు మానవుఁడే. కాని ఆయన ధర్మాధర్మములు తెలియక, తెలిసినను అధర్మమును వదలుకొనుటకు ధర్మమును అవలంబించుటకు చేఁతకానిమనవంటిమానవుఁడు కాదు. మనవంటివాఁడే యైనచో ఆయనను మనము ఆరాధింపవలసినయక్కఱయే లేదు. ఆయన విశ్వామిత్రాదులు ప్రశంసించినట్లు మహాత్ముఁడే కాని మానవమాత్రుఁడు కాఁడు. అందఱివలెనే రాముఁడు తప్పులు చేయువాఁడైనచో ఆంజనేయాదులు ఆయనను ఆరాధించి యుండరు. ఆయన సీతతో పరుషముగా మాటాడునప్పుడు వారి కందఱకు విస్మయము విచారము కలిగినమాట నిజమే. కాని ధర్మాత్ముఁడైన రాముఁడు అట్లు ప్రవర్తించుచున్నాఁడన్నచో దానికి తప్పక తగిన కారణ ముండు నని, అది తరువాత తెలియఁగల దని వారు ఓర్పువహించియుండిరి. తరువాత, "సీతకు శోధనము కలిగింపకున్నచో ప్రజలు సందేహింతురు" అని ఆయన కారణమును చెప్పునప్పుడు ఆయనవర్తనమును సమంజసమే అని వారు గ్రహించియుందురు. ఆయన మహాపరాధమును చేయఁగలఁడను తలంపు వారికి లేదు. అందువలన ఆయనతో ఒక్కమాట

యేని చెప్పుటకు వారు సాహసింపకుండిరి. అందువలన సీత యెడల రామునివర్తనము అపరాధము కాదని గ్రహింపవలసి యున్నది. రాముఁ డట్లు వర్తించుటవలన సీతయొక్క పాతి వ్రత్యము జగద్విదితమై, ఇట్టి పతివ్రతకొఱకు గదా మనము పోరాడినదని ఋక్షవానరు లందఱును ఆనందమును పొందిరి. ఆరంభమున ఎంత కష్టముగ నున్నను అగ్నిశోధనము, ఋక్ష వానరదేవాదులప్రశంసవలన సీతకు కూడ తుదకు ఆనంద ప్రదమే యయ్యె నని గ్రహింపవలసియున్నది.

(3) మనకు ఆత్మవిస్మృతిని కలిగించి మనలను పశువు లనుగా వర్తింపఁజేయువానిలో అమర్షము (అక్షమ) అత్యంతము నికృష్టము. శ్రీరాముఁడు ఈయమర్షమునకు లోఁబడి సీతాపరి త్యాగమును నిస్సంశయముగా ప్రకటించె" ననుట మూఁడవ యంశము—మనలను పశువులనుగా ప్రవర్తింపఁజేయు అమర్ష మునకు రాముఁడు లోఁబడ లే దని. ఆయన దానిని అదుపులో ఉంచుకొనియే, సీతయొక్క పాతివ్రత్యమును లోకమునకు ప్రక టించుటకొఱకే, అట్లు ప్రవర్తించె నని ఇంతకు ముందే గ్రహించి యుంటిమి.

(4) "శ్రీరాముఁడు చెప్పినదానికి ఒథెల్లో చెప్పినది ఎంత చక్కఁగా సరిపోవుచున్నది! ఒథెల్లో ఇట్లనెను. 'నేను ఆత్మగౌర వముకొఱకు చేసినదే కాని, ద్వేషముతో చేసినది ఏదియు లేదు. మీరు చెప్పఁదలఁచుకొన్నచో నన్నుగూర్చి గౌరవార్హుఁడైన హంతకుఁ డని చెప్పఁడు'." ఇది నాల్గవయంశము—ఇయాగో అనుక్రూరుని కుతంత్రమువలన ఒథెల్లో తనభార్య జారిణి యయ్యె నని దృఢ ముగా నమ్మి ఆమెను గొంతు నులిమి చంపెను. తరువాత నిజము తెలిసి అతఁడు పశ్చాత్తాపముతో ఆత్మహత్యకుఁ బాల్ప

డెను. అతఁడు తాను చనిపోవుటకు ముందు పైవిధముగా చెప్పెను. ఆత్మగౌరవముకొఱకే యైనను ఒథెల్లో డెస్డెమోనాను, రామునివలె, పరిత్యజించియుండవచ్చును. అతఁడు ఆమెను చంపవలసినపని లేదు. కాని సాధారణమానవులవలె అతఁడు రోషావేశమునకు వశుఁడై మొదట స్త్రీహత్యఁ గావించి, తరువాత దుఃఖవేగమునకు వశుఁడై ఆత్మహత్యఁ గావించుకొనెను. రెండును మహాపాతకములే. ఇట్టి స్త్రీహంతతో, ఆత్మహంతతో శ్రీరాముని పోల్చుటకు శాస్త్రిగారు ఎట్లు సాహసించిరో తెలియను. ధీమంతులకు ప్రమాద మనఁగా ఇట్లుండు నని వ్యక్త మగుచున్నది.

(5) "ఆర్థరు, క్రైస్తవుఁ డగుటచే, జారిణియైన భార్యపై పరుషమైన తీర్పును ప్రకటింపక, రామునివలెఁ గాక, ఒథెల్లో వలెఁ గాక, ఆమెను క్షమించుటకే ప్రయత్నించెను. ఆమెవర్తనమునందలి వికృతత్వమును మాత్రమే అతఁడు నిరూపించెను. అట్లు మాటాడఁగల్గుట ఆయనకే చెల్లినది" అనుట యైదవ యంశము—క్రైస్తవుఁ డగుటవలన ఆర్థరు భార్యను క్షమించెననుటచే శాస్త్రిగారు క్షమాగుణము క్రైస్తవులకు అసాధారణగుణమని, ఒథెల్లో శ్రీరాముఁడు క్రైస్తవులు కాకపోవుటవలన క్షమింపలేకపోయినారని స్ఫురింపఁజేయుచున్నారు. కాని క్రైస్తవస్త్రీ కాకపోయినను సీత రాక్షసస్త్రీలను క్షమించె నని గ్రహించియుంటిమి. కైకవలన ఎంత కష్టము కలిగినను రాముఁ డామెపై రోషమును పొందలే దనుటయు స్పష్టమే.

ఇంక ఆర్థరుయొక్క పరిస్థితికి రామునియొక్క పరిస్థితికిని సామ్యమే లేదనుట ముఖ్యవిషయము. ఆర్థరు మరణించుటకు సిద్ధముగా నున్నాఁడు. అతఁడు అభార్యను తీసికొనిపోయి రాజ్య

మేలుటకు సిద్ధముగా లేఁడు. అతఁడు కూడ రామునివలె ఆమెను పరిత్యజించుచున్నాఁడే కాని భార్యగా స్వీకరించుట లేదు. "నిన్ను ఇంకను ప్రేమించుచునే యున్నాను" అని చెప్పుచు అతఁడు ఇట్లనెను. "అయినను ఓ స్త్రీ! నేను నిన్ను పరిత్యజింపవలసియే యున్నది. లజ్జాకరమైన నీవర్తనమునకే నిన్ను వదలుచున్నాను" అని చెప్పెను. తరువాత అతఁడు, జారిణియైన భార్యను లోక నిందకు వెఱచి గాని పిల్లలకొఱకుఁ గాని యింటియందు నిలుపు కొనువాఁడు ప్రజాశత్రువులలో అధముఁ డని అట్టివాఁడు పరి పాలకుఁ డైనచో, ఆపరిస్థితి ఘోరాతిఘోరము అని చెప్పుచు ఇట్లనెను. "నాప్రజలనిందాగర్భితమైన పరిహాసమునకు పాత్రు రాలవై వారికి శాపముగా పరిణమించిన నిన్ను మరల సింహాసన ముపై కూర్చుండఁబెట్టుకొనుటకన్న ఈరాజు రాత్రులందు నిద్రా రహితుఁడై వ్యథితమైన హృదయముతో కాలమును గడుపుటయే మేలు."

"Yet must I leave thee, woman, to thy shame.
I hold that man the worst of public foes
who either for his own or children's sake,
To save his blood from scandal, lets the wife
Whom he knows false, abide and rule the house;

.. ... ...... ........ ........ ................ ............ . ................

Worst of the worst were that man he that reigns !
Better the King's waste hearth and aching heart
Than thou reseated in thy place of light,
The mockery of my people, and their bane."

P. 184 - 185.

ఏప్రజాభిప్రాయమునకు రాముఁడు ప్రాముఖ్యము నొసం గనో దానినే ఆరరు కూడ అతిక్రమింపరానిదిగా భావించుట

గమనింపఁదగియున్నది. ఇరుపురును ఇంచుమించుగా ఒకవిధము గనే భావించుట ఆశ్చర్యకరము. రామునివలెనే ఆర్థరు కూడ ప్రజాభిప్రాయమునే ప్రమాణముగా చేసి భార్యను పరిత్యజించెను. అతఁడు ఆమెను శాశ్వతముగా పరిత్యజింపఁదలఁచుకొనుటవలన పరుషముగా మాటాడక మృదువుగా ఆమె గావించినపాప కృత్యముయొక్క ఘోరత్వమును విస్పష్టముగా వివరించి పశ్చాత్తాపమునకు మార్గ మేర్పఱచెను. రాముఁడు సీతశీలమును లోకమునకు ప్రకాశింపఁజేసి తరువాత ఆమెను స్వీకరింపవలయు ననుతలంపుతో ఆమె అగ్నిప్రవేశమునకు సిద్ధపడునట్లు చేయుటకు పరుషముగా మాటాడెను. కావున ఆర్థరుతో పోల్చి రాముఁడు క్రూరముగా ప్రవర్తించె ననుట అసంగతము. "నాకు కూడ సీత పవిత్రత తెలియును. మూఁడులోకములకు ఆమెశీలమునందు ప్రత్యయము కలుగుటకై ఆమె అగ్నియందు ప్రవేశించుచుండఁగా ఉపేక్షించితిని" అని రాముఁడు బ్రహ్మదేవునకు చెప్పిన వాక్యమును బ్రహ్మాదిదేవత లందఱు అంగీకరింపఁగా శ్రీశాస్త్రిగారు విశ్వసింపకుండుట శోచనీయము.

శ్లో॥ అహ మ ప్యవగచ్ఛామి మైథిలీం జనకాత్మజామ్॥ 15
ప్రత్యయార్థం తు లోకానాం త్రయాణాం సత్యసంశ్రయః।
ఉపేక్షే చాపి వైదేహీం ప్రవిశన్తీం హుతాశనమ్॥ 16

యుద్ధ-సర్గ - 118

(6) యశస్సుకొఱకు కుటుంబముయొక్క గౌరవము కొఱకు రాముఁడు సీతను పరిత్యజించె ననుసందర్భమును పురస్కరించుకొని శ్రీశాస్త్రిగారు, "స్త్రీకి స్వతంత్రమైన యునికి ఆనాఁడు గుర్తింపఁబడ లేదు.........భోగసాధనముకన్న మించినవిలువ

స్త్రీకి ప్రాచీనకాలమున లేదు" అనుట అబద్ధముఅంశము—స్వతంత్ర మైన యునికి (Independent existence) అనఁగా నేమి? ఎవరియునికి ఇతరులయాగ్రహానుగ్రహములపై ఆధారపడదో అట్టి వారియునికి స్వతంత్రమైన దగును. మనుష్యుఁడు సంఘజీవి. సంఘ మనఁగా కుటుంబములసముదాయము. సంఘములో జీవించుచున్న ప్రతివ్యక్తియు కుటుంబముపై ఆధారపడి జీవించు చుండును. అవివాహితులైన స్త్రీలు పురుషులు కూడ అన్నలు తమ్ములు అక్కలు చెల్లెండ్రు మొదలగువారిపై ఆధారపడి కుటుంబజీవులే యగుదురు. ప్రతివ్యక్తియు ప్రధానముగా కుటుం బముపై ఆధారపడియున్నను, పెక్కుసందర్భములందు తనకు జీవితమునందు కలుగునక్కఱలనుబట్టి (Requirements) గురువు వైద్యుఁడు మొదలుగా కుటుంబేతరులైన సామాజికవ్యక్తులపై ఆధారపడివలసియే యున్నది. కాఁబట్టి ప్రతివ్యక్తియొక్క జీవితము కుటుంబముపై సమాజముపై ఆధారపడియున్నదే కాని స్వతంత్ర ముగా లే దనుట స్పష్టము. అట్టియెడల కుటుంబసభ్యుల యాగ్రహమునకు గుఱియై కుటుంబమునందుఁ గాని, సమాజము యొక్క యాగ్రహమునకు గుఱియై సమాజమునందుఁ గాని ఏ వ్యక్తియు మనుగడను కొనసాగింపలేఁ డనుట స్పష్టము. కావున ప్రతివ్యక్తియొక్క మనుగడ లేక ఉనికి కుటుంబసమాజ వ్యవస్థకు లోఁబడినదే గాని స్వతంత్రము కాదు. ఇది పూర్వకాలమందు ఎట్లున్నదో ఇంచుమించుగా ఇప్పుడును అట్లే యున్నది. ఇది స్త్రీలకు ఎట్లు వర్తించునో పురుషులకును అట్లే వర్తించును. ఏ వ్యక్తివలన నైనను, స్త్రీవలనఁగాని పురుషునివలనఁ గాని, కుటుంబ మునకు దుర్భరమైన యపయశస్సు అవమానము కలుగుచున్న ప్పుడు, కుటుంబము ఆస్త్రీని గాని పురుషుని గాని బహిష్క రించుట సంభవించును. సమాజబహిష్కరణము కూడ ఇట్టిదే.

మంత్రిమండలిలో (Cabinet of ministers) ఒకానొకమంత్రి అవినీతిపరుఁడని ప్రజలు వానిపై అగ్రహావేశములను ప్రకటించినపుడు ముఖ్యమంత్రి గాని ప్రధానమంత్రి గాని తన ప్రభుత్వముయొక్క మనుగడకొఱకు ఆమంత్రిని మంత్రిమండలినుండి తొలఁగించుట ఈనాఁడు కూడ జరుగుచునే యున్నది. అనఁగా మంత్రిమండలిలో ప్రతిమంత్రియొక్క యునికి ముఖ్యమంత్రియొక్క లేక ప్రధానమంత్రియొక్క అగ్రహానుగ్రహములపై ఆధారపడియున్న దని, వారి యాగ్రహానుగ్రహములు కూడ ప్రజలయభిప్రాయముపై ఆధారపడియుండు ననుట స్పష్టము. ఇందు ప్రజలయభిప్రాయము యథార్థమా లేక అపోహయేనా అనుచర్చకు ప్రాముఖ్యము లేదు. వారిని పాలింపఁదలఁచుకొన్న వాఁడు వారియభిప్రాయమునకు ప్రాముఖ్యము ఈయక తప్పదు. అందువలన ప్రతివ్యక్తియొక్క ఉనికి కుటుంబసమాజపరతంత్రమే కాని స్వతంత్రము కాదని గ్రహింపవలసియున్నది.

రాముఁడు యశస్సుకొఱకు కుటుంబగౌరవముకొఱకు సీతను పరిత్యజించుటయే ఆమెకు స్వతంత్రమైనయునికి లేదనుటకు హేతువైనచో, ఆయన ఆసందర్భముననే తమ్ములను గాని తనజీవితమును గాని పరిత్యజించుటకు సిద్ధముగా నున్నా నని స్పష్టముగా చెప్పెను. అనఁగా కుటుంబగౌరవదృష్టితో వారికి కూడ స్వతంత్రమైన యునికి లేదన్నమాట. అంతే కాదు. ఆయన కుటుంబగౌరవముకొఱకే లక్ష్మణుని కూడ పరిత్యజించె నను విషయమును ఇంతకు ముందే గ్రహించియున్నాము. కావున ఇట్టి సందర్భములనుబట్టి "భోగసాధనముకన్న మించినవిలువ స్త్రీకి ప్రాచీనకాలమున లేదు" అనిమొదలుగా సిద్ధాంతములు చేయుట అనాలోచిత మనియే గ్రహింపవలసియున్నది. పాశ్చాత్యదేశములలో కూడ స్త్రీలు రాజులతో సమానముగా రాణులుగా పరిపాలించుచుండి రనుట

ప్రసిద్ధమే. మనదేశమున స్త్రీ భార్యగా భర్తను దేవునివలె ఆరాధింప వలసియున్నను, ఆమె తల్లిగా వదినగా పుత్త్రులకు మఱఁదులకు ఆరాధ్యదేవతగా విధింపఁబడి యున్నది. కావున మనసంస్కృతిపై శ్రీశాస్త్రిగారు గావించుచున్న యీయారోపణ మయుక్తము.

(7) "ఈపర్యాయము రాముఁడు నీచస్థితినుండి నీచతర స్థితికి దిగజాఱుచున్నాఁడు. తనయంతరాత్మయొక్క సాక్ష్యమునకు విరుద్ధముగా ఆమెను బహిష్కరించుటకు సిద్ధపడుటయే కాక, ఆ పనిని రహస్యముగా చేయుచున్నాఁడు ఆమెకు ఆవిషయమును ఆయన చెప్పుట లేదు........" అనునది యేడవయంశము.

సీతాదేవియొక్క దుఃఖమునుగూర్చియే తలపోయుచు శ్రీ శాస్త్రిగారు రామునిసంకటమును గమనించుటయే లేదు. అపరిస్థితి యందు రాముఁడు ఎట్లు వర్తించినచో నీచస్థితికి దిగజాఱకుండ నుండవచ్చునో అపద్ధతిని వారు వివరింప లేదు. వారియూహా ననుసరించి ఆయన దిగజారకుండ నుండవలయు నన్నచో ఏమి చేయవలెఁ? "ఈమె శీలము పవిత్ర మని అగ్నిహోత్రునివలన నిరూపింపఁబడినది; బ్రహ్మాదిదేవతలు కూడ ప్రశంసించిరి. కావున ఇంక ఎవరు ఏ మనుకొన్నను నేను లెక్కపెట్టను" అని నిశ్చయించి ఆమెతో యథాపూర్వముగా సంసారము చేయుచు నుండవలె. అప్పు డాయన అపరాధి నెవని నైనను దండింపఁబూనినప్పుడు వాఁడు, "రాక్షసునకు చిక్కి తిరిగివచ్చినభార్యతో సంసారము చేయుచున్న నీవు నన్ను ఎట్లు శిక్షింపఁగలవు? నీకు లేనిధర్మము మా కేల?" అని ప్రతిఘటింప వచ్చును. అప్పు డాయన, "నా భార్య పవిత్రశీల; అసురునియింటియందున్నను అగ్నిశుద్ధిని పొందిన నది; ఆమెను నీవు ఆక్షేపింపరాదు" అని శాసింపవలె. అప్పుడు వాఁడు, "అయ్యా! ప్రభువులు ఏమి చెప్పినను చెల్లును; మీరు పందిని నందిని చేయఁగలరు; జగత్కంటకుఁడైన రావణునియింట

ఒక స్త్రీ సంవత్సర ముండి పవిత్రముగా తిరిగివచ్చిన దనుటయే ఎవరును నమ్మఁ జాలరు, దానికి తోడుగా ఆమె అగ్నియందు దూఁకి తిరిగివచ్చిన దనుట అంతకన్నను నమ్ముటకు శక్యము కాని విషయము; అయ్యో! ఈకల్పన లెందులకు? నాభార్య నాకు ప్రియురాలు కావున నేను తెచ్చికొన్నాను అని యొక్కమాట చెప్పరాదా" అని ఆక్షేపింపవచ్చును. అప్పుడు రాముఁ డేమి చేయవలె? మరల ప్రజలకొఱకు శపథము కావింపు మని ఆయన ఆమెను అడుగవలె? ఆమె అందులకు అంగీకరించునా? ఆమె కది ఎంత అవమానకరము! అందువలననే ఆయన ఆమెను ఆ విధముగా అడుగుటకు జంకెను. రెండవసారి ఆవిధముగా ఆమెను అడిగినప్పు డామె భూమిలోనికే పోయినది. అట్లు కాక ఆమె శపథమునకు అంగీకరించి మరల అగ్నిప్రవేశము కావించి నను ప్రజ లందఱును చూడఁగలరా? కొందఱు మేము చూడలే దందురు. మఱికొందఱు, "జలస్తంభనవిద్యవలె ఇది కూడ అగ్ని స్తంభన మనువిద్యయే. ఇంతమాత్రమున శీలము నిరూపిత మగునా?" అని యందురు. కావున సీతాదేవిశీలము పవిత్రముగ నున్న దని ప్రజలను నమ్మింపఁజేయుట అసాధ్యము. వారియపవాదము ప్రబలుచుండఁగా, ఆయన ఏమియు జరుగనట్లే, ఆమెతో సంసారము చేయుచుండుట నికృష్టము. ఎప్పటి కైనను ఆమెకు ఈవార్త చేరకుండ నుండదు. అప్పు డామె చెలికత్తెలమొగములు చూచుచు అంతఃపురములో సుఖముగా నుండఁగలదా? తనవలన ప్రజాపాలనమునకు అభ్యంతరము కలుగుచున్న దని తెలిసినచో అభిమానవతియైన ఆమెయే అంతఃపురమును పరిత్యజించుటకు సిద్ధపడదా? కావున సీతను పరిత్యజించుటకన్న రామునకు గత్యంతరము లేదు. అట్టియెడల ఆయన నీచస్థితికి దిగజాఱె ననుట అయుక్తము.

అట్లయినచో ఆయన ఆపరిత్యాగమును బహిరంగముగనే చేయవచ్చును కదా! ఆమెకు కూడ చెప్పకుండ ఆయన అంత రహస్యముగా ఆమెను అడవిలో దింపి రమ్మని లక్ష్మణున కాజ్ఞాపించుట ఎందులకు? ఆయన ఆమెకు ఆవిషయమును చెప్పినచో ఆమె దుఃఖింపకుండ నుండదు. ఆమె దుఃఖించుచుండఁగా ఆమెను అడవికి ప్రయాణ మగునట్లు చేసినచో కౌసల్యాదులే కాక వసిష్ఠాదులును తప్పక ప్రతిఘటింతురు. అప్పుడు పెద్దలమాటను అతిక్రమించి వర్తించుట రామునకు ఉచితము కాదు. ఆమె రామునిచే పరిత్యజింపఁబడి అడవులకు పోవుచున్న దని తెలిసినచో ఈప్రజలే తాత్కాలికమైన జాలియొక్క ఆవేశమునకు లోనై రథమునకు అడ్డుపడరా? అప్పుడు పెద్దలమాటను వారి యభిప్రాయమును మన్నించి రథమును మరలించి మరల ఆమెను అంతఃపురమునకు చేర్చినచో, "ఇది పెద్దనాటకము; మనలను బేలుపుచ్చుటకై రాముఁడు అందఱు చూచుచుండఁగా భార్యను పరిత్యజించినట్లు నటించి మరల మనయభిప్రాయమునే మన్నించుచున్నట్లుగా భార్యను అంతఃపురములో భద్రపఱచుకొన్నాఁడు; నిజముగా భార్యను వదలుకోఁ దలఁచుకొన్నవాఁడు పదిమందికి చెప్పి పరిత్యజించునా?" అని ఆప్రజలే మరల అపవాదును ప్రబలఁజేయుదురు. కావున పరిత్యాగమును రహస్యముగా చేయుట కన్న రామునకు గత్యంతరము లేదు. ఆయన ఆమెకు తెలియకుండ పరిత్యాగమును కావించె ననుటయు కుదురదు. ఆమెకు ఆవిషయమును ఆయన అంతఃపురములో చెప్పకున్నను, వాల్మీకి యాశ్రమప్రాంతమున దింపి వచ్చునప్పుడు విషయమును విశదముగా చెప్పు మనియే లక్ష్మణునకు ఆదేశించెను, ఇట్లు ఆమహాత్ముఁడు మానవచరిత్రలో ఎవరును కనివిని యెఱుఁగని సంక

టము నెదుర్కొని హృదయభేదకమైన దుఃఖమునకు లోనై ఎంతో ఆలోచించి పత్నీపరిత్యాగమును నిశ్చయించి, ప్రజలదయాదాక్షిణ్యములకు పాలగుట యను దుర్గతి ఆమెకు పట్టకుండ, ఎంతో జాగరూకతతో ఆపరిత్యాగకార్యమును నిర్వహించి, బ్రతికియున్నంతకాలము ఆమెకొఱకు హృదయమున పరితాపమునే పొందియుండఁగా, ఆయన నీచస్థితినుండి నీచతరస్థితికి దిగజాఱెననుటకన్న ఘోర మే మున్నది? దిగజాఱుట అనఁగా నేమి? ఎవఁ డైనను ఎందులకు దిగజాఱును. ఒకఫలము నపేక్షించినవాఁడు, దానిని సరియైనమార్గమున సాధించుకొనలేనప్పుడు, అనుచితవృత్తి నవలంబించి దానిని సాధింపఁబూనుకొన్నచో వాఁడు దిగజాఱుచున్నాఁ డని చెప్పుదురు. మానవంతుఁడు స్వతంత్రముగ జీవింపలేక సేవకవృత్తి నవలంబించి బ్రతుకఁ దలఁచుట నీచస్థితికి దిగజాఱుట యగును. ఆవృత్తియందు కూడ యజమానుని మోసగించి ధనము నార్జింపవలె నని పూనుకొనుట నీచతరస్థితికి దిగజాఱుట యగును. ఇది రామునియం దెట్లు అన్వయించును? కీర్తి నపేక్షించి ఆయన భార్యను బలిపెట్టెననుటయు కుదురదు. ప్రజలదృష్టిలో ధర్మాత్ముఁ డను కీర్తిని నిలుపుకొనుట రాజునకు ధర్మకర్తవ్య మని ముందే గమనించియుంటిమి. ఆకర్తవ్యమును ఆయన అసిధారావ్రతముగ నిర్వహించుచు మానవత్వమహత్త్వమునందు ఒకమెట్టునుండి మఱియొకపైమెట్టుకే ఆయన చేరుచున్నాఁడు. భార్యావిరహపరితప్తుఁడైయుండియు, ఎవరును ఊహింపనిప్రజాపవాదమును ముందుగనే యూహించి, భార్యపై పొంగివచ్చుచున్నజాలిని వెనుకకు త్రోసి ఆయన ఆమెను అగ్నిశోధనమునకు అగ్గముచేయుటయే మానవమహత్త్వమున ఒకపెద్దమెట్టు. ప్రజాపవాదమును విన్నతరువాత రాజధర్మనిర్వహణముకొఱకు భార్యను పరిత్యజించుటయే కాక,

లౌల్యముతో మఱియొక భార్యను పరిగ్రహింపక శాశ్వతముగా భార్యాసుఖమునకు దూరుఁడై యింద్రియనిగ్రహమును అసందిగ్ధ ముగా ప్రజలకు నిరూపించుకొన్నప్పుడు రాముఁడు వెనుకటి కన్నను ఉన్నతతరమైన మెట్టునకు చేరె నని చెప్పవలసి యున్నది. కావున దీనినిబట్టి శ్రీశాస్త్రిగారివాదము ఎంత అనా లోచితమో ఎంత అయుక్తమో గ్రహింపవచ్చును.

## 5. అగ్నిప్రవేశము

లక్ష్మణుఁడు చితిని ఏర్పఱచుచుండఁగా రాముఁడు కాలాంతకునివలె భయంకరుఁడై యుండెను. ఆయన విభీషణుని నిర్దహించుచున్నట్లుగా చూచి నిందించియుండుటవలన సుగ్రీ వాదు లెవ్వరును ఆయనను సమీపించి అనునయించుటకుఁ గాని పలుకరించుటకుఁ గాని సమర్థులు కాకుండిరి. అదోముఖుఁడై యున్న రామునకు సీత ప్రదక్షిణముఁ గావించి హుతాశనుని సమీపించి దేవబ్రాహ్మణులకు నమస్కరించి ప్రాంజలియై, "నా హృదయము రామునినుండి ఎప్పుడును తొలఁగకుండుట సత్య మైనచో లోకసాక్షియైన పావకుఁడు నన్ను అన్నివిధముల రక్షించును గాక! శుద్ధచరిత్రనైన నన్ను రాముఁడు దుష్టనుగా తలంచుచున్నచో లోకసాక్షియైన పావకుఁడు నన్ను అన్నివిధ ముల రక్షించును గాక! సర్వధర్మజ్ఞుఁడైన రాముని నేను మనో వాక్క్రియలచేత అతిక్రమింపకుండుట యథార్థ మైనచో లోకసాక్షి యైన పావకుఁడు నన్ను అన్నివిధముల రక్షించును గాక!" అని పలికి అగ్నిహోత్రునకు ప్రదక్షిణముఁ గావించి నిశ్శంక మైనయంతరాత్మతో హవ్యవాహునియందు ప్రవేశించెను.

శ్లో॥ న హి రామం తదా కశ్చి త్కాలాంతకయమోపమమ్।
అనునేతు మథో వక్తుం ద్రష్టుం వా ప్యశకత్॥ 22

శ్లో॥ యథా మే హృదయం నిత్యం నాపసర్పతి రాఘవాత్।
తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతు పావకః॥ 25

శ్లో॥ యథా మాం శుద్ధచరిత్రాం దుష్టాం జానాతి రాఘవః।
తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతు పావకః॥ 26

శ్లో॥ కర్మణా మనసా వాచా యథా నాతిచరా మ్యహమ్।
రాఘవం సర్వధర్మజ్ఞం తథా మాం పాతు పావకః॥ 27

యుద్ధ-సర్గ-116

"అన్నివిధముల రక్షించుము గాక" అనుమాట కేమి యర్థము? కేశాంబరాభరణములయందు కూడ కొంచె మైనను అగ్నిస్పర్శము లేకుండునట్లుగా తన్ను కాపాడు మనుట ఆమె యభిప్రాయము. అంతే కాదు. ఆమె సమీపించినంతనే అగ్ని దేవుఁడు తనజ్వాలారూపమును ఉపసంహరించుకొనినచో ఆమెకు కేశాంబరాభరణములయందు ఏమార్పును సంభవింపదు. అప్పుడు కొందఱు "ఇదేదో అగ్నిస్తంభనవిద్య అయిఉండవచ్చును" అని తలంపవచ్చును. అందువలన అట్టియపోహలకు తావు లేకుండ అగ్నిదేవుఁడు స్వయముగా ప్రత్యక్షమై తనశీలమును లోకమునకు ప్రకటించి తన్ను రక్షింపవలయు నని కూడ ఆమె తలంచుచున్నది.

తప్తకాంచనభూషణములతో బంగారపుఁదీఁగవలె ప్రదీప్తమైనయగ్నిజ్వాలయందు ప్రవేశించుచున్న సీతాదేవిని చూచి మహర్షులు, దేవగంధర్వులు యజ్ఞమునందలిపూర్ణాహుతినివలె

భావింపఁజొచ్చిరి. అధ్వరమునందు సంతతమంత్రసంస్కృతమైన యాజ్యధారవలె పావకునందు పడుచున్నయామెను చూచి వెంట వచ్చియున్నస్త్రీ లందఱును పెద్దపెట్టున ఆక్రోశించిరి. రాక్షసుల యందు వానరులయందును హాహాకారములు మిన్నుముట్టెను. చుట్టును ప్రబలుచున్న యాక్రందనధ్వనుల వినుచు రాముఁడు కన్నీరు కార్చుచు చింతానిమగ్నుఁ డయ్యెను.

శ్లో॥ దదృశు స్తాం మహాభాగాం ప్రవిశన్తీం హుతాశనమ్।
ఋషయో దేవగంధర్వా యజ్ఞే పూర్ణాహుతీ మివ॥ 31

శ్లో॥ ప్రచుక్రుశుః స్త్రియ స్సర్వా స్తాం దృష్ట్వా హవ్యవాహనే।
పతన్తీం సంస్కృతాం మన్త్రై ర్వసో ర్ధారా మి వాధ్వరే॥ 32

యుద్ధ-సర్గ-116

మహర్షులు దేవగంధర్వులు సీతను పూర్ణాహుతినివలె చూచుచున్నారే కాని ఆక్రోశింపలేదు. సీత అక్షతగాత్రయై మరల వెలికి వచ్చు నని వారికి తెలియును. అందువలన వారు స్త్రీల వలె వానరరాక్షసులవలె హాహాకారములు గావింపలేదు. రాముఁడు విమనస్కుఁ డయ్యెనే గాని ఏమియు మాటాడ లేదు. ఆమె అక్షత గాత్రయై వెలికి వచ్చుననువిషయమున అయనకు ఎట్టి సందేహము లేదు. అయినను అంతమందిలో ఆమెనుగూర్చి పరుషముగా మాటాడి ఆమె అగ్నియందు ప్రవేశించునట్లుగా చేయవలసి వచ్చినందులకు అయన దుఃఖించుచుండెను. ధర్మాత్ముఁడైన అయన బాష్పవ్యాకులలోచనుఁ డయ్యె నని మహర్షి చెప్పుటవలన అయనకు ఆమెశీలమునందు సందేహము గాని ఆమెపై కోపము గాని లేకపోవుటయే కాక ఎంతో దాక్షిణ్యముతో అయన వ్యథ నొందుచుండె నని వ్యక్త మగుచున్నది.

శ్లో॥ తతో హి దుర్మనా రామః శ్రుత్వైవం వదతాం గిరః।
దధ్యౌ ముహూర్తం ధర్మాత్మా బాష్పవ్యాకులలోచనః॥ 1
యుద్ధ-సర్గ-117

తి.టీక:—ప్రాకృతస్త్రీవత్ సీతా ఏత దనర్హేతి తద్వియోగతః బాష్పవ్యాకులలోచనః భూత్వా ముహూర్తం దధ్యౌ, కి ముక్తం, కిం కృతం, కిం చాతఃపరం కర్తవ్య మితి చింతాపరో బభూవ।

## 6. దేవతాదర్శనము

అప్పుడు ఇంద్రవరుణకుభేరధర్మరాజత్రిణయనపితామహులు పితృగణములతో సూర్యసంకాశములైన విమానములతో ప్రత్యక్షమైరి. వారిని చూచి రాముడు అంజలించెను. రామునితో వారిట్లనిరి "సకలలోకకర్తవు, జ్ఞానవంతులలో ఉత్తముఁడవు, దేవగణశ్రేష్ఠుఁడవైన నీవు సీత హవ్యవాహనునియందు పడుచుండఁగా ఏల యుపేక్షించితివి? సృష్టికి ఆదిమధ్యాంతములయందు నిలిచి యుండు నీస్వరూపము నేల తెలిసికొనకున్నావు? ప్రాకృతమానవునివలె వైదేహి నేల యుపేక్షించితివి?"

రాముఁడు బ్రహ్మదేవునితో నిట్లనెను, "భగవానుఁడా! దశరథాత్మజునిగా నన్ను నేను తలంచుచున్నాను. నేను ఎవఁడనో. ఎటనుండి వచ్చితినో భగవానుఁడే చెప్పును గాక!" పరమేష్ఠి శ్రీరాముని శ్రీమన్నారాయణునిగా తెలిపి, అపరమేశ్వరునివిశ్వరూపమును సంగ్రహముగా వర్ణించి, ఇట్లనెను. "రామా! నీవే త్రివిక్రముఁడవై బలిని బంధించి దేవరాజ్యమును మహేంద్రున కొసంగితివి. నీవు విష్ణుదేవుఁడవు. సీత లక్ష్మి. రావణవధమునకై మనుష్యశరీరమును పొంది దేవకార్యమును సాధించితివి.

ఇంక స్వర్గమునకు రమ్ము. నీయందు దేవరు దృఢమైన భక్తి కలిగి యుందురో వారు ఈలోకమునందు పరలోకమునందు కూడ అభీష్టములను పొందుదురు. దివ్యము పురాతనమును అయినయీ స్తవమును పఠించువారు పరాభవమును పొందరు."

శ్లో॥ యే త్వాం దేవం ధ్రువం భక్తాః పురాణం పురుషోత్తమమ్।
ప్రాప్నువన్తి సదా కామా నిహలోకే పరత్ర చ॥ 31

శ్లో॥ ఇమ మార్షం స్తవం దివ్య మితిహాసం పురాతనమ్,
యే నరా కీర్తయిష్యన్తి నాస్తి తేషాం పరాభవః॥ 32

(యుద్ధ-సర్గ-117)

ఈదేవత లందఱు రావణసంహారము జరిగినవెంటనే కాని, సీతాదేవి అగ్నియందు ప్రవేశించుటకు ముందు కాని ఎందులకు ప్రత్యక్షము కాలేదు? అగ్నిప్రవేశమువలన సీతయొక్క శీలము లోకమునకు నిరూపితము కావలయు ననియే వారియభిప్రాయ మని గ్రహింపవలసియున్నది. అట్లయినచో, "ప్రాకృతమానవుని వలె సీత నేల యుపేక్షించితి" వని వారు అయనను ప్రశ్నించుట ఎందులకు? "నన్ను నేను మనుష్యునిగా తలంచున్నాను" అని ఆయనచేత చెప్పించుటకే వారు అవిధముగా ప్రశ్నించిరి. ఇట్లు చెప్పించుటలో విశేష మేమున్నది? విష్ణుదేవుఁడు రాముఁడుగా అవతరించినప్పుడు సకలజీవితదశలలో సుఖములను దుఃఖములను అనుభవించుచు మనుష్యులధర్మములకు బాధ్యతలకు లోఁబడియే వర్తించెను కాని, మానవాతీతములైన దివ్యదృష్టి అదృశ్యరూపత్వము విశ్వరూపప్రదర్శనము మొదలైనశక్తుల నవలంబించి యెప్పుడును ప్రవర్తింపలే దని దీనివలన స్పష్ట మగుచున్నది. మహారాజు మాఱువేషమున ప్రజలలో సంచరించునప్పుడు వారివలె తాత్కాలికముగా సుఖములను దుఃఖములను అనుభవించు

చుండుటయే కాక, రాజుగా తాను విధించినశాసనములను అతిక్ర మింపక వానికి లోఁబడియే వర్తించును. అట్లే రాముఁడుగా అవతరించినవిష్ణుదేవుఁడు సాధారణమానవులవలె సుఖములను దుఃఖములను అనుభవించుచు, ఏపరిస్థితియందును తనయాజ్ఞా రూపములైన వేదధర్మములను అతిక్రమింప లే దని గ్రహింప వలసియున్నది. దివ్యములైన శక్తులను ప్రకటింపక ఆయన సాధా రణవ్యక్తివలెనే వర్తించుటవలన మానవు లందఱును ఆయన యడుగుజాడలలోనే సంకటములందు కూడ వర్తింపవలయు నని వ్యక్తమగుచున్నది. "ఆయన కేమయ్యా! విష్ణుదేవుఁడు; ఎన్నో దివ్యశక్తులు కలవాఁడు. ఆయనకు సుఖ మే మున్నది? దుఃఖ మే మున్నది? ఆయన ఎన్నిధర్మముల నైన ఎంత అసిధారా వ్రతముగా నైన ఆచరింపఁగలఁడు; అట్లు ధర్మమును పాటిం చుట మన కెట్లు సాధ్య మగును?" అని సాధారణమానవులు భావించుటకు అవకాశము లేకుండ రాముఁడు కేవలమానవత్వము తోనే ధర్మములను ఆచరించె నని, మానవుఁడుగా ఆయనకు సాధ్యమైనధర్మవర్తనము సాధారణమానవులకు కూడ సాధ్యమే యని స్పష్ట మొనరించుటకే దేవతలు రామునిచేత "నన్ను నేను మానవుఁడనుగా తలఁచుచున్నాను" అని చెప్పించిరి.

"రాముఁడు మానవుఁడే అయినను మానవమాత్రుఁడు కాదు; మహాత్ముఁడు. అంతగొప్పవానిని మే మెట్లు అనుసరింపఁ గలము" అని కొందఱు భావింపవచ్చును. అట్టివారు ఆయనను అనుసరింప లేకున్నను, ఆయనయందు భక్తి కలిగియున్నచో ఆయ నయే సంకటములందును వారికి ధర్మమే స్ఫురించునట్లుగా, అట్లు స్ఫురించినధర్మమును ఆచరింపఁగల్గునట్లుగా అనుగ్రహింపఁగలఁ డని బ్రహ్మదేవుఁడు మానవులకు విశద మొనర్చుచున్నాఁడు

ధర్మాతిక్రమణమునకు మూలము కోరిక. ఒకఫలము నపేక్షించిన వాఁడు దానిని ధర్మమార్గమున పొందఁజాలనప్పుడు, అధర్మ మార్గము నవలంబించి యైనను దానిని సంపాదించుకొనుటకు ప్రయత్నించును. మఱి విష్ణుదేవుఁడు ఆప్తసమస్తకాముఁడు. ఆయనకు ఈలోకమున పొందవలసినది ఏదియు నుండదు. అందు వలన ఆయనకు కోరిక యుండదు. ఏకోర్కెయు లేనివాఁడు ఎందులకు ధర్మము నతిక్రమించును? కావున శ్రీరామునిజీవితమునందు ఎచ్చటను ధర్మాతిక్రమణము లే దని స్పష్టముగా గ్రహింపవలసి యున్నది. ధీరులకు రామునిజీవితము అనుసరణీయము; సామాన్యులకు రామభక్తి అవలంబనీయము. మానవజీవితపవిత్రతకు పరాకాష్ఠయైన యీయగ్నిపరీక్షా సందర్భమును పురస్కరించుకొని, రాముఁడు సకలమానవులకు ఆదర్శప్రాయుఁ డని ఆరాధ్యుఁ డని పరమేష్ఠి ప్రకటించెను. అందువలననే అప్పటినుండి యిప్పటి వఱకు శ్రీరాముఁడు మర్యాదాస్థాపకుఁడైన పురుషోత్తముఁడుగా సకలఫలప్రదాతయైన పరమేశ్వరుఁడుగా ఆరాధింపఁబడు చున్నాఁడు.

శ్లో॥ ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్।
సోఽహం యశ్చ యతశ్చాహం భగవాం స్తద్బ్రవీతు మే॥11

యుద్ధ-సర్గ-117

బ్రహ్మదేవునిప్రసంగము పూర్తియైనతరువాత అగ్నిదేవుఁడు సీతను పుత్రికనువలె ఒడియందుఁ గైకొని చితిని తొలఁగించి పైకి వచ్చి మాల్యాభరణములు కూడ చెదరకుండనున్న యాపతిదేవతను రామున కొసంగుచు ఇట్లనెను. "రామా! ఈవైదేహియందు ఎట్టిపాపమును లేదు. మనోవాక్కాయదృక్కులచేత నిన్ను ఈమె ఎప్పుడును అతిక్రమింపలేదు. రావణాంతఃపురమున నిబద్ధయై

యున్నప్పుడు రాక్షసస్త్రీలు ఎన్నివిధముల ప్రలోభపెట్టినను బెదిరించినను ఈమె చలింపలేదు; నిన్నే ధ్యానించుచున్నది. ఈమెను స్వీకరింపుము. మారుమాటాడకుము. నిన్ను ఆజ్ఞాపించుచున్నాను."

రాముఁడు హర్షవ్యాకులలోచనుఁడై యిట్లనెను. "అగ్ని భట్టారకా! రావణాంతఃపురమునందు చిరకాల ముండినయీమెను నేను శోధనము లేకుండ పరిగ్రహించినచో 'రాముఁడు కాముకుఁడు, బాలిశుఁడు' అని లోకము నన్ను నిందించును. కావున ఈమె అగ్నిశోధనమును పొందుట అవశ్యక మయ్యెను. ఈమె పతిదేవత యని నాకు కూడ తెలియును. స్వతేజోఽభిరక్షితయైన యీమెను రావణుఁడు అతిక్రమింపఁజాలఁడు. మూఁడులోకములకు ఈమె పవిత్రురా లని విశ్వాసము కలిగించుటకొఱకే నేను అగ్నిప్రవేశమును అంగీకరించితిని. భాస్కరునకు కాంతి యెట్టిదో నాకు సీత అట్టిది. ఆత్మవంతుఁడు కీర్తి నెట్లు విడువఁజాలఁడో, అట్లే ముల్లోకములందును పవిత్రురాలుగా ప్రకటితయైన యీమెను విడిచిపెట్టుట నాకు కూడ శక్యము కాదు. లోకపాలకులైన మీరందఱు చెప్పుచున్నహితము నాకు అవశ్యకర్తవ్య మగును."

శ్లో॥ బాలిశో బత కామాత్మా రామో దశరథాత్మజః।
ఇతి వక్ష్యతి మాం లోకో జానకీ మవిశోధ్య హి॥ 14

శ్లో॥ అనన్యహృదయాం సీతాం మచ్చిత్తపరివర్తినీమ్।
అహ మ ప్యవగచ్ఛామి మైథిలీం జనకాత్మజామ్॥ 15

శ్లో॥ నేయ మర్హతి వైక్లబ్యం రావణాంతఃపురే సతీ।
అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా॥ 18

శ్లో॥ విశుద్ధా త్రిషు లోకేషు మైథిలీ జనకాత్మజా।
న విహాతుం మయా శక్యా కీర్తి రాత్మవతా యథా॥ 19

యుద్ధ-సర్గ-118

ఆత్మవంతుఁడు కీర్తినివలె, విశుద్ధురాలుగా ప్రకటితయైన సీతను విడిచిపెట్టుట తనకు శక్యము కా దని రాముఁ డనుట సాభిప్రాయముగా నున్నది. ఆత్మవంతుఁ డనఁగా ఆత్మగౌరవము కలవాఁడు. అట్టివానికి కీర్తిని వదలుకొనుట శక్యము కాదు. అనఁగా కీర్తికి భంగము కలుగు పరిస్థితి సంభవించినచో ఆత్మవంతుఁడు కీర్తిని నిలుపుకొనుటకొఱకు ఎట్టిత్యాగమున కైనను సిద్ధపడవలసియే యుండు నని రాముఁడు స్ఫురింపఁ జేయుచున్నాఁడు. ప్రాప్తచారిత్రసందేహయైన పత్నిని స్వీకరించుట ఎట్లు అశక్యమో, విశుద్ధచరిత్రగా నిరూపింపఁబడినదానిని విడుచుటయు అట్లే శక్యము కాదు. విశుద్ధురాలుగా నిరూపింపఁబడిన యీమెను ఇప్పుడు ఎట్లు తప్పక పరిగ్రహించుచున్నానో, అట్లే యిఁకముందు ఏకారణముచేత నైనను ప్రజ లీమెను శంకించుట సంభవించినచో మరల పరిత్యజించుట తప్ప దనీ ఆయన వ్యక్తము చేయుచున్నాఁడు.

## 7. పితృదర్శనము

రాముఁడు సీతను స్వీకరించినతరువాత మహేశ్వరుఁడు ఆయనను అభినందించుచు ఇట్లనెను. "రామభద్రా! భాగ్యవశమున నీవు రావణభయమును లోకమునకు తొలఁగించితివి. ఇంక అయోధ్య కేఁగి కౌసల్యాదులను సంతోషపెట్టి పట్టాభిషిక్తుఁడవై సుహృజ్జనమును అలరింపుము. ఇక్ష్వాకుకులమును నిలిపి అశ్వమేధ మొనర్చి బ్రాహ్మణులకు ధన మొసంగి యనుత్తమమైన కీర్తిని పొంది స్వర్గమును చేరుదువు గాక! ఇటు చూడుము. ఇతఁడే మీతండ్రి దశరథుఁడు. ఇతఁడు నీచేత ఋణవిముక్తిని పొంది ఇంద్రలోకమును పొందెను. ఈవిమానమునం దున్నాఁడు చూడుము."

రాముఁడు విమానమందున్న తండ్రిని చూచి సీతాలక్ష్మణ సమేతుఁడై అయనయొద్దకు పోయి ప్రణమిల్లెను. దశరథుఁడు పరమహర్షమున రాముని ఒడిలోనికిఁ గైకొని గాఢముగ కౌఁగిలించుకొని యిట్లనెను. "నాయనా! నీకు దూరమై యున్ననాకు స్వర్గము కాని దేవతాశ్రేష్ఠులసమ్మానము గాని సుఖము నొసంగుట లేదు. నిన్ను అడవికి పంపుటకై కైకేయి యన్నమాటలన్నియు హృదయమున నాటుకొనియున్నవి. ఇప్పుడు నిన్ను కౌఁగిలించుకొని దుఃఖవిముక్తుఁడ నైతిని. సుపుత్త్రుఁడవైన నీచేత నేను తరించితిని. సురేశ్వరులకోఱకు రావణుని వధించుటకై యవతరించి గూఢముగనున్న పురుషోత్తముఁడ వని యిప్పుడు గ్రహించితిని. విజేతవై అయోధ్యకు చేరిననిన్ను చూచి కౌసల్య సిద్ధార్థ యగును. నిన్ను పట్టాభిషిక్తునిగా చూచి ప్రజలు కూడ చరితార్థు లగుదురు. ఇంక నీవు భరతు నోదార్చి సోదరులతో కూడి రాజ్యపాలనముఁ గావించుచు దీర్ఘాయువును పొందుము."

శ్లో॥ ఇదానీం చ విజానామి యథా సౌమ్య సురేశ్వరైః।
వధార్థం రావణ స్యేహ విహితం పురుషోత్తమమ్॥ 17

శ్లో॥ కృతం కర్మ యశ శ్లాఘ్యం ప్రాప్తం తే శత్రుసూదన।
భ్రాతృభి స్సహ రాజ్యస్థో దీర్ఘ మాయు రవాప్నుహి॥ 23

యుద్ధ-సర్గ-119

రాముఁడు ప్రాంజలియై తండ్రి కిట్లు విన్నవించెను. "తండ్రీ! కైకేయిని భరతుని అనుగ్రహింపుము. 'నిన్ను సపుత్రముగా త్యజించుచున్నా' నని నీ వొసంగిన ఘోరశాపము వారిని స్పృశింపకుండును గాక!'' దశరథుఁడు అందులకు అంగీకరించెను.

తమకష్టముల కన్నింటికిని మూలమైన కైకేయివిషయమున, దశరథుఁడు స్వర్గమునకు చేరియు ద్వేషమునే భావించుచుండఁగా, రాముఁడు ఆమెను క్షమింపవలసినదిగా తండ్రిని ప్రార్థించుట ఆయనయొక్క లోకోత్తరమైన యౌదార్యమును వ్యక్తమొనర్చుచున్నది. ఆయన యీసందర్భమున కైకేయినిగూర్చి తండ్రిని ప్రార్థింపకున్నను ఆయనకు కలుగుధర్మలోప మేమియును లేదు. రావణాదివధాదికములైన కార్యములు ఆయనకు ధర్మవిహితములు. వానిని చేయకున్నచో ఆయనకు ప్రత్యవాయము కలుగును. కైకేయికొఱకు ఆయనచేసినయీక్షమాప్రార్థనము విహితము కాదు. కేవలమైన దయాపరత్వముతో ఆయన యిట్లు ప్రార్థించెను.

ఆయన సీతను పరిత్యజించినతరువాత మఱియొకస్త్రీని పరిగ్రహింప కుండుటయు నిట్టిదే. యజ్ఞాదికార్యములందు యజమానునకు పత్ని అవశ్యకము. అది విధివిహితము. అట్టియెడల ఎవఁ డైనను భార్యాపరిగ్రహమును గావించుట సహజము. యజ్ఞాదికార్యములకొఱకై భార్యకు ప్రతినిధిగా స్వర్ణసీతాప్రతిమను గావించుకొనుట కేవలము దయామయత్వమే. ప్రజారంజనమనుబాధ్యత రాజునకు పట్టమహిషికిని సమాన మగుటచే (Combined responsibility), ఆబాధ్యతను నిర్వహించుటకొఱకు ఆమెను పరిత్యజించి ఆమెకు భర్తృవియోగమును కలిగించి తాను మాత్రము యజ్ఞకార్యము కారణముగా మఱియొక పత్నిని పరిగ్రహించి భార్యాసుఖమును పొందుట స్వార్థపరత్వమే యగునని ఆయన తలంచెను. అది ఆయనకు స్నేహధర్మభంజకముగా తోఁచియుండును. అదియునుగాక ప్రజలు ఆమెనుగూర్చి ఏమియనుకొన్నను, తనదృష్టియం దామె పవిత్రమూర్తియే యగుటచే, తనమనస్సునందు ఆమెయే పత్నిగా నుండుటచేత, ఆమెకు ప్రతి

నిధిగా స్వర్ణప్రతిమను ఏర్పఱచుకొని ఆమెయొక్క పాతివ్రత్య మహత్త్వమును సకలలోకమునకు నిస్సంశయముగా ప్రకటించెను.

దశరథుఁడు లక్ష్మణుని కౌఁగిలించుకొని, "ధర్మజ్ఞా!" అని సంబోధించి యిట్లనెను. "నీవు సీతారాములకు భక్తితో శుశ్రూష గావించుటవలన నాకు చాల ప్రీతి కలిగినది; నీకు ధర్మఫలము లభించినది. ఇఁకముందు కూడ ఇట్లే రామునకు శుశ్రూషఁ గావించుచుండుము. రాముఁడు ప్రసన్నుఁడైనచో ధర్మము యశమే కాదు. స్వర్గమును మహిమను కూడ నీవు పొందుదువు. చూచుచున్నావు కదా! ఇంద్రాదులతో ముల్లోకములవారు కూడ రాముని పురుషోత్తమునిగా ఆరాధించుచున్నారు. సర్వదేవతా హృదయము, ఉపనిషదేకవేద్యము, భక్తిశూన్యులకు అవ్యక్తము, షడ్భావవికారరహితము, అక్షరము నైన బ్రహ్మమే యీరాముఁడని బ్రహ్మాదిదేవతలు చెప్పుచున్నారు.

ఈప్రసంగమున, లక్ష్మణుఁడు తన్ను వదలి రాముని వెంట పోయినప్పటికి, అది తనకు ఇష్టమే అగుటవలన, అది అతనికి అధర్మము కాకపోఁగా ధర్మఫలమే కలిగించిన దని దశరథుఁడు స్పష్ట మొనర్చుచున్నాఁడు. "నేను మహారాజునందు పితృత్వమును భావించుటలేదు. నాకు తల్లి తండ్రి సోదరుఁడు సర్వము రాముఁడే" అని లక్ష్మణుఁడు అనుట భగవత్ప్రాప్తి రూపమైన విశేషధర్మముగా సమంజసమే యని దశరథుఁడు అంగీకరించుచు కుమారునకు తనయందు సంకోచము కలుగుటకు అవకాశము లేకుండ చేయుచున్నాఁడు. దీనికి సమర్థకముగానే దేవతాస్తవరూపమైన రామునిపరబ్రహ్మత్వమును ఆయన ఉద్ఘాటించి లక్ష్మణుఁడు గావించినరామశరణాగతి పరమేశ్వరశరణా

శ్లో॥ రామం శుశ్రూషతా భక్త్యా వైదేహ్యా సహ సీతయా।
కృతా మమ మహాప్రీతిః ప్రాప్తం ధర్మఫలం చ తే॥ 26

శ్లో॥ ధర్మం ప్రాప్స్యసి ధర్మజ్ఞ యశ శ్చ విపులం భువి।
రామే ప్రసన్నే స్వర్గం చ మహిమానం త థోత్తమమ్॥ 27

శ్లో॥ ఏతే సేంద్రా స్త్రయో లోకా సిద్ధా శ్చ పరమర్షయః।
అభివాద్య మహాత్మాన మర్చన్తి పురుషోత్తమమ్॥ 29

శ్లో॥ ఏత త్త దుక్త మవ్యక్త మక్షరం బ్రహ్మసమ్మితమ్।
దేవానాం హృదయం సోమ్య గుహ్యం రామః పరంతపః॥30

యుద్ధ-సర్గ-119

దశరథుఁడు ప్రాంజలియై యున్న కోడలిని చూచి "పుత్రి" యని సంబోధించి మధురముగ మెల్లగా నిట్లనెను. "అమ్మాయీ! రాముఁ డిట్లు గావించినందులకు కోపింపకుము. ఇతఁడు నీ హితమును అభిలషించియే యీవిశుద్ధిని కలిగించినాఁడు. ఇతరవనితలకు దుష్కరమైన యీయగ్నిప్రవేశమువలన నీకీర్తి యితరపతివ్రతలకీర్తిని అతిక్రమించుచున్నది. నీకు భర్తృశుశ్రూషనుగూర్చి ఎవరును చెప్పనక్కఱ లేదు. కాని చెప్పుట నాకు ధర్మము. ఇతఁడే నీకు పరదైవతము."

ఇట్లు చెప్పి దశరథుఁడు విమానమున ఇంద్రలోకమునకు వెడలిపోయెను.

దశరథుఁడు ఇంద్రలోకమునుండి వచ్చె నని మహేశ్వరుఁడు రామునితో చెప్పెను. ("ఇంద్రలోకం గత శ్శ్రీమాన్ త్వయా పుత్రేణ తారితః"-శ్లో-8సర్గ-119-యుద్ధకాండ.) మరల ఆయన ఇంద్రలోకమునకే తిరిగిపోయినట్లు వాల్మీకి చెప్పెను. (ఇంద్రలోకం విమానేన యయౌ దశరథో జ్వలన్-శ్లో-37-సర్గ-

119-యుద్ధకాండ). అయోధ్యాకాండమునందు దేవర్షులు, "కైకేయి యొక్క ఋణమును తీర్చుకొనుటవలన దశరథుఁడు స్వర్గమును పొందెను" (అనృణత్వా చ్చ కైకేయ్యాః స్వర్గం దశరథో గతః— శ్లో-6-సర్గ-112-అయోధ్యాకాండ). దీనినిబట్టి దేవర్షులు పేర్కొనిన స్వర్గము, మహేశ్వరుఁడు చెప్పినయింద్రలోకము ఒకటియే యని గ్రహింపవలసియున్నది. స్వర్గమును కోరువాఁడు యజ్ఞమును చేయవలయును. (స్వర్గకామో యజేత) అనువాక్యము ననుసరించి సోమయాగాదులు చేయువా రందఱు ఇంద్రలోకమునకు పోవుదురా? వివిధయజ్ఞానుష్ఠానఫలములందు తారతమ్యము లేదా? పరలోకములకు చేర్చుమార్గములు రెండున్నవి. కేవలకర్మఠులగువారు ధూమమార్గమున ఊర్ధ్వలోకములకు పోవుదురు. యజ్ఞములు దానములు తపస్సులు చేయువారు, ఇక్కడ తమశరీరము అగ్నికి ఆహుతిచేయఁబడినంతనే ధూమదేవతయొద్దకు పోవుదురు. ఆదేవత వారిని రాత్రిదేవతయొద్దకు చేర్చును. ఆదేవత కృష్ణపక్షదేవతయొద్దకు చేర్చును. ఆకృష్ణపక్షదేవత దక్షిణాయనమాసదేవతలయొద్దకు చేర్చును; వారు పితృలోకమునకు తీసికొని పోవుదురు; పితృలోకదేవత వారిని చంద్రలోకమునకు చేర్చును; అచ్చట వారు సోమశరీరమును పొంది అక్కడనున్న దేవతలకు సేవచేయుచు వారివలన స్వర్గభోగములను పొందుచుందురు. ఈమార్గమున ఇంద్రలోకప్రసక్తి లేదు. పంచాగ్నివిద్యనుపాసించినగృహస్థులు, అరణ్యములం దుండి వానప్రస్థులై శ్రద్ధతో సత్యాఖ్యమైన బ్రహ్మము నుపాసించినవారు నైష్ఠికబ్రహ్మచారులు అర్చిరాదిమార్గమున బ్రహ్మలోకమునకు పోవుదురు. శరీరపతనానంతరము వీరు అర్చిస్సునుండి అహస్సునకు అహస్సునుండి శుక్లపక్షమునకు, శుక్లపక్షమునుండి ఉత్తరాయణమాసములకు, అటనుండి దేవలోకమునకు, అక్కడనుండి ఆది

త్యునియొద్దకు, ఆదిత్యునియొద్దనుండి చంద్రలోకము, అక్కడ నుండి విద్యుద్దేవతను చేరుదురు. అర్చిస్సు మొదలగువా రందఱును, ధూమాదులవలె, దేవతలే. ఈదేవతలు తమయొద్దకు చేరినపుణ్యాత్ములను ఆమార్గమున పైమజిలీకి తీసికొనిపోవు చుందురు. కావున వీరిని అతివాహికదేవత లందురు. అతివాహికు లనఁగా ఒకచోటినుండి మఱియొకచోటికి తీసికొనిపోవువా రని యర్థము.

బ్రహ్మదేవునిమనస్సుచే సృష్టింపఁబడినయొక పురుషుఁడు బ్రహ్మలోకమునుండి వచ్చి విద్యుద్దేవతయొద్దనుండి వీరిని బ్రహ్మలోకములకు చేర్చును. ఈమార్గమునందు కూడ దేవలోక ప్రసక్తియున్నది కాని, ఇంద్రలోకము పేర్కొనఁబడలేదు. కాని ధూమమార్గమునకు గమ్యమైనచంద్రలోకముకన్న ఈదేవలోకము భిన్న మనుట స్పష్టము. ఈమార్గములు రెండును బృహదార ణ్యకమున అష్టమాధ్యాయద్వితీయబ్రాహ్మణమున వివరింపఁబడి యున్నవి. మఱి దశరథుఁడు చేరినయింద్రలోకము ఏది? ఏ మార్గమునం దున్నది?

సర్వాధిష్ఠానమైనబ్రహ్మమునుగూర్చి వాచకవ్నియైనగార్గి యాజ్ఞవల్క్యుని ప్రశ్నించెను. ఈప్రసంగము బృహదారణ్యక పంచమాధ్యాయషష్ఠబ్రాహ్మణమునం దున్నది. ఆమెప్రశ్నలకు సమాధానములు చెప్పుచు యాజ్ఞవల్క్యుఁడు పృథివియందు పడుగుపేకలవలె వ్యాపించి పార్థివధాతుజాతమున కంతకును ఆధారములైయున్న యుదకములు వాయువునందు ప్రతిష్ఠిత ములై యున్న వని, ఆవాయువు అంతరిక్షలోకములందు, అంత రిక్షలోకములు గంధర్వలోకములందు, గంధర్వలోకములు ఆదిత్య లోకములయందు, ఆదిత్యలోకములు చంద్రలోకములయందు, చంద్రలోకములు నక్షత్రలోకములయందు, నక్షత్రలోకములు

దేవలోకములయందు, దేవలోకములు ఇంద్రలోకములయందు, ఇంద్రలోకములు నక్షత్రలోకములయందు, నక్షత్రలోకములు ప్రజాపతిలోకములయందు, ప్రజాపతిలోకములు బ్రహ్మలోకములందును ప్రతిష్ఠితములై యున్న వని చెప్పెను. కావున విద్యుల్లోకమునుండి అమానవుఁడైన పురుషుఁడు బ్రహ్మోపాసకులను నక్షత్రలోకమునకు, అటనుండి ఇంద్రలోకమునకు, అటనుండి ప్రజాపతిలోకమునకు, అటనుండి బ్రహ్మలోకమునకు తీసికొనిపోవును.

ఇందు ఆదిత్యలోకములకు ఆధారముగా పేర్కొనఁబడిన చంద్రలోకము మనకు కన్పించుచున్న చంద్రమండలము కాదని స్పష్టమగుచున్నది. అట్లే ఆదిత్యలోకప్రసంగమువలన ఇది ధూమాదిమార్గమునకు గమ్యమైనచంద్రలోకము కాదనియు గ్రహింపవలసియున్నది. అట్లే అర్చిరాదిమార్గమున ఆదిత్యలోకమునకు క్రిందిదిగా చెప్పఁబడిన దేవలోకము, నక్షత్రలోకములకు ఆధారములుగా పేర్కొనఁబడినదేవలోకములకన్న భిన్నము అని గ్రహింపఁదగియున్నది. యాజ్ఞవల్క్యుఁడు పేర్కొన్న పద్ధతియందు ఇంద్రలోకము ఆదిత్యచంద్రనక్షత్రదేవలోకములకు పైన ఉన్నది యని, అది అర్చిరాదిమార్గమున చేరఁదగిన దనియు స్పష్ట మగుచున్నది. కావున దశరథుఁడు చేరినస్వర్గము లేక ఇంద్రలోకము ఇదియే యని గ్రహింపవచ్చును.

మఱి దశరథుఁడు అశ్వమేధమును గావించెను. పుణ్యకర్మలలో అశ్వమేధమునకు మించినది కాని, పాపకృత్యములలో భ్రూణహత్యకు మించినది కాని లే దని చెప్పుదురు. బృహదారణ్యకపంచమాధ్యాయతృతీయబ్రాహ్మణమున అశ్వమేధయాగమును గావించినవారిని, ఇంద్రుఁడు, అనఁగాపరమేశ్వరుఁడు, సుపర్ణుఁడై బ్రహ్మాండకపాలములయొద్దకు తీసికొనిపోయి అక్కడ వాయువు

నకు అప్పగించు నని, ఆవాయువు వారిని ఆకపాలములమధ్య నుండు చిన్నరంధ్రమునుండి బ్రహ్మాండమునకు వెలుపలనున్న స్థానమునకు చేర్చు నని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. పైనఁ పేర్కొనఁబడినధూమమార్గము లేక దక్షిణమార్గము, అర్చిరాది మార్గము లేక ఉత్తరమార్గము, ఈరెండును బ్రహ్మాండము లోనివే. వీనినే శుక్లకృష్ణగతు లనియు పేర్కొందురు. వీనిని గూర్చి శ్రీశంకరభగవత్పాదులవారు ఇట్లు చెప్పిరి. "ఈవిశ్వము ఆరెండుమార్గములవలననే వర్తించుచున్నది. రెండును మాతా పితరులకు నడుమనే యున్నవి. ఆమాతాపితరు లెవరు? ద్యావా పృథివీరూపములైన యండకపాలములే ఆమాతాపితరులు. "ఇదియే మాత, అతఁడే తండ్రి యని" గదా బ్రాహ్మణముచేత వ్యాఖ్యా నింపఁబడినది; అండకపాలమధ్యమందున్న యీరెండుపథములు సంసారవిషయములే. ఇవి యాత్యంతికమైన యమృతత్వమునకు చేర్పవు."

శ్రీమచ్ఛంకరభగవద్పాదభాష్యమ్:—తాభ్యాం సృతిభ్యామ్, ఇదం విశ్వ సమస్తమ్, ఏజత్ గచ్ఛత్, సంగచ్ఛతే సమ్యగ్గచ్ఛతి। తే చ ద్వే సృతీ, యదన్తరా యయో రన్తరా యదన్తరా పితరం మాతరం చ, మాతాపిత్రో రన్తరా మధ్యే, ఇత్యర్థః। కౌ తౌ మాతా పితరౌ?। ద్యావాపృథివ్యండకపాలే। "ఇయం వై మాతా అసౌ పి" తేతి హి వ్యాఖ్యాతం బ్రాహ్మణేన। అండకపాలయో ర్మధ్యే సంసారవిషయే ఏవ ఏతే సృతీ, నాత్యన్తికామృతత్వగమనాయ।" —బృహదారణ్యకే, అష్టమాధ్యాయే, ద్వితీయబ్రాహ్మణే, ద్వితీయ మంత్రే—

పైప్రసంగమునుబట్టి అశ్వమేధయాగమును గావించిన వారు అర్చిరాదిమార్గమునకు కూడ గమ్యము గాక, దానికి పైన బ్రహ్మాండమునకు వెలుపలనున్నలోకమునకు చేరుదు రని స్పష్ట

మగుచున్నది. అట్టియెడల దశరథుఁడు ఆలోకమునకు చేరక ఇంద్రలోకమునందే ఏల నిలిచియుండెను? దశరథుఁడు కేవలము పుణ్యముకొఱకు అశ్వమేధమును చేయలేదు. ఆయన పుత్త్రులను పొందుటకొఱకు దానిని సాధనముగా ఉద్దేశించెను. "పుత్త్రుల కొఱకు విలపించుచున్ననాకు సుఖము లేకున్నది. అందులకై అశ్వమేధమును గావింపవలయు నను తలంపు కలిగినది" అని ఆయన వసిష్ఠాదులతో చెప్పెను.

శ్లో॥ మమ లాలప్యమానస్య సుతార్థం నాస్తి వై సుఖమ్।
తదర్థం హయమేధేన యక్ష్యామీతి మతి ర్మమ॥ 8
బాలకాండ - సర్గ - 8

ఈకారణముచేత ఆయన గావించినయశ్వమేధపుణ్యఫలము చాలవఱకు పుత్త్రోత్పత్తికి ప్రతిబంధకముగానున్నపాపమును తొలఁగించుటలో నుపయుక్త మయ్యెను. మిగిలినపుణ్యఫలమువలన ఆయన ఇంద్రలోకమునకు మాత్రము చేరఁగలిగె నని గ్రహింపవలసియున్నదీ. అట్లే ఒకానొకఁడు ఇంద్రత్వమును గోరి నూఱు అశ్వమేధములను గావించినచో, ఆయజ్ఞములఫల మంతయు వానికి ఇంద్రపదవిని కలిగించుటయందే వినియుక్త మగును. ఇతర మేమియును కోరక బ్రహ్మలోకమునందే శాశ్వతముగా నుండవలయు నను తలంపుతో అనేకాశ్వమేధములను గావించినచో, అందు కొన్ని పాపక్షయమునకు వినియుక్త మైనను మఱికొన్నింటి యొక్క ఫలము బ్రహ్మలోకనివాసమును కలిగింపఁగలదు.

ఈసందర్భమున శ్రీరాముఁడు ఏదృష్టితో అశ్వమేధములను గావించెనో చూడుఁడు. లక్ష్మణభరతులతో ఆయన ఇట్లనెను. "శ్రేష్ఠమైన ద్విజకార్యమును నిర్వహించితిని. ఇంక ధర్మసేతు

వును అధికముగా నొనర్పవలయు నని కోరుచున్నాను. ధర్మ సేతువు అక్షయము అవ్యయము నగు నని తలంచుచున్నాను. అది సర్వపాపప్రణాశనము ధర్మప్రసాధకమును అగును." రాజ సూయమునకు ధర్మసేతు వను ప్రసిద్ధి కలదు. సేతువనఁగా ఆనకట్ట. జలప్రవాహము విశృంఖలముగా గట్లు త్రెంచుకొని జనపదములపైఁబడి వినాశము కావింపకుండ, దానిని నిబంధించి కాలువలద్వారమున పంటలకు ఉపయోగపడునట్లు చేయునానకట్ట సేతువు. అట్లే ప్రజలయందలిబలోత్సాహశక్తులు స్వార్థప్రేరిత ములై పరస్పరసంఘర్షణములకు వినాశములకు సాధనములు కాకుండ, కామక్రోధమూలములై పతనమునకు త్రోవతీయకుండ, వానిని సన్మార్గమున నియమించి వారిసుఖశాంతులకు సాధనము లగునట్లు చేయునాచారనియమపాలనము ధర్మసేతువు. రాముఁడు ఈధర్మసేతువును దృఢముగా నిలుపుటకు సాధనముగా యజ్ఞము లను చేయఁబూనుకొనెను. ఆయన తనకు పాపవినాశమును గాని బ్రహ్మలోకాదిప్రాప్తిని కాని యజ్ఞానుష్ఠానమునకు ఫల మునుగా ఉద్దేశింపలేదు. ఆయన కేవలము లోకమున ధర్మరూప మైన సేతువు దృఢముగా నిలువవలయు ననియే నూఱు అశ్వ మేధములను గావించెను. అనఁగా ఆయన ఆయజ్ఞములఫలము నంతయు లోకమున ధర్మప్రతిష్ఠాపనముకొఱకే ధారపోసె నన్న మాట. కావుననే యుగయుగములుగా ఆయనపేరిట ధర్మసంస్థా పనకార్యము బహుముఖముల జరుగుచునే యున్నది.

శ్లో॥ కృతం మయా తథ్యం ద్విజకార్య మనుత్తమమ్।
ధర్మసేతు మథో భూయః కర్తు మిచ్ఛామి రాఘవౌ॥ 3

శ్లో॥ అక్షయ శ్చావ్యయ శ్చైవ ధర్మసేతు ర్మతో మమ।
ధర్మప్రసాధకం చైవ సర్వపాపప్రణాశనమ్॥ 4

ఉత్తరకాండ-సర్గ-93

ఈఘట్టము అనేకాంశవ్యంజకముగా నున్నది. "నీచే తారితుఁడై మీతండ్రి యింద్రలోకమును పొందెను" అని మహేశ్వరుఁడు రామునితో చెప్పెను. అట్లే దశరథుఁడు కూడ, "సుపుత్త్రుఁడవైన నీచేత నేను తరించితిని" అని రామునితో అనెను. దశరథుఁడు కావించినయజ్ఞయాగాదులఫలముగా ఆయనకు స్వర్గము లభించుచుండగా రాముఁడు ఆయనను తరింపఁజేయుట యేమి? యజ్ఞయాగాదులవలన స్వర్గఫలము సిద్ధమైయున్నను, దశరథుఁడు కైకేయికి ఇచ్చినమాటను జరుపలేకపోయినచో అసత్యభంగమువలన పాప మేర్పడి, అది స్వర్గఫలము లభింపకుండ అడ్డుపడును. అట్లు జరుగకుండ రాముఁడు, తండ్రి కైకేయి కొసంగినమాటను సత్య మొనర్చి ఆయనకు స్వర్గఫలము నిరాఘాటముగ లభించునట్లు చేసెను. అనఁగా సత్యవచనభంగమనుమహాప్రవాహమున దశరథుఁడు మునిఁగిపోకుండునట్లుగా రాముఁడు తెప్పవలె ఆయనమాటను నెరవేర్చి ఆయనను ఆప్రవాహమునుండి తరింపఁజేసి స్వర్గ మను నవ్వలియొడ్డునకు చేర్చెనన్నమాట.

దశరథుఁడు స్వర్గమునకు చేరి పదునాల్గుసంవత్సరములైనను ఆయనకు పుత్త్రవియోగదుఃఖము కాని కైకేయిపై కోపము కాని తగ్గలేదని ఆయనప్రసంగమున స్పష్టమగుచున్నది. మరణమునందు భౌతికమైన శరీరము మాత్రమే భగ్నమై పడిపోవును. కాని వ్యక్తియొక్క చిత్తవృత్తియందు మార్పు ఏమియు కలుగదని దీనివలన వ్యక్తమగుచున్నది. ఈలోకమునందు ఏర్పడిన రాగద్వేషములవలన స్వర్గమునందు కూడ ఆయన పొందఁదగిన సుఖమును పొందలేక పోవుచున్నాఁడు. చుట్టును దివ్యభోగము లున్నను ఇంద్రాదులు మన్నించుచున్నను ఆయనకు రాముని

యెడఁబాటు, కైకేయిపై కోపము మాటమాటికి పైకి వచ్చుచు సుఖము లేకుండ చేయుచున్న వని ఆయనమాటలవలననే స్పష్ట మగుచున్నది. పెద్దదుఃఖము మనస్సును పట్టియున్నప్పుడు సుఖ సాధనములు ఎన్ని సమకూడినను, ఆదుఃఖమును తొలఁగించి సుఖమును కలిగింప లేవని యీలోకమునందే దృష్టాంతముల వలన స్పష్టముగా గ్రహింపవచ్చును. భార్య తన్ను వంచించిన దన్నదుఃఖము కలిగినతరువాత, యుద్ధమున విజయమును సాధించి నను, అది అర్థురునకు సుఖమును కలిగింపలేకపోయెను. అట్లే చిత్తవృత్తియందు ఏమియు మార్పులేకపోవుటవలన దశరథునకు స్వర్గమునందు కూడ ఇక్కడ ఏర్పడిన రాగద్వేషములవలన సుఖము లేకుండ పోయినది. దీనివలన ఆయన ఎంతో కష్టపడి యజ్ఞయాగములు చేసి సంపాదించుకొన్న సుఖసాధనములవలన సుఖము కలుగుట లేదనుట స్పష్టము. లోకమున మానవులు సుఖముకొఱకే కదా మహాశ్రమసాధ్యములైన శాస్త్రీయములైన యజ్ఞయాగాదికార్యములకుఁ గాని, అశాస్త్రీయములు అపాయ భూయిష్ఠములునైన దొంగతనము వ్యభిచారములు మొదలగుకార్య ములకుఁ గాని పూనుకొనుచున్నారు! కాని రాగద్వేషభయాదులు అసుఖమును ప్రతిబంధించుచుండు ననుటయు ఎల్లవారియనుభవ ములో నున్నదే. కావున నిరాఘాటముగా సుఖమును పొంద వలయు నన్నచో రాగద్వేషభయాదులకు మనస్సునందు తావీయ రాదు. రాగద్వేషభయాదులకు మనస్సు దూరమై సంతోషమయ మగునట్లు చేసికొనుట ఈలోకమునందే సాధ్యము; స్వర్గాదిలోక ములలో సాధ్యము కాదు. ఇక్కడ సంపాదించిన పుణ్యము నను సరించి ఆలోకములలో సుఖసాధనములు ఏర్పడునే కాని, అవి రాగద్వేషాదులను తొలఁగింపలేవు. రాగద్వేషాదులు తొలఁగవలయు నన్నచో ఈలోకమునందే సజ్జనసాంగత్యమువలన, అంతకన్నను

సద్గురువుయొక్క సాన్నిధ్యమువలన శాస్త్రము ననుసరించి తత్త్వవిచారమును గావించుట ఆవశ్యకము. స్వర్గాదిలోకములలో ఇదిసాధ్యము కాదా? ఆత్మతత్త్వము ఈలోకమునందు స్పష్టముగా గోచరమైనట్లు ఆలోకములలో కాదు. ఈవిషయము కఠోపనిషత్తునందు యమధర్మరాజు నచికేతునకు ఇట్లుచెప్పెను. "ఈలోకమునందు జీవించియున్నప్పుడే, దేహపతనమునకు ముందే, ఎవఁడు బ్రహ్మమును తెలిసికొనునో వాఁడు సంసారబంధమునుండి విముక్తుఁడగును; అట్లు తెలిసికొనలేనివాఁడు ఆయాలోకములందు శరీరమును పొందుచుండును. ఆతత్త్వము బుద్ధియందు ఈలోకమున అద్దమునందు ప్రతిబింబమువలె, పితృలోకమున స్వప్నమునందువలె, గంధర్వలోకమున నీటియందువలె, బ్రహ్మలోకమున ఎండకు నీడకు భేదము ఎంత స్పష్టమో అంత స్పష్టముగను గోచరించును."

శ్రీశంకరభగవత్పాదులవారు దీని కిట్లు భాష్యమును రచించిరి, "దేనియొక్క భయమువలన అగ్నిసూర్యాదులు తమతమ కార్యములను నియతముగ నిర్వర్తించుచున్నారో? అట్టి భయకారణమైన బ్రహ్మమును, తాను బ్రతికియుండగనే, శరీరము పడిపోకముందే ఈలోకముననే ఎవఁడు తెలిసికొనుటకు సమర్థుఁ డగుచున్నాఁడో, వాఁడు సంసారబంధమునుండి విముక్తుఁడగుచున్నాఁడు. అట్లు తెలిసికొనఁజాలనివాఁడు ఆయజ్ఞానము వలన, పృథివ్యాదిలోకములందు శరీరమును పొందుచున్నాఁడు.

అద్దమునందు ముఖమువలె ఆత్మయొక్క దర్శనము ఈలోకమునందు గోచరించుటకు అవకాశముండుట వలన అట్టియవకాశము ఇతరలోకములలో లేకుండుటవలన బ్రహ్మలోకమునందు తప్ప ఇతరలోకములలో ఆత్మజ్ఞానము దుర్లభ మగుట

వలన, ఈలోకమునందే శరీరము పడిపోకముందె ఆత్మజ్ఞానము కొఱకు యత్నము చేయఁదగియున్నది. అది ఎట్లు దుర్లభమో చెప్పఁబడుచున్నది. అద్దమునందు ప్రతిబింబమువలె ఎవని కైనను, అద్దమువలె నిర్మల మొనరింపఁబడినతనబుద్ధియందు, స్పష్టముగా ఆత్మదర్శనము కలుగుచున్నది. జాగ్రద్వాసనలచేత ఉద్భూతమైన తనప్రతిబింబము స్వప్నమునందు ఎట్లు అస్పష్ట ముగా గోచరించుచున్నదో అట్లే పితృలోకమునందు, కర్మఫలోప భోగాసక్తివలన, ఆత్మ అస్పష్టముగా గోచరించును. నీటియందు ప్రతిబింబమున ఇది ముఖము ఇవికన్నులు అని యవయవవిభా గము ఎట్లు స్పష్టముగా కన్పింపదో, అట్లే గంధర్వలోకమున ఆత్మదర్శనము అస్పష్టముగా నుండును. ఇతరలోకములలో కూడ ఇట్లే యుండు నని శాస్త్రప్రామాణ్యమువలన తెలియు చున్నది. ఒక్క బ్రహ్మలోకమునందు మాత్రమే ఎండకు నీడకు భేదము ఎంత స్పష్టముగా నుండునో అంత స్పష్టముగా ఆత్మ దర్శనము కలుగును. ఆబ్రహ్మలోకము అత్యంతవిశిష్టకర్మజ్ఞాన సాధ్యమగుటచేత దుష్ప్రాపము. అందువలన ఆత్మదర్శనము కొఱకు ఇచ్చటనే యత్నము చేయవలయు ననుట ఇందలి యభి ప్రాయము."

మం॥ ఇహ చే దశక ద్బోద్ధుం ప్రాక్శరీరస్య విస్రసః।
తత స్సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే॥ 4

శ్రీశంకరభగవత్పాదభాష్యమ్;-త చ్చేహ జీవన్నేవ చేత్, య ద్యశకత్ శక్నోతి శక్త స్సన్ జానా త్యేత ద్భయకారణం బ్రహ్మ, బోద్ధు మవగన్తుం, ప్రాక్ పూర్వం, శరీరస్య విస్రసః అవస్రంసనాత్ పతనాత్, సంసారబంధనా ద్విముచ్యతే. న చేత్ అశక ద్బోద్ధుం, తతో అనవబోధాత్, సర్గేషు సృజ్యంతే యేషు

స్రష్టవ్యాః ప్రాణిన ఇతి సర్గాః పృథివ్యాదయో లోకాః తేషు స్వర్గేషు, శరీరత్వాయ శరీరభావాయ, కల్పతే స సమర్థో భవతి శరీరం గృహ్ణా తీత్యర్థః

మం॥ యథాదర్శే తథాత్మని యథా
స్వప్నే తథా పితృలోకే।
యథాప్సు పరీవ దదృశే తథా గంధర్వలోకే
ఛ్చాయాతపయో రివ బ్రహ్మలోకే॥ 5

శ్రీశంకరభగవత్పాదభాష్యమ్;-తస్మాత్ శరీరవిస్రంసనాత్ ప్రాక్ ఆత్మబోధాయ యత్నః ఆస్థేయః యస్మా దిహైవ ఆత్మనో దర్శన మాదర్శస్థ స్యేవ ముఖస్య స్పష్ట ముపపద్యతే, న లోకాంతరేషు. బ్రహ్మలోకా దన్యత్ర స చ దుష్ప్రాపః. కథ మితి ఉచ్యతే, యథా ఆదర్శే ప్రతిబింబభూత మాత్మానం పశ్యతి లోకః అత్యంతవివిక్తం, తథా ఇహ, ఆత్మని స్వబుద్ధే ఆదర్శవత్ నిర్మలీభూతాయాం, వివిక్త మాత్మనో దర్శనం భవతీ త్యర్థః. యథా స్వప్నే అవివిక్తం జాగ్రద్వాసనోద్భూతం, తథా పితృలోకే అవివిక్త మేవ ఆత్మనో దర్శనం, కర్మఫలోపభోగాసక్తత్వాత్. యథా వా అప్సు అవిభక్తావయవం ఆత్మరూపం, పరీవ దదృశే పరిదృశ్యత ఇవ. తథా గంధర్వలోకే అవివిక్త మేవ దర్శన మాత్మనః. ఏవం చ లోకాంతరే ష్వితి శాస్త్రప్రామాణ్యా దవ గమ్యతే. ఛాయాతపయో రివ అత్యంతవివిక్తం బ్రహ్మలోక ఎవ ఏకస్మిన్. స చ దుష్ప్రాపః అత్యంతవిశిష్ట కర్మజ్ఞానసాధ్యత్వాత్. తస్మాత్ ఆత్మదర్శనాయ ఇహైవ యత్నః కర్తవ్యః ఇత్యభి ప్రాయః.

కఠోపనిషది — షష్ఠవల్ల్యామ్.

ఆత్మదర్శనము ఈలోకమునందు బ్రహ్మలోకమునందును స్పష్టముగ కలుగునట్లు ఇతరలోకములలో సంభవింప దనఁగ నేమి?" నేను "అని యనుకొనుచున్న ప్రతిజీవుఁడు తనస్వరూప మును శరీరాత్మకముగానే గ్రహించుచున్నాఁడు. ఆయాలోకము లలో ఉన్న దేవపితృగంధర్వాదు లందఱును జీవులే, ఆయాలోక ములలో సంభవములైన శరీరములు వారి కుండును. వారు కూడ "నేను" అని యనుకొన్నప్పుడు ఆయాశరీరములతోనే తమ స్వరూపమును గ్రహించుచుందురు. కాని శరీరము వినాశము కలది, ఆత్మవినాశరహితము. పరిమితము వినాశియునైన శరీ రముకన్న భిన్నముగా తన్ను, అనఁగా ఆత్మస్వరూపమును. అపరి మితముగా అవినాశిగా సర్వవ్యాపకముగా గ్రహించుటయే ఆత్మ దర్శనము. ఈయాత్మదర్శనము కలుగనంతవఱకు ఎంతపుణ్య మును సంపాదించినను, ఏదే నొకలోకమున శరీరమును పొందక తప్పదు. శరీరమును పొందుటయే పుట్టుక. పుట్టినతరువాత కర్మఫలము క్షీణించినంతనే మరణింపక తప్పదు. ఒకలోక ములో మరణించినవాఁడు మఱియొకలోకములో పుట్టక తప్పదు. కావున దేవపితృగంధర్వాదు లందఱును శరీరధారులే. పుణ్య కార్యములు చేసి ఈలోకమునుండి పైలోకములకు పోవువారికి, "భూలోకములో ఒకశరీర మున్నది. అది పోయి యిప్పుడు దివ్య మైన శరీరము వచ్చినది, కావున నాస్వరూపము శరీరముకన్న విలక్షణ మైనది" అను తలంపు కలుగదా? దానివలన ఆత్మ జ్ఞానము కలుగదా? కలుగదు. బాల్యము పోయి యౌవనము గడచి వృద్ధత్వము వచ్చుచుండఁగా ఆయాదశలను చూచుచున్న వారి కందఱకు "నేను ఈశరీరముయొక్క దశలను చూచు చున్నాను, నాచేత చూడఁబడుచున్నయిల్లు, ఇల్లాలు, పిల్లలు మొదలైనదృశ్యములకు భిన్నముగా నే నెట్లు ఉన్నానో అట్లే

దృశ్యమైనశరీరముకన్న ద్రష్టనైన నేను విలక్షణముగా నున్నాను" అను జ్ఞానము కలుగుట లేదు. అట్లే వారికి శరీరములు మాఱుచున్నను, ఎప్పుడును ఏదే నొక శరీరముతోనే ఉండుట సంభవించుచుండుటవలన శరీరముకన్న విలక్షణమైన తమస్వరూపమును వారు కూడ గుర్తింపఁజాలరు. "నేను" అను తలంపు కలిగిన దన్నచో అది బుద్ధివలననే వ్యక్త మగును, బుద్ధి లేకుండ ఆలోచన యుండదు. శరీరేంద్రియములు లేకుండ బుద్ధి యుండదు. అందువలన "నేను" అని తన్నుగూర్చి ఆలోచింపమొదలుపెట్టినప్పుడు దేవతలు కూడ దేహేంద్రియబుద్ధ్యాత్మకముగనే తమస్వరూపమును గ్రహించుచుందురు. కావున వారికి కూడ శరీరేంద్రియములకు విలక్షణమైన యాత్మస్వరూపమును గూర్చి సందేహ ముండుట సహజము.

ఈవిషయము నచికేతునకు మృత్యువునకు జరిగినసంవాదారంభముననే స్పష్టము చేయఁబడినది. నచికేతుఁడు మృత్యుదేవునివలన మూఁడవవరమును ఇట్లు కోరెను. "మనుష్యుడు మరణించునప్పుడు తరువాత అతఁడు ఉండు నని కొందఱు' ఉండఁ డని కొందఱు అనుచున్నారు. నీచేత బోధింపఁబడి నేను ఈసంశయమును తీర్చుకొందును గాక! ఇది వరములలో మూఁడవది." అప్పుడు మృత్యుఁదేవుఁ డి ట్లనెను. "ఈవిషయమునందు పూర్వము దేవతలకు కూడ సంశయము కలిగినది. సూక్ష్మమైన యీధర్మము సులభముగా తెలిసికొనఁదగినది కాదు. ఈవరమును వదలిపెట్టుము. నన్ను బలవంతపెట్టకుము. నచికేతూ! మఱియొకవరమును కోరుకొమ్ము."

మం॥ యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే
అస్తీ త్యేకే నాయ మస్తీతి చైకే।
ఏత ద్విద్యా మనుశిష్ట స్త్వయాహం
వరాణా మేష వర స్తృతీయః॥ 20

మం॥ దేవై రత్రాపి విచికిత్సితం పురా న హి
సువిజ్ఞేయ మణు రేష ధర్మః।
అన్యం వరం నచికేతో వృణీష్వ మా
మోపరోత్సీ రతి మా సృజైనమ్॥ 21
కఠోపనిషది-ప్రథమవల్ల్యామ్

పైసందర్భమున కొన్నివిషయములు వ్యక్తమగుచున్నవి. ఈలోకమునందువలెనే ఆలోకములలో కూడ దేవపితృగంధర్వాదులలో కొందఱకు అప్పు డప్పుడు, "ఈశరీరమే నేనా లేక దీని కతీతముగ విలక్షణముగా నే నున్నానా? అను సంశయము కలుగు నని, అట్టి జిజ్ఞాస కలిగినవారు ఒకచోట చేరి చర్చించుకొందు రని తెలియుచున్నది. చర్చలవలన ఇది తెలియ దని, ఒకానొకఁడు బోధించినను తెలిసికొనుటకు సులభము కా దనియు వ్యక్త మగుచున్నది. నచికేతునకు మృత్యుదేవుఁడు వెంటనే సంశయమును తీర్పకుండుటచే, ఆత్మతత్త్వము నెఱింగినవారు, అడిగినవారి కందఱకు వెంటనే బోధింప రనియు గ్రహింపవలసియున్నది. ఒకానొకఁడు అనుగ్రహించి బోధించినను ఆత్మజ్ఞానము పితృలోకమునందు స్వప్నములో తనరూపమువలె, గంధర్వలోకమునందు నీటిలోని ప్రతిబింబమువలె అస్పష్టముగానే గోచరించును. ఎందువలన స్పష్టముగా గోచరింపదు? ఆకలిగొన్నవానికి ఆహారము తప్ప మఱియొక విషయ మెట్లు పట్టదో, అట్లే ఈలోకములో ఉపవాసాదివ్రతములతో బ్రహ్మచర్యాది

నియమములతో చిరకాలము ఇంద్రియములను కట్టివైచి పుణ్యమును సంపాదించుకొని ఆపుణ్యఫలమును అనుభవించుటకై ఆ లోకములకు వచ్చినవారికి దివ్యభోగానుభవమునందు గాఢమైన యాసక్తియుండుట సహజము. అంతగాఢమైన భోగాసక్తి యున్నప్పుడు ఇతరులు ప్రబోధించినను ఆత్మదర్శనము అస్పష్టముగా నుండుట కూడ సహజమే. బ్రహ్మలోకమునందు పరమేష్ఠి సన్నిధానముననే ఆత్మవిచారము జరుగును. అందువలన అక్కడ ఆత్మవిచారము చేయువారికి ఎండకు నీడకు భేదము ఎంత స్పష్టముగా నుండునో అంత స్పష్టముగా శరీరేంద్రియబుద్ధిసముదాయము నీడవలె, దానియందు తన చైతన్యప్రసారముచేత కర్తృత్వభోక్తృత్వములను స్ఫురింపఁజేయుచున్న స్వయంజ్యోతియైనయాత్మ ఎండవలె, గోచరించును. కాని బ్రహ్మలోకమునకు పోవుట సులభముకాదు. అశ్వమేధాదికముగా సకలక్రతువులను చేసినవారు కూడ అక్కడకు పోఁజాలరు. విశిష్టములైన బ్రహ్మోపాసనములను గావించినవారు మాత్రమే ఆలోకమునకు చేరఁగలరు. కావున ఆలోకము సామాన్యులకు పొందరానిది. కాని ఆ బ్రహ్మలోకమునందు ఆత్మదర్శనము ఎంత స్పష్టముగ సంభవించునో అంత స్పష్టముగ మనుష్యలోకమునందు కలుగుటకు అవకాశ మున్నది.

ఈయవకాశమును మృత్యుదేవుఁడే నచికేతునకు ఇట్లు వివరించెను. "ఈయాత్మ అనేకులచేత బహువిధములుగా భావింపఁబడుచున్నది. అందువలన ప్రాకృతుఁడైన నరునిచే బోధింపఁబడినచో ఈయాత్మను తెలిసికొనుట శక్యము కాదు. ఈయాత్మ అణుప్రమాణముకన్నను అణుతరము. అందువలన ఇది అనన్యప్రోక్తమైనప్పుడు దీనియందు వేఱొకగతి యుండదు."

"ప్రియతమా! ఈబుద్ధి తర్కముచేత అపనేయము కాదు. అన్యునిచేత చెప్పఁబడి నప్పుడే చక్కనిజ్ఞానమును కలిగించును."

శ్రీశంకరభగవత్పాదులవారు ఇట్లు భాష్యమును రచించిరి. "[ఆత్మనుగూర్చి చెప్పువాఁడు, ఆత్మజ్ఞానమును పొందువాఁడు, నిపుణుఁడైనయాచార్యునిచేత బోధింపఁబడి ఆత్మను తెలిసికొన్నవాఁడు, లోకమున ఆశ్చర్యపడఁదగినవారు.] ఎందువలన? దేనినిగూర్చి నీవు నన్ను అడుగుచున్నావో అయాత్మ. 'ఉన్నది, లేదు, కర్త, అకర్త, శుద్ధము, అశుద్ధము' అని యిట్లు అనేకవిధములుగా వాదించువారిచేత చింతింపఁబడుచున్నది. అకారణముచేత తక్కువవాఁడైన నరునిచేత, అనఁగా ప్రాకృతుఁడైన మనుష్యునిచేత బోధింపఁబడినచో ఈయాత్మ చక్కఁగా తెలిసికొనుటకు శక్యము కాదు. మఱి చక్కఁగా తెలిసికొనుట ఎట్లు శక్య మగును? అది చెప్పఁబడుచున్నది.

అనన్యుఁడైనవానిచేత, అనఁగా ఆత్మను తనకన్న అభిన్నముగా దర్శించుచున్నయాచార్యునిచేత, అనఁగా శాస్త్రముచేత ప్రతిపాదింపఁబడుచున్నబ్రహ్మస్వరూపుఁడైనవానిచేత, చెప్పఁబడిన యాత్మయందు, అనఁగా బోధింపఁబడినయాత్మజ్ఞానమునందు, నకలవిధములైనవికల్పములు తొలఁగిపోవుటవలన, ఉన్నది, లేదు అని మొదలగు చింతారూపమైన గతి యుండదు. మఱియొకవిధముగా కూడ చెప్పవచ్చును. తనస్వరూపము గానే ఒకానొకనికి ఆత్మ బోధింపఁబడినప్పుడు, అట్లు బోధింపఁబడిన వానికి ఇంక తెలిసికొనవలసినది యేమియు ఉండదు. కావున అన్యవిషయమును తెలిసికొనుట అనునది యుండదు; జ్ఞాననిష్ఠ యనఁగా ఆత్మైకత్వవిజ్ఞానమే కదా! అందువలన ఇంక తెలిసికోవలసినవిషయముయొక్క జ్ఞాన మనునది ఏదియు నుండదు; తన స్వరూపముగానే ఆత్మ బోధింపఁబడినప్పుడు అవిజ్ఞానమునకు ఫల

మైన మోక్షము ఏమాత్రము ఎడము లేకుండ వెంటనే కలుగును; కావున సంసారగతి యుండదు. ఇచ్చట ఇంకొకవిధముగా కూడ చెప్పవచ్చును. ఏబ్రహ్మము బోధింపఁబడుచున్నదో ఆబ్రహ్మ స్వరూపుఁడేయైన యాచార్యునిచేత బోధింపఁబడినచో ఎవని కైనను ఆత్మనుగూర్చి తెలియకపోవుట యనునది యుండదు; ఆత్మయే తనస్వరూప మనుజ్ఞానము ఆచార్యునకు ఎట్లున్నదో అట్లే వినుచున్న శిష్యునకు తప్పక కలుగును. ఇట్లు ఆగమ వంతుఁడైన యాచార్యునిచేత ఆత్మ తనస్వరూపముగానే బోధింపఁ బడినప్పుడు చక్కఁగా తెలిసికొనఁదగిన దగును.

అణుప్రమాణమైనది కూడ తర్కించి గ్రహించుటకు సాధ్యము కాదు. దానికన్నను అణుతరమైన యాత్మ తర్కమునకు సాధ్యమే కాదు. ఒకానొకఁడు కేవలమైన తనబుద్ధియొక్క యూహచేత ఆత్మ అణుపరిమాణ మని తర్కముచేత స్థాపించినచో, అంత కన్నను అది అణుతర మని మఱియొకఁడు, అణుతమ మని యింకొకఁడు ఊహించును. తర్కమునకు ఒకచోట నిలుపుఁదల యుండదు కదా!

ఈకారణముచేత అనన్యప్రోక్తమై ఆగమప్రతిపాద్యమై ఆత్మ విషయమున కలిగినయీమతి, తనబుద్ధియొక్క యూహాతిశయము చేత అపనేయము కాదు, అనఁగా ప్రాపణీయము కాదు; అపనేత వ్యము కూడ కాదు, అనఁగా తొలఁగించుకొనఁదగినదియు కాదు. ఆగమము నెఱుంగనితార్కికుఁడు స్వబుద్ధిపరికల్పితమైన దానిని దేనినో చెప్పును. కావుననే అన్యునిచేత, అనఁగ తార్కికునికన్న అన్యుఁడై ఆగమమును చక్కఁగా నెఱింగినయాచార్యునిచేత చెప్పఁ బడినదియై ఆగమప్రసూతమైనమతియే చక్కనిజ్ఞానమును కలి గించుటకు సమర్థ మగు నోయీ ప్రేష్ఠా ప్రియతముఁడా—"

మం॥ న నరే ణావరేణ ప్రోక్త ఏష
సువిజ్ఞేయో బహుధా చింత్యమానః।
అనన్యప్రోక్తే గతి రత్ర నాస్తి
అణీయాన్ హ్యతర్క్య మణుప్రమాణాత్॥ 8

మం॥ నైషా తర్కేణ మతి రాపనేయా
ప్రోక్తా న్యే నైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ। 9
కఠోపనిషది ద్వితీయవల్ల్యామ్

శ్రీశంకరభగవత్పాదభాష్యమ్:—కస్మాత్ న హి నరేణ మనుష్యే ణావరేణ ప్రోక్తః అవరేణ ప్రాకృతబుద్ధినా ఇత్యేతత్, ఉక్తః ఏష ఆత్మా, యం త్వం మాం పృచ్ఛసి. న హి సుష్ఠు సమ్య గ్విజ్ఞేయః విజ్ఞాతుం శక్యః, యస్మా ద్బహుధా అస్తి నాస్తి కర్తా అకర్తా శుద్ధో ఽశుద్ధ ఇత్యా ద్యనేకధా చింత్య మానో వాదిభిః. కథం పునః సువిజ్ఞేయః ఇత్యుచ్యతే.

అనన్యప్రోక్తే, అనన్యేన అపృథగ్దర్శినా ఆచార్యేణ ప్రతి పాద్యబ్రహ్మాత్మభూతేన, ప్రోక్తే ఉక్తే ఆత్మని, గతిః అనేకధా అస్తి నాస్తీత్యాదిలక్షణా చింతా గతిః, అస్మి న్నాత్మని, నాస్తి న విద్యతే, సర్వవికల్పగతిప్రత్యస్తమితత్వా దాత్మనః. అథవా, స్వాత్మభూతే అనన్యస్మి న్నాత్మని ప్రోక్తే అత్ర, గతిః అన్య స్యావగతిః, నాస్తి జ్ఞేయ స్యాన్యస్య అభావాత్; జ్ఞానస్య హ్యేషా నిష్ఠా య దాత్మైకత్వవిజ్ఞానమ్, అతోఽవగంతవ్యాభావా న్న గతి ర త్రావశిష్యతే; సంసారగతి ర్వా అత్ర నాస్తి, అనన్య ఆత్మని ప్రోక్తే, నాంతరీయకత్వాత్ తద్విజ్ఞానఫలస్య మోక్షస్య, అథవా, ప్రోచ్యమానబ్రహ్మభూతే నాచార్యేణ ప్రోక్తే ఆత్మని అగతిః అనవబోధః అపరిజ్ఞానమ్, అత్ర నాస్తి. భవత్యేవ అవ గతిః తద్విషయా శ్రోతుః తదనన్యోఽహ మితి ఆచార్యస్య ఇవ

ఇత్యర్థః. ఏవం సువిజ్ఞేయః ఆగమవ తాచార్యేణ అనన్యతయా ప్రోక్త ఇత్యర్థః.

అణీయాన్ అణుప్రమాణా దపి సమ్పద్యతే ఆత్మా అతర్క్యం; అణుప్రమాణో న తర్క్యః; స్వబుద్ధ్యభ్యూహేన కేవలేన తర్క్యమాణే అణుపరిమాణే కేనచిత్ స్థాపితే ఆత్మని, తతోఽణుతర మన్యోఽభ్యూహతి, తతో ఽ ప్యన్యో అణుతమ మితి; న హి తర్కస్య నిష్ఠా క్వచి ద్విద్యతే. 8

అతోఽనన్యప్రోక్తే ఆత్మ న్యుత్పన్నా యేయ మాగమప్రతిపాద్యాత్మని మతిః, నైషా తర్కేణ స్వబుద్ధ్యభ్యూహమాత్రేణ ఆపనేయా న ప్రాపణీయా ఇత్యర్థః, నాపనేతవ్యా వా న హాతవ్యా. తార్కికో హి అనాగమజ్ఞః స్వబుద్ధిపరికల్పితం యత్కించి దేవ కథయతి. అతఏవ చ యా ఇయ మాగమప్రసూతా మతిః, అన్యేనైవ ఆగమాభిజ్ఞేన ఆచార్యే ణైవ తార్కికా దన్యేన, ప్రోక్తా సతీ సుజ్ఞానాయ భవతి; హేప్రేష్ఠ ప్రియతమ! —" 9

దీనినిబట్టి బ్రహ్మలోకమునకు పో నక్కఱ లేకుండ ఈలోకమునందే ఆగమవంతుఁడైన యాచార్యునివలన ఆగమము ననుసరించి ఆత్మజ్ఞానమును పొంది ముక్తుఁడగుటకు అవకాశము కలదని స్పష్ట మగుచున్నది. ఆగమ మనఁగా వచ్చిన దని యర్థము. వచ్చినది యేది? ఆచార్యశిష్యపరంపరవలన బోధింపబడుచు వచ్చుచున్న శాస్త్రోపదేశమే అగమము. ఆగమవంతుఁడైనవాఁడే ఆచార్యుఁడు. ఆగమప్రమాణమును వదలి సొంతముగ ఊహించి ఆత్మనుగూర్చి చెప్పువాఁడు అచార్యుఁడు. కానేరఁడు ఆగమవంతుఁడైన యాచార్యునియొద్ద నియమపూర్వకముగా గ్రహింపఁబడినగ్రంథమే శాస్త్ర మగును. ఈవిషయమున ఉపనిషత్తులే

ప్రమాణమైన శాస్త్రము. వానిలోనిమంత్రవాక్యములయర్థమును విచారించి నిశ్చయించుచున్న బ్రహ్మసూత్రములు, వానికి సార సంగ్రహరూపమైన భగవద్గీత కూడ శాస్త్రములే యగుచున్నవి. వీనిని ఆచార్యునివలన సంప్రదాయము ననుసరించి గ్రహించి నప్పుడే ఇవి శాస్త్రము లగును. అట్లు కాక సొంతముగా చదువు కొన్నచో రఘువంశాదికావ్యములవలె కేవలగ్రంథము లగునే కాని శాస్త్రము కానేరవు.

స్వర్గమునకు పోయినప్పటికిని రాగద్వేషములవలన సుఖ మును పొందలేకపోయిన దశరథునివలె కాకుండ, ఎచ్చట నైనను సుఖమును పొందఁగోరువాఁడు రాగద్వేషములను నిర్మూలించు కొనక తప్పదు. అవి ఆత్మజ్ఞానముచేతనే నిర్మూలితము లగును. ఆత్మజ్ఞానము ఆచార్యునివలన ఆగమము ననుసరించి బోధింపఁ బడినప్పుడే కలుగును. ఈసందర్భమున బ్రహ్మ ప్రత్యక్షమై రాముని బ్రహ్మస్వరూపమును వర్ణించి చెప్పినను, వినుచున్న దశరథునకుఁ గాని ఇతరులకుఁ గాని బ్రహ్మజ్ఞానము కలుగ లే దనుట స్పష్టము. పుత్రుని కౌఁగిలించుకొనఁ గలుగుటవలననే తనకు దుఃఖము పోయి సుఖము కలిగిన దని దశరథుఁడు స్పష్ట ముగా చెప్పెను. ప్రియుఁడైన పుత్త్రుని ప్రార్థనముచేతనే ఆయన కైకేయియందు కోపమును వీడి ఆమెను క్షమించెను. కావున స్వర్గమునకు పోయినను, బ్రహ్మదేవుఁడే ప్రత్యక్ష మైనను రాగ ద్వేషములు పోవు, ఆత్మజ్ఞానము కలుగదు. ఎప్పటి కైనను సద్గురువు నాశ్రయించి శాస్త్రసంప్రదాయానుసారముగా ఆత్మవిచా రము గావించినప్పుడే అజ్ఞానము నశించి ఆత్మజ్ఞానము కలిగి రాగ ద్వేషములు పోయి నిర్మలమైన యానందము కలుగును.

## 8. మహేంద్రానుగ్రహము

దశరథుఁడు వెడలిపోయినతరువాత మహేంద్రుఁడు రాముని జూచి "రామభద్రా! మాదర్శనము అమోఘము; మే మందరము నీయెడల సంప్రీతులమై యున్నాము; కావున నీ యభిలాషమును చెప్పుము" అనెను. రాముఁడు ప్రహృష్టుఁడై యిట్లనెను. "దేవవల్లభా! నాకొఱకు పరాక్రమించి ప్రాణములను వీడిన ఋక్షవానరగోలాంగూలాదు లందఱును పునర్జీవితులై వ్రణరహితులై ఆరోగ్యవంతులై సకలావయవబలపౌరుషసంపన్ను లగుదురు గాక! వా రుండెడితావులలో ఏకాలమం దైనను ఫల మూలపుష్పములు విమలోదకములును సులభము లగును గాక! ఇట్లు వర మనుగ్రహింపుము". మహేంద్రుఁడు మందస్మితలలితాస్యుఁడై, "మానవేంద్రా! ఇది చాల గొప్పవరము; అయినను నే నెప్పుడును ఏవిషయమును రెండువిధములుగా చెప్ప లేదు. కావున నీవు కోరినట్లే జరుగును" అని పలికెను.

మహేంద్రుఁడు వరమిచ్చుటకు ముందే, దేవతలసాన్నిధ్య ప్రభావమున కాఁబోలు సవ్రణులుగా నున్నవా రందఱు నిర్వ్రణులై యుండిరి. దేవేంద్రుఁడు వర మిచ్చినంతనే మరణించిన వా రందఱు నిద్రనుండి మేల్కొనినట్లుగా శరీరసౌష్ఠవముతో ఉత్సాహసంపన్నులై, "ఇది యే" మనుచు లేచి దేవతలను చూచి విస్మితు లైరి. సేనలయందు ఆశ్చర్యానందకోలాహలము మిన్ను ముట్టెను.

ఇంద్రుఁడు రాముని జూచి, "ఇంక సైన్యవిసర్జనముఁ గావించి అయోధ్యకు పోయి భరతశత్రుఘ్నులను తల్లులను ఓదార్చి పట్టాభిషిక్తుఁడవై పౌరులకు హర్షమును కలిగింపు"

మని బయలుదేరెను. రాముఁడు వానికి నమస్కరించి వీడ్కొలిపి ఆరాత్రికి అక్కడనే సేనాసమేతుఁడై విశ్రమించెను.

యుద్ధములందు యోధులు మరణించుట సహజము. మహేంద్రుఁ డన్నట్లు సంగ్రామహతులైనవా రందఱు మరల బ్రతుకుట మానవచరిత్రయందే అపూర్వము. రాముఁడు, "మమ్ము వెంటనే అయోధ్యకు చేర్పుము; మా యయోధ్యారాజ్యము ధన ధాన్యసమృద్ధ మగునట్లు చేయుము" మొదలుగా తనకు సంబంధించినది ఏదియు కోరక తనకొఱకు మరణించినవారు సజీవులగునట్లు కోరుట యసూహ్యము. ఆయన చెప్పువఱకును అట్లు ప్రార్థింపవచ్చు నని ఎవరికిని, స్ఫురించియుండదు. ఎవని కైనను ఒకానొకనికిఁ స్ఫురించినను; "ఇది సాధ్యమా! మహేంద్రుఁ డిది పేరాశ యని నిరాకరించు నేమో" అను సందేహము కలుగుట సహజము. రాముఁ డట్లు సందేహింప లేదు. "జగత్సృష్టి సంహారనిర్వాహకులైన బ్రహ్మదేవుఁడు మహేశ్వరుఁడు సంప్రీతులై యుండఁగా అసాధ్య మేమియు నుండదు" అని తలంచి ఆయన అపూర్వమైన యావరమును అడిగెను. ఇది యాయన యొక్క మహోదారతకు మహనీయమైన నిదర్శనము.

గద్యము

ఆపస్తంబసూత్ర కౌండిన్యసగోత్ర
పోలూరి వేంకటనరసాంబానారాయణామాత్యపుత్ర
హనుమజ్జానకీరామశర్మ ప్రణీతంబైన
శ్రీరామాయణతరంగిణియందు
త్రయోవింశంబైనజానకీతీర్థము
సమాప్తము

# 24. పట్టాభిషేకతీర్థము

## 1. అయోధ్యాప్రస్థానము

తెల్లవాఱినంతనే విభీషణుఁడు చందనాగురుసుగంధాదిద్రవ్య పాత్రహస్తలైన వనితలతో రామునియొద్దకు వచ్చి జయము పలికి, "రామభద్రా! నీకు మంగళ స్నానములు కావింప వరాంగనలు వచ్చియున్నారు; అవధరింపు" మని నివేదించెను. రాముఁ డి ట్లనెను. "మిత్రమా! సుగ్రీవాదులకు మంగళస్నానముల నేర్పాటు చేయుము. నాకొఱకు భరతుఁ డయోధ్యలో పరితపించుచున్నాఁడు. వానితోఁ గాక నాకు మంగళస్నానవస్త్రాభరణాదులు ఇంపు గావు. ఇంక ఇటనుండి మేము అయోధ్యకు వెంటనే చేరువిధాన మును చూడుము. ఈమార్గము చాలదూరము దుర్గమము కదా!"

విభీషణుఁడు ఇట్లు ప్రార్థించెను. "రామచంద్రా! నీవు ప్రయాణమునుగూర్చి చింతింప నక్కఱ లేదు. కుబేరునివాహన మైన పుష్పకవిమాన మున్నది. ఆలస్యము లేకుండ నీవు దానిపై అల్పకాలముననే అయోధ్యకుఁ జేరఁగలవు. కాని నాయందు నీకు అనుగ్రహ మున్నచో స్నేహ మున్నచో సీతాలక్ష్మణసమేతుఁడవై నాయర్చనమును ఆతిథ్యమును గై కొనుము. నిన్ను మిత్రసహిత ముగా సేనాసమేతముగా సత్కరింపఁగోరుచున్నాను. నాప్రణయ మును మన్నింపుము; ఈదాసు ననుగ్రహింపుము."

ఋక్షవానరులు రాక్షసులును వినుచుండఁగా రాముఁడు విభీషణుని అనునయించుచు ఇట్లనెను. "మిత్రమా! స్నేహము చేత సాచివ్యముచేత వీరకృత్యములచేత నీవు నన్ను చక్కఁగా

పూజించితివి. నీవచనమును అంగీకరింపవలయు ననియే నాకును ఆతురత కలుగుచున్నది. కాని నన్ను మరలించుటకై భరతుఁడు చిత్రకూటమునకు వచ్చి పాదములపై తనశీర్షము నుంచి ఎన్నియో విధముల ప్రార్థించినాఁడు. నేను వానిప్రార్థనమును గావింప నైతిని. వాఁడు నారాకకై ఎంతో పరితపించుచుండును. నాకు కూడ వానిని కౌసల్యాదులను గుహుని చూడవలయు నని మనస్సు తొందరపెట్టుచున్నది. నీవు గావించిన సాయముచేత నీవు నన్ను పూజించినట్లే. నాకు వెంటనే ప్రయాణమునకు అనుమతి నొసంగుము; మనస్సున కష్టము నొందకుము. నిన్ను బ్రతిమాలుచున్నాను. విమానము తెప్పింపుము."

ఇది కూడ రామునకు సమస్యయే. తనకు ఎంతో సాయ మొనరించిన విభీషణునియభ్యర్థనమును ఆయన నిరాకరించుట సులభము కాదు. తనకు రాజ్యము నొసంగినరామునకు తాను ఏమియు సత్కారము కావింప లేకపోయినందులకు విభీషణుఁడు తప్పక మనస్సులో కష్టము నొందును. విభీషణుఁడు చెప్పినట్లు ఆతిథ్యము నొందుటకు ఒక్కపూట గడచినచో కలుగునాలస్యము ఏమియు నుండదు. పుష్పకము మనోవేగమున రాముని అయోధ్యకు చేర్పఁగలదు. కావున ఆలస్య మొక సమస్య కాదు. తన రాకకై తమ్ముఁడు తపించుచుండఁగా వానికన్న ముందుగా మంగళస్నానాదులను స్వీకరించుటకు రాముఁడు అంగీకరింప లేకపోయెను. అది నృశంస మని ఆయనయభిప్రాయము. ప్రత్యుపకారపురస్కృతమైన విభీషణునియభ్యర్థనముకన్న కేవలము పరమప్రేమపురస్కృతమైన భరతునిభక్తియే మన్నింపఁదగిన దని రాముఁడు, మిత్త్రునకు కష్టము కలుగుచున్నను లెక్కపెట్టక, వెంటనే ప్రయాణముఁ గావింప నిశ్చయించెను.

విభీషణుని ప్రార్థనమును మన్నింపక వెంటనే బయలు దేరిన రాముఁడు భరద్వాజాశ్రమమున విడిదిచేయుట ఎట్లు సమంజస మగును? భరద్వాజాశ్రమమున ఆరణ్యకమైన యాతిథ్యమే జరిగినది. అందువలన జటావల్కలవిసర్జనము మంగళస్నాన వస్త్రాభరణధారణాదిప్రసక్తి లేదు. ప్రతిదినము చేయుచున్న భోజనము మాత్రమే ఆయన అక్కడ స్వీకరించెను. అదియును గాక సేనాసమేతుఁడై ముందుగా తెలియఁ జేయకుండ, నేరుగా అయోధ్యకు పోయినచో, అక్కడ తమ్ము స్వీకరించుటకు తగిన సన్నాహము లేక భరతాదులు ఇబ్బందిపడవలసివచ్చును. అందువలన రాముఁడు భరద్వాజాశ్రమమున నిలిచి, హనుమంతుని ద్వారమున తమరాకను భరతునకు తెలిపి తరువాత అయోధ్యకు చేరెను.

రాముఁడు తననిశ్చయమును తెలిపినతరువాత విభీషణుఁడు వెంటనే పతాకాధ్వజాదిసమలంకృతమై హర్మ్యశోభితమై మధురస్వరమైన పుష్పకవిమానమును తీసికొనివచ్చి "మహారాజా! ఇదిగో విమానము; ఇంకేమి చేయు మందువు?" అని యడిగెను.

రాముఁడు విమానమును చూచి సంతుష్టుఁడై విభీషణునితో ఇట్లనెను. "మిత్రమా! ఈవనౌకసు లందఱుమ నాకొఱకు ప్రాణములను లెక్కింపక పోరాడిరి. వీరి నందఱను ధనరత్నాదికముతో యథార్హముగా సంభావింపుము. కృతజ్ఞుఁడవైన నీచేత సమ్మానితులై ఈసేనాపతు లందఱును సంతోషింతురు. త్యాగివి అర్థసంగ్రహపరుఁడవు దయాశాలివి జితేంద్రియుఁడవును అయిన నిన్ను ఎల్లరును సేవింతురు. కావున నీకు చెప్పుచున్నాను. రమింపఁజేయఁగల యౌదార్యాదిగుణములు లేనివానిని, హింసా

విహారియైనవానిని యుద్ధరంగమునందు సైన్యము పరిత్యజించును."

శ్లో॥ ఏవం సమ్మానితా శ్చైతే నంద్యమానా యథా త్వయా।
భవిష్యన్తి కృతజ్ఞేన నిర్వృతా హరియూథపాః॥ 7

శ్లో॥ త్యాగినం సంగృహీతారం సానుక్రోశం జితేంద్రియమ్।
సర్వే త్వా మభిగచ్ఛన్తి తత స్సంబోధయామ్యహమ్॥ 8

శ్లో॥ హీనం రతిగుణై స్సర్వై రభిహన్తార మాహవే।
సేనా త్యజతి సంవిగ్నా నృపతిం తం నరేశ్వర॥ 9

యుద్ధ-సర్గ-122

విభీషణుఁడు వెంటనే ధనరత్నాదికమును తెప్పించి సుగ్రీవాదుల నందఱను యథార్హముగా సంభావించెను. రాముఁడా సమ్మానమును చూచి సంతుష్టుఁడై సీతాలక్ష్మణులతో పుష్పకము నధిరోహించి అందఱను కలయఁజూచి "మీ రందఱును మిత్రకార్యమును చక్కఁగా నిర్వహించితిరి. మీరింక యథేష్టముగా మీనివాసములకు పొండు; అయోధ్యకు పోవుటకు నన్ను అనుమతింపుఁడు" అనెను.

వానరులు రాక్షసులు ప్రాంజలులై, "రామచంద్రా! మేము కూడ అయోధ్యకు వత్తుము. మమ్ము కూడ తీసికొని పొమ్ము. అచ్చట వనోపవనములలో విహరించుచు నీయభిషేకమును చూచి కౌసల్యకు అభివాదనము గావించి త్వరలోనే తిరిగివత్తుము." అని పలికిరి. రాముఁడు సంతోషము నొంది "మీ యందఱతో అయోధ్యకు పోవుటకన్న నాకు ప్రియమే మున్నది. సుగ్రీవ! వానరులతో నీవు, విభీషణ! అమాత్యులతో నీవును వేగముగా పుష్పకము నెక్కుఁడు" అని పలికెను. వెంటనే అందఱు మహా

త్సాహముతో దానిపై కెక్కిరి. దివ్యము కామరూపమును అగుటచే ఎంతమంది ఋక్షవానరు లెక్కినను అది విశాల మగుచునే యుండెను. అందువలన అందఱును అందు సమ్మర్దము లేకుండ సుఖముగా కూర్చుండిరి. పిదప రాముని యానతిపై ఆవిమానము హంసకలస్వనముతో పైకి లేచి ఆకాశమున బయలుదేరెను.

## 2. పుష్పకప్రయాణము

రాముని యభిప్రాయము ననుసరించి పుష్పకము నెమ్మదిగా ముందుకు పోవుచుండెను. రాముఁడు సీతకు ఆయాప్రదేశవిశేషములను చూపుచు ఇట్లు చెప్పఁజొచ్చెను. "జానకీ! కైలాసశిఖరమువంటి త్రికూటశిఖరమున లంక ఎట్లు నిర్మింపఁబడి యున్నదో చూడుము. ఇదే రక్షోవానరులయుద్ధభూమి! ఇక్కడ రావణుఁడు నిహతుఁ డైనాఁడు. ఇక్కడ వేయిమంది సవతులతో మండోదరి భర్తపై వ్రాలి విలపించినది. ఇచ్చట కుంభకర్ణుఁడు. అచ్చట ప్రహస్తుఁడు, అదిగో అక్కడ ఇంద్రజిత్తు నిహతు లైరి. ఇదిగో ఈ రేవును చూడుము. ఇటనుండియే మేము సాగరమును దాఁటి మొదటిరాత్రి గడపితిమి. ఇదే నీకొఱకు నేను కట్టించిన నల సేతువు. అపారమైన యీసముద్రము ఎట్లు గర్జించుచున్నదో చూడుము. ఇదే హనుమంతునకు విశ్రాంతిని కలిగింపవలెనని పైకి వచ్చిన మైనాకశైలము. ఇదియే సేతుబంధనమును ఆరంభించినతీర్థము. ఇది పవిత్రము, మహాపాతకనాశనము. ఇచ్చటనే పూర్వము మహాదేవుఁడు ప్రసన్నుఁ డైనాఁడు. ఇక్కడ విభీషణుఁడు వచ్చి నన్ను కలిసికొనినాఁడు. ఇదిగో చిత్రకాననశోభితమైన కిష్కింధ. ఇక్కడ వాలి నిహతుఁ డైనాఁడు."

శ్లో॥ ఏత త్తు దృశ్యతే తీర్థం సాగరస్య మహాత్మనః।
సేతు బంధ ఇతి ఖ్యాతం త్రైలోక్యే నాభిపూజితమ్॥
ఏత త్పవిత్రం పరమం మహాపాతకనాశనమ్॥ 19

శ్లో॥ అత్ర పూర్వం మహాదేవః ప్రసాద మకరో త్ప్రభుః। 21

యుద్ధ-సర్గ-123

"అత్ర పూర్వం మహాదేవః" అని మొదలగుచున్నశ్లోకము సేతుబంధతీర్థమునకు సంబంధించి యున్నదని, దీనిచేత రాముఁడు సేతుబంధారంభసమయమున ఆతీర్థమునందు మహేశ్వరప్రతిష్ఠ కావించె నని తిలకటీకారుఁ డభిప్రాయపడెను. కాని ఈయభిప్రాయమును గోవిందరాజస్వామి యిట్లు నిరాకరించెను - ఇక్కడ ఔచిత్యము ననుసరించి మహాదేవుఁ డనఁగా సముద్రుఁ డనియే గ్రహింపవలయును. అయన యనుగ్రహమున సేతుబంధము సులభ మయ్యెను. అట్లుగాక మహాదేవశబ్దము ఈశ్వరునియందు రూఢమై యున్న దని, కూర్మపురాణమునందు పద్మపురాణమునందును కన్పించుచున్నవచనములను బట్టి రాముఁడు సేతుబంధతీర్థమునందు శివలింగప్రతిష్ఠఁ గావించె నని కొందఱందురు. కాని ఈవాదము నిరాకరము. రాముఁడు సీతతో పూర్వము జరిగినవిషయములనే చెప్పుచున్నాఁడు. పూర్వము జరిగినట్లుగా వాల్మీకి వర్ణించిన సేతుబంధసన్నాహసందర్భమునందు శివలింగప్రతిష్ఠను రాముఁడు చేసె నని చెప్ప లేదు. రాముఁడు శివలింగ ప్రతిష్ఠను చేసియున్నచో అంతముఖ్యమైన విషయమును ఆ సందర్భమున వర్ణింపక, వాల్మీకి యిప్పుడు రామునిమాటలలో సూచనమాత్రముగ, "మహాదేవుఁ డను గ్రహించె" నని చెప్పుట సంభావ్యము కాదు. కావున మహాదేవుఁ డనఁగా సందర్భము ననుసరించి సముద్రుఁ డని గ్రహించుటయే యుక్తము. ఈసర్గ

యందు శ్లోకములు వ్యత్యాసముగా కన్పించుచున్న వని ఉదారి ప్రభృతులు చెప్పిరి. ఆపక్షమున ఈశ్లోకార్థము "అత్ర మందోదరీ నామ" అని మొదలగు శ్లోకమున కనంతరము పఠింపఁదగి యున్నది. అచ్చట మహాదేవప్రసాద మనగా మహేశ్వరుఁడు రామునకు దశరథుని చూపించుటయే. కావుననే రాముఁడు భరతుని యొద్దకు హనుమంతుని పంపుసందర్భమున" మహాదేవప్రసాదమున నాకు తండ్రితో కలిగిన సమాగమము" అని చెప్పఁబోవుచున్నాఁడు. — ఇది గోవిందరాజస్వామియభిప్రాయము. ఇదియే సమంజసము. రాముఁడు సేతుబంధతీర్థమునందు మహేశ్వర ప్రతిష్ఠను చేసియున్నచో అక్కడ విమానమును ఆపి మహేశ్వరుని పూజించి మరల బయలుదేరియుండును; ఇట్లు ఆకసమున ఆ ప్రతిష్ఠను దాఁటి పోయియుండఁడు.

కిష్కింధ కన్పించినంతనే సీత రాముని చూచి "సుగ్రీవాదులభార్యలను కూడ తీసికొని అయోధ్యకు పోవుదము" అనెను. రాముఁడు విమానమును నిలిపి సుగ్రీవుని చూచి, "వానరపుంగవులభార్యలను సీతకు తోడుగా తీసికొని పోవుదము; వానరముఖ్యులను త్వరపెట్టు" మనెను. సుగ్రీవుఁడు అనుచరులతో కిష్కింధలోనికి పోయి తారతో ఈవార్త చెప్పెను. తార వానర స్త్రీలను తొందరపెట్టెను. వా రందఱు సీతాదర్శనకాంక్షిణులై అలంకృతలై వడివడిగా బయలుదేరి వచ్చి విమానమునకు నమస్కరించి ఎక్కిరి. మరల విమానము బయలుదేరెను.

రాముఁడు సీతకు మరల ప్రదేశవిశేషములను చూపుచు ఇట్లు చెప్పఁ జొచ్చెను. "ఇదిగో ఋష్యమూకమును చూడుము. ఇచ్చటనే సుగ్రీవుని కలిసికొంటిని. ఇదియే పంప. ఇచ్చట నేను

నిన్ను స్మరించి విలపించితిని. దీనితీరముననే శబరిని చూచితిని. ఇక్కడ యోజనబాహువైన కబంధుఁడు నిహతుఁడయ్యెను. ఇదియే జటాయువునివాసమైన వనస్పతి. ఇక్కడ ఆపక్షివల్లభుఁడు నీకొఱకు విక్రమించి రావణునిచే నిహతుఁ డయ్యెను. ఇదిగో మనపర్ణశాల. ఇదే గోదావరి. అదిగో అచ్చట కదళీవృతమై అగస్త్యాశ్రమము కన్పించుచున్నది. అల్లదే శరభంగాశ్రమము. ఇది విరాధునిసంహరించినప్రదేశము. అదిగో అత్రియాశ్రమము. అచ్చటనే నీవు అనసూయను దర్శించితివి. భరతుఁడు మనకొఱకై వచ్చిన చిత్రకూట మిదియే. అదిగో యమున. దాని కవ్వల భరద్వాజాశ్రమము కన్పించుచున్నది చూడుము. గంగ కూడ కన్పించుచునే యున్నది. అదియే గుహుని శృంగిబేరపురము. అదిగో మన యయోధ్య. మరల వచ్చితివి కదా నమస్కరింపుము."

రాముఁ డిట్లు చెప్పుచుండఁగా ఋక్షవానరు లందఱును పైకి లేచి కుతూహలముతో అయోధ్యను చూడఁజొచ్చిరి; భరద్వాజాశ్రమసమీపమున రాముఁడు విమానమును నిలిపెను. అందఱును విమానమునుండి దిగి ఆశ్రమమును సమీపించిరి.

## 3. భరద్వాజదర్శనము

పదునాల్గువర్షములు నిండుచున్నదినమున చైత్రశుద్ధపంచమియందు రాముఁడు భరద్వాజాశ్రమమునకు చేరి యామహర్షికి నమస్కరించి, "మునీంద్రా! మారాజ్యమున యోగక్షేమములు తెలియుచున్నవా? అయోధ్యలో అందఱు కుశలముగ నున్నారా?" అని యడిగెను. అయోధ్యలో అందఱు కుశలముగనే ఉన్నా రని చెప్పి మహర్షి యిట్లనెను. "రామభద్రా! బ్రాహ్మణరక్షణమునకై

నీవు గావించిన రాక్షససంహారము, నీకు కలిగిన సుఖదుఃఖాది విశేషము లన్నియు నాకు తెలియుచునే యున్నవి. నీధర్మరక్షణ దీక్ష ప్రశంసనీయము. ఇచ్చట ఈదినము ఆతిథ్యము స్వీకరించి రేపు అయోధ్యకు పొమ్ము."

రాముఁడు మహర్షి మాటను తలవంచి యంగీకరించి, "అయోధ్యకు పోవుమార్గమున వృక్షము లన్నియు రసపూర్ణములైనఫలములతో నిండియుండునట్లు అనుగ్రహింపు"మని వరమును ప్రార్థించెను. మహర్షి అట్లే అగు ననెను. వెంటనే అక్కడనుండి మూఁడు యోజనములవఱకు లత లన్నియు పుష్పించెను; వృక్షము లన్నియు రసపూర్ణ ఫలభరితము లయ్యెను.

శ్లో॥ పూర్ణే చతుర్దశే వర్షే పంచమ్యాం లక్ష్మణాగ్రజః।
భరద్వాజాశ్రమం ప్రాప్య వవందే నియతో మునిమ్॥ 1

యుద్ధ-సర్గ-124

పదునాల్గవవత్సరము పూర్ణము కాఁగా పంచమియందు రాముఁడు భరద్వాజాశ్రమమునకు చేరి మునికి నమస్కరించె నని చెప్పుటవలన, పదునాల్గుసంవత్సరములక్రిందట చైత్ర శుద్ధ పంచమియందు రాముఁడు అయోధ్యనుండి బయలుదేరె నని యిప్పుడు చైత్రశుద్ధ చతుర్థితో పదునాల్గవవత్సరము పూర్తి యయ్యె నని స్పష్ట మగుచున్నది. ఇచ్చట గోవిందరాజస్వామి వనవాస సంఘటనకాలనిరూపణము నిట్లు చేసెను — చైత్రశుద్ధపంచమియందు రాముఁడు అయోధ్యనుండి బయలుదేరెను. ఆదినము రాత్రి తమసాతీరమునందు నివసించెను, షష్ఠియందు శృంగిబేరపురమున, సప్తమియందు వనస్పతిమూలమునందు, అష్టమియందు భరద్వాజాశ్రమమునందు, నవమియందు యమునాతీర

మున రామాదులుండిరి. రాముఁడు చిత్రకూటమునకు చేరె నని గుహునిచారులవలన తెలిసికొని సుమంత్రుఁడు దశమిసాయంకాలమునకు అయోధ్యకు చేరెను. అరాత్రియందే దశరథుఁడు నిర్యాణము చెందెను. ఏకాదశియందు రాజును తైలద్రోణియం దుంచిరి. ద్వాదశియందు భరతునియొద్దకు దూతలు బయలుదేరిరి. వారు పూర్ణిమారాత్రియందు కేకయనగరమునందు ప్రవేశించిరి. చైత్రబహుళప్రతిపత్తునందు భరతుఁ డయోధ్యకు బయలుదేరి నవమి సూర్యోదయమున అయోధ్యయందు ప్రవేశించెను. నవమియందే దశరథునకు దహనసంస్కారము జరిగెను. అదినము మొదలుకొని పదమూఁడవదినమున వైశాఖశుద్ధపంచమియందు, తత్పూర్వదినమున కూడ భరతుఁడు రాజునకు శ్రాద్ధ మొనరించెను. షష్ఠియందు, ఆదేశముయొక్క ఆచారము ననుసరించి దశరథుని దహించినప్రదేశమును శుద్ధియొనర్చిరి. సప్తమినుండి దశమి వఱకు నాలుదినములు కర్మాంతికులు మార్గమును శుద్ధియొనర్చిరి. ఏకాదశియందు భరతుఁడు బయలుదేరి అరాత్రి గంగాతీరమున నుండెను. అతఁడు ద్వాదశియందు భరద్వాజాశ్రమమున నుండి త్రయోదశియందు రాముని చేరెను. చతుర్దశీపూర్ణిమాప్రతిపత్తులయందు భరతుఁడు చిత్రకూటమునం దుండెను. వైశాఖబహుళద్వితీయయందు అతఁడు చిత్రకూటమునుండి బయలుదేరి చతుర్థియందు అయోధ్యకు చేరెను.

ఇట్లు ఒకటిన్నరనెల గడచినతరువాత వైశాఖబహుళపంచమియందు రాముఁడు చిత్రకూటమునుండి బయలుదేరి అత్రియాశ్రమమునకు పోయెను. అచ్చటనుండి ఆశ్రమమండలములలో పర్యటించుచు రాముఁడు పంచవటికి చేరునప్పటికి వనవాసకాలమున పదిసంవత్సరములకు పైన ఒకయర్ధమాసము గడ

చెను. పంచవటియందుండఁగా పదునొకండవ పండ్రెండవ పదమూఁడవవత్సరములు గడచెను. పదునాల్గవసంవత్సరమున చైత్రమాసమునందు సీతాపహరణము జరిగెను. వైశాఖమున తుదియందు రాముఁడు సుగ్రీవుని చేరెను. ఆషాఢమున వాలివధ జరిగెను. ఆశ్వయుజమున సైన్యసమీకరణము సంభవించెను. ఫాల్గునశుద్ధచతుర్దశియందు హనుమంతుఁడు లంకను దహించెను. తరువాత రాముఁడు సముద్రమునొద్ద ఉపవేశనము గావించెను. ఫాల్గున అమావాస్యయందు రావణుఁడు వధింపఁబడెను. చైత్ర శుద్ధప్రతిపత్తునందు రావణునకు సంస్కారము జరిగెను. విదియ నాఁడు విభీషణునిపట్టాభిషేకము, సీతాప్రాప్తి, దేవతలువచ్చి వెడలిపోవుట సంభవించెను. తదియనాఁడు లంకనుండి రాముఁడు బయలుదేరి చవితినాఁడు కిష్కింధయొద్దనుండి పంచమికి భరద్వాజాశ్రమమునకు చేరెను.

ఈనిర్ణయములకు తగినహేతువులు ఆయాసందర్భములందు (వ్యాఖ్యానమున) నిరూపింపఁబడియున్నవి. ఈప్రకారముగా కాలపరిగణమును గ్రహించునప్పుడు, హనుమంతుని సన్నిధానమున రావణుఁడు ఇంక నేను రెండుమాసములు గడుపవలసియున్నది" అని చెప్పుట సీతాసాంత్వనపరముగా "మాసమునకు పైన నేను జీవింప" నని సీత హనుమంతునితో చెప్పుట ఆమెనిశ్చయపరముగా చక్కఁగా కుదురును. మాస మనఁగా జరుగుచున్నమాస మని యనేకపర్యాయములు చెప్పఁబడినది. "పదిమాసములు గడిచినవి, ఇంక రెండు మానము లున్నవి" అని రావణుఁడు చెప్పుట మధుపానమత్తతవలన నవివేకమున నంభవించె నని గ్రహింపవలసియున్నది. "మాసమునకు పైన నేను జీవింపను" అని సీత యన్నప్పుడు జరుగుచున్నమాస మనియే యర్థము—ఇది గోవిందరాజస్వామి గావించిన సంఘటనకాలనిరూపణము.

శ్రీమాన్ కోయిల్ కందాడై వేంకట సుందరాచార్యస్వామి "రామకాలనిర్ణయబోధిని" అను గ్రంథమున ప్రథమభాగమున తుది యందు "శ్రీ రా మ కా ల ని ర్ణ య ప ట్టి క" ను ఈక్రిందివిధముగా నొసంగిరి. [కాకినాడ—1911]

## శ్రీరామకాలనిర్ణయపట్టిక

### బాలకాండ (12 సంవత్సరములు)

వైవస్వతమన్వంతర పంచమ త్రేతాయుగము చతుర్థభాగమున 30 000వసంవత్సరమగు విలంబిసంవత్సరచైత్రశుద్ధ 9 బుధవారమున శ్రీరామజననము.

విలంబిచైత్ర. బ. 7—నామకరణము

పరాభవసం॥ చైత్రశుద్ధము (గర్భనవమము జననాదిగ నెనిమిదవసంవత్సరము } ఉపనయనము

సౌమ్యసం॥మాఘబ2(సం.11-10-8) శ్రీరామునివయస్సు } విశ్వామిత్రునితో రామలక్ష్మణులు యజ్ఞరక్షణకు బయలుదేరుట

| | | | |
|---|---|---|---|
| సౌమ్యమాఘ | బ 3 | .... .... | కామాశ్రమవాసము |
| ,, ,, | బ 4 | .... .... | తాటకావనవాసము, తద్వధ |
| ,, ,, | బ 5 | .... .... | సిద్ధాశ్రమప్రవేశము యజ్ఞారంభము |
| ,, ,, | బ10 | .... .... | యజ్ఞాంతము |
| ,, ,, | బ11 | .... .... | శోణాకూలవాసము |
| ,, ,, | బ12మధ్యాహ్నము | .... | గంగాతీరవాసము |
| ,, ,, | బ13 | .... .... | విశాలాపట్టణప్రవేశము |
| ,, ,, | బ14 | .... | } మిథిలాప్రవేశము, అహల్యాశాపవిమోచనము, యజ్ఞవాటగమనము |
| ,, ,, | బ15 | .... .... | యజ్ఞవాటమున ధనుర్భంజనము |

,, ఫాల్గున శు3 .... .... దూతల నయోధ్యకుం బంపుట

,, ఫాల్గున శు6 దూత లయోధ్యకుఁ జేరుట

,, ఫాల్గున శు7 సాయంకాలము { చతురంగ బలయుతుఁడై దశరథుఁడు వివాహము నకు బయలువెడలుట

,, ఫాల్గున శు12 ఉదయము .... దశరథుఁడు మిథిలకుఁ జేరుట

,, ఫాల్గున శు13 మఖానక్షత్రము { దశరథుఁడు నాందీశ్రాద్ధములఁ జేయుట

,, ఫాల్గున శు14 .... గోదానవ్రతము

,, ఫాల్గున శు15 ఉత్తరఫల్గుని నక్షత్రము { సీత మొదలగువారల వివాహము

,, ఫాల్గున బ 5 రాత్రి .... విడిదియందు నవవధూప్రవేశము

,, ఫాల్గున బ 8 { విశ్వామిత్రుఁడు తనయాశ్రమమునకు పోవుట

,, ఫాల్గున బ 9 .... జనకుఁడు కన్యాధనముల నిచ్చుట

,, ఫాల్గున బ10 .... పరశురామగర్వాపహరణము

సాధారణచైత్రశు2 { పుత్రయుతుఁడగు దశరథుఁ డయోధ్యం జేరుట

## అయోధ్యాకాండ (సం. 12-1-10)

శ్రీరామునివయస్సు

12 విలంబిసంవత్సరముచైత్రము మొదలు సాధారణసంవత్సరచైత్రమువఱకు } బాలకాండ విషయము

12 తరువాత దుందుభిసం॥చైత్రమువఱకు .... అయోధ్యావాసము వెరసి 24 సంవత్సరములు.

శ్రీరామునకు 25వసంవత్సరప్రారంభము

దుందుభిసం॥చైత్రశు4 .... శ్రీరాములు పట్టాభిషేకార్థముపవసించిన వ్రతదినము

దుందుభిసం॥చైత్రశు5 .... పట్టాభిషేకవిఘ్నమున వనప్రయాణ మొనర్చినదినము

,, ,, ,, అసాయంతనమున సరయూతీరవాసము

,, ,, శు6 .... గంగాతీరవాసము

,, ,, శు7 .... జటాధారణ, గంగాతరణములు

,, ,, శు8 .... భరద్వాజాశ్రమప్రవేశము

,, ,, శు9 .... భరద్వాజానుజ్ఞ వడసి యమునా తీరమున నుండుట

,, ,,శు10 .... చిత్రకూటప్రాప్తి

సుమంత్రునివిషయము

దుందుభిసం॥చైత్రశు7వఱకు } శ్రీరామునితో గుహసుమంత్రులు కలిసియుండుట

చైత్రశు7మొదలు 10 ప్రాతః కాలమువఱకు } గుహసుమంత్రులు కలిసియుండుట

చైత్రశు-10 సాయంకాలము .... సుమంత్రుఁ డయోధ్యకుఁజేరుట

,, శు-10 అర్ధరాత్రాత్పరమున } దశరథుఁడు కాలధర్మము నొందుట

,, శు-11 .... అందరు విలపించుట

,, శు-12 .... సభ జరుగుట; నందిగ్రామమునకు పోవుమనుష్యులకు మార్గవ్రయములనిచ్చుట

,, శు-13 సాయంకాలము ... వారలు నందిగ్రామమునకు చేరుట

భరతునిచరిత్రము

,, శు-14 .... భరతుఁ డయోధ్యకుఁ బ్రయాణ మొనర్చుట

,, బ- 5 రాత్రి .... భరతుఁ డయోధ్యకుఁ జేరుట

| | | |
|---|---|---|
| చైత్ర బ- 6 | .... | కర్మారంభము |
| చైత్ర బ- 15 | .... | కర్మాంతము, దశాహము |
| వైశాఖశు- 1 | .... | ఆశౌచనివృత్తి |
| ,, శు- 2 | .... | సాపిండ్యము |
| ,, శు- 3 | .... | భరతుఁడు దుఃఖించుట |
| ,, శు- 4 | .... | భరతుని పట్టాభిషిక్తునిఁ జేయఁబూనుట |
| ,, శు- 5 | .... | వందిమాగధులు స్తోత్రముఁ జేయుట |
| ,, శు- 6 | .... | శ్రీరాముని మరలించుటకు భరతునిప్రయాణము |
| ,, శు- 7 | .... | గంగాతీరవాసము, జటాధారణము |
| ,, శు- 7రాత్రి | ... | భరద్వాజాశ్రమమున నివాసము |
| ,, శు- 8 | .... | చిత్రకూటప్రాప్తి, రామదర్శనము |
| ,, శు- 9 | .... | స్నానతర్పణపిండదానాదు లొనఁగుట |
| ,, శు-10 | ... | పాదుకాదానము, అయోధ్యాగమనము |
| ,, శు-11 | .... | భరతునినందిగ్రామప్రవేశము |

## శ్రీరామునిచరితము

వైశాఖ-శు14వరకు ... చిత్రకూటమున శ్రీరాముఁడు వసించుట
,, శు-14ఉదయానంతరము.... అత్ర్యాశ్రమమునకుఁ బోవుట
,, శు-15 .... దండకారణ్యప్రవేశము

24-1-10 అరణ్యకాండ (13-1-0).

వనవాసకాలనిర్ణయము పదునాల్గుసంవత్సరములు
దుందుభి సం॥ చైత్ర శు5 మొదలు ధాతృసం॥
చైత్ర శు5 వరకు

సం-మా-రో

0-1-10 .... { వనవాసమున అయోధ్యాకాండలో జరిగినదినములు దండకారణ్యప్రవేశము వరకుదుందుభిసం॥ వైశాఖ శు 15లు

1-6-20 .... రుధిరోద్గారిసం॥మార్గశిరశు.5లవరకు అక్కడక్కడ

1-0-0 .... రక్తాక్షిసంమార్గశిరశు.5వరకు ఒకచోట

1-4-0 .... అక్షయసం॥చైత్రశు.5వరకు ,,

2-6-0 .... విభవసం॥అశ్వయుజ శు5వరకు ,,

1-1-0 .... శుక్లసం॥కార్తికశు.5వరకు ,,

1-6-0 .... ప్రజోత్పత్తి సం॥శు.5వరకు ,,

0-3-0 .... ప్రజోత్పత్తిసం॥శ్రావణశు.5వరకు ,,

0-8-0 .... అంగిరససం॥చైత్రశు.5వరకు ,,

2-0-0 .... భావసం॥చైత్రశు.5వఱకు సుతీక్ష్ణాశ్రమము

0-0-1 .... భావసం॥చైత్రశు,5దినమున నగస్త్యభ్రాత యాశ్రమమున

0-0-1 .... భావసం॥చైత్రశు,6 అగస్త్యాశ్రమమున

1-1-23 .... భావసం॥చైత్రశు.7మొదలు యువసం॥వైశాఖ బహుళ.10అంతము పంచవటితీరనివాసము

0-0-15 .... { యువసం॥జ్యేష్ఠశు.1సీతాపహరణము
యువసం॥జ్యేష్ఠశు.15శబరీదర్శనము
యువసం॥జ్యేష్ఠబ.1హనుమద్దర్శనము }

13-2-10 వనవాసమున గతించినకాలము

కిష్కింధాకాండ (0-8-27)

0-0-15 { యువసం॥జ్యేష్ఠబ.1మొదలు జ్యేష్ఠబ.15వరకు సుగ్రీవసఖ్యసాలఖండనాదులు }

0-0-15 .... యువసం॥అషాఢశు.15 వాలివధ

0-0 15 { అషాఢబహుళ15వరకు సుగ్రీవునిపట్టాభిషేకము, అంగదునియువరాజ్యపట్టాభిషేకము }

సం-మా-రో

0-4-0 .... యువసం॥శ్రావణము మొదలుకార్తికాంతము గుహావాసము

0-1-0 .... యువసం॥మార్గశిరమున లక్ష్మణునికోపము, సర్వవానరసమ్మేళనము, సీతాన్వేషణమునకు వానరుల నంపుట.

దక్షిణపుదిశకుఁ బోయినవానరులకు జరిగినకాలము

సం-మా-రో-
0 — 2 — 12

| మా-ది | |
|---|---|
| 0 - 12 | ....అచట నచట |
| 1 - 0 | ....వింధ్యమున |
| 1 - 0 | ....బిలమున |
| 2 - 12 | ....మొత్తము |

0-8-27వదినము యువఫాల్గునశు12దినమున సముద్రతీర గమనము, సంపాతిదర్శనము మొదలుగునవి

13-11-7 వనవాసమున గతించినకాలము

## సుందరకాండ $(0—0—1\frac{1}{2})$

సం-మా-ది-ఘ
0 - 0 — 0 - 30 యువసం॥ఫాల్గునశు13 ఉదయమున మహేంద్రాగ్రమునుండి హనుమ సముద్రమును లంఘించి యస్తమయాత్పూర్వము లంకాగమనము, అస్తమయపర్యంతము లంకకు వెలుపల నుండుట

0-0-0-4 .... ప్రదోషకాలమున లంకలోనఁ బ్రవేశించి లంకిణిని మర్దించుట

0-0-0-18 .... రావణప్రహస్తాదిగృహములలోన సీతను వెదకి కానక శింశుపావృక్షసమీపమున కరుదెంచిన సమయము తెల్లవారుజాము

సం-మా-ది-ఘ

0-0-0-7½ .... సీతతో సంభాషించి వనమును కింకరులను గూల్చుట ప్రాసాదభంజనసమయము చతుర్దశి ఉదయకాలమున

0-0-0-7½ .... జంబుమాల్యక్షయకుమారులవధ యుదయానంతరము

0-0-0-2 .... ఇంద్రజిత్తుచే హనుమ పట్టువడి రావణుసదనమున కరిగి సంభాషించుట

0-0-0-2 .... లంకాదహనకాలము సుమారు

0-0-0-4 .... సముద్రమును దాటి వానరులతోఁ గలియుకాలము

0-0-0-15 .... వానరు లందఱుఁ గలసి కిష్కింధకుఁ జేరుసమయము చతుర్దశిసాయంకాలము

0-0-1-30

13-11-8-30 వనవాసమున గతించినకాలము

యుద్ధకాండ (0-0-21½)

0-0-0-30 .... యుద్ధయాత్రాసన్నాహము-యువసం॥ఫాల్గున శు14 రాత్రి

0-0-1-0 .... యువసం॥ఫాల్గునశు15 యుద్ధయాత్ర

0-0-3-0 .... ఫాల్గునబ1 సాయంకాలము సముద్రతీరప్రాప్తి, సముద్రమును ప్రార్థించుట, ఫాల్గునబ4ఉదయము వరకు కుశాస్తరణశయనము

0-0-5-0 .... యువసం॥ఫాల్గునబ4 సేతుబంధారంభము, ఫాల్గునబహుళ 8 సేతుబంధాంతము

0-0-1-6 ... ఫాల్గునబ 9 ద్వంద్వయుద్ధారంభము

0-0-1-0 .... ఫాల్గునబ10ప్రహస్తవధ. రావణకిరీటభంగము

0-0-3-0 .... ఫాల్గునబ11 ఇంద్రజిద్యుద్ధారంభము ఫాల్గున బ13 తెల్లవారుజామున ఇంద్రజిన్మరణము

సం-మా-ది-ఘ

0-0-1-0 .... ఫాల్గునబ14 మూలబలసంహారము

0-0-1-0 .... ఫాల్గునబ15 తెల్లవారుజామున రామరావణ యుద్ధము, రావణవధ.

0-0-1-0 .... ధాతృసం॥చైత్రశు1 రావణసంస్కారాదులు

0-0-1-0 .... ,, ,, ,, శు2 విభీషణపట్టాభిషేకము

0-0-1-0 .... ,, ,, ,, శు3 సీతాశోధనము

0-0-1-0 .... ,, ,, ,, శు4 అయోధ్యాప్రయాణము, కిష్కింధావాసము

0-0-1-0 .... ,, ,, ,, శు5 భరద్వాజాశ్రమవాసము

14-0-0-0 .... ,, ,, వనవాసాంతము

0-0-1-0 .... { చైత్రశు6 ఉదయము నందిగ్రామ ప్రవేశము సాయంతనమున నయోధ్యను ప్రవేశించుట

ధాతృసం॥ చైత్రశు7 శ్రీరామపట్టాభిషేకము

పూర్వభాగము-సమాప్తము

ఈపరిగణనము గోవిందరాజస్వామిప్రభృతులవివరణములకు ఇంచుమించుగా సరిపోవుచునే యున్నది. దశరథమరణానంతరము వసిష్ఠునిచే పంపఁబడినదూతలు "నందిగ్రామమునకు చేరుట" అని యిందు పేర్కొనఁబడియుండుట ప్రామాదికము. వారు కేకయరాజధానికి చేరిరి. వారు అయోధ్యలో చైత్రశుద్ధ ద్వాదశి గాని త్రయోదశి గాని బయలుదేరి ఎంతవేగముగా పోయినను కేకయరాజధానికి త్రయోదశిరాత్రికే చేరి రనుట సంభావ్యముగా లేదు. భరతునకు ఆపట్టణమునుండి అయోధ్యకు చేరుటకు ఏడుదినములు పట్టినది. కావున దూతలు ఒకటిరెండు రోజులలో కేకయరాజధానికి చేరి రనుట సంగతముగా లేదు.

# 4. హనుమత్ప్రేషణము

రాముఁడు భరద్వాజునియొక్క ఆతిథ్యమును అంగీకరించిన తరువాత అయోధ్యవైపు చూచుచు ఆలోచించుచు హనుమంతుని పిలిచి యిట్లనెను. "ఆంజనేయా! అయోధ్యకు త్వరగా పోయి రాజమందిరమున అందఱు కుశలముగా నున్నారేమో కనుగొనుము. శృంగిబేరపురమున నామాటగా గుహుని కుశల మడుగుము. నా కుశలము నెఱింగి అతఁడు మిగుల సంతోషించును. అతఁడు నీకు అయోధ్యకు మార్గమును చెప్పును. భరతునివార్తలను కూడ తెలియఁజేయఁగలఁడు. నేను అడిగినట్లుగా నీవు భరతుని కుశల మడుగుము. నేను సీతాలక్ష్మణులతో సిద్ధార్థుఁడనై మిత్రులతో కూడి వచ్చుచుంటి నని చెప్పుము. లంకావిజయమును వివరింపుము. ఇది యంతయు విని భరతుఁడు నావిషయమున ఎట్టి భావమును పొందునో వానిముఖవర్ణముచేత ఇంగితములవలన భాషణమువలనను గ్రహింపుము. హస్త్యశ్వరథసంకులమైన రాజ్యము ఎవనిమనస్సును మరలింపదు. చిరకాలసంగతిచేత భరతుఁడు రాజ్యమునందు అభిలాష కలవాఁ డైనచో, అతఁడే వసుధాతలము నంతను పాలించును గాక! అతనియభిప్రాయమును నిశ్చయమును తెలిసికొని మే మిక్కడనుండి చాలదూరము పయనింపకముందే శీఘ్రముగ రమ్ము."

అంజనేయుఁడు మనుష్యరూపమును ధరించి శృంగిబేరపురమున కేగి గుహుని చూచి, "తెల్లవారుచుండఁగనే నీవు సీతాలక్ష్మణసమేతుఁడైన రాముని చూడఁగలవు" అని చెప్పి, సమృద్ధజనపదశోభితమైన కోసలరాజ్యమును చూచుచు అయోధ్యకు క్రోశమాత్రములో నున్న నందిగ్రామమును చేరి, అందు భ్రాతృవిరహకర్శితుఁడై తాపసుఁడై యున్నభరతుని చూచెను. పురో

హితామాత్యబలముఖ్యాదులు కూడ కాషాయాంబరధారలై భర
తుని పరివేష్టించి యుండిరి. ధర్మవత్సలులైన పౌరులు కూడ భర
తుని వీడి సుఖభోగములను అనుభవింపఁ జాలకుండిరి.

ఆంజనేయుఁడు ప్రాంజలియై భరతుని చేరి, "ఆర్యా! నీవు
ఎవనికొఱకై పరితపించుచున్నావో ఆ రాముఁడు నిన్ను కుశల
మడుగ మనినాఁడు. ఆయన వానరులసాయమున రావణుని
సంహరించి విజయవిలసితుఁడై వచ్చుచున్నాఁడు. సీతాలక్ష్మణ
యుతుఁడైన రాముని ఈముహూర్తమున నీవు కూడినట్లే" అని
చెప్పెను. ఆమాట విన్నంతనే భరతుఁడు హర్షాతిరేకమున సోలి
తేఱుకొని హర్షబాష్పములతో ఆంజనేయుని తడుపుచు కౌఁగి
లించుకొని యిట్లనెను. "అయ్యా నీవు దేవుఁడవో మనుష్యుఁడవో
గాని దయతో వచ్చి నాకు పరమప్రియమును చెప్పుచున్నావు.
నీకు లక్షగోవులు నూఱుగ్రామములు ఉత్తమకులీనలు అలంకృతలు
అయిన పదునార్వురు కన్యలను ఇచ్చుచున్నాను. ఎన్నో యేండ్లకు
నాప్రభువుయొక్క సంకీర్తనమును వినుచున్నాను. బ్రతికియున్నచో
నూఱేండ్లకైనను నరుఁ డానందమును పొందఁగలఁ డను లోకోక్తి
కళ్యాణసూక్తిగానే నాకు భాసించుచున్నది. రాఘవునకు వానరు
లకు సమాగమ మెట్లు కలిగినది? జరిగినదానిని వివరింపుము"
అని పలికెను.

ఆంజనేయుఁడు తాపసయోగ్యమైన బ్రుసియాసనమునందు
కూర్చుండి రాముని వృత్తాంత మంతయు వినిపించి, "రేపు
పుష్యయోగమున రాముని చూడఁగలవు" అని చెప్పెను. భరతుఁ
డానందపూర్ణుఁడై యున్న శత్రుఘ్నుని చూచి, "తమ్ముఁడా వింటివి
కదా! అన్న వచ్చుచున్నాఁడు; దేవాయతనములందు చతుష్పథ
మండపములయందును అర్చనలు జరిపింపుము; సూతమాగధ

వైతాళికులు శ్రేణీముఖ్యులు అమాత్యసైనికప్రముఖులు పౌరజానపదప్రధానులు అంగనాసహితులై రాముని చూచుటకు బయలుదేరుదురు గాక!" అని చెప్పెను.

## 5. స్వాగతసన్నాహము

శత్రుఘ్నుఁడు వెంటనే వేలకొలఁది భృత్యులను పంపి నందిగ్రామమునుండి అయోధ్యవఱకు మార్గమును సమీకరించి నీళ్లుచల్లి, నగరమున వీథులు భవనములు అన్నియు పతాకాదులతో అలంకరింప నియోగించెను. శత్రుఘ్నునిశాసనమున ధృష్టి, జయంతుఁడు మొదలగునమాత్యులు శ్రేణీముఖ్యులు మొదలగువారును అంగనాసహితులై రథగజతురగపదాతిబలములతో నందిగ్రామమునకు బయలుదేరిరి. కౌసల్య మొదలుగా అంతఃపురస్త్రీలు కూడ మేనాలు మొదలగుయానములతో అమితకుతూహలముతో బయలుదేరిరి.

తెల్లవాఱుచుండఁగా భరతుఁడు రామపాదుకలను శిరమున వహించి మాల్యమోదకహస్తులైన మంత్రిపురోహితులను ముందుంచుకొని పాండురచ్ఛత్రవాలవ్యజనములతో శంఖతూర్యదుందుభినినాదములతో దక్షిణాభిముఖుఁడై మెల్లఁగా నడువఁజొచ్చెను. నగరమంతయు నందిగ్రామమునకు చేరినట్లుండెను. భరతుఁడు కొంతసేపైనతరువాత నిలిచి అన్నివైపుల కలయఁజూచి ఆంజనేయుని పిలిచి, "ఏమయ్యా! నీవు కపిసహజమైన చలచిత్తతతో వ్యవహరించుట లేదు గదా! రాముఁ డేఁడి? విమాన మేది? కామరూపులైన ఋక్షవానరు లెక్కడ?" అని యడిగెను. ఆంజనేయుఁడు నవ్వుచు ని ట్లనెను. "అదిగో! వనౌకసులనిస్స్వనము. వారు గోమతిని దాటుచున్నట్లున్నారు. సాలవనమువైపు చూడుము.

పుష్పరజము వర్షముగా పడుచున్నది. వానరులు చెట్లనూపుచున్నారు. అల్లదిగో దూరమున చంద్రబింబసంకాశముగా విమానము కన్పించుచున్నది; చూడుము."

ఇంతలో విమానము సమీపించుచుండఁగా, "వచ్చె వచ్చె రాముఁ" డను శబ్దముతో జనులకోలాహలము మిన్నుముట్టెను. ఎల్లరును వాహనములనుండి దిగి విమానాగ్రమందున్నరాముని చంద్రునివలె చూడఁజొచ్చిరి. భరతుఁడు ప్రణమిల్లెను.

రామునియానతిని పుష్పకము విశాలమైన ప్రదేశమున నేలపై హంసవలె వ్రాలెను. భరతుఁడు విమానముపై కెక్కి రామునకు మరల నమస్కరించెను. తరువాత నతఁడు లక్ష్మణునియొద్దకు పోయి అటనుండి సీతను సమీపించి పేరు చెప్పుకొని నమస్కరించి మరల రామునియొద్దకు వచ్చెను. రాముఁడు భరతుని కౌఁగిలించుకొనెను. భరతుఁడు మనుష్యరూపధరులై యున్న సుగ్రీవాదులైన ఋక్షవానరనాయకుల నందఱను కౌఁగిలించుకొనెను. వా రందఱును భరతుని కుశల మడిగిరి. భరతుఁడు సుగ్రీవునితో, "ఆర్యా, నీవు మాకు అయిదవ సోదరుఁడవు" అని యభినందించి, విభీషణునితో, "సుహృద్వర్యా! భాగ్యవశమున నీసాయమువలన మహాకార్యము నిర్వహింపఁబడినది" అని ప్రశంసించెను. శత్రుఘ్నుఁడు సీతారామలక్ష్మణులకు అభివాదనము గావించెను. రాముఁడు కౌసల్యాదిజననులకు పురోహితునకు నమస్కరించెను, పౌరజానపదప్రముఖులు ప్రాంజలులై రామునకు స్వాగతము పలికిరి.

భరతుఁడు పాదుకలను రామునిచరణములకుఁ గూర్చి, "నీవు నాకు న్యాసముగానొసంగినయీరాజ్యమును మరల నీకుఅప్పగించు

చున్నాను; నాజన్మము చరితార్థ మయ్యెను; నీవు రాజువుగా తిరిగి వచ్చుటచేత నామనోరథము ఫలించినది; కోశమును కోష్ఠాగారమును చతుర్విధబలములను పరిశీలింపుము; నీతేజమున ఈ సంపద లన్నియు దశగుణము లైనవి" అని నివేదించెను.

రాముఁడు నవ్వుచు భరతునిఒడియందు కూర్చుండఁబెట్టుకొని ససైన్యముగా విమానమునందే భరతునియాశ్రమమునకు చేరెను. అచ్చట రాముఁడు సపరివారముగా విమానమునుండి దిగి ఆ విమానాధిష్ఠానదేవతను ఉద్దేశించి. "ఓయీపుష్పకా! నీవు వైశ్రవణుని సేవించుచుండుము. ఇంక పొమ్ము" అని యనుమతి నొసంగెను. వెంటనే అవిమానము ఉత్తరాభిముఖముగా వెడలిపోయెను.

భరతుఁడు ప్రాంజలియై పట్టాభిషిక్తుఁడవు గమ్మని రాముని ప్రార్థించెను. రాముఁ డంగీకరించెను. శత్రుఘ్నుని యాదేశమున క్షురకర్మకుశలులు చనుదెంచిరి. భరతశత్రుఘ్న సుగ్రీవవిభీషణులు కేశసంస్కారమును పొంది మంగళస్నానములను గావించినపిమ్మట రాముఁడు కేశసంస్కారపూర్వకముగా మంగళస్నానము గావించెను. సుఖాసీనులైన రామలక్ష్మణులకు శత్రుఘ్నుఁడు అలంకారకార్యమును నిర్వహించెను. దశరథుని భార్యలు సీతను స్వయముగా అలంకరించిరి. కౌసల్య వానరనాయకులభార్యల నందఱను స్వయముగా అలంకరించెను. సుమంత్రానీతమైన రథమును రాముఁ డధిరోహింపఁగా సుగ్రీవహనుమదంగదాదులు మనుష్యరూపములతో అలంకృతులై రథమువెంట బయలుదేరిరి. సుగ్రీవాదులభార్యలు నగరమును చూడవలయునను కుతూహలముతో సీతతో కూడ బయలుదేరిరి.

అయోధ్యలో మంత్రు లందఱును చేరి వసిష్ఠునితో ఆలోచించి అభిషేకమునకు కావలసిన కృత్యములను నిర్వహింపుఁడని ఆయనను ప్రార్థించి, వడిగా బయలుదేరి రామునకు నెదురుగా నేగిరి,

రాముఁడు రథముపై బయలుదేరఁగా భరతుఁడు పగ్గములను గైకొనెను. శత్రుఘ్నుఁడు ఛత్రమును లక్ష్మణవిభీషణులు వాలవ్యజనములను గైకొనిరి. సుగ్రీవుఁడు శత్రుంజయ మను మహాగజము నధిరోహింపఁగా తొమ్మిదివేలయేనుఁగులపై ఋక్షవానరప్రముఖులు బయలుదేరిరి. శంఖదుందుభితూర్యనిస్స్వనములు ప్రబలెను. రామునకు ముందు తూర్యతాళహస్తులు, అక్షతపూర్ణపాత్రలను స్వర్ణసంభరితపాత్రలను గైకొన్నద్విజులతో కూడ కన్యలు నడచుచుండిరి. వారివెనుక గోవులు మోదకహస్తులైన పౌరులును చనుచుండిరి. రాముఁడు సుగ్రీవునిసఖ్యమును ఆంజనేయునిప్రభావమును వానరులపిక్రమమును మంత్రులకు వివరించి చెప్పుచుండెను. ఆమహాసాహసకృత్యములను వినుచు ఎల్లరును విస్మితు లగుచుండిరి. రాముఁ డిట్లు మాటాడుచుండఁగా రథము అయోధ్యలో ప్రవేశించెను. పతాకాధ్వజపుష్పమాలాద్యలంకృతమైన రాజమార్గమునందు శ్రీరాముని రథము మహోత్సవముతో మెల్లగా పోయి దశరథునిగృహమునొద్ద నిలిచెను.

అప్పటికే కౌసల్యాదులైన యంతఃపురస్త్రీలు అచ్చటికి చేరియుండిరి. రాముఁడు రథమునుండి దిగి కౌసల్యాదిజననులకు నమస్కరించినపిమ్మట భరతుని చూచి, "అశోకవనికాయుతమైన నాభవనమును సుగ్రీవునకు విడిదిగా నొసంగుము" అని చెప్పెను. భరతుఁడు సుగ్రీవుని గైకొని బయలుదేరినంతనే శత్రుఘ్నునిశాసనమున భటు లనేకులు ముందుకా పర్యంకాస్తరణతైలప్రదీపాదు

లతో అగ్రుహమునకు వడివడిగా వెడలిపోయిరి. భరతుఁడు సుగ్రీవుని అచ్చటికి తీసికొనిపోయి, అతఁడు సుఖాసీనుఁడైన తరువాత "వానరేశ్వరా! శ్రీరామునియభిషేకమునకు తీర్థములను తెప్పింపుము" అనెను.

సుగ్రీవుఁడు వెంటనే సుషేణాదులను పిలిచి సువర్ణకలశముల నిచ్చి, "రేపు ఉషఃకాలమునకు తీర్థపూర్ణములైన కలశములతో తిరిగి వచ్చి మాయాజ్ఞకై వేచియుండుఁడు" అని యాదేశించెను. వారు అక్షణమే ఆకలశములను గైకొని, గరుత్మంతుఁడు పెక్కు ఆకృతులతో గగనమున పఱచుచున్నట్లు, తమతమ దిశలకు వెడలిపోయిరి. అరుణోదయ మగునప్పటికి తూర్పు సాగరమునుండి సుషేణుఁడు, దక్షిణసముద్రమునుండి ఋషభుఁడు,పశ్చిమాంబుధినుండి గవయుఁడు, ఉత్తరపాథోధినుండి అనలుఁడు అయిదువందలనదీనదములనుండి జాంబవదాంజనేయాదులు సర్వరత్నవిభూషితములైన కాంచనకలశములతో తీర్థములను తెచ్చిరి.

## 6. పట్టాభిషేకము

శత్రుఘ్నుఁడు తీర్థకలశములను వసిష్ఠాదులకు నివేదించెను. వసిష్ఠుఁడు సుముహూర్తమునందు రత్నపీఠమున సీతతో కూడ రాముని కూర్చుండఁజేసి వామదేవాదులతో కూడి ప్రసన్నములు సుగంధములు నైన తీర్థములతో,వసువులు వాసవునివలె, అభిషేకించెను. ఋత్విజులు బ్రాహ్మణులు అభిషేకించినతరువాత కన్యలు, యోధులు, పౌరవర్యులు, శ్రేణిముఖ్యులు అభిషేకించిరి. సకల దేవతలతో లోకపాలకులగు ఇంద్రవరుణయమకుబేరులు నల్వురు

సర్వౌషధీరసపూర్ణములైన తీర్థములతో ఆకసమునుండి సీతా రాముల నభిషేకించిరి.

పిమ్మట మహార్హములైన నూతనవస్త్రములను ధరించి వచ్చిన సీతారాములను ఆదిరాజాధ్యాసితమైన రత్నసింహాసనమున కూర్చుండఁ జేసి, మనువు దేనిచేత పూర్వము అలంకరింపఁబడెనో అట్టి బ్రహ్మనిర్మితరత్నకిరీటముతో వసిష్ఠాదిమహర్షులు రాము నలంకరించిరి. నానారత్నచిత్రితమై ధర్మశోభావిరాజితమైన యాసభాభవనమున ఋత్విజులు వివిధాభరణములతో రాముని భూషించిరి. పాండురచ్ఛత్రమును శత్రుఘ్నుఁడు, వాలవ్యజనములను విభీషణసుగ్రీవులు వహించిరి.

ఆమహోత్సవమున వాసవునిపంపున వాయుదేవుఁడు సర్వరత్నసమాయుక్తమైన ముక్తాహారమును శతపద్మనిర్మితమై ధగధగ మెఱయుచున్న కాంచమాలను సార్వభౌమునకు కానుకగా సమర్పించెను. దేవగంధర్వులు గాన మొనరింపఁగా అప్సరసలు నృత్య మొనరించిరి.

రామచంద్రుఁడు ముందుగా బ్రాహ్మణులకు నూఱువృషభములను, ఒక్కొక్కలక్షగా అశ్వములను ధేనువులను గోవులను ముప్పదికోట్ల బంగారునాణెములను దానమొనర్చెను. (నవప్రసూతియైన గోవును ధేను వందురు). పిమ్మట రామభద్రుఁడు సూర్యప్రభమై మణిమయమైన హారమును సుగ్రీవునకు, వైడూర్యమయములై చంద్రరశ్మిసంకాశములైన రెండు అంగదములను అంగదునకు నొసంగెను. అనంతర మామహారాజు మణిప్రవరశోభితమై చంద్రకాంతిసమప్రభమైన ముక్తాహారమును దివ్యమైనవస్త్రద్వయమును అనేకాభరణములను ధర్మపత్నికి నొసంగెను.

ఆమహాదేవి తనకంఠమునుండి యొకముత్యాలహారమును తీసి కైకొని రాముని వానరవీరులను చూడఁజొచ్చెను. రాముఁ డామెయభిప్రాయము నెఱింగి యిట్లనెను. "దేవీ! పౌరుషము విక్రమము బుద్ధి ఎవనియందు ప్రతిష్ఠితములై యున్నవో, ఎవని విషయమున నీవు సంతుష్టురాల వైతివో వానికి ఆ హారము నొసంగుము." ఆమె దానిని ఆంజనేయున కొసంగెను. దానిచే ఆమహా వీరుఁడు మిగుల శోభించెను.

పిమ్మట ఆసార్వభౌముఁడు నీలద్వివిదమైందజాంబవదాదు లైన ఋక్షవానరవృద్ధులను వీరులను యథార్హముగా కానుకలతో సమ్మానించెను.

ఆమహోత్సవమున భూమి సస్యవతియై పాదపములు రసపూర్ణ ఫలవంతములై పుష్పములు సుగంధిలములై శోభించెను. అప్పు డామహారాజు భరతుని యౌవరాజ్యపట్టాభిషిక్తుని గావించెను.

మహోత్సవానంతరము సుగ్రీవుఁడు ఋక్షవానరులతో కిష్కింధ కేగెను. విభీషణుఁడు కూడ కులధనమును పొంది మంత్రులతో లంక కేఁగెను.

శ్లో॥ మణిప్రవరజుష్టం చ ముక్తాహార మనుత్తమమ్।
సీతాయై ప్రదదౌ రామ శ్చంద్రరశ్మిసమప్రభమ్।
అరజే వాససీ దివ్యే శుభా న్యాభరణాని చ॥ 73

శ్లో॥ అవేక్షమాణా వైదేహీ ప్రదదౌ వాయుసూనవే।
అవము చ్యాత్మనః కంఠా ద్ధారం జనకనందినీ॥

శ్లో॥ అవైక్షత హరీన్ సర్వాన్ భర్తారం చ ముహుర్ముహుః॥ 74

శ్లో॥ తా మింగితజ్ఞః సంప్రేక్ష్య బభాషే జనకాత్మజామ్॥ 75

శ్లో॥ ప్రదేహి సుభగే హారం యస్య తుష్టాసి భామినీ।
పౌరుషం విక్రమో బుద్ధి ర్యస్మి న్నేతాని సర్వశః॥ 76

శ్లో॥ దదౌ సా వాయుపుత్రాయ తం హార మసితేక్షణా।
హనుమాం స్తేన హారేణ శుశుభే వానరర్షభః॥ 77

శ్లో॥ సర్వవానరముఖ్యా శ్చ రామే ణాక్లిష్టకర్మణా।
యథార్హం పూజితా స్సర్వైః కామై రత్నై శ్చ పుష్కలైః॥ 82

శ్లో॥ ప్రహృష్టమనస సర్వే జగ్ము రేవ యథాగతమ్।
నత్వా సర్వే మహాత్మానం తత స్తే ప్లవగర్షభాః॥ 83

శ్లో॥ విసృష్టాః పార్థివేంద్రేణ కిష్కింధా మభ్యుపాగమన్॥ 84

శ్లో॥ సుగ్రీవో వానర శ్రేష్ఠో దృష్ట్వా రామాభిషేచనమ్।
లబ్ధ్వా కులధనం రాజా లంకాం ప్రాయాద్విభీషణః॥ 85

శ్లో॥ రాఘవః పరమోదార శ్శశాస పరయా ముదా।
ఉవాచ లక్ష్మణం రామో ధర్మజ్ఞం ధర్మవత్సలమ్॥ 86

శ్లో॥ ఆతిష్ఠ ధర్మజ్ఞ మయా స హేమాం।
గాం పూర్వరాజాధ్యుషితాం బలేన।
తుల్యం మయా త్వం పితృభి ర్ధృతా యా
తాం యౌవరాజ్యే ధుర ముద్వహస్వ॥ 87

శ్లో॥ సర్వాత్మనా పర్యనునీయమానో
యదా న సౌమిత్రి రుపైతి యోగమ్।
నియుజ్యమానోఽపి చ యౌవరాజ్యే
తతోఽభ్యషించ ద్భరతం మహాత్మా॥ 88

సర్గ—128-యుద్ధకాండ

సీతాదేవి తనకంఠమునుండి ముత్యాలహారమును గైకొని వెంటనే ఆంజనేయున కీయక రాముని వానరవీరులను చూచుట ఎందులకు? మొదటిసారి లంకలో ఆంజనేయుఁడు రాముని వృత్తాంతమును చెప్పినప్పుడు, రెండవసారి రావణసంహారానంతరము మరల వచ్చి రామునివిజయమును చెప్పినప్పుడు, ఆమె అపరిమితమైనయానందమును పొందెను. అంతయానందమును కలిగించినయామహావీరునకు ఈయఁదగిన గొప్పబహుమతి అప్పుడు తనయొద్ద లేనందులకు ఆమె ఎంతో చింతించెను. ఇప్పుడు అట్టిబహుమతి నొసంగుటకు తగినసమయ మేర్పడెను. ఇంద్రుఁడు పంపినముక్తాహారమును రాముఁ డామెకు బహూకరించెను. ఇతరములైన కానుకలకన్న అది శ్రేష్ఠ మనుటలో సందియము లేదు. తనకు ప్రీతితో నిండుసభయందు భర్త యొసంగినహారము మఱియొకనికి తాను ఇచ్చినచో రాముఁ డే మనుకొనునో అని, అట్లే తనవిమోచనముకొఱకు జరిగిన సంగ్రామమున ఋక్షవానరనాయకు లెందఱో ప్రాణములకు తెగించి పోరాడియుండఁగా దివ్యమై అమూల్యమైన యా హారమును అందఱు చూచుచుండఁగా ప్రత్యేకించి యాంజనేయున కొసంగినచో వారందఱును ఏ మనుకొందురో యనియు ఆమె సందేహము నొందెను. అందువలన ఆమె వెంటనే ఆహారమును ఆంజనేయున కీయక రామునివైపు వానరవీరులవైపును చూడఁజొచ్చెను. రాముఁడు ఆమెసందేహమును గ్రహించెను. ఆ హారమును అర్హుఁడైనవాని కొసంగుటలో తనకభ్యంతరము లే దని రాముఁడు స్పష్టము చేయుచు, ఆంజనేయున కిమ్మని చెప్పక, "పౌరుషము విక్రమము బుద్ధి అనుగుణములచేత నీకు ఎవనియందు సంతుష్టి కలిగినదో వాని కిమ్ము" అని సూచించెను. అట్టిగుణములు సమగ్రముగా కలవానికి ఆహారము నొసంగినచో సుగ్రీవాంగదాదులు

ఎవరును అసూయ నొందవలసినపని లేదని ఆయన స్పష్టమొన రించెను. ఆసూచనమేరకు ఆమె ఆహారమును ఆంజనేయునకు ఒసంగుటవలన ఆంజనేయుని సర్వోత్తమత్వము చక్కఁగా ప్రకటింపఁబడినది. గుణతారతమ్యమును గ్రహింపక అందఱను సమానముగ సమ్మానించుట విజ్ఞులలక్షణము కాదు. అది నీతి కాదు; ధర్మమును కాదు. యథార్థముగ గుణమును గౌరవించుట ఆవశ్యక మని దీనివలన గ్రహింపవలసియున్నది.

సుగ్రీవాదులు తమస్థానములకు వెడలిపోయి రని ఇక్కడనే చెప్పఁబడినది. కాని ఉత్తరకాండలో వా రందఱు కొన్నినెల లుండి తరువాత వెడలిపోయినట్లు వర్ణింపఁబడియున్నది. ఇది పూర్వాపరవిరోధము కాదా? కాదు. పట్టాభిషేకముతో పూర్వ కథను ముగించుచు వాల్మీకి "ఆమహోత్సవమును చూచి వారు వెడలిపోయిరి" అని సామాన్యముగా చెప్పెను. ఎన్నాళ్లుండి వెడలి పోయినారు, ఎట్లు వీడ్కోలును రామునివలన పొందినారు, అను విషయములను పైగ్రంథమున వివరింపఁబూనుకొని యిచ్చట కవి సంగ్రహముగా చెప్పెను. కావున వారు వెడలిపోయి రనఁగా వెంటనే వెడలిపోయి రని గ్రహింప నక్కఱ లేదు. అందువలన పూర్వాపరవిరోధము లేదు.

"విభీషణుఁడు కులధనమును పొంది లంక కేఁగెను" అన్నప్పుడు అతఁడు పొందినకులధన మేది? కులధన మనఁగా స్వకులధనమైన లంకారాజ్య మని రామాయణతిలకటీకాకారుఁడు, ఇక్ష్వాకుకులధనమైన శ్రీరంగవిమాన మని చెప్పుట సంప్రదాయ మని గోవిందరాజస్వామి వివరించిరి.

[తి. టీక:—కులధనం, ఇక్ష్వాకుకులధనం; శ్రీరంగవిమాన మితి సంప్రదాయః ]

విభీషణునకు లంకయందు పట్టాభిషేకము జరిగినప్పుడే లంకారాజ్యము లభించినది. ఇప్పుడు మరల దానిని అతఁడు కులధనముగా పొందె ననుట సమంజసముగా తోఁచుట లేదు. ఇక్ష్వాకు కులధనమైన శ్రీరంగవిమానము అతఁడు పొందె ననుటయు యుక్తియుక్తముగ లేదు. ఇక్ష్వాకువంశీయులకు కులధనముగా శ్రీరంగవిమాన ముండె నని గ్రంథమున ఎక్కడను ప్రస్తావింపఁబడ లేదు. ఇక్కడ కూడ పేర్కొనఁబడలేదు. అదియునుగాక కులధనమును మఱియొకనికి కానుకగా నిచ్చుట సంభవమా? కులధన మనఁగా పెక్కుతరములుగా సంక్రమించుచున్నధనము. కిరీటము, సింహాసనము మొదలైనవి కులధనము లగును. అట్టి వానిని ఒక్కొక్కతరమునందు రాజుగా అభిషేకింపఁబడినవారు, తాము ఉపయోగించుకొని తరువాతితరమువారికి అందింపవలసి యుండును. అందువలననే మనువు ధరించినకిరీటమునే రాముఁడు మరల ధరింపఁగలిగెను. అట్లు పరంపరాగతమైన కులధనమును ప్రభువులు మఱియొకనికి బుద్ధిపూర్వకముగా నీయరు. ఒకవేళ ఇతరులు పరాక్రమించి జయించి తమకులధనమును హరించినచో, ఆకులమువారు మరల ఎట్లైనను దానిని సాధింపవలయు నని యత్నించుచుందురు. అందువలన ఇక్ష్వాకుకులధనమును రాముఁడు విభీషణునకు నొసంగె ననుట పొసఁగదు.

అట్లయినచో విభీషణుఁడు పొందినకులధన మేది? విభీషణుఁడు పౌలస్త్యమహర్షి వంశసంభవుఁడు. తపోధనుఁడైన విశ్రవసునిపుత్త్రుఁడు. మాతామహాదులప్రోద్బలమువలన రావణుఁడు రాక్షసరాజ్యపాలకత్వమును అవలంబించి క్షత్త్రియత్వమును

అవలంబించినతరువాత విభీషణుఁడు కూడ అన్నకు విధేయుఁడై క్షత్రియధర్మమునే అవలంబించి యుండెను. ఆధర్మము ననుసరించియే అన్నచే పరిత్యక్తుఁడైనతరువాత ధర్మరక్షణముకొఱకు రామునిపక్షమునఁ జేరెను. ఇప్పుడు రాముఁడు "పౌలస్త్యుఁడవైన నీకు సహజమైన కులధనము తపోధనమే; రావణుఁడు కొల్లగొట్టి తెచ్చినధనమును కులధన మని తలంపకుము; వారసత్వముగా సంక్రమించినరాజ్యమునకు నీవు ఇప్పుడు పరిపాలకుఁడవుగా నున్నను నీకులధనమైన తపస్సును విస్మరింపకుము; రాజ్యపాలకునకు తపస్సు ఎట్లు కుదురును అని సందేహింపకుము; రాజ్యపాలనమును భోగసాధనముగా తలంపక కర్తవ్యమాత్రముగా ప్రజలను ధర్మమార్గమున పాలించుచు ఫలాపేక్ష లేకుండ భోగాభిలాషను వీడి తత్త్వచింతనపరుఁడ వగుటయే తపస్సు; ఫలాపేక్ష లేకుండ కేవలము ధర్మముకొఱకే ధర్మము నాచరించుచుండుట ఋషిలక్షణము; కావున కేవలధర్మనిర్వహణమాత్రముగ రాజ్యపాలనమును నిర్వహించుచు ఋషికులధనమైన తపస్సును పెంపొందించుకొనుము" అని యుపదేశించి యుండును. ఇదియే విభీషణుఁడు పొందినకులధన మని గ్రహించుట యుక్తము.

ఈసందర్భమున కైకసి పుత్త్రులను కోరినప్పుడు విశ్రవసుఁడు చెప్పినమాటలను గ్రహింపవలసియున్నది. దురాచారులు క్రూరకర్మలునైన పుత్త్రులు తనకు వల దని ఆమె ప్రార్థింపఁగా ఆయన యిట్లనెను. "నీసంతానమున గడపటివాఁడు నావంశమునకు అనురూపుఁడై ధర్మాత్ముఁ డగును. సందేహము లేదు."

శ్లో॥ పశ్చిమో య స్తవ సుతో భవిష్యతి శుభాననే॥ 26

శ్లో॥ మమ వంశానురూప స్స ధర్మాత్మా చ న సంశయః।27
ఉత్తరకాండ-నవమసర్గము

దీనినిబట్టి విశ్రవసుఁడు కైకసియొక్క సంతానమున విభీషణుని తనకులమునకు తగినవానినిగా ఉద్దేశించె ననుట స్పష్టము. మాల్యవంతుఁడు మొదలగు మాతామహాదులచే స్వీకరింపఁబడి రావణకుంభకర్ణులు కేవలము రాక్షసులుగా పెంపొందినను. విభీషణుఁడు మాత్రము రాక్షసచేష్టలకు పాల్పడక, తండ్రికులమునకు అనుగుణముగా తపోవ్రతాదులయందే కాలముఁ గడుపుచుండెను. రావణసంహారానంతరము విభీషణుఁడు రాక్షసరాజ్యమునకు పట్టాభిషిక్తుఁ డైనను, "నీకులము రాక్షసకులము కాదు; నీవు, రాక్షసులను పరిపాలించుచున్నను, తండ్రికులమునకుఁ జెందినవాఁడవే యగుదువు; కావున తపస్సే నీకులధనము" అని రాముఁడు విభీషణునకు ఉపదేశించి యుండును. తపస్సు సకల ధనములకు మూలము. తపస్సునకు మించినధనము లేదు. కావున విభీషణుఁడు రామునివలన తపోరూపకులధనమునే యుపదేశరూపమున పొందె నని గ్రహించుట సమంజసము.

యౌవరాజ్యపట్టాభిషేకమును పొందు మని రాముఁడు లక్ష్మణునితో చెప్పి అతఁడు దృఢముగా నిరాకరింపఁగా అప్పుడు భరతునకు యౌవరాజ్యపట్టాభిషేకము గావించె నని "అతిష్ఠ ధర్మజ్ఞ" అని మొదలగు రెండు శ్లోకములలో కన్పించుచున్నది. పెద్దవాఁడు భరతుఁ డుండఁగా రాముఁడు అతని నుపేక్షించి లక్ష్మణునకు యౌవరాజ్యపట్టాబిషేకము చేయవలయు నని ఏల తలంచెను? ఇందులకు గోవిందరాజస్వామి యిట్లు చెప్పెను. "'లక్ష్మణా! నాతో కూడ ఈవసుంధరను నీవు పాలింపుము' అని పూర్వాభిషేకారంభప్రయత్నసమయమున, భరతుఁడు లేనప్పుడు, ప్రతిజ్ఞ

చేసియుండుటవలన, 'రాముఁడు రెంఉుగా మాటాడఁడు' అను నియమమువలన, ఇప్పుడు రాముఁడు లక్ష్మణునే యౌవరాజ్యము నందు నియోగించుచున్నాఁడు."

["లక్ష్మణేమాం మయా సార్ధం ప్రశాధి త్వం వసుంధరామ్" ఇతి పూర్వాభిషేకారంభే భరతాసన్నిధానే ప్రతిజ్ఞానాత్" "రామో ద్విర్నాభిభాషతే" ఇతి నియమాత్ లక్ష్మణ మేవ యౌవరాజ్యే నియుంక్తే।]

ఈసమాధానము తృప్తికరముగా లేదు. ధర్మమూర్తియైన రాముఁడు పెద్దవానిని అతిక్రమించి చిన్నవానికి యౌవరాజ్య పట్టము నొసంగవలయు నని తలంచె ననుట అసంభావ్యము. అట్లయినచో ''నాతో కూడ ఈవసుంధరను నీవు పాలింపుము" అని ఆయన మొదట ఎట్లు చెప్పెను? "నాకు సహాయుఁడవుగా నీవును ఈరాజ్యమును పాలింపుము" అని చెప్పుటయే రాముని యభిప్రాయము గాని లక్ష్మణుఁడు యువరాజు అగు నని ఆయన యభిప్రాయము కాదు. అట్టియభిప్రాయమే రామునికున్నచో అంగదుని విషయమున సుగ్రీవునితో చెప్పినట్లు ఆయన లక్ష్మణునితో కూడ, "నేను రాజు నైనంతనే నీవు యువరాజు వగుదువు'' అని చెప్పియుండెడివాఁడు. ఆయన ఇట్లు చెప్పలేదు. అందువలన అప్పుడు చెప్పినమాటకొఱకు ఇప్పుడు లక్ష్మణుని ఆయన యువరాజును చేయఁదలంచె నని చెప్పనక్కఱ లేదు.

అసలు రామునకు ఇట్టి తలంపు కలుగుటయే అసంభవము. ఈసంగతి తెలిసినచో భరతుని మనస్సునకు కష్టము కలుగదా? తమ్ముఁడు నిరాకరించినయౌవరాజ్యమును అతఁడు స్వీకరించునా? సకలరాజ్యభోగములను వదలి లక్ష్మణుఁడు పదునాల్గుసంవత్సర

ములు తన్ను సేవించుచు నుండెను; కావున అతనికి యౌవ రాజ్యము నొసంగవలయు నని రాముఁడు తలఁచుట సహజము సమంజసమే యని కొంద అనవచ్చును. కాని లక్ష్మణుఁడు కావించినత్యాగముకన్న భరతునిత్యాగము అనేకవిధములమిన్న యైనది. లక్ష్మణునకు రాజ్యాధికారసంబంధ మెప్పుడును లేదు. అట్టి యవకాశమే లేకపోవుటవలన అతనికి దానియందు ఆశ యుండుటకే వీలు లేదు. భరతునివిషయము అట్టిది కాదు. రాజ్యాధికారమున రామునకు ఎట్టి యవకాశ మున్నదో భరతునకు కూడ అట్టియవకాశమే యున్నది. అవకాశము ఉండుటమాత్రమే కాదు; కైకేయి వరములమూలమున అతనికి రాజ్యమును సంపాదించిపెట్టి సిద్ధమొనర్చినది. అప్పుడు తల్లి చేతి కందించిన రాజ్యమును అతఁడు అన్నయందలి భక్తివలననే దృఢముగా నిరాకరించెను. చిత్రకూటమున రాముఁడు రాజ్యము తనదే యని యంగీకరించుచు పాదుకలమూలమున మరల ఆరాజ్యమును న్యాసముగా భరతుని చేతియం దుంచెను. ఈపర్యాయము అతఁడు రాజ్యమును తన చేతియందు పదునాల్గుసంవత్సరములు ఉంచుకొనవలసివచ్చెను. ఇది యతనికి అసాధారణమైన పరీక్షగా పరిణమించెను. భార్యకు దూరముగా నుండి లక్ష్మణునివలె, బ్రహ్మచర్యమును నిలుపుకొనుట దుర్ఘటమే. భార్య చెంతనే యుండఁగా బ్రహ్మచర్యమును, రామునివలె, నిలుపుకొనుట, ఇంకను దుర్ఘటము. అట్లే దినదినము రాజ్యవ్యవహారమును నిర్వహించుచు పదునాల్గుసంవత్సరములు దానియందు ఆసక్తిని పొందకుండుట దుర్ఘటతమము. అందువలననే రాముఁడు భరతుని చిత్తవృత్తిని పరీక్షించుటకు ఆంజనేయుని పంపెను. కావున రామలక్ష్మణులు వహించిన నిగ్రహముకన్న అధికమైననిగ్రహమునే భరతుఁడు వహించె

ననుట స్పష్టము. ఈకారణముచేతనే రాముఁడు లక్ష్మణునియెడు టనే విభీషణశరణాగతిసందర్భమున సుగ్రీవునితో సోదరప్రేమకు పరమాదర్శముగా లక్ష్మణుని పేర్కొనక "మిత్త్రమా, సోదరు లందఱును భరతునితో పోల్పఁదగినవారుగా నుండరు" అని భరతునే ఉత్తమసోదరునకు దృష్టాంతముగా పేర్కొనెను. అప్పుడు లక్ష్మణుని చూచి మొగమోటపడని రాముఁడు ఇప్పుడు మొగ మోటపడి భరతుని అతిక్రమించి లక్ష్మణుని యువరాజును చేయఁదలంచె ననుట కేవలము అసంగతము.

భరతునియీవ్రతదీక్షయొక్క పవిత్రతాతిశయమును కాళి దాసమహాకవి మిగులరమణీయముగా నిట్లు నిరూపించెను. భర తుఁడు పుష్పకములోనికి పోయి రామునకు నమస్కరించిన తరు వాత సీతకు కూడ పాదాభివందనము గావించెను. ఆసందర్భ మును ఆమహాకవి ఇట్లు వర్ణించెను. "లంకేశ్వరుఁడైన రావ ణుఁడు పాదప్రణామమును గావించుటకై తలను వంచఁగా, ఆ తల తనకు తగలకుండ దూరముగ నుండి పవిత్రతను కాపాడు కొన్న దృఢవ్రతము కలిగి వంద్యమై యున్న సీతాదేవియొక్క చరణయుగము, జ్యేష్ఠుఁడు వనవాసవ్రతముతో నుండఁగా తాను రాజ్యభోగములతో నుండుట తగదని తానును వనవాసవ్రతము నవలంబించిన భరతునియొక్క జడలుగట్టినశీర్షము, ఒకచోట కూడి, ఒకదానిని మఱియొకటి పవిత్రము నొనరించెను." ఈ యిరువురి వ్రతదీక్షలలో ఏది యధికమైనదో చెప్పుటకు వీలు లే దని, రెండును అపూర్వమైన వని కవి, వ్యక్త మొనర్చుచున్నాఁడు.

శ్లో॥ లంకేశ్వరప్రణతిభంగదృఢవ్రతం త

ద్వంద్యం యుగం చరణయో ర్జనకాత్మజాయాః।

జ్యేష్ఠానువృత్తిజటిలం చ శిరో ౽స్య సాధో
రన్యోన్యపావన మభూ దుభయం సమేత్య॥ 78
రఘువంశ-సర్గ-13

ఈశ్లోకమున కాళిదాసు, బ్రహ్మచర్యపాతివ్రత్యపితృవాక్య పాలనాదివ్రతదీక్షాదృఢత్వమే మహత్త్వమునకు మూల మని, మానవులయభ్యుదయనిశ్శ్రేయసములకు ధర్మాచరణమే సాధన మని, రామాయణప్రతిపాదితమైన పరమార్థముగా వ్యక్తీకరించి నాఁడు.కావున ఈమహాగ్రంథమువలన ఈపరమార్థమును గ్రహించి ఎల్లరు ధర్మానుష్ఠానపరులై శ్రీరామానుగ్రహపాత్రులై అభ్యుదయ నిశ్శ్రేయసములను పొందుదురుగాక!

## ఫలశ్రుతి

వాల్మీకిమహర్షిచే రచింపఁబడినయీమహాగ్రంథము ఆది కావ్యము. శ్రద్ధతో దీనిని పఠించువారును వినువారును పాప విముక్తులై దుర్గములైన కష్టములను దాఁటుదురు; పుత్త్రులను గోరువారు సత్పుత్త్రులను పొందుదురు; అభ్యుదయమును కాంక్షించు వారు పుష్కలముగా సంపదలను దీర్ఘాయువును దృఢమైన యారో గ్యమును పొందుదురు. ఇంకను ఎవరు ఏయభిలాషతో ఈమహా కావ్యమును నియమపూర్వకముగా పఠింతురో లేక విందురో అట్టి వారు తమకోర్కుల నెల్ల సంపూర్ణముగా అచిరకాలమునఁ బడయు దురు. క్షత్త్రియాదులు బ్రాహ్మణుని పూజించి యాతనివలన ఈ గ్రంథమును సమగ్రముగా పఠించుచు వినుచున్న వారియెడ శ్రీరామచంద్రప్రభువు ప్రీతి నొందును. సనాతనుఁడైన శ్రీవిష్ణు దేవుఁడే కదా శ్రీరామచంద్రప్రభువుగా నవతరించెను! పరమ

పవిత్రమైన ఈగ్రంథము ఏగృహమునందు పూజింపఁబడుచుం డునో ఆయింటియందు కుటుంబవృద్ధి ధనధాన్యవృద్ధి ఉన్నత మైన కీర్తి ఉత్తమమైనసుఖము శాంతి నెలకొనియుండును.

ఆర్యులారా! మహామహిమాన్వితమైన యీశ్రీరామకథను భక్తివిశ్వాసములతో ప్రవచనముఁ గావింపుఁడు. శ్రీమహావిష్ణుదేవుని బలము ప్రవర్ధమాన మగుచు గాక! మీకు స్వస్తి యగును గాక!

శ్లో॥ ఏవమేత త్పురావృత్త మాఖ్యానం, భద్ర మస్తు వః।
ప్రవ్యాహరత విస్రబ్ధం, బలం విష్ణోః ప్రవర్ధతామ్॥

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః।
గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు॥

శ్లో॥ మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే।
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్॥

శుభమస్తు

## గద్యము

నలచరిత్ర శ్రీమద్రామాయణాది మహాకావ్య
భువనవిజయాదినాటక
శ్రీ భగవద్గీతాసారాదిబాలప్రియావ్యాఖ్యాదిక
రచన ప్రస్తుతి పాత్ర
ఆపస్తంబసూత్ర కౌండిన్యసగోత్ర
పోలూరివేంకటనరసాంబానారాయణామాత్యపుత్ర
హనుమజ్జానకీరామశర్మప్రణీతంబైన
శ్రీరామాయణతరంగిణియందు
చతుర్వింశంబైన పట్టాభిషేకతీర్థంబుతో
ఉత్తరార్థంబు సంపూర్ణము

శ్లో॥ యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ య ద్భవేత్।
తత్సర్వం క్షమ్యతాం దేవ రామచంద్ర నమోఽస్తుతే॥



శ్రీరామ

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 11 | 10 | శస్తా | శస్త్రా |
| 12 | 4 | మనుయతో | మనుయాతో |
| ,, | 9 | ఇప్వస్త్రీ | ఇష్వస్త్రే - శ్లో॥ 20 |
| 13 | 9 | అపలం | అవలం |
| ,, | 23 | వ్యవస్థను | సువ్యవస్థ |
| 15 | 11 | తద్పంగ | తద్భంగ |
| ,, | 22 | ఆనెను | అనెను |
| 16 | 3 | ఆమిత | అమిత |
| ,, | 6 | ఆరోగు | అరోగు |
| 17 | 14 | ప్రతి | ప్రతి-శ్లో॥ 57 |
| 22 | 7 | ప్రప | ప్రహ |
| ,, | 12 | అందఱ | అందఱు |
| 26 | 3 | మారుతు | మారుతి |
| 29 | 22 | మకుడ | మకుట |
| 31 | 25 | ఘోష | ఘోషి |
| 33 | 11 | అన్న | అన్న |
| ,, | 14 | డెప్వ | డెవ్వ |
| 36 | 4 | ఆపన్నుఁడు | ఆపన్నుఁడ |
| 38 | 14 | దర్ప | దర్భ |
| 41 | 18 | విపమ | విషమ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 47 | 23 | సిగు | సిగ్గు |
| 49 | 7 | మాటలని | మాటలను |
| 56 | 17 | పోపలెయు | పోవలయు |
| ,, | 25 | కాపున | కావున |
| 57 | 22 | యాజా | యాజ్ఞా |
| 58 | 3 | వురీ | పురీ శ్లో॥ 11½ |
| 59 | 1 | బ్రహ్మత్ర | బ్రహ్మాస్త్ర |
| ,, | 6 | తాండ్రనమిధలతో | తాంద్రసమిధలతో |
| 60 | 23 | యస్త్రముచు | యస్త్రమును |
| 61 | 20 | మిగిలన | మిగిలిన |
| 62 | 8 | హనుమంతఁడు | హనుమంతుఁడు |
| 63 | 6 | అంతరానము | అంతర్ధానము |
| 67 | 20 | పరంపరులను | పరంపరలను |
| 68 | 11 | మొసర్చి | మొనర్చి |
| 70 | 3 | హెతు | హేతు |
| 71 | 4 | స్ఫురించి | స్ఫురించి |
| 72 | 22 | చున్నారు | చున్నాను |
| 73 | 22 | ఆధర్మ | అధర్మ |
| 74 | 13 | ప్రవృద | ప్రవృద్ధ |
| 75 | 6 | ప్రజేత్ | ప్రజేత్ |
| 79 | 25 | అని | అని |
| 80 | 18 | లప్పటి | అప్పటి |
| ,, | 23 | అపదవిని | అపదవిని |
| 83 | 28 | స్వస్త్వయనుఁడై | స్వస్త్యయనుఁడై |
| 89 | 8 | మార్కొనెను | మార్కొనెను |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 92 | 12 | యత్రమునకు | యత్రమునకు |
| 93 | 12 | నవ్వాడు | నప్పాడు |
| ,, | 21 | ఆసగా | అనఁగా |
| 98 | 12 | చెప్పెను | చెప్పెను |
| 101 | 4 | ఆదియే | ఆదియే |
| 102 | 3 | పచ్చి | వచ్చి |
| .. | 9 | ఋ వానరులు | ఋక్ష వానరులు |
| 103 | 9 | అప్రతిమ | అప్రతిమ |
| 104 | 8 | ఆఋవది | అఋవది |
| 105 | 2 | వివర్యయ | విపర్యయ |
| 106 | 17 | నూతా! | సూతా! |
| 107 | 12 | ఆగ్నేయస్త్రిము | ఆగ్నేయాస్త్రము |
| 110 | 8 | ఆప్పాడు | అప్పాడు |
| 112 | 21 | పధ | వధ |
| 113 | 10 | వంపె | పంపె |
| ,, | 17 | రానురావణుల | రామరావణుల |
| ,, | 22 | పరంవరచే | పరంపరచే |
| 115 | 20 | సర్పణాపస్పరణములను | సర్పణాపసర్పణములను |
| 117 | 21 | కొంత | కొంద |
| 125 | 5 | చెప్పచున్పను | చెప్పచున్నను |
| 133 | 14 | స్థీతప్రజ్ఞుఁడే | స్థితప్రజ్ఞుఁడే |
| 135 | 11 | కొరిక | కోరిక |
| 142 | 14 | వేద్యబాహ్యము | వేదబాహ్యము |
| 143 | 15 | యశొభాజనుఁడ | యశోభాజనుఁడ |
| 151 | 17 | శబికకు | శిబికకు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 155 | 4 | కొపము | కోపము |
| 156 | 11 | నవ్వాచు | నవ్వుచు |
| 157 | 23 | రాముసకు | రామునకు |
| 161 | 14 | మన్త్రి | మన్త్రై |
| 162 | 12 | మున్నసీత | మున్నసీత |
| 165 | 22 | విప్రయమును | విప్రియమును |
| ,, | ,, | అనుచు | అనుచు |
| 168 | 4 | గృహాణి | గృహోణి |
| ,, | 15 | యొద్ధకు | యొద్దకు |
| 169 | 4 | అవ | అవ |
| ,, | 8 | దోషమును | దోషమును |
| 170 | 10 | ఆనుమతి | అనుమతి |
| 171 | 1 | బాషణము | భాషణము |
| ,, | 24 | అక్కడ | అక్కడ |
| 172 | 21 | ప్రవాదమును సమన్వ | ప్రవాదమును సమన్వ |
| 173 | 22 | అందువ | అందు |
| | 26 | అంతే | అంతే |
| 175 | 17 | అట్టిరాజు | అట్టిరాజు |
| | 22 | కలిననప్పుడు | కలిగినప్పుడు |
| 176 | 8 | అభిమాన | అభిమాన |
| | 10 | అందువలన | అందువలన |
| 177 | 2 | ఒరిగినది | జరిగినది! |
| 179 | 11 | ననుసూహాను | ననుసూహాను |
| 181 | 14 | శ్రొత్ర | శ్రోత్ర (శ్లో-5) |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 182 | 18 | జివింప | జీవింప |
| 183 | 20 | వా రందరు | వా రందురు |
| 191 | 2 | సంకొచించుట | సంకోచించుట |
| 195 | 26 | అనాథ | అనాధ |
| 199 | 19 | రాక్షన | రాక్షస |
| 209 | 3 | వాప్యశకత్ | వాప్యశకత్సుహృత్।(శ్లో-22) |
| | 6 | శుద్ధచరిత్రాం | శుద్ధచారిత్రాం |
| | 16 | అప్పడు | అప్పుడు |
| 213 | 4 | విష్ణుధేవుఁడు | విష్ణుదేవుఁడు |
| 217 | 16 | సురేశ్వరైః | సురేశ్వరైః |
| 224 | 5 | పేర్కున | పేర్కొన |
| 228 | 9 | అర్థరునకు | అర్ధరునకు (చూడు పుట.188) |
| 239 | 23 | అచార్యుఁడు.కానేరఁడు | అచార్యుఁడు కానేరఁడు. |
| 244 | 13 | ఆయన నిరాకరించుట | నిరాకరించుట ఆయనకు |
| 269 | 14 | కాంచమాలను | కాంచనమాలను |
| 271 | 6 | హరేణ | హారేణ |
| 276 | 26 | ప్రతీజ్ఞా | ప్రతిజ్ఞ |

# ఇతర గ్రంథములు

## ముద్రితములు

నాటకములు:-భువనవిజయము, ఎఱ్ఱాప్రెగ్గడ, నన్నయభట్టు

కావ్యము:-బాపూజీ

కథలసంపుటి:-కథాతరంగిణి

ధర్వతత్త్వగ్రంథములు:-

[ప్రతులు దొరుకుచోటు:-శ్రీరమణాశ్రమము; తిరువణ్ణామలై 606 603
తమిళనాడు]

| | | |
|---|---|---|
| 1. శ్రీరమణజీవితస్మరణోపదేశములు | — | 3-00 |
| 2. శ్రీభగవద్గీతాసారము | — | 4-00 |
| 3. పరాపూజ-ఆత్మబోధము | — | 3-00 |
| 4, శివానందలహర్యాది గ్రంథసంగ్రహములు | — | 5-00 |
| 5. ఆత్మసాక్షాత్కారము | — | 3-00 |
| 6. దేవీకాలోత్తరము | — | 3-00 |
| 7. శ్రీత్రిపురారహస్యజ్ఞానఖండసారము | — | 20-00 |
| 8. శ్రీరమణకథామణిమాల | — | 10-00 |

## శ్రీరామాయణతరంగిణి

| | | |
|---|---|---|
| మొదటిభాగము | — | 12-00 |
| రెండవభాగము | — | 15-00 |
| మూడవభాగము | — | 18-00 |
| నాల్గవభాగము | — | 20-00 |
| అయిదవభాగము | — | 20-00 |
| ఆఱవభాగము | — | 20-00 |

## అముద్రితములు

ఝాన్సీలక్ష్మీదేవి_18 సర్గల గేయకావ్యము

నాయకోదయము-స్వాతంత్రోద్యమ సంఘటనాత్మక పద్యకావ్యము

నలచరిత్రము-చంపూకావ్యము

శ్రీమద్రామాయణము - సప్తకాండములలో ఇరువదినాల్గు తీర్థము లతో వాల్మీకిరచనానుసారియైన చంపూమహాకావ్యము

శ్రీవాసుదేవకథాసుధ మొదలైనవచనరచనములు.